



# నా సంకల్పం వజ్రసంకల్పం

"నేను ఈ మధ్య ఒక విషాదకరమైన వార్తను పత్రికలలో చూచాను. ఒక అమాయకురాలైన తల్లి, తన ముగ్గురు పిల్లలను సాకలేక, ఆకలి అమ్మా! అంటుంటే అన్నం పెట్టలేక, ఆ పిల్లలకు విషం యిచ్చింది, తాను త్రాగింది. అందరూ మరణించారు. ఆ వార్తను చూచి నేను చాలా బాధపడ్డాను. నా హృదయం ద్రవించింది. ఇది నిజంగా దురదృష్టకర సంఘటన. నేను ఇప్పటివరకు ఎన్నో పనులు చేసాను. కోట్లాది రూపాయలు ఖర్చుచేసి విద్యాసంస్థలను నెలకొల్పి ఉచితంగా చదువు చెప్పిస్తున్నాను. వందలకోట్ల రూపాయిలు వెచ్చించి రెండు సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రులను నిర్మించాను (పుట్టపర్తి బెంగుళూరు). లక్షలు వెచ్చించినా నయంకాని వ్యాధులకు ఉచితంగా చికిత్సలు చేయిస్తున్నాను. వేలాదిమందికి ఉచితంగా గుండె ఆపరేషన్లు కూడా చేయిస్తున్నాను. మరియు వందల కోట్లరూపాయలు ఖర్చుచేసి ఉచితంగా వందలాది గ్రామాలకు మంచినీటిని అందిస్తున్నాను. విద్య వైద్యం, నీరు - ముఖ్యమైన ఈ మూడూ ఉచితంగా అందిస్తున్నాను.

పేద పిల్లలను పోషించే నిమిత్తమై, ఇప్పుడు ఒక క్రొత్త ప్లాన్ వేస్తున్నాను. అనంతపూర్ జిల్లాలో నా విద్యార్థులను, అధ్యాపకులను సర్వే చేయించడానికి నవంబరు 1వ తేదీ నుంచి గ్రామాలకు పంపుతున్నాను. పేదపిల్లలకు అన్నంపెట్టి ఉచితంగా వస్త్రములనిచ్చి, చదువు చెప్పించి, వారికి సమాజంలో గౌరవప్రదమైన స్థానం కల్పించాలని సంకల్పించుకున్నాను. మొదటి దశలో వెయ్యి పేదకుటుంబాలను గుర్తించి, ఒక్కొక్క కుటుంబానికి లక్షరూపాయల చొప్పున **Fixed Deposit** చేసి, వచ్చే వడ్డీ ద్వారా ఆ పేద పిల్లలకు అన్నం, వస్త్ర సౌకర్యములు ఏర్పాటుచేసి, మా విద్యార్థులచేత వారికి ఉచితంగా విద్యను నేర్పించాలని సంకల్పించుకున్నాను. క్రమక్రమేణా ఈ పథకమును అభివృద్ధి పరచదలిచాను.

ఈ నవంబరు 1వ తేదీ నుంచి దీనిని ప్రారంభిస్తున్నాను. కొన్ని లారీలలో చీరెలు, పంచెలు, పిల్లలకు చొక్కాలు, నిక్కర్లు మరియు అన్నం పాకెట్లు యిచ్చి పల్లెలలో పంచడానికి మా విద్యార్థులను పంపుతున్నాను. ఇంతేకాదు, **నా సంకల్పం వ్రజసంకల్పం. నా ఆలోచనలు ఎప్పుడూ పరోపకార సంబంధమైనవిగానే ఉంటాయి. స్వార్థమనేది నాలో ఎక్కడా కనిపించదు.** ఆ పేదకుటుంబాలకు తలా ఒక చిన్న ఇల్లు కూడా నిర్మించాలని నా సంకల్పం. అందులో తల్లిదండ్రులకు ఒక గది, పిల్లలుండటానికి మరో గది మరియు చిన్న వంటగది, స్నానాల గది కూడా ఉంటాయి. ఈ విధంగా ప్రథమ దశలో వెయ్యి పేద కుటుంబాలకు సహాయం చేయదలిచాను".

**- బాబా**

**(ది. 6-10-2000న భగవాన్ సాయి ప్రశాంతి నిలయంలో విజయదశమి సందర్భమున చేసిన దివ్యప్రసంగం నుండి)**

నవంబరు 2000

సంపుటి 16 సంచిక 11

మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-52, రామానాయుడుపేట,

మచిలీపట్నం -1. ✆ 22818, 21137




# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక


సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | - | 5-00 |
| ప్రత్యేక సంచిక | - | 15-00 |
| సంవత్సర చందా | - | 60-00 |
| 4 సం॥ల చందా | - | 225-00 |
| జీవిత సభ్యత్వం | - | 600-00 |
| పోషకులు | - | 1,116-00 |
| రాజపోషకులు | - | 5,116-00 |
| మహారాజపోషకులు | - | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | | 50 $ |

**Edited, Printed and Published by Komaragiri Krishna Mohan Rao**


## విషయ సూచిక




***Printed at* SREEVANI OFFSET PRINTERS, MACHILIPATNAM**

***DESPATCHED ON* 7-11-2000**

**Cheques & Drafts should be drawn in favour of "SREEVANI" Monthly, MACHILIPATNAM**



# శ్రీవాణి నావాణే!

## అందరికీ నమస్కరించి........

"**శ్రీవాణి నావాణే గదా! ఇంకా మరో సందేశం దేనికి? ప్రింటింగ్ ఇబ్బందులు నాకు బాగా తెలుసు. 25 రోజులలో మంచిగా తీసుకొని వచ్చావు**" అని, నేను ముద్రించి స్వామికి సమర్పించిన **శ్రీవాణి** ప్రత్యేక సంచికను మొదటి నుంచి ఆఖరువరకు పరిశీలిస్తూ, శీర్షికలను, వ్యాసములను చూస్తూ ది 6-11-1987న ఇంటర్వ్యూ గదిలో '**తమ సందేశం బాబా!**' అని అర్థించినప్పుడు, భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు నాతో అన్న పవిత్రమైన పసిడి పలుకులు అవి. ఆనాటి నుంచి, నేటివరకు ప్రతి సంచికలో భగవాన్ సాయి దివ్యసందేశాలను ముద్రిస్తూ, ప్రతి పుట్టు పండుగకు ప్రత్యేక సంచికలను సర్వాంగ సుందరంగా తీసుకొని వస్తూ, ఈనాడు భగవాన్ సాయి 75వ జన్మదిన ప్రత్యేక సంచికను స్వామికి సమర్పించుకుంటున్నాను, పాఠకులకు అందిస్తున్నాను.

**శ్రీవాణి** 1985 జనవరిలో ప్రారంభించబడింది. పది నెలల తరువాత స్వామిని దర్శించడానికి ప్రప్రథమంగా 1985 అక్టోబర్‌లో పుట్టపర్తి వెళ్ళాను. ఆ దేవదేవుని అనుగ్రహం, ఆశీస్సులు, ప్రత్యేకమైన ఇంటర్వ్యూ మొదటి సారే అనగా ది. 21-10-1985న నాకు లభించినాయి. 30 సంవత్సరాలపాటు దేశ దిమ్మరిగా రాజకీయాలలో నిర్విరామంగా తిరిగిన నాకు ఆ తొలి ఇంటర్వ్యూ నా జీవన గమనాన్నే మార్చివేసింది. ఆనాటి నుంచి నాకు, నా కుటుంబ సభ్యులకు పలు పర్యాయములు స్వామి ఇంటర్వ్యూలు అనుగ్రహించారు, అనేక బహుమతులు ప్రసాదించారు. రానురాను స్వామివారి ఆధ్యాత్మిక ఆలోచనాసరళి నాలో ఊహించని మార్పులను కూడా తీసుకొని వచ్చింది. "**శ్రీవాణి నా వాణేగదా! అందరూ మెచ్చుకుంటున్నారు. శ్రీవాణికి నా ఆశీస్సులు ఉన్నాయి**" అని భగవాన్ సాయి పలు పర్యాయములు 'శ్రీవాణి'ని ప్రశంసించటం జరిగింది. మహనీయుల వాక్కులు వేదవాక్కులు, నిత్యసత్యాలు. అందులో సాయీశ్వరుని దివ్యాశీస్సులు ఉండటం వలననే, నేనింతకాలం ప్రతినెలా సకాలంలో పాఠకులకు **శ్రీవాణి** ని అందించగలుగుతున్నానని విశ్వాసం. విశ్వాసమే కాదు వాస్తవం కూడాను. నేనొక సామాన్యుడను గదా! ఇంతకాలం ఇటువంటి పత్రికను క్రమం తప్పకుండా నడపటమే ఆశ్చర్యం. ఇందులో నా ప్రతిభ ఏమీలేదు. స్వామివారి అనుగ్రహా ఆశీస్సుల ఫలితమేనని నా నమ్మిక.

ఈ సందర్భమున **శ్రీవాణి** పాఠకులకు ఒక చిన్న '**మనవి**' చేస్తున్నాను. భగవాన్ సాయి దివ్యశక్తి ఇంతటిది, అంతటిది అని ఎవరికీ చెప్పనలవికాదు. అది అనంతమైనది, అద్భుతమైనది. ఈనాడు ఈ ప్రపంచంలో అనేక మంది పీఠాధిపతులున్నారు, ఆధ్యాత్మిక తత్త్వవేత్తలున్నారు, సాధువులున్నారు, సన్యాసులున్నారు. అందులో చాలామంది ఎవరి మతాలకు వారు పరిమితమై ఆధ్యాత్మిక ప్రచారం గావిస్తున్నారు, ప్రబోధలు చేస్తున్నారు. అందులో కొందరు రాజకీయ నాయకులతో, మంత్రులతో, బడాబడా పారిశ్రామికవేత్తలతో పరిచయాలను ఏర్పర్చుకొని గురువులుగా చలామణి అయి కొంతకాలం ఒక వెలుగు వెలిగి తెరమరుగై పోతున్నవారు కొందరైతే, పారిశ్రామికవాడలను, ఆయుధ



కర్మాగారాలను సయితం వారే నడుపుతూ విదేశాలతో అక్రమ సంబంధాలను పెంచుకొని, అప్రదిష్ఠపాలైనవారు మరికొందరు. వీరందరిని చూస్తూ ఎవరిని ఎంతవరకు నమ్మాలో, ఎవరిని నమ్మకూడదో అర్థంకాక సామాన్యులు సతమతమవుతున్నారు. దీనిని అవకాశంగా తీసుకొని హేతువాదులు విమర్శనలకు పూనుకుంటున్నారు. ఇది ఈనాటి పరిస్థితి, దుస్థితి.

భగవాన్ శ్రీసత్యసాయిబాబావారి ఆలోచనా సరళి యిందుకు భిన్నంగా కనిపిస్తున్నది. ఒక్క ఆధ్యాత్మిక ప్రబోధనలకే పరిమితం కాకుండా, తుచ్ఛ రాజకీయాల జోలికి పోకుండా, విద్యా వైద్య సేవారంగాలలో ఎనలేని కృషిని కొనసాగిస్తూ, బీద, పేదల సముద్ధరణకు నిర్విరామంగా శ్రమిస్తున్నారు. ఇదే వారి ప్రత్యేకత. కొన్ని వందల కోట్ల రూపాయలు విద్యా రంగములో వెచ్చించి కె.జి నుండి పి.జి. వరకు ఉచిత విద్యను అందిస్తున్నారు. షుమారు 300 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌ను కుగ్రామమైన పుట్టపర్తిలో నిర్మించి, లక్షలు వెచ్చించినా దొరకని, దుర్లభమైన వైద్యసేవలను లక్షలాదిమందికి ఉచితంగా అందిస్తున్నారు. త్రాగడానికి నీరులేక అలమటిస్తున్న అనంతపురం జిల్లా ప్రజలకు షుమారు 250 కోట్ల రూపాయలు వెచ్చించి గ్రామీణులకు మంచినీటిని ఉచితంగా అందిస్తున్నారు. ఈ పథకమును కొన్ని తెలంగాణా జిల్లాలకు విస్తరింపజేశారు. మరి మూడువందల కోట్లరూపాయలపైన వెచ్చించి, బెంగుళూరులో మరో సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్‌ను నిర్మించారు. నవంబరులో దానికి ప్రారంభోత్సవం జరుగుతుంది. అంతేకాదు అనంతపురం జిల్లాలో కొన్నివందల గ్రామాలలో కమ్యూనిటీ హాల్స్‌ను, విద్యాలయాలను, దేవాలయాలను ఉచితంగా నిర్మిస్తున్నారు. ఆర్థిక స్తోమతలేని, ఉన్నత చదువులు చదువుకోలేని బీద పేద విద్యార్థులకు ఒక శాశ్వతమైన పథకమును రూపొందించి, వారి చదువులు సాఫీగా జరిగేందుకు అవసరమైన ఆర్థిక సహకారమును అందిస్తున్నారు. పేదలకు ఉచితంగా గృహాలను నిర్మిస్తున్నారు. జీవనోపాధికి ఆటోలు, సైకిల్ రిక్షాలు, కుట్టుమిషన్లు ఉచితంగా యిస్తున్నారు. రైతులకు వ్యవసాయ పనిముట్లు, ట్రాక్టర్లు కూడా బహూకరిస్తున్నారు. ఈ విధంగా వారి సేవలు అనంతం. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కూడా చేయని పనులు భగవాన్ బాబావారు ఒక్కరే చేస్తున్నారు. ఈ విధంగా సేవలందించే ఆధ్యాత్మిక తత్త్వవేత్తలు ప్రపంచంలో మరొకరులేరని చెప్పటంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు. వారికి వారేసాటి. ఈ విధంగా ఇన్ని రంగాలలో ఉచితంగా సేవలనందిస్తున్నవారు మరొకరులేరని ఘంటాపదంగా చెప్పవచ్చును.

అలనాటి రామావతార కాలంలో, కృష్ణావతారంలో మనం వున్నామోలేదో మనకు తెలియదు. కాని ఈనాటి సాయి రాముని, సాయికృష్ణుని అవతార సమకాలీన సమాజంలో మనం వుండే అదృష్టం మనకు లభించింది. ఆ సదవకాశమును మనం సద్వినియోగం చేసుకోవాలి. ఒక్క పర్యాయం పుట్టపర్తిని దర్శించండి. ఆ సాయీశ్వరుని దివ్యదర్శనం చేసుకోండి. తరించండి! ఈ ప్రత్యేక సంచికకు సహృదయంతో వ్యాసములు, అనుభవాలు, అనుభూతులు, పద్యములు అందించిన రచయితలకు కృతజ్ఞతాభివందనములు.

**ధన్యవాదములు**

సదా సాయిసేవలో

(కొమరగిరి కృష్ణమోహనరావు)

మచిలీపట్నం,
ది. 1-11-2000.



# అధ్యాపకులు ఆదర్శజ్యోతులు కావాలి

అధ్యాపకులారా!

మానవత్వాన్ని వికసింపజేసేవారే అధ్యాపకులు. జీవితానికి రాచబాట ఏర్పర్చువారే అధ్యాపకులు. దేశమునకు దివ్యజ్యోతులను అందించువారే అధ్యాపకులు. అధ్యాపకులు మహా ఆదర్శమూర్తులు, ఆదర్శజ్యోతులు. అధ్యాపకులనే జ్యోతులు నిరంతరమూ వెలుగుతున్నప్పుడే, విద్యార్థులనే జ్యోతులను వెలిగించడానికి వీలు అవుతుంది. కనుక అధ్యాపకులారా! మీ దివ్యమైన భావములను, ఆదర్శ వంతమైన సూక్తులను, పిల్లలకు అందించే నిమిత్తమై మీరు నిరంతరమూ కృషి చేయవలసి ఉంటుంది.

గురువులు :

గురువనగా చిన్న ఉద్యోగిగా భావించరాదు. సరియైన నాయకులను, ధీశక్తులను రూపొందింపజేసేవారే గురువులు. దేశపాలకులు కాబోయే వారిని తర్ఫీదు చేసేవారే గురువులు. నిత్యజీవితమునందు దేశమునకు రాచబాటను నిర్మించే వారే గురువులు. జగత్తునకు కాంతి రేఖలనందించే వారే గురువులు. స్వార్థరహితమైన కర్మల ద్వారా పరార్థమైన పరశక్తిని చూపించేవారే గురువులు. నిత్య సత్యమైన దైవత్వమునకు సోపానములు నిర్మించేవారే గురువులు. అంతర్ దృష్టిని అభివృద్ధిపరచి, దివ్యకాంతిని ప్రకాశింపజేసే వారే గురువులు. మానవత్వాన్ని వికసింపజేసి, దివ్యత్వాన్ని ప్రకాశింపజేసేవారే గురువులు.

జ్ఞానాగ్ని :

నిప్పును సరీగా పోషించినప్పుడు అది ప్రకాశమును వెచ్చదనమును మనకు అందిస్తుంది. కాని, నిప్పును అలక్ష్యం చేసినప్పుడు దానిపై నివురు కప్పి దానిని మరుగు పరుస్తుంది. ప్రతి మానవునియందు పవిత్రమైన జ్ఞానాగ్ని ఉన్నది. అదే మంచి మనస్సు. కాని, ఈనాడు లౌకిక వాంఛలనే నివురు కప్పడంచేత జ్ఞానాగ్నిని మనం చూడలేక పోతున్నాం. నివురును ఊదితే నిప్పు కనిపిస్తుంది. 'ఆధ్యాత్మ విద్యావిద్యానాం' అన్నాడు కృష్ణుడు. విద్యలలో 'ఆధ్యాత్మిక విద్య నేనే' అన్నాడు. అలాంటి ఆధ్యాత్మికతత్త్వాన్ని అనుభవించి, ఆనందించి జగత్తుకు అందించిన మహనీయులెందరో ఈ భరతమాత పుత్రులుగా జన్మించారు. కాని, అట్టి ఆదర్శపురుషుల తత్త్వాన్ని ఈనాటి మానవులు విస్మరించారు. ఆ మహనీయుల పవిత్ర సూక్తులను పిల్లలకు ఈనాడు తల్లిదండ్రులుగాని, అధ్యాపకులుగాని నేర్పలేకపోతున్నారు.

అధ్యాపకులు మార్గదర్శకులు కావాలి

ఆదర్శజ్యోతులుగా వెలుగొందవలసిన అధ్యాపకులు ఈనాడు తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించకపోవటం వలన

## భగవాన్ సాయి హితోపదేశం

విద్యార్థులలో క్రమశిక్షణారాహిత్యం పెచ్చుపెరిగిపోతున్నది. ఉద్యోగములన్నింటికంటే అధ్యాపకుని ఉద్యోగం బాధ్యతకలది, పవిత్రమైనది. అధ్యాపకుడు సత్యమార్గము నవలంబించకున్న విద్యార్థులు చెడిపోదురు. తద్వారా సమాజము చెడిపోవును. విద్యార్థుల భవిష్యత్తు గురువుల చేతిలో వుండటం వలన, గురువులు దాని పవిత్రతను గుర్తించి, బాధ్యతను గుర్తించి, ఆచరణయందు ఆదర్శ ప్రాయముగా వారికి ఆనందమునందించుటకు పూను కోవాలి. పిల్లల మనస్సులు, పరిశుద్ధముగా, నిర్మలముగా వుండును. మీ ప్రబోధలు వారి లేత మనసులపై హత్తుకొని పోవుటవలన, అధ్యాపకులు చక్కని అభ్యాసమును, ఆదర్శమును కలిగియుండుట అత్యవసరం. పిల్లలు మంచినిగాని, చెడునుగాని సులభముగా గుర్తిస్తారు. దానిననుసరించుటకు ప్రయత్నిస్తారు. కాన, గురువులు సదభ్యాసములను కలిగియుండుటవల్ల, వారిని మంచి మార్గమున తీర్చిదిద్దవచ్చును. ప్రపంచానుభవంలేని పిల్లలు అధ్యాపకుని చేతిలో వేలాదిమంది ఉంటారు. వారి లేత మనస్సులపై ఉపాధ్యాయుల ఉపదేశ ప్రభావాలు ఎక్కువగా ఉంటాయి. కనుక ఉపాధ్యాయులు తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే, వేలాది మంది విద్యార్థులు చెడిపోతారు. కనుక ఒక విద్యార్థి చెడిపోతే, దాని వలన అతడే

పాడవుతాడు. ఒక ఉపాధ్యాయుడు క్రమశిక్షణతో కర్తవ్యాన్ని నిర్వర్తించకపోతే వేలమంది విద్యార్థులు చెడిపోతారు. కనుక అధ్యాపకుల పాత్ర ఎంత ఉన్నతమైనదో, ఉత్కృష్టమైనదో, బాధ్యతతో కూడినదో గమనించి వర్తించాలి. భవిష్యత్తుకు రాచబాట వేయువారు విద్యార్థులే, వారికి మార్గదర్శకులు అధ్యాపకులు కావాలి.

**TANK - TAP :**

అధ్యాపకులు Water Tank వంటివారు. విద్యార్థులు Taps వంటివారు. 'వాటర్ ట్యాంక్'లో ఏ విధమైన నీరు ఉంటుందో, ట్యాప్‌లో కూడా అదే నీరు వస్తుంది. Tank లో మంచినీరువుంటే Taps ద్వారా మంచి నీరు లభిస్తుంది. ఒకవేళ Tank లో కంపుకొట్టే నీరుఉంటే అదే నీరు Taps ద్వారా వస్తుంది. అసలు Tank లో నీరువుంటే Taps లో నీరు వస్తుంది. ఒకవేళ Tank లో నీరులేకపోతే Taps లో చుక్క నీరుకూడారాదు. అదే విధంగా ఇచ్చేవాడు (బోధించే వాడు) అధ్యాపకుడు. పుచ్చుకొనేవాడు (నేర్చుకునేవాడు) విద్యార్థి. అయితే ఈనాడు టీచర్లవద్ద యివ్వడానికి సరుకులేదు. (బోధించే శక్తిలేదు). పుచ్చుకోవడానికి విద్యార్థికూడనూ సంసిద్ధుడైలేడు. (నేర్చుకోవడానికి సిద్ధంగా లేడు). కొంతమంది అధ్యాపకులలో బోధించే సమర్థత వున్నా, వారి ప్రవర్తన ఉండవలసిన రీతిలో ఉండటంలేదు. సత్ప్రవర్తన లేనివారు ఏమిచెప్పినా ప్రయోజనంలేదు. దానికి విలువలేదు. అధ్యాపకులు తమ హృదయాలలో పవిత్ర భావములు నింపుకొనినప్పుడే, బాలబాలికలలో కూడా పవిత్ర భావములను ప్రసరింపజేయగలుగుతారు. విద్యార్థులు చదివేది కొంతకాలమే. కాని, అధ్యాపకులు మాత్రం జీవితమంతా చదువుతూ ఉండాలి. నిరంతరం చదువుతున్నప్పుడే విద్యార్థులకు చెప్పగలుగుతారు. దీపము వెలుగుతున్నప్పుడే, ఇతర దీపములను వెలిగించవచ్చును. కనుక అధ్యాపకులు నిరంతరమూ వెలుగుతూ వుండే దీపాలుగా ఉండాలి. అజ్ఞానఅంధకారములకు అవకాశముండని స్థానము వెలుగు.

గురుత్వము :

అయితే ఈనాడు అటువంటి అత్యున్నతమైన గురుస్థానమును మనము కోల్పోతున్నాము. 'గు' అనగా **అజ్ఞానము. 'రు' అనగా లేకుండా చేయటం.** అనగా అజ్ఞానమును నిర్మూలనం గావించువాడు గురువు. గురువులు సరియైన స్థితిలో లేకపోవడంచేతనే, జగత్తు నందు ప్రవర్తనలుగాని, పరివర్తనలుగాని లేకుండా పోతున్నాయి. గురువుల ఘనత శిష్యుల ప్రభావంపై ఆధారపడి ఉంటుంది. గురువుల ఘనతకు ప్రతిరూపులు శిష్యులు. దేశకాలపరిస్థితుల ప్రభావములకు లొంగనిదే గురుత్వము. కనుక దివ్యమైన పవిత్రతను గురువులు, శిష్యులలో ప్రవేశింపజేయాలి. ఈ విధమైన గురువులు ఈనాడు లోకమునకు అత్యవసరం. గురువులు ఆదర్శ వంతమైనవారుగా ఉన్నప్పుడే శిష్యులు ఆదర్శమూర్తులుగా తయారవుతారు.

బాలబాలికల హృదయాలను వికసింపజేసే అధ్యాపకులు కమలములకు సూర్యునివంటివారు. సూర్యోదయము కాగానే కమలములు వికసించినట్లు, గురువుల సద్బోధల చేత బాలబాలికల హృదయకమలములు వికసిస్తాయి. ఇట్టి పవిత్ర శక్తి గురువులకు మాత్రమే ఉంటుంది. కనుక గురువులు సత్ప్రవర్తన, సదాలోచన, సచ్చింతన, భక్తి - ఈ నాలుగు తత్త్వములతో తమ హృదయాలను నింపుకోవాలి.

**GUIDE POST :**

అధ్యాపకులు Guide Post వంటివారు. 'గైడ్ పోస్ట్' బోర్డు స్థిరంగా ఉన్నప్పుడే ప్రయాణీకులు దానిని ఆధారం చేసుకొని చేరవలసిన గమ్యమునకు చేరగలుగుతారు. ఆ గైడ్‌పోస్ట్ బోర్డు స్థిరంగావుండకుండా, అటూ, ఇటూ ఊగిసలాడుతుంటే చేరవలసిన గమ్యం తెలియక ప్రయాణీకులు నానా యిక్కట్లకు గురవుతుంటారు. అదే విధంగా అధ్యాపకుల భావాలు స్థిరంగా ఉండాలి. ఊగిసలాడే మనస్తత్వం వుండరాదు. ఆ విధంగా అధ్యాపకులు సరియైన స్థితిలో ఉన్నప్పుడే బాలబాలికలనే ప్రయాణీకులకు దివ్యజీవితాన్ని, దీర్ఘజీవితాన్ని కూడా అందించినవారవుతారు. ఈ భౌతికమైన జీవితంతోపాటు, దీనికి ఆధారమైన ఆధ్యాత్మిక జీవితం కూడా మనకు అత్యవసరం. అట్టి ఆధ్యాత్మిక తత్త్వాన్ని విద్యార్థులకు బోధించి, ఆదర్శ మూర్తులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత అధ్యాపకులపైన ఉన్నది.

శిల్పులు :

రాతిని రూపంగా తీర్చిదిద్దునది శిల్పి. భావాన్ని రూపంగా తీర్చిదిద్దునది భాష. మానవుని ఉత్తమునిగా తీర్చిదిద్దునది శీలము. అదేవిధంగా బాలబాలికలను తీర్చిదిద్దగలవారు అధ్యాపకులే. శిల్పి బండరాయిని చెక్కి

దివ్యమంగళకరమైన దేవతా విగ్రహాలను రూపొందించ గలడు. విద్యార్థులు కొండలలోవున్న గుండురాయివంటి వారు, బండరాయివంటివారు. వీరికి అధ్యాపకులనే శిల్పులు చక్కటి రూపకల్పన చేయాలి. విగ్రహంలో ఏ లోపంవున్నా, ఏ దోషంవున్నా, అది రాయిలోని లోపంకాదు, విగ్రహంలోని దోషంకాదు. అది శిల్పి దోషమే. అదేవిధంగా విద్యార్థులు వినయశీల సంపన్నులుగా వెలుగొందాలంటే, అధ్యాపకుల ప్రయత్నంమీదనే ఆధారపడి ఉంటుంది. బాలబాలికలను ఆదర్శప్రాయులుగా తీర్చిదిద్దగలవారు అధ్యాపకులు. బ్రతుకలేనివాడు అధ్యాపకుడగునని, అంధులైనవారు, అజ్ఞానులైనవారు అనుచుందురు. కాని, బ్రతుకు నేర్పువాడే అధ్యాపకుడు. సత్ప్రవర్తనలను చక్కగా బోధించి, ముందు దారిని చూపి, సమతమమతలను పెంచి, సన్మార్గమును చూపు సద్గుణవంతులే గురువులు.

**తోటమాలి :**

అడవిలోని మొక్కలలాంటివారు విద్యార్థులు, అధ్యాపకుడు తోటమాలివంటివాడు. అడవిలో చిందర వందరగా పెరిగిన మొక్కలను తీసుకొనివచ్చి, పార్కులో వాటిని నాటి, ఒక చక్కటి రూపకల్పనచేసి, అందంగా పార్కును ఏ విధంగా తోటమాలి తీర్చిదిద్దుతాడో, అదే విధంగా పసిహృదయాలను తీసుకొని, వారిని ప్రేమతో లాలించి, బుజ్జగించి, విద్యాబుద్ధులు నేర్పి, చక్కటి సంస్కార వంతులుగా తీర్చిదిద్దవలసిన బాధ్యత అధ్యాపకులదే.

**అలారం :**

అలారంవంటివాడు అధ్యాపకుడు. సరీగా మనం పెట్టిన సమయానికి అది మ్రోగుతుంది. నిద్రలోనున్న మనల్ని లెమ్మనమని హెచ్చరిస్తుంది. జడపదార్థమైన గడియారమే 'అలారం'. పాత్రను సక్రమంగా నిర్వర్తిస్తుంటే, చైతన్యవంతులైన అధ్యాపకుల పాత్ర ఇంకా ఎంత ఉన్నతంగా ఉండాలో, ఎంతటి బాధ్యతతోకూడినటు వంటిదో విజ్ఞులైన అధ్యాపకులు గ్రహించాలి. అజ్ఞానాంధ కారంలో పయనిస్తున్న శిష్యులనులేపి, హెచ్చరించి, కర్తవ్యబోధచేసి, సన్మార్గంలో నడిపించాలి అధ్యాపకులు.

**ప్రేమపుత్రులు - కామపుత్రులు :**

అధ్యాపకుల బాధ్యత కేవలం బోధించడమేకాదు. ఆదర్శవంతమైన విద్యార్థులుగా తీర్చిదిద్దాలి. ఏదో మేము ఒక క్లాసు తీసుకోవడానికి వచ్చాము. ఆ క్లాసులో Lecture చెబుతాం. వింటే వింటారు, పోతేపోతారు అనే లక్ష్యములో ఉపాధ్యాయులు ఉండకూడదు. ఇది నిన్ను నీవు ద్రోహం చేసుకున్నట్లే అవుతుంది. ప్రతి విషయము నందు పిల్లలను కొంతవరకు గమనించాలి. నీ ఇంటిలో నీ బిడ్డలు సరైన ప్రవర్తనలో లేనప్పుడు నీవెంత బాధపడుతావు? వారు నీకు కామపుత్రులు. (అసలు పుత్రులు) కావచ్చు గాని, వీరు నీకు ప్రేమపుత్రులు (విద్యార్థులు). ఈ ప్రేమ పుత్రులను కామపుత్రులకంటే సన్నిహితం చేసుకోవాలి. ద్రోణాచార్యుడు, కామపుత్రుడైన అశ్వత్థామకంటే, ప్రేమ పుత్రుడైన అర్జునునకు మరిన్ని రహస్యాలను బోధించాడు. కనుకనే అతనిని 'ఆచార్యుడు' అని పిలిచారు.

**ఆచార్యుడు :**

మీరు కూడా 'ఆచార్యుడు' అన్న పేరుతో సార్ధకనామ ధేయులై ఉండాలి. అధ్యాపకునకు, ఆచార్యునకు చాలా తేడాఉంది. 'ఆచార్య' అనగా ఆచరించి బోధించేవాడని అర్థము. కాని, మనం చెప్పినవి మనమే ఆచరించకుండా వుంటే, - అది Artificial జీవితంగా ఉంటుంది. ఇది సరియైనదికాదు. Heart is Inside, Art is Outside. కనుక మనం Heart Full గా వుండాలిగాని, Artificial గా ఉండకూడదు. మన పిల్లలను కూడా ఈ విధమైన ఆదర్శ వంతులుగా తయారుచేయాలి. ఏ విద్యార్థీ పెడమార్గం పట్టకుండా చూచుకోవాలి. అదే నిజమైన సాధన.

**ఆదర్శంగా నడచుకోవాలి :**

అధ్యాపకులు పిల్లలయొక్క శ్రేయోభిలాషులు కావాలి. ఆదర్శవంతమైన విద్యార్థులుగా రూపొందింపజేయాలి. అధ్యాపకులు మొట్టమొదట తాము ఆదర్శంగా నడచుకొని తరువాత విద్యార్థులకు బోధించాలి. అధ్యాపకులయందు వినయ, భయ విశ్వాసములతో కూడిన భక్తిఉండాలి. ఆ భక్తియే లేకుండిన ఎంత విద్యావంతుడైనప్పటికీ ప్రయోజనం లేదు. కుటుంబంలో నీ పిల్లలను ఏ విధంగా పోషించు కోవాలో చూచుకో. అదే భావము బయటపిల్లలపై కూడా చూపుకో. నీ బిడ్డలను ఒక దృష్టితో, బయట బిడ్డలను మరొక దృష్టితో చూచుకుంటే, తప్పక నీ బిడ్డలకే నీవు Harm(హాని) చేసినవాడవవుతావు. బయట పిల్లలను మంచిగా చూచినప్పుడు, నీ పిల్లలను భగవంతుడే చూచుకుంటాడు.

**అధ్యాపకుల పాత్ర :**

విద్యార్థులు ఆదర్శవంతమైన పౌరులుగా తయారు కావడానికి తగిన శక్తిసామర్థ్యములను అధ్యాపకులు



అందించాలి. ఈనాడు నీతినియమాలు ఎక్కడా కనిపించడం లేదు. విద్యాసంస్థలు మాత్రం పెరిగి పోతున్నాయి. కాని విద్య యొక్క ప్రభావం మాత్రం తరిగిపోతున్నది. విద్యా సంస్థల Quantity పెరిగిందికాని Quality మాత్రం పెరగ లేదు. దీనికి కారణమేమిటి? విద్యార్థులకు మనం సరియైన గ్రంథాలు అందించటంలేదు.

**"నీతినియమాలు గ్రంధాల నిలచిపోయె**
**హృదయమంతయు దుర్గంధ సదనమయ్యె**
**చేతులంతయు స్వార్థంబు చేతలయ్యె**
**ఇదియె ప్రోగ్రెస్సు ఈనాడు విద్యలందు"**

ఇదేనా విద్యలవలన మనం పొందవలసిన అభివృద్ధి? నైతిక విలువలను పెంపొందించాలి. మానవతా విలువలను విద్యార్థుల హృదయాలలో చేర్చాలి. పవిత్రమైన పెద్దల సూక్తులనే పలుకు మిఠాయిలను పిల్లలకు పంచి పెట్టాలి. పిల్లలకు క్రమశిక్షణ బోధించడం, వినయ విధేయతలను వారి హృదయాలలో చేర్చడం, సమాజాభివృద్ధికి తగిన ఆదర్శాలను బోధించడం మున్నగు విషయాలలో అధ్యాపకులు ప్రధానమైన పాత్రను పోషించాలి. బ్రతకటానికి చదువు అక్కరలేదు. జీవితానికి చదువుకావాలి. Education లో Elevation ను మనం చూడాలి.

**సమత్వాన్ని బోధించాలి :**

అందరూ సోదరులనే ఏకత్వాన్ని వారి హృదయాలలో నింపాలి. జాతి మత కుల విభేదాలను నిర్మూలించాలి. Fatherhood of God, Brotherhood of Man (దైవ పితృత్వం, మానవసోదరత్వం) అనే సత్యాన్ని మొట్టమొదట బోధించాలి.

**"There is only one Cast**
**The cast of Humanity**
**There is only one Religion**
**The Religion of Love**
**There is only one Language**
**Language of the Heart"**

ఇట్టి సమత్వాన్ని లేతహృదయులైన పిల్లలకు బోధిస్తే, భవిష్యత్తులో వారెంతో ఉత్తమ పౌరులుగా రూపొందగలుగుతారు. కనుక మొట్టమొదట టీచర్లు తగిన ఆదర్శాన్ని నిరూపించాలి.

**మూడు 'P' లు :**

అధ్యాపకులారా! పిల్లలకు మొట్టమొదట 3 'P'లను గురించి బోధించాలి. ఏమిటా 3Pలు. 1. Purity (పవిత్రత). 2. Patience (సహనం). 3. Perseverence (పట్టుదల). ఈ మూడింటిని బాలబాలికలకు అందించినప్పుడు వారు ఈ దేశాన్ని రక్షించగలరు. ఈనాడు దేశాన్ని రక్షించేవి తుపాకులుకావు, బాంబులుకావు, రాజకీయాలుకావు, మరేవీకావు. నీవు మిలటరీలోచేరి, తుపాకి పట్టుకొని, దేశాన్ని రక్షించడానికి ఏమీ శ్రమపడనక్కరలేదు. నీవు రక్షించవలసినది దేశాన్నికాదు. సత్యధర్మాలను రక్షించాలి. ఈ సత్యధర్మాలను రక్షిస్తే, అవే దేశాన్ని రక్షిస్తాయి. Truth is God (సత్యమే దైవస్వరూపం). అన్ని దేశములవారికి, అన్ని జాతులవారికి, అన్ని మతములవారికి సత్యం ఒక్కటే... ఒక్కటే.... **'ఇది అమెరికన్ సత్యం, ఇది బ్రిటీష్ సత్యం, ఇది ఇండియన్ సత్యం'** అనేదిలేదు. సత్యం అందరికీ ఒక్కటే. దానిని మనం రక్షించాలి. ఇంక ధర్మమనేది ప్రత్యేకంగాలేదు. **'సత్యంనాస్తిపరోధర్మః'.** సత్యమనే పునాదిపై ధర్మమనే భవనం నిలచియున్నది. కనుక ఈ సత్యధర్మాలను మనం కాపాడుకుంటే మన నివాసం సుక్షేమంగా ఉంటుంది.

**అధ్యాపకుల కర్తవ్యం :**

చిన్నచిన్న మొక్కలను వృక్షంగా తీర్చిదిద్దేవారే గురువులు. అసలు గురువంటే ఎవరు? అజ్ఞానమును దూరంచేసి, ప్రజ్ఞానమనే ప్రకాశవంతమైన జ్యోతి వెలిగించువాడు 'గురువు'. డాక్టర్ కంటిపొరను తొలగించి దృష్టిని ప్రసాదిస్తాడు. అదే విధముగా గురువు అజ్ఞానమనే పొరను తొలగించి, జ్ఞానదృష్టిని కలిగించుతాడు. కనుక గురువులు దురభ్యాసములకు, దుశ్చింతలకు గురికాకుండా, పిల్లలకు ఆదర్శవంతంగా ఉండాలి. విద్యార్థులను ఉన్నతస్థాయికి తీసుకొనిపోవుటకు అధ్యాపకులు తగిన ప్రయత్నం చేయాలి. విద్యార్థి యొక్క ఔన్నత్యమును, అభివృద్ధిని ఆశించి తన కర్తవ్యమును గుర్తించి వర్తించడమే అధ్యాపకుని కర్తవ్యం. కనుక జీతము నిమిత్తం గురువుకారాదు. జీవితం నిమిత్తం కావాలి. అట్టి ఆదర్శ పద్ధతులను అవలంబించి, ఆచరించి, పిల్లలకు మార్గదర్శకులు గురువులు కావాలని ఆశిస్తున్నాను.

*(భగవాన్ సాయి దివ్యోపన్యాసములనుండి గ్రహించబడినది)*



# సాయి వేద భారతీయం

**సనాతన సారథి :**

భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారి దివ్యబోధలు, వారు నిర్వహించే కార్యక్రమాలు, 'నా జీవితమే నా సందేశము' అని తెలిపే వారి దివ్య జీవన విధానము ఇవన్నీ వేదసారమైన సనాతన ధర్మమును ప్రతిబింబిస్తాయి. వాటితో త్రికాల అబాధ్యమైన నిత్య సత్యములు, విశ్వ జనీన మైన ప్రేమ, పవిత్రతలు నిండి ఉంటాయి. అందువలననే వారిని "సనాతన సారథి" అని వ్యవహరిస్తారు.

**అద్వితీయమైన భారతీయ సంస్కృతి :**

ఈ ప్రపంచములో వ్యక్తికి ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వ మున్నట్లే, ప్రతి ఒక్క జాతికి అద్వితీయమైన ఒక ప్రత్యేక వ్యక్తిత్వమున్నది. ప్రతి వ్యక్తిలోను కొన్ని ప్రత్యేక లక్షణాలు, ప్రత్యేకమైన నైపుణ్యము ఉంటాయి. అవి అతనికే స్వంత మైనవి. అదే విధంగా ప్రతి ఒక్క దేశము, ప్రాంతము లేక జాతిలోను కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉంటాయి. వాటితో బాటు, ఈ ప్రపంచమనే రంగస్థలముపై అవి నిర్వహించ వలసిన పాత్రలు కూడా వేరు వేరుగా ఉంటాయి. తమ తమ అంతరంగములోని భావములు, దృష్టిని బట్టి ఈ ప్రపంచ సంగీత విభావరిలో అవి తమ తమ రాగములను ఆలాపిస్తాయి.

ఈ నేపథ్యంలో, వేద శాస్త్రములపై ఆధారపడిన భారతీయ పరమార్థ వాహినిని గురించి ప్రస్తుత సమయంలో అవతార స్వరూపులైన భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు సులభ గ్రాహ్యమైన రీతిలో ఏ విధంగా సమగ్రంగా బోధిస్తున్నారో తెలుసుకుందాం. దీని వలన మనం ఆధ్యాత్మిక సాధనలో మరింత ప్రగతిని సాధించగలము.

**పరమార్ధ శాస్త్రము :**

అనేక సిద్ధాంతములపై ఆధారపడిన భౌతిక విద్యల కంటె ఆచరణ పూర్వకమైన బ్రహ్మవిద్య ఎంతో ఉన్నతమైనది. "బ్రహ్మ విధ్యా విద్యానాం" అని భగవద్గీత ఘోషిస్తున్నది. భౌతిక సృష్టి రహస్యాలను తెలుసుకొనుట సరిపోదు. భిన్నత్వములోని ఏకత్వమును అన్వేషించే ఆధ్యాత్మిక సాధనకు వేదశాస్త్రవేత్తలు ప్రాధాన్యము నిచ్చినారు.

**ఏకమేవ అద్వితీయం బ్రహ్మ :**

ఈశ్వర తత్త్వమును నిర్వచించడానికి వేదములు ప్రయత్నం చేసాయి. ఆయన తత్త్వమును గురించి, ఆయన లక్షణాలను గురించి అనేక మందికి అనేకమైన అభిప్రాయములుండవచ్చును.

## ఘండికోట వెంకట సుబ్బారావు

కొంతమంది ఆయనను మానవతీతమైన లక్షణాలు కలిగిన 'పురుషోత్తముని' గా భావించవచ్చు. మరి కొంత మంది ఆయనను దివ్యశక్తులు గల 'భగవత్' స్వరూపముగా భావించవచ్చు. మరి కొంతమంది కేవలం నిరాకారమైన నిత్య, సత్య, బుద్ధ పరబ్రహ్మ తత్త్వము నందే నమ్మకము ఉండవచ్చు. ఏది ఏమైనప్పటికి, వీరందరు కూడా అనంతమైన ఒక దివ్యశక్తి, ఒక అద్వితీయ బ్రహ్మ ఉన్నాడని తప్పక విశ్వసిస్తారు. 'ఏకోహం బహుస్యాం' అని వేదములు కీర్తించినట్లు, అట్టి అద్వితీయమైన ఒకే ఒక దివ్యశక్తి నుండి ఈ సృష్టి అంతా ఆవిర్భవించింది. బహుముఖమైన ఈ సృష్టి అంతా చివరకు ఆ ఏకైక శక్తిలోనే లీనమవుతున్నది. వేదములు, వేదసారమైన సనాతన ధర్మమును బోధించే భగవాన్ బాబావారు కూడా ఈ నిత్య సత్యమునే ఉద్ఘాటిస్తున్నారు. మన ఆధ్యాత్మిక సాధన యొక్క లక్ష్యము కూడా ఇదే.

**'ఏకం సత్ విప్రా: బహుధావదంతి'** అని ఋగ్వేదము ఘోషిస్తున్నది. భగవత్తత్త్వమును వెల్లడించే ఈ మహా వాక్యము మన దృష్టిని పవిత్రముగావించి, మన ఆధ్యాత్మి కానుభవమునకు విశ్వజనీనతను ప్రసాదిస్తుంది.

ఇక, 'ఏకమేవ అద్వితీయం బ్రహ్మ', అంటే, అద్వితీయమైన భగవతత్త్వము ఒక్కటే అనే సత్యమును ప్రతి ఒక్కరు తమ తమ దృష్టి కోణము నుండి అన్వేషించి తెలుసుకోవలసినదే. అందువలన, భగవంతుని చేరుకోవ డానికి అనేక మార్గములు ఏర్పడ్డాయి. కాని, సాధకులందరి

లక్ష్యము మాత్రము ఒక్కటే. ఆ ఏకైక భగవత్తత్త్వమును గురించి ఎందరో మహర్షులు, సాధు పుంగవులు, పావన పురుషులు, కవులు గాయకులు తమ తమ భావశైలి కనుగుణంగా వివిధ భాషలలో పదకవితలు, స్తోత్రములు రచించి స్తుతించారు, రాగమాలికలల్లి గానం చేశారు, కీర్తించారు.

## చతుర్విధ సత్య దర్శనం :

'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసః' అయి నటువంటి, వాక్కుకు, భావనకు అతీతమైన ఒక దివ్యశక్తి ఈ విశ్వమంతటను వ్యాపించి యున్నదని వేదములు, ఉపనిషత్తులు, ఉపనిషత్సారమైన భగవద్గీత ఘోషిస్తున్నాయి. ఈ విషయమునే భగవాన్ శ్రీ సత్యసాయి బాబా వారు పునరుద్ఘాటిస్తున్నారు. లెక్కకు మించిన రూప, నామము లతో నిరంతరం మార్పు చెందే ఈ సృష్టిని నడిపే ఆ సచ్చిదానంద తత్త్వము ఎన్నటికి మారని నిత్యసత్యమైన, సనాతనమైన తత్త్వము.

త్రికాలాబాధ్యమైన సత్యస్వరూపమును నాలుగు విధములుగా గుర్తించ వచ్చునని వేదాంతము మనకు బోధిస్తున్నది.

మొట్టమొదటిగా, స్వప్న, జాగృత్, సుషుప్త్యవస్థలలోను, అంతకు మించి తురీయావస్థలోను కూడా నిలిచి ఉండే, మార్పు చెందని విశ్వమంతటా వ్యాపించియున్న పరబ్రహ్మ తత్త్వము. దీనిని 'పారమార్థిక సత్యము' లేక 'సత్యస్య సత్యం' అని బృహదారణ్యకోపనిషత్తు వర్ణిస్తున్నది.

రెండవది, నిరంతరం మార్పుచెందే జాగ్రదవస్థలో మాత్రమే గుర్తింపబడే ప్రాపంచికమైన సత్యము. దీనిని 'వ్యావహారిక సత్యము' అంటారు.

మూడవది, మృగతృష్ణలో గోచరించే నీటివలె, రజ్జు సర్ప భ్రాంతి కారణంగా క్రీనీడలో త్రాచు పాము వలె గోచరించేది 'ప్రాతిభాసిక సత్యము'.

ఇక నాలుగవది, కేవలం ఊహాజనితమైన 'కేవల కాల్పనిక సత్యము'. దీనిలో ఆధార భూతమైన ఎటువంటి వస్తువు ఉండదు. శశివిషాణం లేక కుందేటి కొమ్మును దీనికి ఉదాహరణగా పేర్కొనవచ్చు. అయితే ఈ నాలుగు రకముల అనుభవాలలోను, ఆ అనుభవమును పొందే, దానికి సాక్షీభూతమైన, ఒక చైతన్యశక్తి ఉంటుంది. అదే ఆత్మ.

## "ఏకం సత్ విప్రాః బహుధా వదంతి" :

ఋగ్వేదములో చెప్పబడిన 'ఏకం సత్ విప్రాః బహుధా వదంతి' అనే మహా వాక్యములో ప్రపంచ మంతటికి వర్తించే గొప్ప అంతరార్థమున్నదని భగవాన్ బాబావారు చెపుతారు. ఇది సర్వ ధర్మ సమభావమునే గాక అన్ని మతముల యందు గౌరవభావమును కూడా పెంపొందిస్తుంది. మానవ జాతి పొందే అనేక రకములైన ఆధ్యాత్మికానుభవములు విశ్వజనీనమైనవనే సత్యమును ఇది నిరూపిస్తుంది. ఇది మనలను ఉన్నతమైన చైతన్య స్థాయికి కొనిపోయి విశ్వవ్యాప్తమైన పరమాత్మ తత్త్వమును గుర్తించేటట్లు చేస్తుంది. హిందూ మతము, జోరాష్ట్ర మతము, బౌద్ధ మతము, యూదు మతము, క్రైస్తవ మతము లేక ఇస్లాం, ఏ మతమైనా సరే, అన్ని మతములు బోధించే సత్యమొక్కటే అనే భావన యందు మనకు అచంచలమైన విశ్వాసమును ఇది పెంపొందిస్తుంది. అయితే ఇట్టి విశ్వ చైతన్య స్థాయికి మనం చేరుకోవాలంటే మనలో పెరిగిపోయిన స్వార్థ, సంకుచిత భావములు, అహంకారము సమసిపోవాలి. ఈ వస్తు ప్రపంచమందు మనం పెంచుకున్న కోరికలు, బంధాలు తొలిగిపోవాలి. జీవాత్మ పరమాత్మతో ఐక్యము చెందినప్పుడు ఎటువంటి దుఃఖమునకు తావు లేదని, అట్టి వ్యక్తి జీవన్ముక్తుడని వేదములు ఘోషిస్తున్నాయి. అటువంటి వ్యక్తికి 'తత్రకో మోహః కశ్శోకః ఏకత్వం అనుపశ్యతః' అంటే మోహము గాని, శోకము గాని, ఎక్కడ ఉన్నాయి? అని ఈశావాస్యో పనిషత్తు ప్రశ్నిస్తున్నది. వ్యక్తి చైతన్య స్థాయి నుండి విశ్వ చైతన్యస్థాయికి, చివరకు దివ్య చైతన్య స్థాయికి చేరుకోవ డానికి కర్మ, భక్తి, జ్ఞానములనే మూడు సాధనలను సనాతన ధర్మము నిర్దేశిస్తున్నది. ధ్యానము, ఆత్మానుసంధానము, ఈ సనాతన ధర్మములోని కొన్ని అద్వితీయమైన అంశములు.

## ఏకోవశీ సర్వభూతాంతరాత్మ :

వేద విజ్ఞానమును అవగాహన చేసుకోవడానికి ముందు భిన్నత్వములోని ఏకత్వమును ప్రప్రథమంగా అవగాహన చేసుకోవాలి. అనేక రూపనామములతో వ్యవహరింపబడుతున్న ఈ వస్తు ప్రపంచమును బంధించి ఉంచే సూత్రము, ఏకత్వమనే దారము. అంతే కాకుండా

జీవాత్మ, పరమాత్మల అభేద తత్త్వమును వేదములు ఘోషిస్తున్నాయి.

సమస్త జీవరాసులు భగవంతుని నుండి ఉద్భవించాయి. అదే విధముగా భగవంతుడు సమస్త జీవరాసుల యందు అధివసించి ఉన్నాడు. భగవాన్ బాబా వారు అనేక సార్లు తమ దివ్యోపన్యాసములలో 'ఏకోదేవః సర్వ భూతాంతరాత్మా' అనే వేదవాక్యమును ఉద్ఘాటిస్తూ ఉంటారు. ఈ విధంగా సర్వ జీవరాసులలోను అంతర్లీనమై యున్న పరమార్థ తత్త్వమును గుర్తించడమే వైదిక పరమైన భారతీయ పరమార్థ తత్త్వమునకు మూలస్తంభము. మన మహర్షులు కనుగొన్న గొప్ప అపురూపమైన సత్యము ఇదే.

ఆత్మతత్త్వము ప్రతి ఒక్కరిలోను నిబిడీకృతమై యున్నదనే చైతన్యము, అది నశ్వరమైన ఈ శరీరము కంటె భిన్నమైనది, అతీతమైనది అనే జ్ఞానముపై భారతీయ పరమార్థ తత్త్వము ఆధారపడియున్నది. ఈ విషయమే భగవద్గీతలో 'నైనం ఛిందంతి శస్త్రాణి, నైనం దహతి పావకః, నచైనం క్లేదయంత్యాపః, నశోషయతి మారుతః', అంటే ఆత్మ అస్త్ర శస్త్రములచే ఖండింపవీలుకానిది, అగ్నిచే దహింపబడనిది, నీటిచే తడుపబడనిది, గాలిచే శోషింప బడనిది, అని ఉద్ఘాటింపబడింది. అది సర్వత్రా సర్వకాల సర్వావస్థలయందు నిత్యసత్యమై మార్పు, చేర్పు, కూర్పు లేకుండాయుండును.

### తత్త్వ దర్శనం:

వేదాధ్యయనం చేసిన తత్త్వవేత్తలు యుగయుగాలుగా తపస్సు, పుణ్యకార్యాలు చేయడం, నియమనిష్ఠలతో కూడిన ఆత్మ విచారము అనే సాధనల ద్వారా పరమాత్మ తత్త్వమును అనుభవములోనికి తెచ్చుకోవడానికి ప్రయత్నం చేశారు. బహిర్ దృష్టితో బాహ్య ప్రపంచమును అన్వేషించడం వలన ప్రయోజనం లేదని వారు తెలుసు కున్నారు. తమ అంతరంగములోనే ఉన్న ఆత్మ చైతన్యమును గుర్తించడానికి అంతర్దృష్టిని వారు అలవరచు కున్నారు. మానవుని యందే నిక్షిప్తమై యున్న సత్యమును అన్వేషించడానికి ప్రయత్నం చేశారు. సంస్కృత భాషలో మానవ అంటే మనస్సు. అందువలన మనస్సు యొక్క స్వరూప స్వభావములను వారు అధ్యయనం చేశారు. మానవుని అంతరంగములో, అంటే మనస్సు, బుద్ధి, అహంకారముల వెనుకనున్న ఆత్మ చైతన్యమును గుర్తించ డానికి వారు ప్రయత్నము చేశారు. వేద కాలములోని మహర్షులు ధ్యానము ద్వారా భగవంతుడు వేరే ఎక్కడా లేడనీ, మానవుని అంతరంగములోనే ఉన్నాడని తమ ప్రత్యక్ష అనుభవం ద్వారా వ్యక్తము చేశారు. అదే ఆత్మ తత్త్వమని, అదే 'సత్యస్య సత్యం' అని వారు ఉద్ఘాటించారు.

### జీవాత్మ, పరమాత్మ :

ప్రతి మానవునిలోను అంతర్యామిగాను, బాహ్యంగా విశ్వమంతటను వ్యాపించియున్న అతీతమైన దివ్యశక్తిగా కూడా వెలసియున్న పరబ్రహ్మ తత్త్వమును అన్వేషించే భారతదేశమునకు మనువు 'బ్రహ్మావర్తము' అని పేరు పెట్టాడు. పరమపావనమైన ఈ భారతీయ పరమార్థ వాహిని అనేక యుగముల నుండి నిరంతరాయంగా ప్రవహిస్తున్నది. అందువలననే అవతార పురుషులు భారత దేశములోనే ఉద్భవిస్తున్నారని భగవాన్ బాబావారు ఉద్ఘాటించారు. మానవ రూపములో అవతరించిన భగవంతుని గురించి, మానవునిలో గల దివ్యత్వమును గురించి ఆయన అనేక మార్లు నొక్కి చెప్పారు. "మీరు

### శ్రీ సత్యసా (శా) యి ప్రభూ!

ఉ॥ లాలిత శీలసంపద నిరంతర బోధ సౌవర్చ్యవట్టి వి
ద్యాలయముల్ వెలార్చితి; భయంకర రోగములన్ కుదుర్చువై
ద్యాలయముల్ విశిష్టములు ధారత నిల్పితి పుట్టపర్తి; ప్రే
మాలయ! సత్యసాయి విభు! మానవ సేవ సౌవర్చ్య మాధవ!

ఉ॥ ఖాయము పాపతాపసని కాయము కూల్చుట, అంతెకాదు సో
హాయిగ నీదు పేరు సముదంచిత రీతిని త్రిప్పి పల్క ఈ
శా! యగు; నీ మహత్త్వము విచారము సారతరాద్భుతమ్మొ; ఓ
శాయి! నినున్ స్మరింతు మనసా వచసా ప్రమదప్రదమ్ముగన్

శా॥ 'శ్రీవాణీ' జయవైభవాభ్యుదయనిశ్రేయః ప్రదాకారి! నీ
యావద్భావ పరీమళ స్ఫురదుదవ్యాప ప్రమావాళి మా
భావోద్యానము నిత్య జాగృతి సౌవర్ణన్ భాసిలున్ గాదె! నీ
సేవా భాగ్యమె మా అదృష్టము మమా! శ్రీ సత్యసాయి ప్రభూ!

**- రాముడుగు వెంకటేశ్వర శర్మ**
గుంటూరు



భగవంతుడేనా?" అని అడిగిన ప్రశ్నకు ఆయన సమాధానం చెబుతూ 'అవును; ఇది సగం వరకు మాత్రమే నిజం. మీరు కూడా భగవంతుడే, అది పరిపూర్ణమైన సత్యము. భగవంతుడు మీలో అంతర్యామిగా ఉన్నాడు, ఆయనను బయటకు వ్యక్తము చేయడానికి ప్రయత్నం చేయండి' అని చెప్పారు.

శ్రీ అధ్యాత్మ రామాయణములో హనుమంతుడు ఇదే భావమును ఇలా వ్యక్తము చేశాడు.

**"దేహ బుధ్యాతు దాసోఽహం**
**జీవ బుధ్యాతు త్వదంశకః**
**ఆత్మ బుధ్యాతు త్వమేవాహం"**

శరీర భావముననుసరించి నేను నీ దాసుడను; జీవుడనే బుద్ధిచే విచారించి చూచిన, నేను నీలో ఒక అంశమును; ఆత్మ భావముతో చూచిన నీవే నేను, అని దీని అర్థం.

ఆత్మ అనేది ఆద్యంతములు లేని పరబ్రహ్మ తత్త్వమని వేదపండితులందరూ అంగీకరిస్తారు. అయితే, అది మానవ రూపములో నున్న దివ్యాత్మ స్థాయికి చేరుకోవడానికి అనేక జన్మలు గడుపవలసి వస్తుంది. ఈ విషయాన్ని భగవాన్ బాబావారు పదేపదే చెపుతారు.

**సచ్చిదానంద స్వరూపము :**

వేదములలో నిరూపించబడిన మౌలిక సత్యములను అన్వేషించిన మహర్షులు, యోగులు, ఆచార్యులు ఆత్మ యొక్క స్వాభావిక లక్షణములు పవిత్రత, చైతన్యము, పరిపూర్ణమైన ఆనందము అని తెలియజేస్తారు. అది శుద్ధ సాత్త్విక చైతన్య రూపమైన ఆనందము. దానినే వారు 'సచ్చిదానంద' మని పిలుస్తూ వచ్చారు.

వేదములు, ఉపనిషత్తులు సాక్షాత్తూ భగవంతుని శ్వాస అని వేదవేత్తలు విశ్వసిస్తారు. అవి వారికి అనేక నిగూఢమైన అంతరార్థములను తెలియజేస్తాయి. ధ్యానము ద్వారా వారు మానవత్వములోని దివ్యత్వమును, దైవము యొక్క మానవత్వమును తెలుసుకుంటారు. మానవ రూపములో నున్న భగవంతుని ఆ తత్త్వవేత్తలు దర్శించి, అనుభవములోనికి తెచ్చుకోవడానికి ప్రయత్నం చేస్తారు.



వైదిక సత్యములను గ్రహించిన తత్త్వవేత్తలకు మతమంటే అంతర్ముఖ సాధన ద్వారా తమ అంతరంగములోనే ఉన్న దివ్యాత్మను అన్వేషించి తెలుసుకోవటం తప్ప మరేది కాదు. విశ్వమంతటా వ్యాపించి యున్న, సమస్త జీవులకు ఆధారభూతమైన, మహామహిమాన్వితమైన దివ్య చైతన్యమును తమ అంతరంగములోనే అన్వేషించి తెలుసుకోవటమే వారి సాధన.

మానవుని అంతరంగములో నున్న దివ్యజ్యోతియైన అంతర్జ్యోతి యొక్క వైభవమును, మహిమను ధ్యానించడం మరియు విశ్వవ్యాప్తమైన, నిత్య సత్యమైన ఆత్మతత్త్వమును అనుభవించడం ఆధ్యాత్మిక సాధనలో గొప్ప ప్రగతికి సూచన. అదే సచ్చిదానంద స్వరూపమును అనుభవములోనికి తెచ్చుకోవడం.

**విశ్వజనీనమైన ఆధ్యాత్మిక సత్యము :**

ఋగ్వేదములోని శ్రీ పురుష సూక్తము విశ్వమంతయు భగవంతుని శరీర స్వరూపమేనని ఉద్ఘాటిస్తోంది.

**"సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష సహస్రపాత్"** అంటే, విశ్వవ్యాప్తియైన భగవంతుడు వేలకొద్ది శిరస్సులు, కన్నులు, పాదములు కలిగి ఉన్నాడని అర్థము. అనగా భగవంతుడు అనంతమైన రూప, నామములు, ధరించి యున్నాడని ఈ మంత్రము యొక్క భావము.

ప్రపంచములోని దేశములన్నియు బ్రహ్మ చైతన్యము లేక బ్రహ్మ సూత్రము అనే దారము ద్వారా ఒక దానితో ఒకటి బంధింపబడి ఒక పుష్పమాలగా కూర్చబడినవి. ఈ విశ్వ విరాట్స్వరూపములో ఒకే రక్తము ప్రవహిస్తోంది. సమస్త మానవజాతిలోను ఒకే దివ్య చైతన్యము ప్రతిబింబిస్తోంది.

భగవాన్ బాబా వారు పదే పదే ఉద్ఘాటిస్తున్నట్లుగా

"ఉన్నది ఒకే జాతి - అదే మానవ జాతి
ఉన్నది ఒకే భాష - అది హృదయ భాష
ఉన్నది ఒకే మతము - అది ప్రేమ మతము
ఉన్నది ఒకే భగవంతుడు - ఆయన సర్వాంతర్యామి"

(తెనుగుసేత : గంమెళ్ళ కృష్ణమూర్తి)

**శ్రీవాణిని ప్రోత్సహించండి!**
**సాయి సందేశ వ్యాప్తికి తోడ్పడండి!!**

# భగవాన్ సాయి అనుగ్రహం

అది 1966వ సంవత్సరం. ప్రశాంతి నిలయంలో శ్రీశ్రీశ్రీ సత్యసాయిబాబావారిచే పిలువబడి నేనూ, మిత్రుడు నరశింహారావు ఒక పెద్ద గదిలోనికి వెళ్ళాము. అప్పటికే అచట చాలామంది భక్తులు ఉన్నారు.

బాబావారు విడివిడిగా పిలిచి, ఒకొక్కరికి 'ఇంటర్వ్యూ' ఇస్తున్నారు. స్వామి ఇంటర్వ్యూ ఇచ్చే స్థలం కూడ గదికి ఒక మూలగా వుంది. ఇతరులు చూడటాన్కి, వారితో జరిపే సంభాషణ వినటాన్కి వీలుండని దూరంలో ఉంది. కొంత మంది భక్తులకు ఇంటర్వ్యూ ఇచ్చిన తర్వాత బాబావారు నన్ను, శ్రీ నరశింహారావును కలిపి లోపలికి పిలిచారు. మేము వెళ్ళి ప్రథమముగా స్వామివారి పాదనమస్కారం చేసుకున్నాము. మేము మాట్లాడకముందే స్వామి అన్నారు.

"మీరు హైదరాబాద్ నుంచి వచ్చారు. స్వామిని హైదరాబాద్‌కు ఆహ్వానించటాన్కి వచ్చారు. అయితే స్వామితో ఇంటర్వ్యూ దొరుకునా? లేదా? అని సందేహిస్తున్నారు. స్వామిని కల్సుకోవాలని, స్వామితో మాట్లాడాలని వచ్చేవారికి స్వామి తప్పక అవకాశం ఇస్తారు.

'కొంతమంది ప్రయాణం మధ్యలో పుట్టపర్తిలో దిగి, స్వామిని చూచి మాట్లాడాలని వస్తారు. అట్టివారు కొంత ఓపికతో వేచి ఉండాలి. అలా ఉండలేనివారు దర్శనం చేసుకుని వెళ్ళుతారు. 'మీరు స్వామిని ఆహ్వానించటాన్కి వచ్చారు హైదరాబాద్‌కు. కాని స్వామి ఇప్పుడు రావటాన్కి వీలుపడదు. వచ్చే నెలలో హైదరాబాద్ వస్తాను. నా ప్రోగ్రామ్ గురించిన వివరాలు శ్రీ బూర్గుల రామకృష్ణారావు, ఉమాపతి నుండి తెలుసుకోండి. నేను హైదరాబాద్ వచ్చినప్పుడు మీకు ఒక సమావేశానికి అవకాశం ఇవ్వమని వార్కి చెప్పండి' అన్నారు స్వామి.

ఇద్దరం మరొకసారి స్వామి పాదాలకు నమస్కరించి హాలులోనికి వచ్చాం. తర్వాత బాబావారు మరికొంత మందికి ఇంటర్వ్యూ ఇచ్చారు. తలవని తలంపుగా మరల స్వామి మా మిత్రుడు నరశింహారావును లోనికి పిలిచారు. ఆతని స్వవిషయాలు ప్రస్తావన చేసినట్లు తర్వాత నాతో నరశింహారావు చెప్పాడు. నరశింహారావు బయటకు వచ్చిన తర్వాత మరల స్వామి నన్ను లోపలికి పిలిచారు. మరల మరొకసారి స్వామికి పాదాభివందనం చేశాను. స్వామి చాలా ఆప్యాయంగా మాట్లాడారు. స్వామి వారితో జరిగిన సంభాషణ జ్ఞాపకమున్నంతవరకు వ్రాస్తాను.

స్వామి అన్నారు. 'నీవు చాలా భారం నీపై వేసుకుని కుటుంబం నడుపుతున్నావు. అది మోయలేని భారం. ఆర్థిక పరమైన ఇబ్బందులు స్వామికి తెలుసు'. నీ పిల్లల భవిష్యత్ గురించి ఆలోచిస్తావు. అయితే వారు నీ సంకల్పం వలన పుట్టిన వారుకారు. వారి భవిష్యత్ నీవు నిర్ణయించలేవు'.

## జి.సి.హెచ్. రామారావు, హైదరాబాద్

నేను అన్నాను. 'స్వామీ! నా దగ్గర ఉన్నది నా తండ్రి; సోదరులు. తల్లిదండ్రులను కోల్పోయిన మేనల్లుడు. ఇక నా పిల్లలు. మళ్ళీ బాబాయే అన్నారు. "మంచిది బంగారు. మంచిది. ఇకనుంచి నీ ఆర్థిక ఇబ్బందులు సమసిపోతాయి. నీ పిల్లల విషయం స్వామి చూచుకుంటారు'. ఇలా అంటూ నా కడుపు మీద చేయి వేశారు. 'ఉదర సంబంధమైన వ్యాధి రావచ్చు. అయినా ఫరవాలేదు. జాగ్రత్తగా భోజన విషయం చూచుకో' అన్నారు బాబా.

స్వామి కరుణామయమైన ఈ మాటలు నన్ను కలచి వేశాయి. కళ్ళు చెమ్మగిల్లాయి. స్వామి పాదాలకు మరొకమారు నమస్కరించి లేచాను. స్వామి ఒక సెకండులో కన్న తక్కువ వ్యవధిలో తన "ఫోటో" ను చేతిలోనికి తెప్పించి నాకు ఇచ్చారు.

"ఈ ఫోటో అన్ని వేళలా నీ దగ్గర ఉంచుకో. నీపర్సులో పెట్టుకో. నీ ఇబ్బందులు తీరిపోతాయి" అన్నారు బాబావారు. మరల స్వామి ఇచ్చిన ఫోటోతో నేను హాలులోనికి వచ్చాను. అక్కడ చేరిన భక్తులకందరికి స్వామి స్వయంగా విభూతి పొట్లాలు ఇచ్చారు. అందరూ సంతోషంగా హాలు నుంచి బయటకు వచ్చేశారు.

స్వామివారు చెప్పిన ప్రకారం హైదరాబాద్ వచ్చినప్పుడు మేము ఏర్పాటుచేసిన ప్రత్యేక భక్తుల సమావేశంకు వచ్చారు. ఆశీర్వదించారు. సనత్‌నగర్‌లో మేము ఏర్పాటుచేసిన నారాయణ సేవను స్వామి ప్రారంభించి, కొందరికి ప్రసాదం వడ్డించారు. అందరికి స్వామి దర్శనభాగ్యం లభించింది. ★





# భక్త పరాధీనుడు బాబా

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు 1941 వ సంవత్సరంలో బుక్కపట్నం స్థానిక ఎలిమెంటరీ పాఠశాలలో 8 వ తరగతి చేరినారు. ఈ సందర్భమున నేను కూడా బాబా వారితో పాటు చదివే భాగ్యము కలిగినందులకు నా పూర్వజన్మ సుకృతమని భావించుచున్నాను. అప్పటిలో స్వామి వారితో కలిగిన ప్రేమానుబంధము ఇప్పటివరకు కూడా అదే ప్రేమకు నోచుకొనుచున్నాను. నా నిత్య జీవితంలో ఎన్ని ఇబ్బందులు, కష్టములు ఎదురైనా కాపాడుచున్నారు. స్వామి వారు 60 వ జన్మదినోత్సవ సందర్భమున మమ్ములను జ్ఞాపకం ఉంచుకొని నన్ను, బుచ్చయ్యగారి పల్లి A.C నారాయణ రెడ్డి గారిని పిలిపించుకొన్నారు. ఆ సందర్భమున మాకు నూతన వస్త్రములు ప్రసాదించినారు. ఈ వస్త్రములను ధరించి స్వామి సన్నిధికి వెళ్ళినాము. స్వామివారు వారి సన్నిధికి మమ్ములను పిలుచుకొనిపోయినారు. ఆ సందర్భమున స్వామివారు నాతో ఈ విధంగా అన్నారు. నాకు ప్రస్తుతం 60 సంవత్సరములు పూర్తి అయినందున మిమ్ములను పిలిపించుకున్నానని తెలుపుతూ విద్యార్థి దశలో కలసి మెలసి యుండిన సందర్భాలను జ్ఞాపకం చేసుకుంటూ అనేక విషయాలు మాట్లాడినారు. ఈ సందర్భమున నా కుడిచేతి చూపుడు వేలుకు బాబా గారి ఫోటో ఉన్న సువర్ణ ఉంగరం సృష్టించి తొడిగినారు. ఇపుడు నీకు ఎట్లు ఉన్నదని బాబావారు అడిగినారు. నా జన్మ తరించినదని తెలిపినాను. మిత్రుడు AC నారాయణ రెడ్డి గారి కోర్కెమన్నించి బుచ్చయ్యగారి పల్లెలో నివాసయోగ్యమైన సుందర భవనమును నిర్మాణం గావించినారు. ఈ సందర్భమున స్వామివారు మమ్ములిరువురిని ఆశీర్వదించినారు. స్వామి వారు చెప్పినట్లుగా మనము ఒక్క అడుగు ముందుకు వేస్తే స్వామి వారు పది అడుగులు ముందుకు వేస్తారు. మీ వెంట జంటగా ఉంటానని తెలిపినారు. ఇది అక్షరాల సత్యమని ఇప్పటికి రుజువయింది.

ఇటీవల 4 మాసముల క్రితం నా భార్యకు అతి ప్రమాదకరమైన జబ్బు ఆవరించినది. మరణావస్థలో కొట్టుమిట్టాడుచున్నది. నాకు దిక్కుతోచని పరిస్థితి ఏర్పడినది. ఈ పరిస్థితిలో స్వామి వారి పాదాలంటి ప్రార్థించినాను. నా భార్యను బ్రతికించి నా జీవితం అంధకారం కాకుండ కాపాడమని స్వామి వారిని దీనత్వముతో ప్రార్థించినాను. ఈ విషయము నేను ముందుగా నా భార్యను స్వామివారి సూపర్ స్పెషాలిటి ఆసుపత్రిలో డాక్టర్ భట్ గారికి చూపించి తగిన వైద్య సేవలందించి కాపాడమని కోరినాను. డాక్టర్

**టి.వి. సత్యనారాయణ, బుక్కపట్నం**

భట్ గారు నా భార్యను పరీక్షించి ఈ ఆపరేషన్ చేయుటకు ధైర్యం చాలదనియు, ఏమి చేయజాలని స్థితిలో ఉన్నానని తెలిపినారు. ఈ పరిస్థితిలో నాబాధను గుర్తించి డాక్టర్ భట్ గారు ఒక్కమాట అన్నారు. ఏమనగా! స్వామివారు నాకు స్వయంగా ఆశీర్వదించి ఈ ఆపరేషన్ జరుపమని ఆజ్ఞాపిస్తే స్వామివారి మీద భారంవేసి చేయగలుగుతానని తెలిపినారు. ఈ మాట విన్న తరువాత నా మనసుకు కొంత ఊరట కలిగింది. ఆ తరువాత స్వామివారికి నా కన్నీళ్ళతో నాబాధను విన్నవించుకొని డాక్టర్ భట్ గారు చెప్పిన విషయము విన్నవించుకున్నాను. స్వామివారు నా బాధను గుర్తించి వెంటనే డాక్టర్ భట్ గారికి ధైర్యం కలిగించి ఈ ఆపరేషన్ చేయమని నేను చెప్పుచున్నానని తెలిపి ఆశీర్వదించినారు. ఆ పిమ్మట ఆపరేషన్ జయప్రదంగా జరిపి ఆపదనుంచి కాపాడినారు. ఆ తర్వాత స్వామి వారి ఆదేశానుసారం 7 వారాలు ఆసుపత్రిలో ఉంచుకొని సంపూర్ణ ఆరోగ్యవంతురాలిని చేసినారు. ఆ పిమ్మట స్వామివారు నా భార్యను ఆశీర్వదించి ఇంటికి పంపినారు, ప్రస్తుతం బాగున్నది. దయామయుడు అయిన స్వామివారు నా భార్య ఆరోగ్యం గురించి అడుగుచునే యుందురు. నేను స్వామివారి దర్శనం కొరకు వెళ్ళినప్పుడల్లా ఎంతో ప్రేమతో పిలుచుకొని అనేక విషయములు మాట్లాడి ఆశీర్వదించి పంపెడివారు. ఈ విధంగానే జరిగిపోవుచున్నది.

అయితే ఒకసారి స్వామి వారి దర్శనం కొరకు కూర్చున్నాడు. అయితే స్వామివారు నా ముందు నుంచి వెళ్ళినారు. నన్ను చూడలేదు. పలుకరించ లేదు. ఈ సంఘటన చూచి ఎంతోభయపడి చెప్పలేని ఆవేదన చెందినాను. కలిగిన బాధ వర్ణింపజాలను. నా బాధను గురించి ఉత్తరం ద్వారా తెలుపుకున్నాను. నా ఉత్తరం స్వామి వారికి అందిన తరువాత స్వామివారు కూడా నాకు ఉత్తరం వ్రాసినారు. ఆ ఉత్తరం చూచిన వెంటనే నా హృదయం చలించినది. నన్ను ఓదార్చడానికి నా బాధను మరచిపోవడానికి ఎంతో అభిమానంతో అనేక విషయాలు తెలుపుతూ మిక్కిలి సంతోషం కలిగించే లాగున అనేక అమూల్య విషయాలు తెలిపినారు. భక్తుల పట్ల స్వామి వారికి ఎంత అభిమానం ఉన్నదో ఈ ఉత్తరం చూచిన వారికే తెలుస్తుంది. ఈ యొక్క మహత్తర విషయాన్ని భక్తులందరికీ తెలియ జేయడం ఎంతైనా అవసరం అని భావించి స్వామివారు వ్రాసిన ఉత్తరం యధాతంగా తెలుపు కొనుచున్నాను.

**సత్యనారాయణ అందుకో ఆశీర్వాదములు.**

అందె నీ పంపిన వందనములు, అందలి విషయములు విశదమయ్యెను. నీ మనసు అశాంతితో ఆరాటపడు చుండినట్లు కూడానూ అర్థమయినది. అది నాకు చాలా బాధ కలిగించెను. భక్తుల ఆనందమే నా ఆహారముగా తలంచు నాకు నీకు ఆనందము లేకపోవటము నాకు ఆహారము చాలక పోవుటమే. మానవుని నిజస్వరూపమే ఆనందము కదా!, వాని నిజస్వభావమే శాంతము కదా? వాని గుణమే ప్రేమ స్వరూపము. అందువలననే మానవుడు తన నిత్య సత్య నిర్మలమైన తన స్వస్థానమును కోరుటలో తప్పేమి లేదు కదా? అది వాని కర్తవ్యము. జలములందలి చేపను బంగారు గిన్నెలో పెట్టినను ఆ చేప సంతోషింపక తన స్వస్థానమైన జలము చేరుటకెట్లు ఆరాటపడు చుండునో అట్లే తన నిజస్థానములైన ఆనందము, శాంతి, ప్రేమలను స్వస్థానమును వీడి భోగభాగ్యములతో తులతూగుచున్న ఈ భౌతికమను బంగారు గిన్నెలో నివశించినను తను సంతోషించక అగమ్య గోచరమై తన స్వస్థానమును ఆశించి అట్టి ఆనంద శాంతము చేరుటకు ఆరాటపడునుకదా! ఇదియేసత్యము. అట్టి ఆరాటమే సత్యాన్వేషణ. అదియే మానవుని లక్ష్యము ఔనా? కాదా?

నాయనా! అనాటి నుండియు స్వామి దయా ప్రేమలతో నిన్ను చూచు చుండుటే నీ ఆనందమునకు మూలకారణ మనియు, ఈనాటి స్థితికి పునాది అనియూ వ్రాస్తివి. అది నన్నెంతో ఆనందపరచినది. ఈ నాటిది కాదు మన సంబంధము, యేనాటిదో. ఈనాటికి, యేనాటికి అది మారునదికాదు. స్వామి దయాప్రేమలు యెల్లప్పుడు ఒక్కటే విధముగా నుండును. నుండెను. నున్నవి. దీనిలో నీకు సందేహమక్కరలేదు. స్వామి నీకు యేనాడునూ నీవాడే. అది మారునదికాదు, జారునదికాదు, ఇక్కడికి వచ్చినా, అక్కడికి వచ్చినా, నీకు మొదలు నుండియూ, నా హృదయమున యెక్కడిచోటు అక్కడ నీకు స్థిరముగానే యుండును. శిథిలముకాదు, కాలేదు, కాబోదు, కనుక ధైర్యంగా, ఆనందంగా వచ్చిన అశాంతు లకు చోటివ్వక, అధైర్యమునకు ప్రవేశమియ్యకు. ఉత్సాహముతో సాయి హృదయమున ఊయలలూగు. అట్టి ఉత్సాహమును త్వరలో అందింతును. జయింతువు. ధైర్యంగా ఉండు. నవరాత్రులు గడచినప్పటి నుండి వచ్చిన వారలను ప్రత్యేకించి చూచుచు పంపుటలో నాకు శివరాత్రిగా ఉన్నది. అదే నా తృప్తి. ఈ కార్యములో మునుగుటచే అత్యవసరవారలను చూచి పంపుటలో మొన్న నీతో సంభాషించలేక పోతిని. కానీ వేరే కారణము కాదు. అంత మాత్రమున మన బంధము సన్నగిల్లదు. మనది ఆత్మ సంబంధము కానీ, వేరే కాదు. అది తరగని. కరగని. కరుణ. త్వరలో ఆనందమునను భవించు. అశాంతిని జయించు.

ఇట్లు

నీ బాబా



# 'సాయి అవతార వైభవం'

"ఆనందబాలుడే ఆ నంద బాలుడై
తనవారి గుర్తింప తరలివచ్చె
ఆరామచంద్రుడే ఆ రామచంద్రుడై
తన బంటులను కనుగొనగవచ్చె
ఆ యీశుడే బాలసాయీశుడై ఇట
తన గుంపుతో ఆడుకొనగ వచ్చె
ఆ మహావిష్ణువే ఈ మహీ విష్ణువై
తన ఆయుధములు చేకొనగవచ్చె
అట్టి పరమాత్మయను బొమ్మలాటగాడు
తాను జీవుల రంగస్థలాన నిలిచి
ఆడు ఆనాడు ఈనాడు......"

ఇది స్వామి తన అవతార తత్త్వం గూర్చి చెప్పిన పద్యరాజం. ఈ పద్యం ద్వారా స్వామి ఈనాటి సాయిబాబా కాదు. పురాతన సనాతన కాలం నుంచి అనంతంగా అవతారాలు దాలుస్తున్నాడు. అన్ని అవతారాలు స్వామివే.

ప్రతి యుగంలోనూ భక్తులను బాగుచేయుటకు పరిశుద్ధమైన వారిని చేయుటకు స్వామి శ్రమిస్తున్నాడు. భక్తులు తనలోకం రావాలనీ, తన లోకం వచ్చినవారు సామీప్యంలో ఉండాలనీ, సామీప్యంలోనివారు సారూప్యం పొందాలనీ - సారూప్యం పొందినవారు సాయుజ్యం అనుభవించాలనీ, భగవంతుడి మహత్వాకాంక్ష. దీనికై స్వామి ఎన్నో యుగాలుగా కష్టపడి తాను కూడా సామాన్య మానవుడి స్థాయికి వచ్చి ఎంతో సహనంతో, ప్రేమతో, వాత్సల్యంతో నీతిపాఠాలు చెప్పి, చమత్కారాలు చూపి బహుమతులిచ్చి, ఆపదలు తొలగించి, అభీష్టాలు తీర్చి సంతోషం కలిగిస్తున్నారు. పిల్లలను పెద్దచేయటం కోసం తల్లి తాయాలుపెట్టి, తండ్రి పాఠాలునేర్పి అనేకయాతనలు సహిస్తారు. అలానే స్వామి యుగయుగాలలో అవతరించి లోకం సృష్టిని సరిదిద్దుతుంటారు.

ఈ అవతార విధానంలో కొన్ని అంశావతారాలు, కొన్ని లీలావతారాలు, కొన్ని పూర్ణావతారాలు దాలుస్తున్నట్లు మన వేద సాహిత్య పురాణ వాఙ్మయం విశద పరుస్తుంటుంది. బాగా సంస్కరింపబడింది సంస్కృతం. సంస్కృతంతో బాగా సంస్కరణ పొందిందే మన సంస్కృతి. ఆ సంస్కృతిని, ప్రపంచంలోని ప్రతివాడు పట్టుదలతో అలవరచుకొంటూ మంచిని గ్రహించి ముందుకు వెళు తున్నాడు. ముందుకు కూడా వెళ్ళాలి. ఎక్కడ సుగుణాలు ఉంటే వాటిని సంస్కృతిలో లీనం చేసుకోవాలి. ఇది అనూచానంగా వస్తున్న ఆచారం.

సంస్కరణ మార్గానికి అవరోధం కలిగించే వారెల్లా అసురులే సుమా! సంస్కరణలు, సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసల పునాదులపై శోభిల్లుతుంటాయి. సత్య ధర్మోద్ధరణ కోసమే భగవంతుడు అనేక లీలావతారాలు దాల్చాడు.

"పరిత్రాణాయ సాధూనా సంభవామి యుగేయుగే"
'రామో విగ్రహవాన్ ధర్మః'.

**'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**

రాముడుగా వచ్చి స్వామి ధర్మం స్థాపించాడు. జగత్కంటక చక్రవర్తులను పరిమార్చాడు. సత్య పరాక్రముడై విజృంభించాడు. అసురమూకలను సంహారంచేసి ప్రజా దృష్టితో తాను ఆదర్శ ప్రభువుగా అజరామరంగా రాణించాడు".

ప్రజాదృష్టిలో ప్రభువు పతనం కాకూడదని కట్టుకొన్న భార్యను కారడవులలో వదలిరమ్మనాడు. ప్రజాసేవ ఇంత కఠినమైనదని నిరూపించాడు.

"అనన్యాశ్చింతయంతోమాం యేజనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"

అని కృష్ణదేవుడు ప్రేమ, శాంతులతో భక్తరక్షణ తన ధ్యేయంగా చెప్పుకొన్నాడు. ధర్మస్థాపనకై మహా యుద్ధమే జరిపించాడు. ప్రజలు బలిఅయినారు. సత్యధర్మ సంస్కరణలో ప్రజాకోటి బలి అవుతుంది. అయినా ఆదర్శం అవసరం అని గీత ప్రబోధించి జ్ఞానమార్గంలో, మానవ మనుగడకు మార్గం సుగమం చేశాడు. కృష్ణుడు గొప్ప సంస్కర్త.

ఆనాటి నుండి రోజురోజుకు అవతార వైభవాలు అనేకం. పాతమందిరంలో జరిగిన లీలలు ఎన్నో చెప్పలేము. చిత్రావతీ నదిలోని ఇసుక రేణువులను లెక్కించవచ్చునేమో గాని స్వామిలీలలు లెక్కించలేము. చిత్రావతిలోని ప్రతి రేణువు తాను సాక్షిగా అనేక గాథలు చెప్పుతూ ఉంటుంది.

"పూర్వావతార సాయీశం
పూర్ణావతార రాఘవమ్ ।



కార్యకారణమాధారం
నమ శ్రీ సత్యసాయినమ్".

ఇంతకు పూర్వం మహారాష్ట్రలోని పత్రిలో శివాంశ సంభూతుడుగా సాయీశుడుగా జనించాడు. అనేక అద్భుత కార్యాలు చేశాడు. ఈనాడు మహావిష్ణువే శ్రీ సత్యసాయిగా అవతరించాడు. సంస్కరణోద్యమాన్ని చేబూనాడు.

"యుగధర్మ పద్ధతుల్ విగళితమ్మైయుండ వయమార్గమున
త్రిప్పి నడుపు కొరకు -
లోకంబులెల్ల కల్లోలమై చెడియుండ నిష్కల్మషము చేత
వెగడు కొరకు -
దుర్మార్గ బుద్ధులై తొలగి దీనతనుండ సాధుసంరక్షణ
సలుపు కొరకు -
కాలసందిగ్ధ విగ్రహదీప్తులైయుండ భాష్యార్ధ గోప్యముల్
పలుకు కొరకు -
క్షాభారముబాపి భూదేవి మనుపు కొరకు
త్రేతనొసగిన కోర్కెలు తీర్చుకొరకు
అవతరించెను అచ్యుతుడవని మీద
సత్యరూపుడై పర్తిలో సత్యమగును"

'సాయి' అంటే స్వామి అని సామాన్య అర్థం. మరొక అర్థం 'సాంబ' అని. స: + అయి = 'అయి' అంటే పార్వతి దేవి. పార్వతీ సమేతుడైన పరమేశ్వరుడు అని పరమార్థం. 'సాయి అనే పేరుతో మహారాష్ట్రంలో మహాదేవుడు అవతరించాడు. ఆయన శివాంశలో జన్మించి లోకక్షేమ కార్యాలు చేశాడు. ఇప్పుడు మీ వంశంలో వేంకావధూత అని ఒక అవధూత ఉండేవాడు. అతడు మహాభక్తుడు. విజ్ఞాని. పెద్ద వివేకవంతుడు. అతడు నన్ను 'మా వంశంలో పుట్ట వలసింది' అని భక్తితో కొన్ని సంవత్సరాలుగా ప్రార్థిస్తున్నాడు. ఆ భక్తుడి కోరికమేరకు అతనికి 'అట్లే జన్మిస్తా'నని జన్మించాను' అన్నాడు బాలసాయి.

వేంకావధూత అని పేరు వినగానే ఆతనికి పూర్వ స్మృతులు కొన్ని స్మరణకు వచ్చాయి. దానితో వెంకమ రాజులో పెద్ద మార్పు వచ్చి దీనంగా అడిగాడు. ఇపుడు మా కర్తవ్యం ఏమిటి? అనగా - 'నన్ను శరణుజొచ్చి భక్తి విశ్వాసాలతో, నిర్మలమైన మనస్సుతో నన్ను పూజించండి. సత్ప్రవర్తన, సదాచారం, సదాలోచన నాకు ముఖ్యం. ప్రతి గురువారం భజనలు చేయండి. నా కార్యక్రమాలకు అడ్డు రాకండి. ఆరాధనలో అమితానందం లభిస్తుంది. మీ కోరికలు అన్నీ నెరవేరుతాయి. మీరు బాగా వృద్ధి పొందుతారు. సర్వమంగళాలతో మీ గృహాలు విరాజిల్లుతాయి' అని సత్యస్వామి ప్రవచించాడు. ఆ ప్రవచనం తీరు అత్యద్భుతంగా ఉంది. ఆలోచనీయంగా ఉంది. అప్పటి నుండి ఆ యింటిలో ప్రతి గురువారం భజనలు జరుగుతున్నాయి. పల్లె జనంలో భక్తి ప్రబలింది. ఒక భజన అనంతరం ప్రసాద సమయంలో సత్యాన్ని సమీపించి ఒక గ్రామ పెద్ద భక్తుడు ఇలా అభ్యర్థించాడు.

'స్వామీ! తమరు సాయిబాబానని ఒక నిదర్శనం చూపి మా మనస్సులలోని అల్ప సందేహాలు దూరంచేసి మా భక్తిని దృఢతరం చేయండి' సాహసించి అడిగినందుకు క్షమించండి'. సత్యం ఆమోదించాడు. మీరంతా శుచిగా, శుభ్రంగా ఉండండి. పాదాలు ప్రక్షాళన చేసుకొనిరండి. మంచి మల్లెపూలు పట్టుకురండి. పువ్వులంటే నాకు ఇష్టం. మల్లెలంటే మరీ ఇష్టం!. పరిశుద్ధులై భక్తులు మిక్కిలి భక్తిశ్రద్ధలతో తెల్లని మల్లెపూలవంటి మనస్సులతో తెల్లని బొండు మల్లెపూలు దోసిళ్ళనిండా పట్టుకొని వచ్చారు.

'నేను సాయిబాబాను'.

'నాయనా! నీవు ఎవరవు. నిన్ను ఎవరు ఆవేశించారు. నిజస్వరూపమేమిటి? నీ చేష్టల ఆంతర్యం ఏమిటి? నీవు సత్యంకదా! నీవు సత్యం చెప్పు. మమ్మ అయోమయంలో పడవేయకు. ఎంతకాలం మేము ఈ స్థితిలో ఉండిపోవాలి?' అని తల్లి, తండ్రి, అన్న, బంధువులు కన్నీళ్ళు పెట్టుకొని, గడ్డం పట్టుకుని మరీ వారి ఆవేదన అర్థం చేసుకొని అసలు అవతార రహస్యం విశదపరచారు.

పువ్వులు స్వామి ముందు పోశారు. స్వామి ఆ పూల పరిమళాలు ఆస్వాదించినట్లు మంత్రించి విసిరివేశారు. విచిత్రం ఏమిటంటే అవి చిత్రంగా వచ్చి వరుస క్రమంలో 'నేను సాయిబాబాను' అనే అక్షరాలు అందంగా ఏర్పడ్డాయి. అందరూ చూచి ఆ:

**"నేను సాయిని తెలియుము నిక్కముగను**
**మమత బాయుము - యత్నముల్ మానుకొనుము -**
**బాసె మీతోడి నాకు సంబంధమింక**
**కాదు ననుబట్ట మరియెట్టి ఘనునికైన"** అని చెప్పారు.

భక్తులకు బలమైన భక్తి కుదిరింది. ఆ దినం నుండి సంతోషంతో, నమ్మకంతో స్వామిని ఆరాధించసాగారు. మారుమూలన గల ఒక కుగ్రామంలో జన్మించిన స్వామి వామనస్వామిగా విశ్వం నిండిపోయినాడు. పర్తిస్వామి అంటే ప్రపంచంలో ప్రభువై అన్ని ఖండ ఖండాలవారికి అఖండ జ్యోతిగా నేడు ప్రకాశిస్తున్నాడు. ఈ విధంగా అనేక విధాల ప్రజలను కాపాడుతూ ఇదే నాకు 'దీక్ష - వ్రతము - ప్రేమ - ఘనత' అని మరీమరీ చెప్పుకొన్నారు స్వామి. *





# శ్రీ సత్యసాయి విద్యావిధానం జాతీయ స్థాయిలో అమలు జరిపేందుకు మంచి (నమూనా) ఉదాహరణ



డా॥ కె. హనుమంతప్ప

భారతదేశంలో విద్యారంగం అగమ్యగోచర స్థితిలో ఉన్నది. భారతదేశం రాజకీయ జీవితమే కాదు సామాజిక జీవితం కూడా ఏ దశలో ఉన్నదంటే ఎంతోకాలంగా మనం అంగీకరించిన కొన్ని విలువలు నేడు క్రమేణా రూపుమాసి పోయే ప్రమాదకర స్థితిలో ఉన్నాయి. సెక్యులరిజం, సోషలిజం, డెమోక్రసీ, వృత్తిపరమైన నైతిక విలువల లక్ష్యాలు నేడు తీవ్రమైన ఒత్తిడికి లోనవుతున్నాయి. విద్యావిధానం గానీ వైజ్ఞానికంగా లేదా సాంకేతికంగాగానీ మనం సాధించిన ప్రగతిగానీ మనిషిని మెరుగైన స్థాయికి తీసుకురాలేక పోయాయి. పైపెచ్చు మానవ విలువల విషయంలో కొన్ని కొత్త సమస్యలను సృష్టించాయి. వైజ్ఞానిక జ్ఞానం, సాంకేతిక శక్తి పెరిగిన స్థాయిలో మానవుని బుద్ధి కుశలత ఎదగలేదు. ఈ ప్రపంచం ఏ క్షణంలోనయినా నశించి పోవునన్న భయం నల్లని మేఘాల్లా మనపై దోబూచులాడుతోంది.

పరిసరాల నిరంకుశత్వాన్నుండి మానవుణ్ణి సైన్స్, టెక్నాలజీ, సఫలీకృతమయ్యాయి. కానీ తన ప్రవృత్తి యొక్క నిరంకుశత్వాన్నుండి తనను తాను విముక్తుణ్ణి చేయలేక పోయాయి. ఇక్కడ నైతిక, ఆధ్యాత్మిక విలువల సంబంధం ఏమిటో మనకు అర్థమవుతుంది. ముఖ్యమైన విలువల వినాశనము, సమాజంలో పెరుగుతున్న మానవద్వేషం, విద్యా వ్యవస్థలో మార్పులను కోరుతున్నాయి. అందువల్ల సామాజిక నైతిక విలువలను పెంపొందించేందుకు విద్యను ఒక బలమైన సాధనంగా చేయవల్సిన అవసరం వచ్చింది. సాంస్కృతికంగా బహుముఖమైన మన సమాజంలో విద్య, అస్పష్టతను, ధార్మిక మూఢతత్త్వాన్ని, హింసను, మూఢ విశ్వాసాలను, కర్మవాదాన్ని రూపుమాపడానికి కృషి చేయాలి.

ఇప్పుడు మనం దేశంలోని విద్యారంగాన్ని హేతు బద్ధంగా అధ్యయనం చేసి, వ్యక్తిగత శీలాన్ని రూపొందించే విలువలను పెంపొందించటంలోనూ, సామాజిక, సాంస్కృతిక, జాతీయ విలువలను పెంపొందించటంలోనూ అవసరమయ్యే వాతావరణాన్ని కల్పించటానికి ఎంత వరకు దోహదపడిందన్న విషయాన్ని పరిశీలిద్దాం! ఎందుకంటే వ్యక్తులు ఒక విశ్వాసంతోనూ, అంకిత భావంతోనూ వ్యవహరించటానికి అవి ఎంతో తోడ్పడతాయి మరి! పరిస్థితులను స్థూలంగా పరిశీలిస్తే మనకు అవగతమయ్యే విషయమేమిటంటే విద్యారంగం నేడు పనిచేస్తున్న తీరు ఏ మాత్రమూ తృప్తికరంగా లేదు. విద్యావ్యవస్థలో అత్యంత ఆవశ్యకమైన విలువలకు తిలోదకాలివ్వడం ఏనాడో మొదలయింది. విద్యావిధానంలో ఆవశ్యకమైన మార్పులు తేవడానికి ఏ రకమైన ప్రయత్నాలు జరగలేదు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత నుండి భారతదేశంలో ఎలా విద్యావిధానం ఉండాలో, ఏయే విధానాలను పాటించాలో, ఎలా అ



చేయాలో అన్న అంశాన్ని గురించి విస్తృతంగానే చర్చలు జరిగాయి. ఎందరో వ్యాసాలు వ్రాశారు. 1949-50 నాటి డా॥ రాధాకృష్ణన్ కమిటీ మొదలుగా నేటి వరకు ఎన్నో కమిటీలు, సబ్ కమిటీలు ప్రస్తుత విద్యావిధానాన్ని క్షుణ్ణంగా పరిశీలించేందుకు ఏర్పడ్డాయి. విలువలపై ఆధారపడిన విద్యావిధానంగా రూపొందించటానికి, కోరుకున్న ఫలితాలను విద్యద్వారా సాధించటానికి అవసరమైన ఆచరణ యోగ్యమైన సంస్కరణలను సూచించటం ఈ కమిటీల లక్ష్యం. కాని దురదృష్టవశాత్తూ, కారణం ఏదైనా కానివ్వండి, ఈ కమిటీలు సూచించిన మార్గాలలో దాదాపు ఏ ఒక్కటీ ఆచరణకు నోచుకోలేదు. ఒకవేళ ఒకటి అర ఆచరణలోకి వచ్చినా ఆశించిన ఫలితాలను యివ్వలేదు.

ఉన్నత విద్యారంగం ఈ మధ్య నా పరిమాణరీత్యా బాగా విస్తరించింది. ఇవ్వాళ భారతదేశంలో 200కిపైగా విశ్వవిద్యాలయాలు, 7000లకు పైగా కళాశాలలు, 2,50,000కి పైగా అధ్యాపకులు, 60 లక్షలమంది డిగ్రీ చదివే విద్యార్థులు ఉన్నారు. చెప్పుకోదగినంత అభివృద్ధి సాధించేందుకు, నిస్సందేహంగా నేడు యు.జి.సి. ఆధ్వర్యంలో, బోధనలోనూ, రీసెర్చిలోనూ ఔన్నత్యాన్ని సాధించటానికి అనేక విశ్వవిద్యాలయాల్లో ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి. అయితే, మరో







యం, ఈ సందర్భంగా విస్మరించబడింది. విద్యార్థులు, అధ్యాపకులద్వారాను, అన్ని రకముల విధానాలలో పెంపొందింపవల్సిన మానవవిలువలే ఆ అంశం.

కానీ, సాంస్కృతికంగాను, ఆధ్యాత్మికంగాను దూరదృష్టితో ఏర్పరుచుకోవల్సిన విశ్వశ్రేయోదాయకమైన శాశ్వత విలువలను పెంపొందించుటమనే నిజమైన లక్ష్యాన్ని చేరుకోవటంలో ప్రస్తుత విద్యావిధానంగానీ, దానివల్ల వచ్చే జ్ఞానంకానీ ఉపయోగపడటంలేదు. ఈ నైరాశ్యపూరిత అంధకార విద్యావిహాయనంలో మెరుపు రేఖలా నైతిక, ఆధ్యాత్మిక విలువలనేగాక మానవ విలువలను కూడా ప్రబోధించే విద్యను విద్యార్థులలో పెంపొందించగల్గే విలువలపైనే ఆధారపడిన సత్యసాయి విద్యావిధానం సాక్షాత్కరించింది. అవసరమైనప్పుడల్లా దృఢమైన, విశ్వసించదగిన, నిపుణత గల్గిన కార్యశీలురను బ్యాంకు నుండి చెక్ ద్వారా పైకాన్ని తీసుకున్నట్లు దేశంలోని విద్యా విధానం తీసుకోగల్గుతుందని చెప్పబడింది. అలాకాక దివాలాతీస్తే, అది దేశానికే వినాశకరం అవుతుంది. అందువల్ల ఏ రకమైన విద్యనేడు మనకు కావాలి? భగవాన్ బాబా దానికి సమాధానం ఇలా చెప్పారు. విద్యఅనేది విద్యార్థులలో బుద్ధికుశలతను పెంపొందించటమేకాక, వారి ఉద్రేకాన్ని, మనోవికాశాన్ని అదుపులో ఉంచగల్గాలి. అంతేకాదు తమ హృదయంలో ప్రశాంతతను, ఆనందాన్ని అనుభవించ గల్గించేందుకు అవసరమైన శారీరక, మానసిక క్రమశిక్షణను వాళ్ళు అలవర్చుకోగల్గాలి'.

ప్రశాంతి నిలయంలో ఉన్న శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్‌గానీ, మరి ఏ ఇతరమైన సత్యసాయి విద్యాసంస్థలుగానీ, ప్రాథమిక స్థాయి నుండి డిగ్రీ స్థాయివరకు తమ నిర్మాణ విధానంలోగానీ, పాఠ్య ప్రణాళికలలోగానీ, బోధనలోగానీ, లక్ష్యసాధనలోగానీ, ఆదర్శాలలోగాని పూర్తిగా భిన్నమైనవి. ప్రాథమిక స్థాయి నుండి డిగ్రీ స్థాయి వరకు అవి రెసిడెన్షియల్ సంస్థలు. మత, కుల, వర్ణ, భాష, జాతి భేధాలకు అతీతంగా ఇక్కడ అందరికీ విద్య ఉచితంగా లభిస్తుంది.

సాయి విద్యావిధానం పూర్తిగా ఆధ్యాత్మిక వారసత్వం పైనా, జాతీయ లక్ష్యాలపైనా, విశ్వశ్రేయోదాయకమైన జ్ఞానంపైనా, సాంస్కృతిక విలువలపైనా ఆధారపడింది. ఈ విద్యావిధానం విద్యార్థుల ఆలోచనల్లోనూ, మాటల్లోనూ, చేతల్లోనూ కూడా పవిత్రతను తీసుకు వస్తుంది. అన్నిటికీ మించి 'ఉత్తమ మానవులు'గా వీరిని తీర్చిదిద్దుతుంది.

ఇక్కడ మనం ఒక సమతౌల్యం కల్గిన కలయికను చూస్తాము. ఆధ్యాత్మికమైన, మతాతీతమైన విద్య యొక్క సంయోగరూపాన్ని చూస్తాము. సైన్సుకూ, ఆధ్యాత్మికతకు మధ్య బాబా ఒక సంధానశక్తి. అన్నిరకాలైన ఉత్కృష్ట గుణాలు ఇక్కడ వికాసాన్ని పొందుతాయి. ఎందుకంటే ఇక్కడ విద్యార్థులు ఒక జాగృత స్ఫూర్తి యొక్క శాశ్వతమైన వెలుగునూ, సుశిక్షితులైన మేధావుల మార్గదర్శకత్వాన్ని పొందగల్గుతారు. ఇక్కడి దివ్యమైన వాతావరణం, విద్యార్థుల అలవాట్లను, వారు అలవరుచుకున్న ప్రవృత్తులను ప్రభావితం చేయగల దైవాంశంగల గురువు, స్వామి యొక్క ఆరాధనవల్ల శక్తివంతమౌతుంది. ఆయన దివ్యకటాక్షం వల్ల ప్రతి ఒక్కరూ తన శక్తిమేరకు చేసేందుకు ప్రేరణను పొందుతారు. ఇది విద్యార్థుల సాధారణ ప్రతిభా పాటవాలను, వారి విజయాలను ఉన్నత స్థాయికి తీసుకు వెళ్ళేందుకు దోహదం చేస్తుంది. సాయి విద్యావిధానం సత్యాన్ని, న్యాయబుద్ధిని, శాంతిని, ప్రేమను, అహింసా తత్వాన్ని వ్యక్తులలోనూ, కుటుంబాలలోనూ, సమాజంలోనూ, దేశంలోనూ, ప్రపంచంలోనూ కూడా పెంపొందించటానికి కృషి చేస్తుంది.

## శాంతిధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి!

"పుట్టల నిలయంబు పుణ్య ప్రదేశమై
  యవని జనుల యఘ మణగద్రొక్కు
నీరంబు దొరకని నిర్జన దేశాన
  జనవాహినీధుని సందడించు
బర్ణకుటీరముల్ పరిపూర్తిగా మార
  దివ్య భవనరాజి తేజరిల్లు
మారుమూల నొదిగి యూరు పేరును లేని
  పర్తి విశ్వనుతంబై పరగెనేడు
నీదు విభవంబు మహిమ యీనేల తెలుపు
నీదు లీలలు బోధ లాహ్లాదకరము
దివ్య తత్త్వంబు నివ్విటు తెలుపుచుండు
శాంతిధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి"

- కొలచన వెంకట రమణమూర్తి, పలివెల, తూ॥గో॥ జిల్లా



ఈ సంస్థ పనిచేస్తున్న విధానాన్ని గురించి సమీక్షిస్తూ, యు.జి.సి. రివ్యూ కమిటీ, 1990లో ఈ సంస్థను సందర్శించిన సందర్భంలో, ప్రశంసాపూర్వకంగా ఇలా అన్నది. ఛాన్సలర్ పర్యవేక్షణలో సాగుతున్న ఈ సంస్థ ఉన్నత విద్యాబోధనలో ఒక విలక్షణమైన ప్రయోగం. ఇది నిజమైన అర్థంలో సమగ్ర విద్యను అందిస్తుంది. అన్ని మతాలకూ, ప్రాథమికమైన సర్వసాధారణమైన విశ్వాసాలకు అనుగుణమైన మానవతా విలువలకు విద్యార్థులు కట్టుబడేలా చేయటంలో సహాయపడ్తుతుంది. ఈ సంస్థ మూడుకేంపస్‌లలోనూ కరిక్యులర్, కో-కరిక్యులర్ ప్రోగ్రామ్‌లను నిర్వహించటం ద్వారా హృదయ మేధ సంబంధమైన లక్షణాలను, ప్రాథమిక మానవ విలువలను దైనందిన జీవితంలో ఆచరణకు వచ్చేలా విద్యార్థులలో స్ఫూర్తి కల్గించటంలో సహాయపడుతుంది. దీనివల్ల భారతీయ ఆచారవిచారాలకు, విశ్వఅవగాహనకు అణుగుణంగా విద్యార్థులలో సర్వతోముఖమైన వ్యక్తిత్వ వికాసం కల్గేందుకు అవకాశం కల్గుతుంది.

క్రమశిక్షణపైనా, అంకిత భావాలపైన ఆధారపడి నడుస్తున్న స్వయం సహాయక మరియు సామాజిక సేవాకార్యక్రమాలు విద్యార్థుల వ్యక్తిత్వ వికాసంలోనూ, జాతీయమైన నైతిక విలువలను గ్రహించటంలోనూ, విశ్వఅవగాహనను పొందటంలోనూ చాలా ప్రముఖపాత్రను వహిస్తున్నాయి. విశ్వవిద్యాలయ ఛాన్సలర్ భగవాన్ యు.జి.సి. మరియు ఎ.ఐ.యు. సంయుక్త ఆధ్వర్యంలో వైస్‌ఛాన్సలర్స్, ప్రముఖ విద్యావేత్తలు పాల్గొన్న నిర్వహించబడిన సింపోజియమ్ ఆరంభోపన్యాసంలో ఇలా అన్నారు.

ఉపన్యాసాలు విన్నందువల్లా లేదా పుస్తకాలు చదివినందువల్లా మానవ విలువలను నేర్చుకోలేము. వాటిని నిరంతర అభ్యాసంద్వారా అలవరుచుకోవాలి. విద్యా విధానంలో మానవ విలువల అభ్యున్నతి అంతర్గత భాగంగా కావాలి. జాతీయ సమైక్యత, జాతీయ సమగ్రత జీవిత మార్గం కావాలి. విద్యార్థులు, అధ్యాపకులు, విద్యారంగంలోని అధికారులు సంకుచితమైన మతసంబంధమైన విధేయతను త్యజించి సమాజానికి, ప్రపంచానికి సేవ చేసేందుకు తమను సంసిద్ధం చేసుకోవాలి. అన్ని విద్యా సంస్థలు సంయుక్తంగా విద్యార్థులలోనూ, అధ్యాపకులలోనూ మానవ విలువలను మనసున నిలిచేలా చేయగల్గితే భారతదేశం ఒక ఆదర్శ దేశంగానూ, యావత్ ప్రపంచానికి ఒక తార్కాణంగానూ కాగల్గుతుంది.

[illegible]ంపబడిన విద్యావిధానాన్ని, దాని రూపాన్ని అందించటమే ఈ సంస్థ యొక్క ముఖ్య ఉద్దేశ్యం. ఈ విద్యావిధానంలో జ్ఞానసముపార్జనకు కృషి, కర్తవ్యదీక్ష, ఆరాధన, సాదాసీదా జీవిత లక్షణాలు మొదలైన ప్రవృత్తులు అంశాలుగా ఉంటాయి. అలాగే ఏ మతానికీ అనుబంధం కాకుండా తోటిమానవులలో ఐకమత్యభావన పెంపొందిస్తుంది. ఒక విద్యావంతునిగా గుర్తింపబడటానికి అవసరమైన విశిష్టమైన లక్షణాలైన జ్ఞానం, నైపుణ్యం, క్రమశిక్షణ, సమతౌల్యత, సౌజన్య ప్రవృత్తి మొదలైన మతాతీతమైన గుణసమూహాన్ని నింపుకొని విద్యార్థి తన అధ్యయనాన్ని ఇక్కడ ఆరంభిస్తాడు. ఇంతకుముందే చెప్పినట్లు, ఈ సంస్థ తన స్వభావరీత్యా పూర్తిగా రెసిడెన్షియల్ విధానం కలది. బెంగుళూరు, అనంతపురం మరియు ప్రశాంతి నిలయం ఈ మూడు ఆవరణల్లో ఉన్న హాస్టల్ జీవితం, నియమబద్ధమైన కఠినమైన జీవితాన్ని, క్రమశిక్షణతో కూడిన ప్రవర్తనను, వ్యక్తిగత శుభ్రతను, హుందాయైన ప్రవర్తనను, స్వయంసహాయకత్వాన్ని, తోటి వాళ్ళ సంక్షేమం కోసం ఆరాటపడటాన్ని నేర్పుతుంది.

ఈ సంస్థలో ఆచారవ్యవహారాల చక్రంలో విద్యార్థులు సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ, అహింస మొదలైన ఉత్తమ గుణాలను శ్లాఘించటం, ఒక పద్ధతిలో వాటిని తమలో పెంపొందించుకొనటం, నేర్చుకోవటం ఆరంభిస్తారు. మేధను, సంకల్పాన్ని, హృదయాన్ని సంస్కరించే ఆత్మాన్వేషకులు అన్వేషించే ఆదర్శాలను, మానవ స్వభావ ప్రమాణాలను రూపొందించే సంపూర్ణ విలువలు ఇవి.

అవగాహనను కల్గించే ఒక కోర్సు, సమగ్ర అంశాలను అందించే ప్యాకేజ్ ఈ సంస్థ ఇచ్చే శిక్షణలోని ముఖ్యమైన విశిష్టమైన లక్షణాలు. అవగాహనను కల్గించే కోర్సు ఈ క్రింది అంశాలపై విద్యార్థులను గమనించేలా చేస్తుంది. బాబా జీవితం, ఆయన సేవ, బోధనలు, అన్ని ధర్మాలను ఒకటిగా కూర్చే ఐకమత్యబంధం. గొప్ప మేధావులు, ప్రవక్తల జీవితాల మరియు సేవల పరిచయం, వర్తమాన ప్రపంచంలోని సమస్యలు, వాటికి సాధ్యమైన పరిష్కారానికి సంబంధించిన అంశాలు. ఈ సమగ్ర విద్యావిధాన పట్టికలో యోగసాధన, ఆటలు, ప్రార్థన, ధ్యానం, సామాజిక సేవ, స్వయం ఆలంబించిన కార్యక్రమాలు అన్నీ ఉన్నాయి.

(తరువాయి 22వ పేజీలో..

# శ్రీ సాయి దేవ కరావలంబ స్తోత్రమ్

శ్రీ పుట్టపర్తి భవ! మానవరూపధారిన్
రత్నాకరాన్వయ సుధాంబుధి పూర్ణచంద్ర
చిత్రావతీ తట ప్రశాంతి నిశాంతవాస
శ్రీ సాయి దేవ! మమ దేహి కరావలంబమ్ । శ్రీ సాయిదేవ ।

సృష్టిస్థితి ప్రళయ హేతుక కార్యశీల
కాల స్వరూప! కలివారక! కాలకాల
లీలా మనుష్య! మహిమాన్విత లోకపాల । శ్రీ సాయిదేవ ।

లోకత్రయీ భవనధూర్వహ! విశ్వమూర్తే
బ్రహ్మేంద్ర రుద్రహరివైభవతుల్యకీర్తే
యజ్ఞేశ ! యజ్ఞకర! పావన యజ్ఞమూర్తే । శ్రీ సాయిదేవ ।

సూర్యాగ్ని సోమనయన । శ్రితపారిజాత
పాపౌఘమేఘపరిధూనన తీవ్రవాత
ఆతంకనిగ్రహ । పరిగ్రహదూర । దాతః । శ్రీ సాయిదేవ ।

త్రైలోక్య మోహకర సుందర దివ్యరూప
ఆద్యంతరూప రహితాత్మక । చిత్స్వరూప
లీలావినోద ప్రకటీకృత విశ్వరూప । శ్రీ సాయిదేవ ।

యోగీశ్వరేశ్వర । సుయోగిహృదబ్జవాస
అల్పాల్పహాస ప్రకటీకృత చిద్విలాస
వందారు భక్తజన । సుందర మందహాస । శ్రీ సాయిదేవ ।

సత్యస్వభావ । శివసుందర రూపధారిన్
స్వర్గాపవర్గ సుఖదుఃఖ ఫలాధికారిన్
ఆనందరూప । విమనస్క । విదేహ చారిన్ । శ్రీ సాయిదేవ ।

వేదజ్ఞ । వేదపరిపోషక । వేదసార
వేదాంత వేద్య । నిగమాగమ సుప్రతిష్ఠ
వేదప్రతిష్ఠిత సనాతన ధర్మపాల । శ్రీ సాయిదేవ ।

విశ్వంభరార్చిత । చిదాత్మక విశ్వనాథ
షాడ్గుణ్యయుక్త । వరదాభయ హస్తయుగ్మ
యోగీంద్రవందిత । సదాశ్రిత । యోగగమ్య । శ్రీ సాయిదేవ ।

దైన్యాపహృత్ । పతితపావన । సౌఖ్యదాతః
ధర్మార్థకామ త్రితయాధికమోక్షదాతః
మాయావినాశకర । చిజ్జడగ్రంథిభేత్తః । శ్రీ సాయిదేవ ।

సంసారకూపపతితోద్ధృతి శస్తహస్త
దూరాతిదూర జనరక్షణ దీర్ఘహస్త
ప్రేమ ప్రశాంతి పూరిత సత్యధర్మ । శ్రీ సాయిదేవ ।

సత్సంగపూజిత । బుధార్చిత । సంగదూర
నిస్సంగసంగ । నిజకల్పిత కార్యసంగ
మోహాపహృత్ । సగుణనిర్గుణ పూజనీయ । శ్రీ సాయిదేవ ।

భక్తానురక్త । పరిపాలన దీక్షితాఢ్య
అవాఙ్మ్యదీనజన పోషణకార్యసక్త
సంకల్పమాత్ర సఫలీకృత కష్టకార్య । శ్రీ సాయిదేవ ।

వేదాంతతత్త్వ సువిచార సదుక్తి బోధ
సర్వేశ । సర్వమత సమ్మత మార్గవర్తిన్
హింసారిరంసు పరివర్తిక । శాంతమూర్తే । శ్రీ సాయిదేవ ।

సంగీతపోషక । సుధామరగానలోల
విద్యాపపతే । చుళుకితాఖిల దివ్యవిద్య
విద్యార్థి రక్షణ ప్రశిక్షణ జాగరూక । శ్రీ సాయిదేవ ।

ఆబాల వృద్ధపరితోషక కార్యజాల
కారుణ్యపూరనయనాంచల దృష్టిసార
కల్యాణరూప కమనీయగుణాభిరామ । శ్రీ సాయిదేవ ।

సర్వజ్ఞ । సర్వమయ । శాశ్వత । సుప్రసన్న
వాచామగోచర । పరాత్పర । విశ్వవంద్య
మాతాపితా ప్రియసఖశ్చ గురుర్దయాళో । శ్రీ సాయిదేవ ।

శ్రీవత్స చిహ్నిత భుజాంతరదీప్త మూర్తే
చంద్రార్కకోటి సదృశామల కాంతి ధామన్
క్లేశవ్యయాకుల భరస్య ప్రపీడితస్య । శ్రీ సాయిదేవ ।

నానా ప్రకార పరమాద్భుత లింగసృష్టే
తత్కాల సృష్టమణి భూషణదాన శౌండ
నానా రుజార్తిపరిదూషిత మానసస్య । శ్రీ సాయిదేవ ।

మాంగల్యకారక । సుమంగళ చారుగాత్ర
పూర్ణేందు సుందరముఖాంబుజ పత్రనేత్ర
త్వత్పాదపద్మయుగళార్చన మానసస్య
శ్రీ సాయిదేవ । మమ దేహి కరావలంబమ్ । శ్రీ సాయిదేవ ।

- బి. రామరాజు

# No more Fires

భగవంతుడు సర్వజ్ఞుడు (Omniscient) సర్వాంతర్యామి (Omnipresent) మరియు సర్వశక్తిమంతుడు (Omnipotent). ప్రకృతిని కూడ శాసించగల ధీశాలి.

"బుసలు కొడుతూ విషాన్నిక క్కెడినాగుబాములలాగ మీదమీదికి వచ్చే అగ్నిజ్వాలలను No more Fires అని ఇక్కడ నుండి ఒక్కకేక వేస్తే అనేక వేలమైళ్ళదూరంలో అవి తోకమడిచి తగ్గిపోతాయి".

అమెరికాలో 'ప్రప్రథమయోగిని' అయిన ఇంద్రాదేవి రష్యాలో జన్మించి, అమెరికాలో స్థిరపడి, హిందూ నామమును ధరించింది. అమెరికా, మెక్సికో సరిహద్దులవద్ద ఒక పెద్దయోగ సంస్థను స్థాపించి దానికి 'సాయీనిలయం' అని పేరు పెట్టింది. మైసూరులో యోగవిద్యనభ్యసించి ఆ విద్యను షాంగ్రై లండను, మాస్కో నగరాలలో బోధించెడిది. తన 66వయేట అనగా 1966లో ఆమెకు స్వామి యొక్క ప్రప్రథమ దర్శనం లభించింది. రోగులను చికిత్స చేయుటకై స్వామి ఆమెకొక విభూతి భరిణెని ప్రసాదించారు. ఎంత విభూతినివాడినా మరల అది నిండిపోతూ ఉంటుంది. అన్నమాట ప్రకారం ఆమె తల్లి యొక్క తుదిక్షణాలలో షిరిడీసాయి ఫోటో నుండి అమృతధారను ప్రవహింపచేసేరు స్వామి. దానిని త్రాగి ఆ ముదుసలి స్వామిలో ప్రశాంతంగా ఐక్యమయింది. అనేకమార్లు ఇంద్రాదేవిని ఘోరప్రమాదాల నుండి కాపాడారు స్వామి.

స్వామి మనుష్యులలో ఎంతటి అద్భుతమయిన మార్పులను తెస్తారో ఇంద్రాదేవి ఈ విధంగా వ్రాసింది. 'ఒకసారి స్వామి ముప్పది మందికి ఇంటర్వ్యూ ఇచ్చారు. అందులో ఇద్దరికి తప్ప మిగిలినవారెవ్వరికీ స్వామి అంటే ఎవరో తెలియదు. అంతేకాక వారిలో చాలామంది నాస్తికులు మొదలగువారున్నారు. ఇంటర్వ్యూ గదినుండి ఇవతలకు వచ్చాక ప్రతివాని కళ్ళు చెమ్మగిల్లి ఉన్నాయి. ఆ తర్వాత వారి జీవితాలలో గొప్పమార్పు వచ్చింది'.

1970 సెప్టెంబరు నెలాఖరు ప్రాంతంలో ఇంద్రాదేవి చికాగోలో ఉన్నప్పుడు మెక్సికో సరిహద్దులో సుమారు 4500 ఎకరాల ప్రదేశం తీవ్ర అగ్నిజ్వాలలకు ఆహుతి అవుతున్నదని పత్రికలలో చదివింది. ఆమె 'సాయీ నిలయం' కూడ ఆ ప్రాంతంలోనే ఉన్నది. ఇంద్రాదేవి సిసలయిన యోగిని కాబట్టి ఆమె ఏమాత్రం కలత చెందలేదు. 'సాయీ నిలయం స్వామిది. ఇష్టముందా అగ్ని జ్వాలల నుండి ఆయనే రక్షించుకుంటారు. ఒకవేళ అది నాశనమయిందా దానికి ఒక పద్ధతి, కారణం ఉండి ఉండాలి. ఏది ఏమయినా ఆయన సంకల్పం వజ్రసంకల్పం' అని ధీమాగా కూర్చుంది.

చిత్రం! అన్నీ ధ్వంసమయినా 'సాయి నిలయం' మాత్రం చెక్కుచెదరక అట్లే ఉంది. ఇంద్రాదేవి వచ్చిన తర్వాత 'సాయి నిలయం'లో యోగశిక్షణను పొందుతున్న విద్యార్థులు ఆనందాన్ని పట్టలేక డ్యాన్సు చేస్తూ జరిగిన అద్భుతాన్ని ఈ విధంగా చెప్పేరు. 'మంటలురాగానే మేమంతా ప్రక్కనున్నకొండపైకి పరుగులెత్తేము. అగ్నిదేవుడు ఆనందంతో అన్నిటిని ఆహుతి చేసి తృప్తిపడి శాంతించాక మేము తిరిగి వచ్చాము.

అగ్నిదేవుడు 'సాయీ నిలయానికి' మసి రాయగలిగేడు గాని భస్మం చేయలేకపోయేడు. స్వామి పూజగదికి ఈ మసి కూడాలేదు. కళకళలాడుచు తెల్లగ స్వచ్ఛంగా ఉంది'.

1971 జూలై మొదటివారంలో తిరిగి అదే ప్రదేశంలో అంత ప్రమాదం జరిగింది. ఈసారి వాయుదేవుడు కూడ సహకరించుటమూలాన అగ్నిదేవుడు ఉరకలువేస్తూ విజృంభిస్తున్నాడు.

ఇంద్రాదేవి, ఆమె భర్త మరియు వారి కారు డ్రైవరు ఎక్కడకో వెళ్ళి అప్పుడే తిరిగి వచ్చారు. ఏమి జరుగుతుందో గ్రహించారు. 'సాయి నిలయాన్ని' పొట్టన పెట్టుకోవాలని అగ్నిదేవుడు నాలుకలు చాపుకుంటూ చుట్టు ముడుతున్నాడు. కాని ఇంద్రాదేవి, ఆమె భర్త వారి కారు డ్రైవరు ముగ్గురు కూడా బయట నిలబడక తిన్నగా 'సాయీ నిలయం'లోనికి వెళ్ళేరు. స్వామియందు వారికిగల దృఢవిశ్వాసానికి యిది ఒక మచ్చుతునక.

పాలగుమ్మి జగన్నాథరావు, రాజోలు

మంటలు ప్రారంభించగానే ఆశ్రమవాసులు, విద్యార్థులు తలదాచుకోవడానికి ప్రక్కనున్న కొండలపైకి పరుగుతీసారు. ఇంద్రాదేవి ధ్యానంలోనికి వెళ్ళింది. 'భగవాన్ బాబా! నువ్వు, సర్వాంతర్యామి అయినప్పటికీ ఆపదలో ఉన్నప్పుడు ఈ ఉంగరంలోని రూపమును ప్రార్థించమని నన్ను ఆదేశించావు. ఈ అడవిని ధ్వంసం చేస్తున్న అగ్నిదేవుడు **'సాయి నిలయము'** మీదకు కూడ ఉరుకుచున్నాడని మీకు తెలియపరుస్తున్నాను. అంతయూ మీ ఇచ్ఛప్రకారమే జరుగునుగాక!' అని ప్రార్థిస్తూ స్వామి బహుకరించిన ఉంగరం వైపు చూసింది. ఆ సమయానికి స్వామి ఎచట ఎలా ఉన్నదీ ఆ ఉంగరంలో ఆమెకు మాత్రమే దర్శనమిస్తారు. కెరటాలలాగవచ్చి పడుతున్న అగ్నిజ్వాలలు ఆగిపోయి నట్లనిపించింది. ఆ ముగ్గురు **'సాయి నిలయం'** నుండి ఇవతలకు వచ్చారు. ఆశ్చర్యం! సాయి భక్తులు కూడ నమ్మజాలని అద్భుతం జరిగింది.

**'సాయీ నిలయానికి'** కొద్ది గజాల యివతల ఒక అదృశ్యశక్తిచేత బంధింపబడిన విధంగా అగ్నిజ్వాలలన్నీ తిన్నని గోడకట్టినట్లు ఒక వరసలో ఆగిపోయాయి. ఇప్పటి వరకు సహకరించిన వాయుదేవుడు కూడ తన దిశను మార్చి అగ్నిదేవుని 'సాయీనిలయానికి' దూరంగా తరిమివేయడం మొదలుపెట్టాడు. ఈ మంటలను ఆర్పడానికి ఎన్నో Fire ఇంజన్లు వచ్చాయికాని ఏమీ చేయలేకపోయాయి. ఈ అద్భుతాన్ని చూసి "Miracle! Madam Miracle" అని అగ్నిమాపకదళం వారు అరిచారు. తక్షణం పుట్టపర్తి రావలసినదిగా స్వామి వద్దనుండి ఇంద్రాదేవికి Cable వచ్చింది. వెంటనే ఆమె స్వామి పాదాలవద్ద వాలింది. స్వామి లక్ష్మీదేవి విగ్రహాన్ని సృష్టించి ఇవ్వబోగా 'స్వామి! Please! ఇలాంటివి ఏమీ నాకు వద్దు' అంది ఇంద్రాదేవి.

"ఇవి నీ కోసంకాదు. మీ ఇంటి రక్షణ కోసం. 'No More Fires' అన్నారు స్వామి. ఒకరోజు రాత్రి **'సాయి నిలయము'** వెనుక కొండమీద మంటలు ప్రారంభమయ్యాయి. వెంటనే ఆమె, ఆమె విద్యార్థులు పూజ గదిలోనికి వెళ్ళి స్వామి బహుకరించిన లక్ష్మీవిగ్రహాన్ని సింహాసనంపై ఉంచారు. అంతే కొద్దిక్షణాలలో దట్టంగ కమ్ముకుని మేఘాల లాగ వస్తున్న పొగలు ఒక్కసారిగ తగ్గిపోయాయి. స్వామికి కృతజ్ఞతలు తెల్పుతూ **'గోవింద కృష్ణజై గోపాలకృష్ణజై'** పాటను మంచి ఉత్సాహంగా పాడుకుని ఆమె యోగ పాఠాలను కొనసాగించింది.

శ్రీ సత్యసాయి విద్యావిధానం... 19వ పేజీ తరువాయి...)

ఈ అంశాలలో విద్యార్థులు ఎంత వరకు కృతకృత్యులమయ్యా మనే విషయాన్ని గురించి ఎప్పుడూ అంచనా వేయటం జరుగుతూనే ఉంటుంది.

సూక్ష్మంగా చెప్పాలంటే జ్ఞానం, నైపుణ్యం - ఈ రెంటి కలయికతో నిర్మింపబడే ఒక కట్టడానికి దారితీసే విద్యను అందించుటయే ఈ సత్యసాయి విద్యావిధానం లక్ష్యమని చెప్పవచ్చు. మతపరమైన విలువలను శాశ్వత విలువలుగా మార్చేందుకు అవసరమైన పునాదిగా నిర్మిస్తూ, భౌతిక ప్రపంచాన్ని ఆధ్యాత్మిక జిజ్ఞాసతో ముడిపెడుతూ పెడుతూ క్రియాత్మకంగా సాగేలా చూచుట దీని మహత్తర లక్ష్యం. దీనివల్ల సమయం వచ్చినప్పుడు ఇక్కడ విద్యను అభ్యసించిన వ్యక్తి సమాజంలో ఒక అర్థవంతమైన భూమికను నిర్వహించ గల్గుతాడు. అతనిలో భౌతిక ప్రపంచ ఆవశ్యకతలు, ఆధ్యాత్మిక ఆదర్శాలు రెండూ పరస్పరం సహకరించు కుంటాయి. బాబా తరచూ ఇలా అంటారు. "విద్య అనేది జీవితాన్ని అర్థవంతమైన రీతిలో గడిపేలా వ్యక్తిని తయారు చేయలేకానీ బ్రతకటానికి అవసరమైన ఉద్యోగాన్ని సంపాదించటానికి మాత్రమే కాదు". పుట్టపర్తిలోని సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హయ్యర్ లెర్నింగ్ వద్ద 1990లో దీక్షాంత ప్రసంగం చేస్తూ భారత రాష్ట్రపతి ఇలా అన్నారు.

**"బాబా యొక్క సాన్నిధ్య సౌభాగ్యంవల్ల ఈ ఆవరణ ఒక విశిష్టమైన పవిత్రతను సంతరించుకున్నదనటంలో ఆశ్చర్యం ఏమీలేదు. విదేశాలలోనూ, భారతదేశంలోనూ కూడా ఎన్నో సంస్థలను నేను సందర్శించాను. కాని ఇంత గంభీరమైన వాతావరణాన్ని ఎక్కడా చూడలేదు. ఇక్కడ ఒక సంస్కరించే ప్రవృత్తి ఉన్నది. బాధను నివారించే శక్తి ఉన్నది. ప్రశాంతతను ఇచ్చే వాతావరణం ఉన్నది. అందువలన ఇది పూర్తిగా విలక్షణమైనది. ఈ సంస్థలో అనుబంధమున్న ప్రతి వ్యక్తీ, ఈ ఉన్నత విద్యాభ్యాస సంస్థ ఉత్తమ ప్రవర్తనకు, ఉత్తమ అవగాహనకు నిలయమని తెలుసుకొని ఉన్నట్లు అన్పిస్తుంది".**

ఈ విద్యావిధానం ఎంత ప్రయోజనకరమైనదంటే ఇది విద్యార్థులలో త్యాగ శీలతను, విచక్షణా జ్ఞానాన్ని సంస్కరణాభిలాషను, ఆత్మ దర్శనాన్ని, మాటల్లోనూ, ఆలోచనల్లోనూ, చేతల్లోనూ పవిత్రతను కల్గి ఉండాలనే భావాన్ని కల్గించుటయే గాక వారిని ఉత్తమ మానవులుగా తీర్చిదిద్దుతుంది.

**- తెనుగుసేత : డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు**

# పరమాద్భుత ప్రేమమూర్తి

ప్రపంచంలో అందరూ ఎక్కువగా ఉపయోగిస్తున్న మాట 'ప్రేమ'. కాని భ్రమలు, వ్యామోహాలు, క్షణికమైన ఆకర్షణలు కపటాడంబరాలతోకూడిన ప్రదర్శనలు, క్షుద్రమైన వికారాలు, భావోద్రేకాలు మొదలైనవన్నీ ఈనాడు 'ప్రేమ' అనే పేరుతో చెలామణి అయిపోతూ ఉండటంచేత దాని అసలు అర్థం పూర్తిగా మరుగున పడిపోయింది. '**ఈ లోకంలో ఎవరు ఎవరిని ప్రేమించినా ఆత్మకోసమే, అన్నింటికంటె ఆత్మయే ప్రియమైనది**' అన్న పరమసత్యాన్ని బ్రహ్మజ్ఞానియైన యజ్ఞవల్క్యమహర్షి, సత్యజిజ్ఞాసతో ప్రశ్నించిన తన భార్యయైన మైత్రేయికి చెప్పారు. కనుక ఈ 'ప్రీతి' అనే భావం ఆత్మసంబంధమైనది. ఆత్మ దేహంలో ఉన్నంతవరకే ఎంతటి ఇష్టులనైనా ప్రేమిస్తున్నాం కాని శవాన్ని ప్రేమించడం లేదుకదా!

**'మనకీ, మన దేహానికి ఉండే సంబంధంవంటిదే భగవంతునికీ, విశ్వానికీ ఉండే సంబంధం!!'** అని ప్రకటించారు సత్యద్రష్టలైన మహర్షులు. నిరాకార నిర్గుణమైన భగవంతుని ప్రేమ పరిష్వంగంలోనే పుట్టి, పెరిగి, లయమవుతున్నా ఆ ప్రేమని మానవులందరూ గుర్తించలేరు. మనిషిలో దురాశ పెరగడంచేత వివేకభ్రష్టుడై, దూరదృష్టి లేకుండా సృష్టి విధ్వంసనానికి పాల్పడుతున్నాడు. ప్రాణులన్నీ హాహాకారాలు చేస్తున్నాయి. మనిషికి హిత బోధలు చేసి మంచిదారిలోకి మళ్ళించేందుకు భగవంతుడు తన దూతల్ని ఎందరెందరినో భూలోకానికి పంపిస్తూ వచ్చాడు. వారంతా శక్తివంచన లేకుండా గొప్ప కృషి చేశారు. కాని మనిషి ఆలోచనా విధానం చక్కబడలేదు. తెలివితేటలు పెరుగుతున్న కొద్దీ హృదయంలో ప్రేమరసం ఇంకిపోతూ వచ్చింది. శాస్త్ర - సాంకేతిక పరిజ్ఞానాభివృద్ధి పేరుతో భూతహింస, ప్రాణిహింస అపరిమితంగా పెరిగిపోయింది. మానవాళిని ఆధ్యాత్మిక మార్గంలో నడిపించి సమైక్యపరచే ఉద్దేశంతో ప్రారంభమైన మతాలు మనుషుల మధ్య అడ్డుగోడలై పోయాయి. దైవభక్తి దంభంగా, ఆడంబరంగా దిగజారిపోయింది. ప్రేమలేకపోవడంచేత స్వార్థం ప్రబలి పోయి అసురగుణాలు విజృంభించాయి. పాపభీతి నశించి పోయింది. దయాదాక్షిణ్యాశూన్యుడై మనిషి రక్తపిపాసియైన రాక్షసుడైపోయాడు. పాపభారాన్ని మొయ్యలేక పుడమి తల్లి కంపించిపోతూ, దిక్కుతోచక అల్లాడిపోతూ బాధతో కృంగిపోతోంది. క్రూరమారణహోమాలు విధ్వంసకర, చర్యలు ప్రబలిపోవడంచేత భయాందోళనలూ, హాహాకారాలూ చెలరేగిపోయాయి. ఇవే యుగాంత లక్షణాలు. ప్రళయం... ప్రళయం... ప్రళయం! అప్పుడింక మూలవిరాట్టే తన సమస్త శక్తులతోనూ మానవ రూపాన్ని ధరించి తరలిరాక తప్పలేదు. ఇదే అవతారం! యుగావతారం!

**"అవతరించుటయనుటలో అర్థమేమి?**
**జనులపై ప్రీతి వాత్సల్యపరత తోడ**
**వారి స్థాయికి దైవంబు వచ్చు భువికి**
**జీవప్రజ్ఞతోపాటుగ దైవప్రజ్ఞ"**

## న.చ. చూడామణి

అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా. **'అవతరించడం'** అంటే సర్వవ్యాపకమైన త్రివిక్రమ స్థాయి నుండి **'వామన'** స్థాయికి రావడం అన్నమాట. అందుకు ప్రబల కారణం 'ప్రీతి', వాత్సల్యపరత్వం'. 'దేవుడే ప్రేమ! ప్రేమే దేవుడు! ప్రేమలోనే జీవించండి!' అన్నది శ్రీ సత్యసాయి సత్యసూక్తి. సత్యసూత్రం. దాని వ్యాఖ్యానమే శ్రీవారి నిస్వార్థ పవిత్ర జీవితం! అందుకే ఆయన 'నా జీవితమే నా సందేశం' అని చాటిచెప్పి చిన్ననాటి నుండీ పరిపూర్ణమైన ప్రేమకి ప్రబలమైన ఉదాహరణంగా నిలచియున్నారు.

తల్లిదండ్రి తానే అయిన భగవంతునికి తన సృష్టిమీద ఎంత అవ్యాజము, అపారము అయిన ప్రేమ ఉంటుందో మానవ మాత్రుల ఊహకి ఏమాత్రం అందని విషయం. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు బాల్యం నుండీ కూడా ఎంతో సహజంగా, కలివిడిగా ప్రజలమధ్య తిరుగుతూ వాత్సల్యక్షీరాన్ని చేపే, ప్రేమామృతాన్ని వర్షించే మహత్తర దృశ్యాల్ని చూస్తే, చూడగలిగితే, **మనకి దైవప్రేమ** సంగతి కొంచెమైనా అర్థం అవుతుంది. **దర్శనాలు**, ఇంటర్వ్యూలు,

పర్వదినాలవంటి ప్రత్యేక సందర్భాలలో జరిగే సమావేశాలు (భూలోకంలో ఇలాంటివి ఎక్కడాలేవు సరికదా పూర్వావతారాలలో కూడా లేవు. ఇవి ఈ అవతారం ప్రత్యేకతలు!) ఇవన్నీ తల్లి తన పిల్లల్ని ప్రేమగా చేరదీసి తాయిలం పెట్టడం, కడుపునిండా కమ్మగా భోజనం పెట్టడం, మంచి చెడ్డలు తెలియజెప్పడం వంటి ప్రేమసన్నివేశాలు! గోవు తన దూడకి పాలు చేపే దృశ్యం ప్రాకృతికం. శ్రీ సత్యసాయి కామధేనువు ప్రజలకి బహుముఖాలుగా, రకరకాలుగా ప్రేమామృతాన్ని చేపే దృశ్యాలు దివ్యాలు! అపూర్వాలు! పరమాద్భుతాలు!

ప్రపంచం నలుమూలల నుండీ ప్రశాంతినిలయాన్ని వెతుక్కుంటూ తండోపతండాలుగా ప్రజలు ఎందుకు వస్తున్నారు? (ఇప్పుడే కాదు రాకపోకల సౌకర్యాలూ వసతి భోజన సదుపాయాలూ ఏవీలేని రోజులలోకూడా!). ఎంతటి వ్యయప్రయాసలనైనా కష్టనిష్టూరాలనైనా భరించి అవరోధాన్ని అధిగమించి పరుగుపరుగున ఎందుకు వస్తున్నారు? సమీపించడం, సంభాషించడం, శ్రీపాద స్పర్శనం పొందడం మాట అటుంచి, దూరం నుండయినా ఒక్కసారి ఆ అద్భుతమంగళమూర్తిని చూస్తేచాలు జన్మతరించి పోతుందని ఎందుకు పరితపిస్తున్నారు? చూసి, తమ కన్నులు సార్ధకమయ్యామని ఆనందంతో ఎందుకు పరవశించిపోతున్నారు? పూర్ణచంద్రుణ్ణి చూచిన సముద్రాల్లాగ శ్రీ సత్యసాయి పురుషోత్తముని చూసి హృదయాంబుధులు ఎందుకు ఉప్పొంగి పోతున్నాయి? ఎందుకు? ఎందుకు? ఎందుకు? అది పరమరహస్యం! (ఓపెన్ సీక్రెట్!) అదే పరిపూర్ణ ప్రేమస్వరూపులైన శ్రీ సత్యసాయినాధుల అనంత దివ్యప్రేమాకర్షణ! అఖండ ప్రేమస్వరూపుడైన భగవంతుడొక్కడే ఆనందప్రదాత! 'ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్' అన్నది తైత్తిరీయోపనిషత్తు.

'సాయీ!' అంటే ఓయని పలుకుతూ 'అంతర్బహిశ్చతత్ సర్వం వ్యాప్యనారాయణస్థితః' అన్న వేదసూక్తిని సార్ధకం చేస్తూ (స్వామికి తల్లిదండ్రులు పెట్టిన పేరు సత్యనారాయణ) అనుభవ ప్రధానపూర్వకంగా అడుగడుగునా నిరూపిస్తూఉంటే తనకీ, విశ్వానికీ అంతటికీ ఆధారం ఈ పరమాద్భుత ప్రేమమూర్తే అన్న పరమసత్యాన్ని మానవుడు గుర్తించకుండా ఎలా ఉండగలడు? అయితే, 'జీవప్రజ్ఞతో పాటుగ దైవప్రజ్ఞ' కనుక, మానవుల మధ్య మానవుడుగా అరమరికలు లేకుండా అతిసిరాడంబరంగా (నిప్పుకప్పిన నిప్పులా) సంచరిస్తున్న మాధవుణ్ణి మానవ మాత్రుడుగా భ్రమపడే ప్రమాదం ఉంది. అదే మాయ! విష్ణుమాయ! 'మమ మాయా...' అని గుండెమీద చేయివేసుకుని కృష్ణావతారంలో చెప్పుకున్నారు. మాయమీద స్వామికంత మక్కువ! మరి అయితే ఇంక మనకి దాని బారినుండి తప్పించుకొనే మార్గం ఏది? 'తనను ఆశ్రయించడమే' అని ఆనాడే స్పష్టంగా చెప్పారు. ఈ సత్యసాయి అవతారంలో కూడా ముద్దులు మూటగట్టే చిన్నారి బాలుడుగా ఉన్నప్పుడే

**'సాయినాధుడు గురుమహరాజు (గురూణాంగురుః) ఓ మనసా! ఆయన చరణాలను ఆశ్రయించు. దుస్తరమైన భవసాగరాన్ని అవి నిన్ను సునాయాసంగా దాటిస్తాయి'** అని సత్యప్రకటన చేశారు! అవ్యాజము, అపారము అయిన ప్రేమతో జీవులను అజ్ఞాన నిద్రనుండి తట్టిలేపేందుకే అలా ప్రకటించారు! తమ శిష్యులను ఆధ్యాత్మిక మార్గంలో నడిపించగల గురువులు ఉన్నప్పటికీ పరిపూర్ణావతార కాలంలో వారి ప్రభ (పగటి దీపాల్లాగ) మరుగున పడిపోతుంది. అది ఓటమికాదు. ప్రబలమైన దైవశక్తి ముందు తలవంచడం విజ్ఞత! గౌరవప్రదం!

పవిత్రప్రేమ ఉన్నచోట సద్గుణాలన్నీ ఉంటాయి. సమస్త కళ్యాణగుణాభిరాముడైన శ్రీ సత్యసాయిలో ప్రస్ఫుటంగా గోచరిస్తున్న సౌహార్దం, మార్దవం, వినయం, శ్రద్ధ, కరుణ, త్యాగం, ఈవి, క్షమ, స్నేహం, సేవ, సహనం, ఆత్మీయత, సహవేదన, సహానుభూతి, సహకారం, సంతోషం మొదలైన ప్రేమానుబంధులైన సద్గుణాలలో కనీసం ఒక్కదానిని కూడా స్వానుభవపూర్వకంగా అర్ధం చేసుకొని వివరించగల సామర్ధ్యం మానవమాత్రుల మైన మనకిలేదు. కాని ఆర్తితో, ఆవేదనతో నిష్కపటంగా ప్రార్ధించేవారికి అనిర్వచనీయమైన ప్రేమానందానుభూతి కలుగుతుంది! అమూల్యము, అలౌకికము, రక్షకము అయిన ఆ అనుభూతి కోసమే వేణునాదాన్ని విన్న గోపికల లాగ సత్యజిజ్ఞాసువులంతా ఈ శ్యామసుందరుని శ్రీపాద సన్నిధికి ఆత్రంగా వచ్చేస్తున్నారు. పక్షి తన పిల్లల్ని రెక్కలు కప్పి సంరక్షించే రీతిగా **ప్రపంచమంతటినీ తమ దివ్య పరిష్వంగంలో ఇముడ్చుకొని యుగాంతప్రళయం సర్వనాశనం నుండి సంరక్షించే అనిర్వచనీయమైన అనంత, పరిపూర్ణ, పవిత్రప్రేమయే శ్రీ సత్యసాయి!**



# కలియుగ అవతారి బాబా



ఆర్.వి. రామారావు, అనకాపల్లి

కలియుగంలో మానవాళిని వుద్ధరింప అవతరించిన శివశక్తి స్వరూపులు శ్రీ సత్యసాయిబాబా! బాబావారు సంపూర్ణ అవతారులు. 'ప్రార్థించే పెదవుల కన్నా సేవచేయు చేతులు మిన్న'యని భక్తికి నూతన నిర్వచనందిద్దిన మహామహిమాన్వితమూర్తులు. భక్తులను తన మార్గానికి త్రిప్పుకొనేందుకు తన జీవితాన్నే సందేశముగా మలచి, ఎన్నో లీలలు, ఎన్నెన్నో పరమాద్భుతాలు సృష్టిస్తున్న కలియుగ చక్రవర్తి మన సత్యసాయి. భగవాన్ శ్రీ సత్యసాయివారి దివ్యచరిత్రపారాయణ సప్తాహంలో అనకాపల్లిలో స్వామి చిత్రపటంపై భక్తులు చూస్తుండగా **'బాబా సంతకం'** ప్రత్యక్షమవడం అది శాశ్వతంగా అలాగే నిలచిపోవడం ఈ మధ్యజరిగిన అపురూపలీల. రెండేళ్ళ క్రితం శ్రీ పైడిరాజు అనే భక్తుని గృహంలో పూజజరిగే సమయంలో తీసిన ఫోటోలో స్వామి సింహాసనారూఢులై విచిత్రదర్శనము ఇచ్చారు. శరీర భాగాలు కనిపించకుండా కేవలం వారు ధరించే దుస్తులను కనిపింపజేసి అపురూప దృశ్యాన్ని భక్తులకు ప్రసాదించారు. 73 రోజులు జరిగిన శ్రీ సత్య సాయిజ్యోతి మహోత్సవంలో ఎన్నోమార్లు విభూతిని, తేనె (అమృతము)ను సృష్టింపజేసి, మహిళలు సాగించిన కార్యక్రమంలో **'బంగారు'** అని పిలిచేస్వామి ఒక బంగారు జ్ఞాపికను సృష్టింపచేసి భక్తులకు ప్రసాదించారు. ఆరని కట్టెలతోనే యజ్ఞంలో అగ్నిప్రతిష్టాపన చేయాలని శతవిధాలా ప్రయత్నం చేసి విఫలమైన ఋత్వికులు శ్రీ సత్యసాయి గాయిత్రీ హోమాన్ని స్వామివారి సాయిజ్యోతితోనే ప్రారంభింపచేయడం స్వామివారిపై అచంచల విశ్వాసాన్ని పెంచింది. అనకాపల్లి సమీపంలోని సిరసపల్లి అనే గ్రామంలో నివసించే ప్రసాద్ అనకాపల్లి మునిసిపాలిటీలో పనిచేసే గుమాస్తా. అతని కుటుంబంలో సంచిత కర్మవల్ల కూతుళ్ళు ఇద్దరూ అవిటివాళ్ళుగా జన్మించారు. ఆ కుటుంబంలోని అశాంతి ప్రసాద్‌ను అనుక్షణం బాధింప చేసేది. 1999 జనవరిలో శ్రీ సత్యసాయి సేవాసమితి సభ్యులతోపాటు స్వామి దర్శనానికి ప్రశాంతి నిలయం వెళ్ళాడు ప్రసాద్. స్వామి పాదనమస్కారానికి కూర్చొని తన కుటుంబ స్థితిగతుల గూర్చి స్వామికి ఒక ఉత్తరం వ్రాసుకున్నాడు. స్వామి దగ్గరకు రాగానే కొంచం పైకిలేచి స్వామికి ఉత్తరం ఇవ్వబోయాడు. **'అంతా నేను చూసు కుంటాను. నీవు బాధపడవద్దు'** అని ఓదారుస్తూ స్వామి అతన్ని అనునయించి ఒక బంగారు వుంగరాన్ని సృష్టించి వ్రేలికి తొడిగారు. భోరున ఏడుస్తూ స్వామి కాళ్ళపై పడి పోయాడు. తిరిగి అనకాపల్లి వచ్చాక అతని జీవిత దృశ్యమే మారిపోయింది. అనుక్షణం స్వామి సేవయే! స్వామి కార్యక్రమాలపై ధ్యాసయే! పెద్ద కూతురుకు తీవ్రంగా జబ్బు చేసింది. హాస్పటల్‌కు తీసుకొనివెళ్ళమని తోటివారు ఎంత చెప్పినా ప్రసాద్ వినలేదు. **'అంతా స్వామి చూసుకుంటారు'** అనే విశ్వాసంతో స్వామి విభూతి వ్రాస్తూ, స్వామిని స్మరిస్తూ కాలం గడపసాగాడు. ఇంతలో ఏప్రియల్ సర్వీసుకు సేవాదళ్‌ను పంపమని ప్రశాంతి నిలయం నుండి తాకీదు. సర్వం స్వామిమీద భారంవుంచి ప్రశాంతి నిలయంలో సర్వీసుకు వెళ్ళాడు. ఇంట్లో కూతురు అనారోగ్యం పట్టించు కోకుండా ఆయన పనికోసం తాను వెళ్ళగా స్వామి భక్త సంరక్షకులు కాబట్టి ప్రసాద్ కుటుంబం యోగక్షేమాలు స్వామి చూశారు. కూతురు ఆరోగ్యం బాగు పడింది. విశ్వాసము నీకెంత బలంగావుంటే అనుగ్రహం అంత బలంగా నిన్ను చేరుతుంది అనేమాట ప్రసాద్ విషయంలో నిరూపించారు స్వామి.

రమణారావు అనే భక్తుడు అనకాపల్లి నుండి విశాఖ పట్నం స్కూటర్ మీద బయలుదేరాడు. స్కూటర్ వెనక కూర్చొన్న వ్యక్తి పుట్టపర్తి గురించి స్వామి దర్శనమిచ్చే తీరు గురించి స్వామి గురించి అడగటం వల్ల అనకాపల్లిలో బయలుదేరిన క్షణం నుండి ఏకధాటిగా రమణారావు అతనికి స్వామి గురించి చెప్పసాగాడు. స్వామి కబుర్లలో కాలం తెలియ లేదు. గాలిలో తేలిపోతున్నట్లు ఆనందంగా స్కూటర్‌పై వెళ్తున్నారు. సింథియా దాటిన తరువాత ఒక మలుపు దగ్గర ఎదురుగా ఒకలారీ వేగంగా రాసాగింది. లారీ వేగాన్ని చూసి శ్రీ రమణారావు కంగారు పడసాగాడు. ప్రక్కకు తప్పు

కోవాలంటే మార్గంలేదు. రోడ్డుప్రక్కన పెద్ద గొయ్యి. గోతిలో పడినా, లారీ క్రిందపడినా ప్రమాదమే! చేసేదిలేక అరిచాడు. ఒకే ఒక్కమాట! అదే ప్రణవనాదం! 'సాయిరాం' అంటే ఆపన్నశరణ్యుడైన సాయి భగవానుని కృపాకటాక్షవీక్షణమా అన్నట్లు లారీ దగ్గరకు వెళ్ళి స్కూటర్ ఇద్దరు మనుషులు తనపై వుండగా అమాంతం గాలిలోకి లేచి గోతిప్రక్కన భద్రంగా దిగింది. లారీ వెళ్ళి పోయింది. వాళ్ళిద్దరూ ఆశ్చర్యంలో మునిగిపోయారు. స్కూటర్ ఎలా పైకిలేచింది. ఎలా రోడ్డు ప్రక్కన భద్రంగా దిగింది. ఎవరు అమాంతం స్కూటర్‌ను లేపి రక్షించారు? ఇంకెవరు? సర్వరక్షకుడు శ్రీ సత్యసాయిబాబానే!

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు సర్వాంతర్యామి. ఎక్కడ సత్యసాయి భజన జరుగునో అక్కడ స్వామి సూక్ష్మశరీరంతో భక్తులను ఆశీర్వదిస్తూ అభయ మొసంగుతూ, దివ్యలీలలను ప్రదర్శిస్తూ తన భక్తులను ఆధ్యాత్మిక మార్గంవైపు పయనించేటట్లు చేస్తుంటారు. ఇటీవల అనకాపల్లిలో జరిగిన శ్రీ సత్యసాయి లింగేశ్వర ఆరాధనా సప్తాహంలో స్వామి దివ్యలీలలను చూపి, భక్తులలో అవతారం పట్ల మరింత విశ్వాసాన్ని కలిగించారు. జూన్ నెలలో అనకాపల్లిలోని అగ్గిమర్రిచెట్టు వీధి భజన మండలి కన్వీనరు స్వామి సంకల్పంతో తొమ్మిది అంగుళాల శివలింగాన్ని చేయించి ప్రశాంతి నిలయం తీసుకొనివెళ్ళి స్వామి ఆశీస్సులు పొంది పుట్టపర్తిలోని స్వామి జన్మస్థలమైన శివాలయంలో ప్రథమపూజ జరిపించి అనకాపల్లి తీసుకొని వచ్చారు. శివలింగానికి శ్రీరాజుగారనే భక్తులు నాగాభరణాన్ని, పానపట్టాన్ని వెండితో చేయించి దివ్యంగా అలంకరణ గావించారు. శ్రీ సత్యసాయి సేవాసమితి ఆధ్వర్యంలో జరిగిన 75 గంటల నిర్విరామ ఆధ్యాత్మిక కార్యక్రమంలో కైలాస దర్శనం పేరుతో శివలింగానికి మహాన్యాసపూర్వక రుద్రాభిషేకం జరిగింది. ఇటీవల సెప్టెంబరు 11వ తేదీ నుండి 17వ తేదీ వరకు స్వామికి ఆరాధనా సప్తాహం జరిపించాలనే సత్సంకల్పంతో కార్యక్రమం ప్రారంభించి ప్రతి రోజూ తెల్లవారుఝామున ఓంకారం, సుప్రభాతం, నగర సంకీర్తన, శ్రీ సత్యసాయి లింగానికి పురుషసూక్త, బిల్వార్చన, లింగాష్టక; శివాష్టకాలతో అభిషేక పూజ, సాయంత్రం ప్రత్యేక భజనలు, ప్రసంగములు, సంగీతార్చనలు జరుపసాగారు. రెండవరోజు అభిషేక సమయంలో స్వామి సింహాసనం ముందుగల్గ పాదపీఠంపై 21 చిన్నసైజు మంచి ముత్యములు సృష్టించబడినాయి. 21మార్లు ఓంకారం చేయుటవలన స్వామి 21 మంచి ముత్యములు ప్రసాదించారని భక్తులు సంతోషించారు. నాలుగవరోజు స్వామి ఫోటోయందు, స్వామి నడిచేందుకు దారిలో వేసిన పట్టుచీరపై గుప్పెడు విభూతి దర్శనం ఇచ్చింది. స్వామి సూక్ష్మశరీరంతో కార్యక్రమాన్ని వీక్షిస్తున్నారని భక్తులు మురిసిపోయారు. అధిక సంఖ్యలో భక్తులు కార్యక్రమంలో పాల్గొనసాగారు. కడువైభవంగా జరుగుచున్న కార్యక్రమంలో భాగంగా 6వ రోజు శివలింగమును, స్వామి ఫోటోను పల్లకి యందుంచి, పాదుకలు, అఖండ జ్యోతి, స్వామి చిత్రపటంను, ఛత్రఛాయలలో వూరేగింపుగా మహానగర సంకీర్తన చేశారు. వందలాది స్త్రీలు, పురుషులు పాల్గొన్న నగర సంకీర్తనకు మురిసి స్వామి 24 మంచి ముత్యాలను తిరిగి శివ లింగముపై సృష్టించి ఒసంగినారు. ఆఖరిరోజున మహన్యాస పూర్వక రుద్రాభిషేకం అత్యంత వేదమయంగా, స్వర యుక్తంగా, ఘనాపాటీలైన వేదపురోహితుల ఆధ్వర్యంలో జరుగుచుండగా ఆ కార్యక్రమాన్ని వీక్షించిన స్వామి, తన లీలావైభవం అందరికీ చూపించదలచి శ్రీ తాకాశి ఉమామహేశ్వరరావుగారనే భక్తుని ఇంటి నుండి తీసుకుని రాబడిన స్వామి చిత్రపటం నుండి ఆశ్చర్యంగా అందరూ చూస్తుండగా ధారాపాతంగా ఎరుపురంగు, తేనెరంగుగల అమృతం ధారగా ప్రవహించింది. భక్తులు జయజయ ధ్వానాలతో, భజనలతో స్వామికి స్వాగతం పలికారు. తెల్లవారుఝామున నగర సంకీర్తన సమయంలో అమృత దర్శనం జరిగి తిరిగి రుద్రాభిషేక సమయంలో దాదాపు 3 గంటలు నిర్విరామంగా అమృతధార ప్రవహించింది. జూన్ నెలలో దర్శన సమయంలో '**లింగార్చన కార్యక్రమం చేస్తాము స్వామి**' అన్న అగ్గిమర్రిచెట్టు వీధి భజన మండలి కన్వీనరు ప్రకాష్ మాటకు! '**ఏదిచేసినా హృదయపూర్వకం గానే చేయండి**' అని ఆశీర్వదించి స్వామి తన సర్వజ్ఞత్వంతో ఆశీర్వదించారు.

భగవంతుడు అవతరించి 74 సంవత్సరములు పూర్తయిన ఈ శుభసందర్భములో కూడా ఇంకా స్వామి దివ్యదర్శనానికి నోచుకోని వారెందరో! దేవతలకు కూడా లభ్యంకాని దివ్యదర్శనం ప్రతిదినం మనకు ప్రసాదింపబడు తున్నది. స్వామి స్పర్శనభాగ్యాన్ని మనం పొందగలుగు తున్నాం. స్వామి సంభాషణల అదృష్టాన్ని మనం పొంద గలుగుతున్నాం. ఇది మన జన్మజన్మల అదృష్టఫలమే! అహంకారం వివర్జితంగా ఎంత సేవచేస్తే అంత ఫలితాన్ని ఇచ్చే కలియుగ అవతారి భగవాన్ సాయి.





# జననీ - జన్మభూమి



సమస్త హృదయాంభోజ నిలయాయైనమః
సర్వశక్తిమయ్యైనమః

మూలప్రకృత్యైనమః - అని మనం కీర్తించే శ్రీమాతృస్వరూపం ఆ తల్లి సర్వవ్యాపకత్వాన్ని, సకల శక్తిమత్వాన్ని, సమస్త ఆధారపరత్వాన్ని తెలియచేస్తోంది. అమ్మ అనే పదంలోని అమృతత్త్వం అనుభవైకవేద్యం. ప్రేమానురాగాలు, భక్తిగౌరవాలు, ఆనంద ఆర్ద్రానుభూతులు - ఇలా ఎన్నో భావతరంగాలు మాతృత్వపు సాగరంలో ఉద్బుద్ధములై ఉంటాయి. అమ్మతత్త్వం అనంతం. కేవలం మనకి దేహానిచ్చిన తల్లి మాత్రమే తల్లికాదు. భగవాన్ బాబా వారు ఈ విషయమై ప్రస్తావిస్తూ ప్రతీ వ్యక్తికీ అయిదుగురు తల్లులుంటారు అంటారు. **'దేహమాత, గోమాత, భూమాత, దేశమాత, వేదమాత'** అనే ఈ అయిదు తత్త్వములు ఉత్తరోత్తర బలీయములై జగన్మాతయైన శ్రీ తత్త్వమును గుర్తించుటకు సహాయ కారకములవుతాయి. పరతత్త్వాన్ని గుర్తించుటకు సాధనమైన శరీరము నిచ్చినది దేహమాత. ఆ శరీరమును పెంచి పోషించుటకు మృదుమధుర క్షీరమునిచ్చేది గోమాత. సస్యసమృద్ధమై పలురకముల ఆహారమునందించేది భూమాత. శారీరకములైన ఈ అవసరములు తీరిన తదుపరి దశలో వ్యక్తికి కావలసిన రక్షణ, భద్రతలనిచ్చి విద్యాబుద్ధులు నేర్చుటకు, సమగ్ర వికాసమునందుటకు అవకాశమునిచ్చేది దేశమాత. మానవ జీవిత లక్ష్యమును తెలియచేసి ఆధ్యాత్మిక జీవితవారసత్వము నకర్షమైన ఆత్మజ్ఞానమును కలుగచేసేది వేదమాత. మానవుడీవిధంగా భౌతిక, ఆధ్యాత్మిక వికాసాన్ని పొంది శ్రీమాతృస్వరూపాన్ని తెలిసికొని తరించుటకై తీర్చిదిద్దేది మాతృమూర్తి తత్త్వం. స్త్రీతత్త్వం స్వార్థరాహిత్యానికి, త్యాగానికి, ధర్మానికి ప్రతీక. అందుకే ఉత్తమము, పవిత్రము అయిన తత్త్వాన్ని మాతృ శబ్దంతో చేర్చి చెప్తారు. తల్లినిమించిన దైవం లేదంటారు. ప్రతి వ్యక్తికి తల్లి మొట్ట మొదటి గురువు. దేహమాత బోధనలతో ఉత్తమ ప్రాపంచిక జ్ఞానాన్ని సంపాదించి క్రమంగా దేశమాతను గౌరవ పూర్వకంగా సేవించి, వేదమాతను భక్తితో ఆరాధించి జగన్మాత ఒడిలో ఒదిగి కరగిపోయిన వ్యక్తిదే సార్ధకమైన జన్మ.

'మాతృదేవోభవ' - అనేది ఉపనిషదాదేశం. ప్రత్యక్ష దైవంగ మనం గౌరవించి సేవించుటకు అందుబాటులో ఉండే దేవతయే మాతృమూర్తి. ఆమె ప్రేమస్వరూపిణి. జన్మనిచ్చి పోషించిన తల్లిని గౌరవించుట ప్రథమ కర్తవ్యం. భగవాన్ బాబా ఈ విషయం విద్యార్థులందరికీ అనేక పర్యాయాలు నొక్కి చెప్తారు. **'మీ దేహము తల్లిదండ్రు** లిచ్చిన వరప్రసాదం. **వారిని తృప్తిపరచక, కృతజ్ఞతను అందించక జీవించే జీవితం వ్యర్థం. తల్లికీర్తిని నిలబెట్టేరీతిగ మీ నడక ఉండాలి. మీరు నాకు తృప్తినందించకపోయినను**

ప్రొ॥ జె. హేమలత

ఫరవాలేదు. మీ తల్లిదండ్రులను ఆనందపరచండి' అంటారు స్వామి. తల్లిదండ్రులను తిరస్కరించి దూషించుచు, విద్యావంతులమని చెప్పుకొని విఱ్ఱవీగే వారిని పరమమూర్ఖులుగ పశువులకంటే హీనులుగ పరిగణించాలని స్వామివారు అంటారు. విద్యార్థినులను సంబోధిస్తూ స్వామి **'మీరు పవిత్ర మాతృమూర్తులు కాబోయేవారు. తల్లి మంచిదైతే పిల్లలు మంచివారవుతారు. కోడలుమంచిదయితే సంసారం సద్గుణవంతమవుతుంది. మీరు చదివేచదువులు కేవలం ధనార్జన కొఱకు, ఉద్యోగాల కొఱకుకాదు. మంచి గుణములను పోషించుట కొఱకై విద్యమపయోగించు కోండి'** అని ఆదేశించారు.

మాతృమూర్తికి, మాతృదేశానికి చాలా సామ్యం ఉన్నది. మన తల్లి భరతమాత - మనమందరం ఆమె అనుంగు బిడ్డలం అన్న భావనలోని ఆనందం హృదయైకవేద్యం. ఆ తల్లి సమ్యగ్వీక్షణం సకలజనావళికి శ్రేయోదాయకం. ఆ మాతృమూర్తి క్షేమం మన సమిష్టి శుభకామం. అనాదికాలం నుండి వేదవిహితమైన నీతులను బోధించి మానవాళికి తగిన సద్గుణములను, సన్మార్గమును అందించిన భారత దేశం సర్వదేశములకు నాయకత్వం వహించింది. కొద్దికాలం క్రిందటి వరకు కూడ అన్ని దేశాలవారు ఆధ్యాత్మికరంగంలో భారతదేశానికి శిరసువంచి నమస్కరించేవారు. ఇట్టి మహాపవిత్రమైన కర్మభూమిని, త్యాగభూమిని, యోగ



భూమిని ఈనాడు భోగభూమిగ తీర్చిదిద్దుటకు ప్రయత్నం చేయుట మానవత్వమునకు అవమానకరంగ ఉన్నది అని భగవాన్ ఆవేదన. భారతమాత మీ తల్లి. ఆమెయెడ భక్తిప్రపత్తులు కలిగి సేవించండి అని బాబావారి ఉద్బోధ. 'దేశమంటే మట్టికాదోయ్ - దేశమంటే మనుషులోయ్ - దేశమును ప్రేమించుమన్నా - మంచియన్నది పెంచుమన్నా - వట్టిమాటలు కట్టిపెట్టోయ్ - గట్టిమేల్ తలపెట్టవోయ్' అన్న మహాకవి సార్వకాలిక సందేశాన్ని మనసానమ్మి ఆచరణలో పెట్టవలసిన అగత్యం నేడెంతైనా ఉన్నది. భౌతికంగ, వైజ్ఞానికంగ మన దేశం చాలా వరకు అభివృద్ధిని సాధిస్తోందికాని మరొకవైపు ఆర్థిక, రాజకీయ కల్లోలాలు, కులమత వర్గభేదాలు, ప్రాంతీయ దురభిమానాలు పెచ్చుపెరిగిపోతున్నాయి. దీనికి కారణం సంఘంలో నైతిక విలువలు అడుగంటి పశుత్వం ప్రబలిపోవుటయే. మానవత్వంలోని దివ్యత్వాన్ని అభివృద్ధి పరచుకొని ప్రతి వ్యక్తీ ఆత్మసంశోధన చేసికొని న్యాయమార్గంలో పయనిస్తే మాతృదేశానికి సేవ చేసినట్లే! తల్లి కోరుకునేది పిల్లల శ్రేయస్సే కదా! మనలో ప్రతి ఒక్కరు ధర్మం తప్పక పాటించి, ద్వేషాసూయాది భావాలు విడనాడి హింసా ప్రవృత్తిని దూరంచేసికొని పరస్పర ప్రేమానురాగాలతో జీవిస్తే మన తల్లి ఆనందం వర్ణనాతీతం. అదే మనం ఆమెయెడ చూపే కృతజ్ఞత. ఆమె పట్ల ప్రదర్శించే భక్తి. చేయకలిగే సేవ. ముఖ్యంగా విద్యావంతులనబడే ప్రతి ఒక్కరిపైన ఈ బాధ్యత ఎంతో ఉన్నది. విద్య అంటే కేవలం కాలేజీ డిగ్రీల సంపాదనకాదు. హృదయవైశాల్యాన్ని, బుద్ధివైశిత్యాన్ని సమపాళ్లల్లో అభివృద్ధి చేసేది విద్య. విద్యమీదనే పారమార్థికం, వ్యావహారికం, ప్రాతిభాసికం ఆధారపడి ఉన్నాయి. పారమార్థికమనే జలము నుండి వ్యావహారికమనే అలలుపుట్టి వాటిలో ప్రాతిభాసికమనే నురుగు ఆవిర్భవిస్తుంది. ఈ మూడింటిలోని ఏకతత్త్వమైన ఆత్మతత్త్వాన్ని అర్థం చేసుకోవాలి. వ్యావహారిక ప్రాతిభాసిక ములననుభవిస్తూనే నిత్యజీవితంలో పారమార్థికమును అంతర్వాహినిగ గుర్తించి పిల్లలకు బోధించి యావత్ ప్రపంచానికి వ్యాపింపచేయుట విద్యావంతుల కర్తవ్యం. విద్యావంతులనేకులు లౌకిక సుఖవ్యామోహంలో కొట్టుకు పోతూ మాతృదేశాన్ని వీడి పాశ్చాత్య దేశాలకు వలసపోయే ఈనాటి పరిస్థితి చాలా దయనీయం. ఈ స్థితికి కారణం కొన్ని దశాబ్దాలుగ మనలో పాతుకుపోయిన లోపాలే. స్వార్థచింతన, దగా, మోసం, ప్రావీణ్య నైపుణ్యాలను గుర్తించకుండ, నిజాయితీకి విలువలేకుండ చేయడం, అవాంఛిత అభిమానాలు, ఆదరణలు చూపడం, ఆదర్శాలను అణగద్రొక్కడం - ఇలా ఎన్నో ఇంకెన్నో విషయాలు నిపుణులైన యువతలో నిరాశానిస్పృహలను కలిగించి వారు మాతృభూమిని వదలి పరదేశాలకి పారిపోయేట్లు చేస్తున్నాయి. ఇది గుర్తించక వారు కేవలం ధనార్జనకు మాత్రమే వెళ్ళిపోతున్నారని మనల్ని మనం సమాధానపరచుకుంటే అది ఆత్మద్రోహం అవుతుంది. అనంతమైన యువమేధాశక్తిని వారి కార్యదీక్షాదక్షతలను మాతృదేశసేవకై వినియోగించుటకు అనుకూల పరిస్థితులను కల్పించటం ఇక్కడ ఉన్న పెద్దల కర్తవ్యం. మన భరతమాతయెడల మన భక్తిని నిరూపించుకోవడానికి ఇది ప్రస్తుత ప్రధాన కర్తవ్యం. ఈ మహాయజ్ఞంలో స్త్రీ పాత్ర కూడ ఎంతో ఉన్నది. ఇల్లాలు, గృహలక్ష్మి అనబడే గృహిణి తన బిడ్డలను వినయవిధేయవంతులుగ తీర్చిదిద్ది క్రమశిక్షణ, విద్యా బుద్ధులు గరపి వారిని పవిత్రభావాలతో ఆదర్శవంతులుగ తీర్చిదిద్ది ఉత్తమ పౌరులుగ దేశానికి అందించినపుడే తన మాతృస్థానానికి న్యాయం చేకూర్చినదవుతుంది. ఇట్టి మాతృమూర్తులను తయారుచేయుటకే స్వామి స్త్రీ విద్యకు ప్రాధాన్యం ఇస్తారు.

మహిమాన్వితమైన మాతృభావనా స్రోతస్వినిలో పునీతులమై స్వామి సదాశయసిద్ధికి మనవంతు కర్తవ్యాన్ని నిర్వహించే శక్తిని ప్రసాదించమని 'శ్రీ సాయిమాతను ప్రార్థిద్దాం'

ఓం శ్రీ మాత్రేనమః



## సుప్రీంస్టేజి సుప్రీంకోర్టు

"ఈనాడు ఆకార మానవుడు కనిపిస్తున్నాడేకాని, ఆచార మానవుడు కనిపించటంలేదు. ఆచార మానవులుగా తయారై 'సుప్రీంస్టేజి' కి వెళ్ళడానికి ప్రయత్నం చేయాలి. అయితే ఈనాడు 'సుప్రీంస్టేజి'కి వెళ్ళడానికి ప్రయత్నం చేయటంలేదుకాని, 'సుప్రీంకోర్టు' కు మాత్రం పోతున్నారు. కనుక మనం **Supreme Court** కు కాదు, **Supreme Stage** కు వెళ్ళాలి. అదియే **Supreme Divine Self.** అట్టి పవిత్రమైన దివ్యజీవితాన్ని మనం అనుభవించాలి".

- బాబా

# సాయీ విగ్రహవాన్ శాంతిః

"అశాంతికి మూలం అదుపులేని ఆశలు. కళ్ళాలులేని కోరికలు. కోరికలనదుపు చేసుకుంటే మనశ్శాంతి వస్తుంది. కోరికలే లేకుండా చేసుకుంటే శాంతి వస్తుంది. కామక్రోధ రాహిత్యమే శాంతి. కామక్రోధరాహిత్యమును వికసింప చేయుటయే ప్రశాంతి".

"సత్యమే నా ప్రచారము. ధర్మమే నా ఆచారము
శాంతియే నా స్వభావము. ప్రేమయే నా స్వరూపము"

అన్నారు భగవాన్ బాబా.

కొంతమంది భక్తులు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారిని అడుగుతూవుంటారు. 'స్వామీ! నాకు శాంతి కావాలి' అని. దానికి స్వామి ఏం చెప్తారో తెలుసా! 'బంగారూ! 'నాకు' అనే అహమూ, 'కావాలి' అనే కోరికా రెండూ తీసేస్తే ఇక మిగిలేది 'శాంతి' మాత్రమే నాయనా. అది నీలోనే వుంది' అని. మనస్సులో కోరికలు విశృంఖలంగా పైశాచిక నృత్యం చేస్తున్నప్పుడు హృదయానికి కలిగే అనారోగ్యమే **అశాంతి.** హృద్రోగాలు నివారించడానికి Super Specialities Hospital నిర్మించారు స్వామి. కాని హృదయంలోని అశాంతిని నివారించడానికి స్వామివంటి Special Super Doctor కే సాధ్యమవుతుంది.

ఈనాడు ప్రపంచంలో అశాంతి విలయతాండవం చేస్తున్నది. ఈ అశాంతి నిజానికి బాహ్యంలోకాక మనిషి యొక్క అంతరంగంలో దుమారం లేపుతోంది. దానికి కారణం మానవుడి హృదయంలో 'దయ' అనేది లోపించడమే. 'దయగల హృదయమే దైవమందిరము' అంటారు స్వామి. హృదయమునకు 'దయ' హృదయమువంటిది. ఆ దయ లోపించిననాడు హృదయానికి కలిగే అనారోగ్యమే **అశాంతి.** అత్యుత్తమమైన మానవతా విలువలైన సత్య, ధర్మ, శాంతి, ప్రేమలను పునరుద్ధరించి ప్రపంచాన్నంతటినీ ప్రశాంతి నిలయంగా తీర్చిదిద్దడానికి మనలో ఒకరుగా వుంటూ, సాధారణ మానవుడిగా మసులుతూ అసాధారణ శక్తిసంపదలతో విచ్చేసిన కరుణరసావతారమే భగవాన్ శ్రీ సత్యసాయిబాబా. సత్యధర్మములడుగంటినప్పుడు శ్రీరాముడు, శాంతి ప్రేమలకు ముప్పు వాటిల్లినప్పుడు శ్రీకృష్ణుడు అవతరించాడు. ఇప్పుడవన్నీ అంతరించిపోయే ప్రమాదం వచ్చినందువల్ల తానే యీ భువిపై అవతరించవలసి వచ్చిందని స్వామి నిష్కర్షగా ప్రకటించారు. అంతేకాదు అడుగడుగునా తన బోధలతోనూ, ప్రవర్తనతోనూ తన దివ్యత్వాన్ని నిరూపిస్తున్నారు. బాబావారు భగవంతుడని విశ్వసించేవారు చాలామంది వున్నారు. అలా విశ్వసించనివారు కూడా చాలా ఎక్కువమందే వున్నారు. 'మీరు విశ్వసించినా విశ్వసించక పోయినా మీరంతా నావారు. నేను మీ వాణ్ణి. మానవాళి నంతటినీ సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలతో

## యన్. బదరీ నారాయణరావు

ప్రభావితం చేసి మాధవుని స్థాయికి తీసుకుపోవడమే నా లక్ష్యం' అని చాటుతున్నారు ఆ ప్రేమమయుడు. ఎంతటి కరుణ! ఎంత ప్రేమ!! మన కోసం అంత కృషి చేస్తున్న కరుణామయుణ్ణి మనం దర్శించుకోవద్దా?

ప్రపంచంలో యిప్పుడున్న కోటానుకోట్ల జనాభాలో ఒక్కసారైనా ప్రశాంతి నిలయానికి వెళ్ళి శ్రీ సత్యసాయీశ్వరుని దర్శన భాగ్యం పొందినవారే నిజమైన అదృష్టవంతులు. అసలు ఆ ప్రశాంతి నిలయం ఆవరణలో అడుగు పెడుతూనే యేదో ఒక అలౌకికమైన అనిర్వచనీయమైన దివ్యానుభూతి కలగనివారు చాలా అరుదు. ఆ అనుభూతి ఒక్కొక్కరికి ఒకోలాగ వుంటుంది. ఈనాడు అణ్వాయుధాల తయారీలో పోటీ పడుతున్న ధనికదేశాలనూ, శాంతి పాఠాలను వల్లిస్తూనే గుట్టలుగుట్టలుగా అతి ప్రమాద భరితమైన అణ్వాయుధాలను సమీకరిస్తున్న దేశాధినేతలనూ ఉద్దేశించి వారిని ఎద్దేవా చేస్తూ,

"హస్తమున అణుబాంబు వుంచుక
అరచుచుందురు శాంతిశాంతియని"

అంటూ చురక తగిలిస్తారు.

ఈ విషయాన్ని గురించి ప్రస్తావిస్తూ Howard Murphet తాను వ్రాసిన 'Where the Road Ends' అనే గ్రంథంలో "Labours of an Avatar' అన్న అధ్యాయంలో





కొన్ని రహస్యమైన విషయాలను ఇంతవరకూ చాలామందికి తెలియనివాటిని వెల్లడించారు. అదేమిటంటే - 1960వ దశాబ్దంలో అమెరికా, రష్యాల మధ్య Cold War చాలా ముమ్మరంగా సాగుతున్న రోజులవి. అమెరికా, రష్యా దేశాలు రెండూ అణ్వాయుధాల తయారీలో పోటాపోటీగా హోరాహోరీగా ప్రపంచాన్నంతటినీ మూడో ప్రపంచ యుద్ధ భయంతో గడగడలాడిస్తున్న ఆ గడ్డురోజులలో కొంతమంది పాశ్చాత్య భక్తులకు మర్ఫెట్‌తో సహా Interview ఇచ్చినప్పుడు వారు స్వామిని ప్రశ్నించారు.

**'బాబా! మూడో ప్రపంచ యుద్ధం వస్తుందా? వస్తే అది అణ్వాయుధాలతో జరిగే యుద్ధంగా పరిణమించే ప్రమాదం వుందా'** అని.

**'లేదు. అటువంటిదేమీ జరగకుండా ఆపు చెయ్యడానికే సర్వదివ్యశక్తులతో ఇప్పుడీ అవతారం ఆవిర్భవించింది'** అని స్వామి చాలా ఖచ్చితమైన జవాబిచ్చారు.

ఈ మాటలు స్వామి చెపుతున్నప్పుడు కొందరు పాశ్చాత్య భక్తులు నమ్మలేకపోయారు. అంతటి బృహత్తరమైన బాధ్యతను ఈ 'చిన్న మనిషి' నెరవేర్చగలడా అన్న

**"అఖిల మానవులకు ఆనంద మొనగూర్చి**
**రక్షించు చుండుటే దీక్ష నాకు -**
**సన్మార్గమువీడి చరియించు వారిని**
**పట్టుక బ్రోచుటే వ్రతము నాకు -**
**బీదసాదలకైన పెనుబాధ తొలగించి**
**లేమిని బాపుటే ప్రేమ నాకు -**
**మదినిష్ఠతో నన్ను మహి గొల్చువారిని**
**కాపాడుచుండుటే ఘనత నాకు -**
**అనగ పేరంది నాయండ నలరు వారి**
**నెన్నడును మరువనివాడనన్న మాట**
**మరువబోకుడు మదిలోన మనుజులార!**
**సకల సద్గుణ గణ్యులౌ సభ్యులార!**
**అట్టి స్వామికి వందనాలు.**
**ప్రేమ ప్రశాంతినిలయా! ప్రేమోదయ!**
**ప్రేమ హృదయ! ప్రేమాభ్యుదయా!**
**ప్రేమావతార! విశ్వ ప్రేమాలయ!**
**ప్రేమసాయి! ప్రేమాంజలులివే!"**

**- శాంతిశ్రీ**

సందేహం వారందరి ముఖాల్లోనూ కనబడిందోయేమో - వెంటనే స్వామి వారి కళ్ళలోకి సూటిగా తీవ్రంగా చూస్తూ **'అవతార పురుషుడికి అపజయం అనేది వుండనే వుండదు'** అని ఖండితంగా చెప్పారు. అయినా కూడా కొందరు ఆ మాటను నమ్మడానికి సాహసించలేక పోయారంటాడు మర్ఫెట్ మహాశయుడు. వేరొక సందర్భంలో ఆయన బాబాను ప్రశ్నించాడు. 'స్వామీ! రష్యాలోగాని, అమెరికాలో గాని జనసామాన్యం ఎవరూ విశ్వ విధ్వంసకమైన యుద్ధాన్ని కోరుకోవటంలేదు. అసలు ప్రమాదం అంతా ప్రభుత్వాల తోనే వచ్చిపడింది. ఆ ప్రభుత్వాల మాటేమిటి?' అని. దానికి స్వామి 'అవును. ప్రభుత్వాలనే మార్చెయ్యాలి. అవి తప్పక మార్చి వెయ్యబడతాయి' అని దృఢమైన స్వరంతో జవాబిచ్చారు. ఇక్కడ మర్ఫెట్ యేమంటాడో ఆయన మాటల్లోనే విందాం.

"In the rhythm of Siva's timedrum, there is the right time for everything. And so, at the right time the world witnessed the amazing, almost unbelievable change of government of Russia The Cold War with its threat of nuclear annihilation, vanished over night The world breathed a sigh of relief, while our hearts rejoiced that the Avatar had carried out his promise".

ఎంతటి మహత్తరమైన సంకల్పశక్తి!

భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరుడు ప్రపంచంలో సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలను తప్పక నెలకొల్పుతారన డానికి ఎటువంటి సందేహమూ అఖ్కర్లేదు. ఆ Cold War జరుగుతున్న రోజుల్లోనే మర్ఫెట్ బృందంతో భగవాన్ చెప్పిన ఈ మాటలు విశ్వానికంతకూ ఆశాకిరణాలు, శాంతి తోరణాలు.

'రాబోయేది స్వర్ణయుగం. చిన్నచిన్న యుద్ధాలు, కలహాలు, కలతలూ మరికొన్ని బాధాకరమైన విషయాలూ ప్రపంచంలో సంభవించవచ్చు. కాని రాబోయే శతాబ్దం యొక్క ఆదిలోనే ప్రపంచం స్వర్ణయుగంలోకి పయనించ బోతున్నది. మానవ సమాజంలో శాంతి సౌఖ్యాలూ ప్రశాంత వాతావరణమూ ప్రతిష్ఠించబడతాయి.' ఈ హామీయే ప్రపంచానికి స్వామియిస్తున్న అభయహస్తం. అదే విశ్వానికంతకూ శ్రీరామరక్ష.

సాయీ విగ్రహవాన్ శాంతిః



# సర్వమత సమన్వయమే సాయిలక్ష్యం

**జి.వి. సుబ్రహ్మణ్యశర్మ**

"ప్రతి మతానికి చెందిన ప్రచారకులు తమ, తమ మతం బోధించే ఉత్తమ విలువలయందు విశ్వాసం పెంచుకుని, వాటిని తాము స్వయంగా ఆచరించటంలోగల ఔన్నత్యాన్ని గుర్తించాలని సాయి అభిమతం, అదే సాయి మతం. అన్ని మతాలను పెంచి, పోషించి, వాటన్నింటి యొక్క ఔన్నత్యాన్ని నొక్కిచెప్పే మతం ఇది. ఈ మతాన్ని ధైర్యంగా, ఆనందంగా అనుసరించండి" అని భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి 'సాయిమతం' అనే అంశాన్ని గూర్చి "At the feet of Sai" అనే గ్రంథంలో 'రూబెన్ లోవెన్‌బర్గ్' ఇలా వ్రాశాడు.

ఈ భావాన్నే బాబావారు మరొక సందర్భంలో ఇలా వివరించారు.

"మతములన్నిచేరి మంచినే బోధించె
తెలిసి మెలగవలెను తెలివితోడ
మతులు మంచివైన మతమేది చెడ్డది?
వినుము భారతీయ వీరసుతుడ!"

## మతం అంటే ఏమిటి?

భగవంతుని గూర్చిన విశ్వాసం అని అర్థం. ఇష్టము, అభిప్రాయము అని అర్థం కూడా ఉన్నది. మతమనేది భగవదారాధన సలుపుతూ, ఆయన కృపను పొంది, ఇహలోకంలో సుఖశాంతులను, పరలోకంలో మోక్షానందాన్ని పొందించే సాధన. మతమును గురించి స్వామి వివేకానంద చక్కగా వివరించారు. **'Religion is the Idea which is Raising the Brute Unto Man, and Man unto God'.** మృగాన్ని మానవుడిగా, మానవుడిని మాధవునిగా మార్చగలశక్తియే 'మతము' అన్నారు. అనేకత్వంలో ఏకత్వాన్ని నిరూపించేటటువంటిదే మతం. మానవునికి మోక్షమార్గం చూపునది మతం. మానవుని సక్రమ మార్గంలో నడిపించడానికే మతాలు ఏర్పడినాయి. అన్ని మతాల గమ్యం ఒక్కటే. అయితే ఆ గమ్యమును చేరుకోవటానికి ఒక్కొక్క మతం ఒక్కొక్క మార్గాన్ని సూచించింది. మతాలు అన్నీ మంచి విషయాలనే బోధించాయి. అయితే వాటిని సరిగా అవగాహన చేసుకోకపోవటం వలన తరచుగా మత సంఘర్షణలు సంభవిస్తున్నాయి. మతాలలో చెడ్డలేదు. మన మతులలోనే ఉన్నది స్వార్థం. అందువలనే భగవాన్ బాబావారు 'మతులు మంచివైన మతమేమి చెడ్డది' అని ప్రశ్నించారు.

భగవద్విషయంలో సమన్వయభావం మానవులందరి లోనూ ఉండాలి. భగవంతుని విషయంలో సమభావాన్ని ప్రకటించకుండా కొందరు స్వార్థపరులు ఎలా ప్రవర్తిస్తున్నారో చెబుతూ, సమన్వయభావం ఎలా ఉండాలో భగవాన్ బాబా వారు వివిధ ప్రసంగాలలో ఇలా వివరిస్తారు.

"అల్లాయంచు మహమ్మదీయులు యెహోవాయంచు సత్ క్రైస్తవులు
పుల్లాబ్జాక్షుండంచు వైష్ణవులు శంభుడంచుశైవుల్ సదా
ఉల్లాసంబున గొల్వనెల్లరను వాయుర్భోగ భాగ్యాది సం
పల్లాభంబు లొసంగి బ్రోచు పరమాత్ముండొక్కడే చూడుడీ!"

"విష్ణువే గొప్పని వైష్ణవులనుచుండ
శంభుండు గొప్పని శైవులనగ
గణపతి గొప్పని గాణాపతులు పల్క
శారద గొప్పని చదువరులన
అల్లా ఘనుండని ఆ తురకలు చెప్ప
శాక్తేయులందరు శక్తియనగ
నేను గొప్పయటంచు నాదుభక్తులు చెప్ప
అందరొక్కటియని కొందరనగ
సర్వమత సమ్మతమ్ముగ సత్యమైన
బ్రహ్మమొక్కటియని మీరు పలుకవలయు
ఇంతకన్నను వేరెద్ది ఎఱుక పఱుతు
సాధు సద్గుణ గణ్యులౌ సభ్యులారా!"

సర్వమత సమ్మతమే సాయిలక్ష్యం. స్వామి కోరేది సర్వమత సమన్వయం. అసలు సర్వమత సమన్వయ భావన సనాతనమైనదేగాని, ఈనాడు క్రొత్తగా కల్పించి చెప్పినదికాదు. అందువలననే 'సనాతన సారథి' అయిన భగవాన్ 'సర్వమతసమన్వయం' తన అవతార లక్ష్యంగా ఎంచుకున్నారు, బోధిస్తున్నారు, బోధించటమేగాక, ఆచరించి

చూపుతున్నారు. సర్వమతాలలో సమన్వయం ప్రతిపాదించబడింది. అయితే దానిని గ్రహించలేక వైషమ్యాలను పెంచుకుంటున్నారు. 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' అని సర్వమతాలు ఈ విషయాన్ని ఎలా ప్రతిపాదించాయో పరిశీలిద్దాం. 'హృదయ పవిత్రతయే సర్వమతముల సారం' అని, 'భగవంతుడు ఆత్మస్వరూపుడు' అని అన్ని మతాలు చెబుతున్నాయి. 'భగవంతుడు హృదయకుహరంలో ఆత్మ స్వరూపుడై ఉంటాడు' అని ఉపనిషత్తులు బోధిస్తున్నాయి.

## భగవంతుని అనుగ్రహం పొందాలంటే...

"ప్రతి దేశమునకు ఒక మంత్రిమండలి ఉంటుంది. దానికి ప్రధాన మంత్రి అధిపతి. అతనొక్కడే అన్ని శాఖలను చూడటం కష్టం కనుక, ఆర్థిక, రవాణా, పోలీసు, పరిపాలన మొదలగు అనేక శాఖలుగా విభజించి, మంత్రులకు ఆయా శాఖలను కేటాయించబడుతాయి. ప్రధానమంత్రి అతి ముఖ్యమైన శాఖలను కొన్నింటిని తన ఆధీనంలో ఉంచుకుంటాడు. ఈ విధంగా విభజించటం వలన ఏ శాఖకు చెందిన Files ఆ శాఖకు చెందిన మంత్రివద్దకే వెళ్ళుతాయి. ప్రధానమంత్రి పెద్దవాడు కదా! అని అతని దగ్గరకు అన్ని Files వెళ్ళవు. అదేవిధముగా భగవంతుని సృష్టియందు కూడా పరిపాలనలో అనేక శాఖలుగా విభజించబడి ఇంద్రుడు, వరుణుడు, వాయువు, అగ్ని, రుద్రుడు వంటి మంత్రులకు కేటాయించబడినాయి. వారు వారి శాఖలను పరిపాలన చేస్తుంటారు. అయితే భగవంతుడు, ప్రధానమంత్రి (Prime Minister) వలె అన్నింటిని పర్యవేక్షిస్తూ తన ఆధీనంలో వుంచుకొనిన శాఖలపైన ప్రత్యేకమైన దృష్టిని పెట్టి పరిపాలన కొనసాగిస్తుంటాడు. భగవంతుని అధీనంలో మూడు ప్రధాన శాఖలున్నాయి. 1. నిష్కామ కర్మ 2. అనంత ప్రేమ 3. నిర్మల చిత్తము. ఈ మూడు మార్గముల ద్వారా వచ్చే ప్రార్థనలన్నీ భగవంతునికి Direct గా చేరుతాయి. మిగిలిన ప్రార్థనలన్నీ భగవంతునికి Direct గా చేరడానికి వీలుకాదు. కనుక మనం ఈనాడు Direct గా భగవంతుని అనుగ్రహాన్ని, ఆశీస్సులను, అనుమతినీ పొందాలంటే, ఈ మూడు మార్గముల ద్వారానే పొందటానికి వీలవుతుంది. ఈ మూడింటి యందు నిష్కామకర్మ ప్రధానమైనది".

- బాబా

'హృదయం పవిత్రమైతే దైవాన్ని పొందటం సాధ్యం' అని బైబిల్ ప్రకటిస్తున్నది. పవిత్ర కార్యాలు ఆచరించి, హృదయాన్ని నిర్మలంగా ఉంచుకోవటమే' అని ఖురాన్ ప్రతిపాదిస్తున్నది. 'సత్కర్మలు, సత్ప్రవర్తనలచేత మానవత్వాన్ని నిరూపించుటకు హృదయమే ప్రధానము' అని గురునానక్ మనకు గుర్తు చేశాడు. 'సర్వమతాలసారం, సర్వశాస్త్రాల మూలం, సర్వమార్గాల గమ్యం ఒక్కటే' అనే భావమే సర్వమత సమన్వయానికి రాచబాటను వేసింది. ఇదే భావమును భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ఒక పర్యాయం సోదాహరణంగా వివరించారు.

"శృంగారములు వేరు బంగారమొక్కటె
వస్త్రభేధములు వేరు వస్తువొక్కటె
పశుల వన్నెలు వేరు పాలు ఒక్కటె
జీవజాతులు వేరు జీవుండు ఒక్కడె
జాతినీతులు వేరు జన్మ ఒక్కటె
దర్శనంబులు వేరు దైవంబు ఒక్కటె
పూలజాతులువేరు పూజ ఒక్కటె
తెలియలేకను మానవులు తెలివి తప్పి
బ్రతుకు కోసము బహుబంధబద్ధులైరి!"

అంటూ 'దైవము ఒక్కడే Truth is God, Love is God (సత్యమే దైవం, ప్రేమే దైవం) సత్యమును పలకండి! ప్రేమను పెంచుకోండి' అని అంటారు భగవాన్ బాబావారు.

చెప్పింది చేయటం, చేసింది చెప్పటం భగవాన్ సాయి అవతార లక్ష్యము. అందువలననే భగవాన్ సాయి సర్వమత సమన్వయాన్ని సూచించడానికే వారి పతాకంలో సర్వమత చిహ్నాలకు చోటు కలిపించారు. ప్రశాంతి నిలయంలో సర్వధర్మశాంతి స్థూపాన్ని నిర్మించారు. అంతేకాదు ప్రశాంతి నిలయంలో హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ, బౌద్ధ, జైన, సిక్కు మరియు భారతదేశంలో వివిధ ప్రాంతముల వారి పండుగలు కడువైభవంగా ప్రతి సంవత్సరమూ నిర్వహించబడుతాయి. భగవాన్ బోధించే సర్వమత సమన్వయానికి ఇవి ప్రతీకలు.

కనుక భగవాన్ బాబావారి ఆలోచనలను ఆచరణలో పెట్టినప్పుడు వివిధ మతాల మధ్య వైషమ్యాలకు తావే వుండదు. వివిధ ప్రాంతాల మధ్య, వివిధ దేశాల మధ్యనున్న అడ్డుగోడలు తొలగిపోతాయి. మానవుల మధ్యనున్న బేధభావాలు వైదొలగిపోతాయి. 'లోకాః సమస్తాః సుఖినో భవంతు' అనే వేదోక్తి ఆచరణ రూపం దాలుస్తుంది. #





# ఇది ఆనాటి.. అనుభవం



సరిగ్గా ఇరవై అయిదు సంవత్సరాల క్రిందటిమాట. నేను అనే జీవిని స్వామికి తెలుసునా లేదా అని మథన పడుతున్న రోజులవి. ఈ జన్మకి ఒక్కసారైనా పలకరింపు దక్కుతుందా లేదా అని బాధపడుతున్న రోజులవి. ఎప్పుడు వచ్చినా, ఎన్నిసార్లు వచ్చినా, చచ్చినా మొదటివరస, దర్శనం సమయంలో నోచుకొని రోజులవి. భజన సమయంలో, ఏ ముహూర్తబలంవల్లనో, మూడో వరస నాలుగో వరసలో, చోటుచిక్కినా స్వామి నేరుగా భజనహాలులో కూర్చోటం జరిగేది. ఏ తెలిసినవాడినో మొహమాటపెట్టి ముందు కూర్చుంటే ఆ ప్రక్క ఈ ప్రక్క నన్ను తప్ప స్వామి చూడటం జరిగేది. పైగా ఆశ్చర్యమేమంటే నేను కూర్చున్న వరుసవైపే వచ్చేవారుకాదు. మన శనిగ్రహం అంతగా నా ప్రక్కవారిపై ప్రభావం చూపేది. అందుకనే తెలిసినవాళ్ళను 'నా ప్రక్కన కూర్చోవద్దురా బాబూ! నా శని నీకు కూడా తగులుకుంటుంది' అని బతిమాలాడేవాడిని. అందుకే చాలామంది ముందు జాగ్రత్తగా సాహసించేవారు కాదు. నమ్మండి నమ్మకపొండి. ఒకటిమాత్రం పచ్చి నిజం. ఎనిమిది సంవత్సరాలు స్వామి నన్ను చూడటంకాని, పాదనమస్కారం ఇవ్వటంకాని, నన్ను చూచి నవ్వటంగాని జరగలేదు. ఇంటర్వ్యూమాట దేవుడెరుగు! కాని అదేమిటో గాని ప్రతి పండక్కి పుట్టపర్తి రావాలనిపిచ్చేది. కాలేజిలో మాష్టర్లం కదా. ఈ మార్చిలో ఫెయిలయితే, సెప్టెంబరులో పాసుకావచ్చని విద్యార్థులకు సలహా ఇచ్చినట్లు ఈ సంవత్సరం కాకపోతే వచ్చే సంవత్సరం నన్ను స్వామి చూడకపోతారా, మాట్లాడకపోతారా అని అనుకునేవాడిని. ఇలా అనుకుంటూనే ఎనిమిది వసంతాలు గడిచాయి. కాని ఒక్కటి జరుగుతుండేది. పర్తికి వెళ్ళి వచ్చినప్పుడల్లా భక్తులు నన్ను 'నీకు పాద నమస్కారం దొరికిందా? విభూతి ప్రసాదం దక్కిందా?' అని అడుగుతారని మొహం తప్పిచ్చి తిరిగేవాడిని. ఎంతో ఆత్మీయంగా, మధురంగా మాట్లాడతారట. అది ఎట్లా వుంటుందో అనుభవించాలని ఉండేది. మొదట్నించీ నాకు కోరికలు లేవనే చెప్పాలి. వృత్తి అధ్యాపక వృత్తి. లక్షలు ఎక్కడ్నించి ఊడిపడతాయి? కోరికోరి ఎన్నుకున్న ఉద్యోగం. ఎన్నో అవకాశాలు ఉన్నా కాదనుకుని నేను వరించిన ఉద్యోగం ఇది. కనుక నేను కోరవలసింది పెద్దగా ఏమి లేదనవచ్చు. జీవితంలో తట్టుకోలేని ఇబ్బందులేమి లేవు. కాని ముఖాముఖి సంభాషణ ఎలా ఉంటుందో అన్న ఆరాటం ప్రబలంగా ఉండేది. కాని బాహ్యంగా, మౌనంగా స్వామి నాతో ఉన్నప్పటికిని ఆ కాలంలోనే నాకు కొన్ని మరపురాని, మరువలేని మహిమలు ప్రసాదించారు. వాటిల్లో ప్రధానమైనది తెలియజేసుకునే ప్రయత్నమే ఇది.

అది 1975వ సంవత్సరం మండు వేసవి . నేను గుంటూరులో రవి కాలేజిలో మెడికల్ ఎంట్రన్సు క్లాసులు తీసుకునేవాడిని. చాలా సంవత్సరాలు చెప్పేను. యధా

**కామరాజు అనిల్‌కుమార్.** *ప్రశాంతి నిలయం*

ప్రకారం ఆ సంవత్సరంకూడా రాత్రి గం॥ 8-00 లకు ఆఖరి పీరియడ్ పాఠం చెప్తున్నాను., అనుకోకుండా నా మిత్రులొకరు వచ్చి 'మీరు క్లాసు అయిపోగానే రవి కాలేజి ప్రక్కనే ఉన్న శ్రీ పంగులూరి శ్రీనివాసరావు అడ్వకేటు గారింటికి రండి' అని అన్నారు. ఒక ఇంటర్వ్యూకి మీరు Appear కావలసియున్నది అని అన్నారు. పొద్దున్న నించి కొట్టుకుంటున్న నేను చాలా అలసి పోయాను. కాని మిత్రుణ్ణి కాదనలేకపోయాను. క్లాసుమధ్యలో పిలిచి చెప్పాడు. వివరాలు తెలియదు. అప్పటికే పన్నెండు సంవత్సరాలు సర్వీసు అయిపోయిన నాకు ఇప్పుడు ఇంటర్వ్యూ దేనికి? ఎక్కడ ఏమి తెలియదు. అంతా అగమ్యగోచరంగా ఉంది. పైగా గుంటూరు ఎండల ధాటికి ముచ్చెమటలు పోస్తున్నాయి. కాస్త మొహం కడుక్కుని పౌడరు రాసుకుని డ్రస్సు మార్చుకోటానికి టైం లేదు. ఏం చేసేది చెప్పండి? అయిష్టంగా ఎందుకొచ్చిందిరా దేవుడా అంటూ వెళ్ళేను. అక్కడ తెలిసింది నాకు అసలు విషయం. శ్రీ పంగులూరి శ్రీనివాసమూర్తి గారు Rotary Club సభ్యులు. Rotary Foundation తరపున ప్రతి సంవత్సరం అయిదుగురిని ఎంపిక చేసి అమెరికాకు నాలుగు వారాలు పర్యటనకు పంపుతారట. జిల్లాస్థాయిలో ప్రథమంలో రాష్ట్రస్థాయిలో తరువాత ఇంటర్వ్యూలు జరిపి ఎంపిక





చేస్తారట. వీరు Rotary వారి బంధువులు కాకూడదు. ఎన్నికైన వారు ఒక్కొక్క రంగానికి చెందినవారై ఉండాలి.

విద్యారంగంలో నేను వారికి జ్ఞాపకమొచ్చి ఉండవచ్చును. నేను అక్కడికి చేరేటప్పటికి రాత్రి గం॥9-00లు అయింది. అందర్నీ ఇంటర్వ్యూ చెయ్యటం అయింది. నేనే ఆఖరివాడిని. ఏ కోశాన ఇష్టంలేనట్లుగా సమాధానాలు చెప్పేను. నిజానికి మా దగ్గరబంధువులు ఆరోజుల్లోనే ఆ దేశంలో స్థిరపడిపోయినవారున్నారు. ఊహామాత్రంగా నాకు వెళ్ళాలని ఉన్నా వెళ్ళటం పెద్ద విశేషమేమి కాదు. ఈమాటే అక్కడి పెద్దలకు చెప్పేను. మరునాడు ఉదయం మా ఇంటికి కబురొచ్చింది. 'జిల్లాస్థాయిలో ఎన్నిక పూర్తయింది. మిమ్మల్ని Select చేసినాము. Application Form Fillup చేసి పంపండి' అని వర్తమానం . ఇది విడ్డూరం. Application ముందు, తరువాత Selection సాధారణంగా జరుగుతుంటుంది. నా విషయంలో ముందు Selection వింతగానే ఉంది. ఏం చెప్పేను. ఏం అడిగారు, ఎందుకు Select చేశారు ఇప్పటికీ నాకు ప్రశ్నార్థకమే.

## అంతర్బహిశ్శాశ్వతత్సర్వం సాయి

"విశ్వప్రేమ సాయి విభుదుండు శ్రీ సాయి
సత్యరూప మదియె సత్యసాయి
జీవి జీవి సాయి జీవేశ్వరుడు సాయి
అణువు అణువు సాయి ఆత్మ సాయి

నింగినేల సాయి నిశ్శబ్ద మదిసాయి
ఏడ్పు నవ్వు రెంటి వేల్పు సాయి
ఇచ్చి పుచ్చుకొనెడి విధి విధానము సాయి
చూపుసాయి కాలరూపు సాయి

అంతరాత్మసాయి అఖిలమ్ము శ్రీ సాయి
పవలు రేయి సంధ్య ప్రభలు సాయి
తిన్నదనము సాయి తీరుతెన్నులు సాయి
రూపు రూపు సాయి రుజువు సాయి

సాయిలేనిది కానిదీ జగతిలేదు
సాయిరానట్టి పోనట్టి చోటులేదు
సాయి ఈయని పొందని సొత్తులేదు
సాయి దృశ్యంబ దృశ్యంబు సత్యసాయి"

- కర్రి క్రిష్ణమ్మ వీరఘట్టము

Medical Entrance Classes జోరుగా సాగుతున్నాయి. చేతినిండా పని. క్షణం తీరిక లేదు. బుర్ర అంతా Botany Bit Questions తో నిండిపోయింది. ఈ పనికి ఆటంకంగా ఎవరు వచ్చినా, పలకరించినా చాలా చిరాకుగా విసుగ్గా కోపంగా ఉండేది. ప్రతి సంవత్సరం ఆ నెల ఇంట్లో Curfew ఉన్నట్లు ఉండేది. పలకరిస్తే కోప్పడతాడేమోనని పిల్లలు బిక్కుబిక్కుమంటుండేవారు. ఈలోగా Final Interview Hyderabad RITZ Hotel లో అని నాకు Intimation వచ్చింది. ఊపిరితిత్తుల నిండా ఊపిరి పీల్చుకోవడానికి కూడా తీరిక లేదు. కడుపు నిండా అన్నం తినడానికి time లేదు. ఆ సీజను అలాంటిది. తిట్టుకుంటూ Hyderabad ప్రయాణమయ్యాను. రైల్లో కొందరు నా వయసువారు ఉద్యోగస్తులు ఇదే ఇంటర్వ్యూకి వెళ్తున్నారని తెలిసింది. నేను ఎవర్నీ ఎలా Prepare అయ్యారని కానీ ఏం చదివారని కాని, ఏమి పొరపాటున కూడా అడగలేదు. కారణమేంటను కున్నారు. నేనేమి చదవలేదు. తెలుసుకొని ఏం ప్రయోజనం అనుకున్నాను. Prepare కాలేదు. కాని ఒకరిద్దరు ధైర్యంగా నన్ను అడిగారు. 'ఏమి Prepare కాకుండా మీరు Interview కు ఎందుకువెళ్తున్నారు?.' అని, నేను ఉన్నమాట చెప్పేను. 'Sir! మా అక్కయ్య వాళ్ళు తార్నాకలో ఇల్లు కట్టుకున్నారు. నేను గృహప్రవేశానికి వెళ్ళలేకపోయాను. ఈ వంకతో వెళ్తున్నాను. నాకు వచ్చిన నష్టం ఏం లేదు'. మరునాడు Neat గా తయారయ్యాను. First Class Dark Blue సూటువేసుకుని Tip Top గా Interview కు వెళ్ళేను. అప్పటికే అక్కడికి చాలామంది చేరి ఉన్నారు. ఎవరెవర్ని ఏమేమి అడిగారో తెలును కుంటున్నారు. ఆ సంవత్సరం భారత - రష్యా మైత్రి ఒప్పందం జరిగింది. దీనిపై ప్రశ్నలడిగినారట. అలీన దేశమైన భారత్‌కు ఇది సరియైనదేనా అని అడిగారట. ''ఆర్యభట్ట' అంతరిక్ష ప్రయోగం భారత్ చేసింది. బీదదేశమైన భారత్‌కు ఇది సమంజసమా? అని కొందరిని ప్రశ్నించి నారట. అవి ఇందిరాగాంధీ ఎమర్జన్సీ విధించిన రోజులు. ఇది ప్రజాస్వామ్య విరుద్ధంకాదా! అని అడిగినారట. నాకు గుండెదడ అప్పుడు ప్రారంభమయింది. 'స్వామీ! నాకు ఇలాంటి ప్రశ్నలు ఎదురవకుండా చూడు. ఆ దేశం రాజధాని ఏమిటి ఈ దేశం రాజధాని ఏదిలాంటి తిక్క ప్రశ్నలు రాకుండా చూడు,ఎత్తైనది ఏది? చాలా పొట్టిది ఏది? ఇలాంటి పిచ్చి ప్రశ్నలు రాకుండా కాపాడు. నాకు, నా వృత్తికి మర్యాదదక్కేటట్టు చెయ్యి. అమెరికావద్దు.

బెజవాడ వద్దు. పరువు కాపాడు, నాకు అదే పదివేలు! అంటూ ప్రార్థించుకున్నాను.

ఈలోగా నన్ను పిలిచారు. మంచిధైర్యంతో ఠీవిగా నడుచుకుంటూ వెళ్ళి Hall లో నాకోసం వేసిన కుర్చీపైన కూర్చున్నాను. పన్నెండుమంది Interview చేశారు. ఎంతో ఉత్సాహభరితంగా సాగిన ఆ Interview ప్రశ్నలు నాచెవిలో ఈనాటికీ రింగుమంటున్నాయి. అవి అందరికీ ఉపకరిస్తాయి. వాటిని వివరిస్తాను. ఒకరి తరువాత ఒకరు నన్ను అడిగిన ప్రశ్నలవి. మొట్టమొదట మీకు తప్పక చెప్పాలి. నన్ను అడిగిన ప్రశ్నలన్ని సత్యసాయి భగవానుని సందేశంపైనే ఆధారపడినవి. భక్తులకు ఆనందంగా ఉంటుందని వ్రాస్తున్నాను. ఇది అనూహ్యం. ఇదంతా సాయిలీల అనండీ, సాయిసంకల్పం అనండీ, నా ప్రయోజకత్వం మాత్రం ముమ్మాటికీ కానేకాదు. Interview Board లోని పెద్దాయన వేసిన ప్రశ్న ఇది. 'మీకు సమాధానం తెలిస్తే చెప్పండి. లేకపోతే ఫరవాలేదు. మిమ్మల్ని అమెరికాలో ఈ ప్రశ్నవేస్తే ఏం చెప్తారో అని అడుగుతున్నాం. భారతదేశంలో జనాభా ఎంతఉందో దేవుళ్ళు అంతమంది ఉన్నారు. ఇంత మంది దేవుళ్ళు వింతగా ఉంది అని వారంటే మీ సమాధానం ఏమిటి? నాకు వెంటనే తట్టిన సమాధానం చెప్పేను. 'దేవుళ్ళు అనేకమని మీరు అనుకున్నా దైవత్వమొక్కటే. పూల జాతులు వేరు, జన్మమొక్కటే. దర్శనంబులు వేరు దైవమొక్కటే. రూప నామములు వేరు నారాయణుడొక్కడే. సాయి సాహిత్యం లోని ఈ మాటలు చెప్పేను. వేరొకరు ప్రశ్నవేశారు. 'దైవత్వ మొక్కటే. అయితే ఒక దేవుడు చాలా పొడుగు (రాముడు). వేరొకరు చాలా పొట్టి (వినాయకుడు). ఎందువల్ల?'. మన స్వామి చెప్పిన ఉదాహరణ, హైద్రాబాదు 'శివం' ప్రారంభోత్సవంలో గావించిన ఉపన్యాసంలోని ఉదాహరణ చెప్పేను. 'ఒక Medical Shop యజమానికి, ఒక Hotel Proprietor కు ఒకేసారి తలనొప్పి వచ్చింది. Medical Shop యజమాని Coffee Hotel కు Cup Coffee కి వెళ్ళినాడు. Coffee Hotel Proprietor Medical Shop కు తలనొప్పి Tablet కోసం వెళ్ళేడు. ఒకరికి Coffee పైన, వేరొకరికి Tablet పైన నమ్మకం. ఎవరి విశ్వాసంవారిది. అంతేకాదు. సనాతన ధర్మం ఆస్తికులకు పూర్తి స్వాతంత్ర్యాన్నిచ్చింది. ఉదాహరణకు బట్టలు కుట్టించుకోవాలనుకోండి. ఏం చేస్తారు? ముందుగా Tailor దగ్గరకు వెళ్ళి మీ Measurements ఇస్తారు కదా! మీ కొలతల ప్రకారం బట్టలు ఆయన కుట్టి ఇస్తాడు. ఎవరి Size వారిది. అంతా ఒకటే కాదే! అలాగే ఎవరి స్ఫూర్తి వారిది. స్ఫూర్తి ప్రకారం 'మూర్తి' ఆధారపడుతుంది. అందర్ని ఒకే ఆదితో కుట్టిన వస్త్రాలు ధరించమంటే సాధ్యపడుతుందా?' అన్నాను. మరొకరు ప్రశ్న వేశారు. 'దైవత్వం ఒకటే గదా! మరి ఇన్ని పూజావిధానాలు ఎందుకు? లలితా సహస్రనామాలని, విష్ణు సహస్రనామాలని ఇన్ని రకాలా?'. దీనికి జవాబులు సాయి సూక్తి ఆధారంగా చెప్పాను. "ఎన్ని రకములున్నా దివ్యత్వము యొక్క వర్ణనలే, వివరణలే. తెలుగులో 'నీరు' అన్నా, ఆంగ్లంలో 'వాటర్' అన్నా, తమిళంలో 'తణ్ణి' అన్నా, హిందీలో 'పానీ' అన్నా ఒకటే గదా! అదే రీతిగా సర్వవ్యాపక, సర్వశక్తి సంపన్న, సర్వజ్ఞ ఈశ్వరత్వమును నిత్యశుద్ధ బుద్ధ ముక్త దైవత్వమును ఎన్ని రకములుగా వర్ణించినా, వివరించినా మూలతత్త్వమొక్కటే' అని చెప్పాను. మరొక

## మూడుమృగములు

"ప్రేమలేని జీవితం జీవితముకానేరదు. ప్రేమలేనటువంటి హృదయము హృదయము కానేరదు. ప్రేమ గలవాడే మానవుడు. అయితే ఇట్టి ప్రేమను ప్రవేశింప జేయకుండా మూడు మృగములు సింహద్వారమునందు అడ్డుగా నిలిచియున్నవి. 1. క్రోధము అనే కుక్క దీనిని అడ్డగిస్తున్నది. 2. అభిమానముఅనే పంది అటకాయిస్తున్నది. 3. అహంకాము అనే దున్నపోతు అడ్డముగా పరుండి యున్నది. వీటిని సంహరించి విశాలమైన ప్రేమతత్త్వంలో మనం ప్రవేశించాలి. అహంకారము మృగలక్షణం. అహంకారముండినంతవరకు వాడు మానవుడు కానేరడు. క్రోధము మహా ప్రమాదకరమైనది. మానవత్వాన్ని కూడా సంహరించడానికి ప్రయత్నిస్తుంది. మనిషికి మనిషికి మధ్యనున్న సంబంధబాంధవ్యాన్ని దూరంగావిస్తుంది. ఈ క్రోధమే పాపమునకు ధూపముగా ఏర్పడుతున్నది. క్రోధం వల్లనే మానవుడు గౌరవ మర్యాదలను కూడా కోల్పోతున్నాడు. అభిమానం చాలా సంకుచితమైనది. ఐతే ఆత్మాభిమానం వుండాలిగాని, దేహాభిమానం మాత్రం వుండకూడదు. దేహాభిమానాన్ని త్యజించడమే త్యాగం. ఆత్మాభిమానాన్ని అభివృద్ధి పరచుకోవడమే యోగం".

\- బాబా

సభ్యులు మరో ప్రశ్న వేశారు. 'మీ దేశంలో కేశములను కోరే దేవుడు ఉన్నారటగదా? ఆశ్చర్యంగా లేదా! అని కొందరు భావిస్తే మీ సమాధానమేమిటి?'. నాకు వెంటనే వెంకటేశ్వర స్వామి గురించి అడుగుతున్నట్లు అర్థమయింది. ఇంకేం! మన స్వామి చాలా చెప్పేరు. కేశాలు నలుపు. నలుపు తమో గుణం. తలనీలాలు సమర్పించడంచేత తమోగుణాలని అర్పించినట్లవుతుంది. అందచందాలకు కారణమైన ఆ కేశాలని అర్పించినారంటే అభిమానమును త్యజించినట్లవుతుంది. ఏడుకొండలవాడి దర్శనం ఎప్పుడవుతుంది? ఆరు కొండలైన అరిషడ్వర్గాలను దాటాక ఏడోకొండపై వెంకటరమణుని దర్శనమవుతుంది. మొదటి కొండ మూలాధారమైతే ఏడవకొండ సహస్రారమైంది. ఏడు కొండలు దూరానికి సర్పంలాగా రాత్రివేళ విద్యుద్దీపాలలో క్రింద నుంచి కనబడతాయి. ఇదే కుండలిని ఈ అంతరార్థాన్ని గ్రహించాలి". మరొక సభ్యులు భలే ప్రశ్న వేశారు. 'భారతదేశంలోనే ఇంత ఆధ్యాత్మికత ఎందు కుంది? పశ్చిమ దేశాలలో అవతారాలు రాలేదేమి?' భగవాన్ ఏనాడో అన్నమాటలు జ్ఞాపకమొచ్చినవి చెప్పేను. 'భారత దేశం పరార్థాన్ని ప్రధానంగా భావించింది. పశ్చిమ దేశాలు పదార్థాన్ని ముఖ్యంగా భావించినవి. భారతదేశం 'పరం' లక్ష్యంగా కలిగిఉంటే పశ్చిమదేశాలు 'ఇహం'ను ప్రధానమను కున్నాయి. డాక్టరు ఎక్కడ ఉంటారు? రోగులు ఎక్కడుంటారో అక్కడే కదా! అట్లే నిర్మల నిస్వార్థపరులైన యోగులు, త్యాగులు జన్మించిన యోగభూమి ఇది. అవతారముల కన్నతల్లి ఈ దివ్యభూమి. కోలారులో బంగారం లభిస్తుంది. భగవదన్వేషణ మోక్షకాంక్ష కలిగిన కర్మభూమి ఇది. అందుచేత భారతదేశంలో ఆధ్యాత్మికం అధికం' అని సమాధాన మిచ్చాను. అయితే అందులో ఒకరు ఇబ్బందికర మైన ప్రశ్నవేశారు. స్వామిదయవల్ల బాగానే బయటపడ్డాను. ఏమి అడిగారనుకున్నారు. 'ప్రస్తుతం అవతారమూర్తి ఎవరు?' నాకు అవతారంపైన నమ్మకం లేదు. దైవం అవతారరూపంలో ఉన్నాడంటారా?'దానికి ఈ ప్రకారం బదులిచ్చాను. పానకంలో పుడకలాగా మరొక ఆయన తన సందేహాన్ని కూడా జోడించాడు. 'అవతారమూర్తి మహేష్ యోగి అంటారా?'. వారు బహుశా వారి అనుచరులై యుండవచ్చు. ఔనందామా అంటే నాకు కాదాయె! కాదందామా అంటే వారికి ఔనేమో! ఏం చేసేది? స్వామి దయతో ఎవర్నీ కించపరచకుండా సమాధానం చెప్పేను. 'ప్రస్తుతం అవతారమూర్తి సద్గురు రూపంలో ఉన్నారు. మీకు నమ్మకంలేని పక్షంలో భగవంతుడే గురువుగా మీ హృదయపీఠంలో నిలచి నడిపిస్తారు. ఇంద్రియములే గుర్రాలు. బంధములే కళ్ళెములు. శరీరమే రథము. రథసారథి పార్థసారథి సనాతన సారథియైన భగవంతుడే మీకు గురువుగా నిలుస్తాడు. మహేష్ యోగి గురువా అని మీరు ప్రశ్నించారు. నా ఉద్దేశంలో Need not necessarily so 'ఆ తరువాత ప్రశ్న 'భారత దేశంలో ఎందుచేత విడాకులు (Divorces) లేవు? పెద్దలు కుదిర్చిన వివాహాలు (Arranged marriages) ఎందుకుంటున్నవి?'. దానికి నా జవాబు 'Sir! సనాతన ధర్మంలో వివాహం ఒక దశ మాత్రమే. ఆశ్రమ ధర్మాలలో గార్హస్త్యం ఒక దశ. ఇహము అనే ఒడ్డున ఉండి పరము అను ఒడ్డునకు చేర్చే నావ గార్హస్త్యం. ధర్మాచరణకు, కర్మాచరణకు ఉపకరణం గార్హస్త్యం. ప్రారంభంలో బ్రహ్మచర్యమునకుకాని అంత్యమున సన్యాసమునకు కాని ఆధారము గార్హస్త్యము. ఇది ఒక వంతెన వంటిది. వివాహం అంత్యం కాదు. It is a means to an end Not amend by itself" ఒక సభ్యుడు వేసిన ప్రశ్న 'భారతదేశంలో గోమాంసం ఎందువల్ల ప్రజామోదం పొందలేదు?'. బాబా ఒక సందర్భంలో చెప్పినది జ్ఞాపకమొచ్చి చెప్పేను. 'భారతదేశంలో మాతృస్థానాన్ని కలిగినవి కొన్ని ఉన్నవి. జన్మనిచ్చిన దేహమాత, క్షీరాన్నందించి పుష్టిని సంతుష్టిని చేకూర్చే గోమాత, నిధినిక్షేపాదులను ధనధాన్యాదులనందించే భూమాత, సంస్కృతిని సంప్రదాయమును ఆచారములను కట్టుబాట్ల నందించిన దేశమాత, జీవిత ధ్యేయాన్ని హెచ్చరించి మార్గాన్ని ఉచ్చరించి మోక్షమును ప్రబోధించి ఆనందాన్ని, జన్మరాహిత్యాన్ని ప్రసాదించే వేదమాత మాతృస్థానమున నిలచి పూజార్హులైనారు. ఆ కారణంగా ఈ దేశంలో మాంసం ప్రజామోదాన్ని పొందలేదు'. ఇలా సాగిన ఈ ప్రశ్నోత్తర వాహినిలో ఏ పొంతన సంబంధం లేకుండా ఒకరు వేసిన ప్రశ్న ఇది. 'ఇజ్రాయిలు ప్రధాని ఎవరు'. ఇప్పటిదాకా వేసిన ప్రశ్నలకు దీనికి ఏమి సంబంధం లేదు. 'స్వామీ! ఇప్పటిదాకా నేనే వీరిచే ప్రశ్నలు వేయించాను. ఇప్పుడు వారిష్టమొచ్చింది అడిగారు. నీకు చేతనైతే చెప్పుచూద్దాం అన్నట్లు చేశావా స్వామీ! నాకు గర్వంవస్తుందనుకున్నావా? నీవే రక్షించాలి' అని అనుకున్నాను. ఆ రోజుల్లో గోల్డామియరే ఒకావిడ ప్రధానిగా ఉండేది. ఆవిడ ప్రభుత్వం పడిపోయింది. ఇది నాకు జ్ఞాపకమొచ్చింది. 'Sir! మొన్నటిదాకా ఒకామె ఉండేది. ప్రస్తుతం ఆమె స్థానంలో ఒకాయన ఉన్నారు.

వారి పేరు నాకు జ్ఞాపకంలేదు' అన్నాను. 'Well! Fifty percent answered. You may go' అన్నారు. స్కూలు వదిలిన తరువాత పుస్తకాల సంచీని బుజాన వేసుకుని పరిగెత్తే బడిపిల్లల్లా నేను Interview నించి బయటపడ్డాను. గుంటూరు చేరేను. Result ఏమైందో కనుక్కోమని తెలిసిన పెద్దలను విచారించమని నన్ను కొందరు ప్రోత్సహించారు. నేను నిరాకరించాను. నేను ఏం ప్రయత్నం చేశాను? నాకొచ్చే నష్టం ఏముంది కనక? ఇంకేం Result రానే వచ్చింది. News Papers లో Publish చేశారు. ఎంపికైన వారిలో మొదటిపేరు నాదేఅయింది. సంతోషం అనుకున్నాను. కొంతకాలం తరువాత Visakhapatnam లో మాకు Training అన్నారు. మా కాలేజి Anniversary అవటంచేత Principal అనుమతి నిరాకరించటంతో నేను Rotary వారికి రాలేనని టెలిగ్రాం పంపేను. వచ్చితీరాలని వారు రాశారు. ఏం చెయ్యను? కాలేజి Anniversary కి అన్ని ఏర్పాట్లు పూర్తి అయినవి. ఆ రోజుల్లో జిల్లాకలెక్టరు చంద్రయ్య I A S గారిని ఆహ్వానించారు. నమ్మలేనిది ఏం జరిగిందో తెలుసా? ఆఖరి క్షణంలో Anniversary Postpone అయింది. నూరుసంవత్సరాల కాలేజి చరిత్రలో ఇదే ప్రథమం Postpone కావటం. ఇది బాబా వజ్ర సంకల్పమంటే Training కు వెళ్ళాను. సన్నాహాలు పూర్తి చేసుకున్నాను. అమెరికా వెళ్ళేను. గ్రూపులో శాకాహారిని నేనొక్కడినే. నేను మాత్రమే మాష్టర్ని. ఇతరులు ఇంజనీర్లు, డాక్టర్లు. కాని బాబాదయవల్ల నా పాత్ర ఈ యాత్రలో ప్రముఖమైనదని ఎల్లరు అంగీకరించిన సత్యమే. T.V. లో Interview చెయ్యటం, పాత్రికేయులు Interview చెయ్యటం సంస్థలలో ప్రసంగించడం నా దినచర్య అయి పోయింది. అయితే ఒక తమాషా జరిగింది. ఒకరోజు New York వెళ్తూ Car లో బాబా భజనపాడుతున్నాను. Car లోని వారికి అర్థం కావటంలేదు. 'ఏం చేస్తున్నారు?' అని అడిగారు. 'Sir! భారతీయ ఆధ్యాత్మికత సంకీర్తన చేస్తున్నాను. వీటికి ఇంగ్లీషులో అనువాదాలు కావలిస్తే చెప్తాను' అన్నాను. 'అయితే మా ఇంట్లో ఈ రోజు ఆ కార్యక్రమం పెట్టుకుందామా?' అన్నారు. 'తప్పక. కాని మీ స్నేహితులందరిని సకుటుంబంగా ఆహ్వానించండి' అన్నాను. ఇంక చూడండి ప్రతిరోజు సాయంకాలం జనాలు Tape Recorder తో రెడీగా వచ్చేవారు. స్వామి విభూతి ప్రసాదాలు, Photos పంచేవాడిని. 'భారతీయ ఆధ్యాత్మికత ఎంతో తెలియజేశారు. మీదేశం చూడాలని ఉంది'' అన్నారు అందరూ ముక్తకంఠంతో. గుంటూరులోని ప్రముఖ శస్త్రవైద్యులు డా॥ చిగురుపాటి నాగేశ్వరరావు గారు Rotary Club కు అధ్యక్షులు ఆనాడు. శాంతా . కాలేజి ప్రిన్సిపాలు శ్రీమన్నారాయణగారు కార్యదర్శిగా ఉండేవారు. తిరిగి వచ్చాక Rotary సంస్థలన్నీ తిరిగి అనుభవాలు పంచుకున్నవాడిని నేనొక్కడినే అయ్యాను. Rotary సభ్యులందరు ఆనాటి నా యాత్రను ఎరిగినవారే. అనితర సాధ్యమని, అపురూపమని కొనియాడినవారే. దీనికంతటికీ కారకులెవరు? దిగ్విజయం వెనుక అదృశ్య అభయవరద హస్తం ఎవరిది? భగవాన్ బాబావారే. సత్యం సత్యస్య సత్యం. పైకి మాటామంతీ లేకపోయినా చిరునవ్వులకు నోచుకోకపోయినా, పాదనమస్కారం గగనకుసుమమైనా, అంతరంగ సాయి, ఆనందసాయి, కళ్యాణసాయి తన లీలనందిస్తునే ఉంటారు.

బాబా 75వ జన్మదినం జగత్కళ్యాణకారకం. జన్మ దినోత్సవం జగతికి బ్రహ్మోత్సవం. శాంతికారకం, ధర్మోద్ధరణం. ప్రేమదాయకం, స్వామి జన్మదినోత్సవం. వానిని తిలకించిన మన జీవితం చరితార్థకం, జన్మసార్థకం. ✛

## శుభవారము

వారంలో ఘనమైనది లక్ష్మీవారం
గురుపూజకు అనువైనది లక్ష్మీవారం
శ్రీ సత్య సాయీశుని తలచే వారం
శ్రీ మహా దేవుని కొలిచే శుభవారం. ॥ వా ॥

భక్త జనులు భక్తి విరియ ధ్యానించేవేళ
సుప్రభాత శుభగీతం నాంది పలుకువేళ
నగర సంకీర్తనలే వినిపించువేళ
శ్రీ సాయినామమే తలచే శుభవారం ॥ వా ॥

శ్రీ సాయి చిరునవ్వుతో నడిచేటి వేళ
పరవశులై పర్తీశుని ప్రార్థించు వేళ
హృదయేశుడు కరుణతో దరిజేరువేళ
జగదీశుని పాదములే పట్టే శుభవారం ॥ వా ॥

భక్తితోడ కీర్తనలు కీర్తించు వేళ
సత్యసాయి సత్యమై దీవించు వేళ
కర్పూరపు హారతే వెలిగించు వేళ
లోకేశుని రూపమే తిలకించే వారం। ॥ వా ॥

నరసమ్మ రామన్

# సైన్స్ - ఆధ్యాత్మికం

పరిశీలన ద్వారా, ప్రయోగాలద్వారా, భౌతిక ప్రపంచానికి, ప్రకృతి నియమాలకు, సమాజానికి సంబంధించిన యదార్థ విషయాలను క్రమపద్ధతిలో సేకరించి, విశ్లేషించి చూచేదే 'సైన్స్'. చేతనములలో, అచేతనములలో నిబిడీకృతమై, సర్వమునకూ మూలాధారమైఉన్న ఆత్మతత్వాన్ని శోధించేదే **'ఆధ్యాత్మికం'**. ఒకటి పదార్థ స్థాయికి చెందినదైతే ఇంకొకటి పరార్థ స్థాయికి చెందినది.

మేథోసంపత్తితో, ఇంద్రియాల సహాయంతో సముపార్జించే జ్ఞానమే 'సైన్స్'. ఇంద్రియాలకు, మనసుకు అతీతమైన ఆత్మశక్తితో, సర్వోత్కృష్టమైన సత్యాన్ని అనుభూతము గావించుటకు దోహదపడే ప్రజ్ఞానమే 'ఆధ్యాత్మికము'.

ఒకటి బాహ్య సాధన; రెండవది అంతరంగ సాధన. మానవుని లౌకిక జీవితాన్ని సుఖమయం చేయడం **'సైన్స్ లక్ష్యం'**. మానవుని పారలౌకిక జీవితానికి వెలుగుబాట వేయడమే **'ఆధ్యాత్మికత లక్ష్యం'**.

భారతీయ సంస్కృతి, ఆధ్యాత్మికతకు పెద్దపీట వేసిన సైన్స్‌ను విస్మరించలేదు. ఆయుర్వేదం, లలితకళలు, క్షాత్ర విద్య వేదంలోని అంతర్భాగాలే. ఈ విద్యలన్నీ ఆధ్యాత్మిక సూత్రాల పరిధిలోనే అభివృద్ధి గావించబడ్డాయి. కాగా పాశ్చాత్యుల ప్రభావం వలన కొన్ని మార్పులు సంభవించాయి. వాటికి విశేష ప్రాచుర్యంకూడా లభించింది.

పాశ్చాత్యులు ప్రాచీన భారతీయ గ్రంథాలలోని ఎన్నో సాంకేతిక విషయాలను గ్రహించి, వాటి ఆధారంగా సైన్స్‌ను అభివృద్ధి గావించారు. కానీ, ఆ విద్యలలో అంతర్వాహినిగా వున్న ఆధ్యాత్మిక సూత్రాన్ని అవగాహన చేసుకోలేక పోయారు. పర్యవసానంగా శరవేగంతో అభివృద్ధి చెందిన సైన్స్, ఆధ్యాత్మికత ఉనికినే నేడు ప్రశ్నిస్తున్నది. సంకుచిత మనస్కులైన కొందరు శాస్త్రవేత్తలు హేతువాదానికి చేయూత నిచ్చారు. వేదాలు వాదాలపాలయినాయి. విజ్ఞాన శాస్త్రపరంగా ఋజువైనదే యదార్థమని వారివాదన. సృష్టిని విశ్వసిస్తున్నారు కాని సృష్టికర్తను విశ్వసించడంలేదు. అతీంద్రియ శక్తుల ఉనికిపై శాస్త్రవేత్తల మధ్య ఏకాభిప్రాయం కుదరలేదు. అయితే 'విశ్వం విష్ణుమయం' అని గ్రహించిన శాస్త్రవేత్తలు కూడా లేకపోలేదు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అవతరణ విజ్ఞానశాస్త్రరంగంలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకువచ్చింది. శాస్త్రవేత్తలు తమ సిద్ధాంతాలను పునఃపరిశీలించవలసిన అగత్యం ఏర్పడింది.

కొద్ది సంవత్సరాల క్రితం, అమెరికాలో అతీంద్రియ శక్తులపై విస్తృతంగా పరిశోధనలు చేసిన కార్లిస్ ఒసిస్, యర్లండల్ హెరాల్డ్సన్ అను శాస్త్రవేత్తలు స్వామితో పలుమార్లు సమావేశమై, చివరకు, స్వామి చర్యలు భౌతిక స్థాయికి అతీతమైనవని, పరమాద్భుతమైనవని, అవి ఆధ్యాత్మికత ఉనికిని సైన్స్ కూడా అంగీకరించవలసిన పరిస్థితులు కల్పిస్తున్నాయని పలికారు.

**దివి చతుర్వేది**

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో జియాలజి విభాగానికి అధిపతియైన డా॥ వై.జె. రావు ఒక పర్యాయం స్వామిని సందర్శించారు. అప్పుడు జరిగిన ఒక అద్భుత సంఘటనకు (Sai Baba : Man of Miracles - Howard Murphet) వారు ప్రత్యక్ష సాక్షి. ఒకరోజు పుట్టపర్తిలో స్వామి, డా॥ రావుతో నడచివెళుతూ దారిలోపడివున్న ఒక గ్రానైట్ శకలాన్ని తీసి డా॥ రావుకు అందించి,

ఆ రాయిలో ఏమున్నదో చెప్పమన్నారు. ఆ జియాలజిస్ట్, ఆ రాతిలోగల ఖనిజాలను పేర్కొన్నాడు.

స్వామి : అవి కాదు, ఇంకా లోతుగా ఆలోచించు.

డా॥ రావు : మంచిది. అణువులు, పరమాణువులు, ఎలక్ట్రాన్స్, ప్రోటాన్స్.

స్వామి : కాదు, కాదు. ఇంకా లోతుగా

డా॥ రావు : నాకు తెలియదు స్వామీ.

స్వామి, ఆ గ్రానైట్ శకలాన్ని తీసుకొని నోటి దగ్గర ఉంచుకొని 'ఉఫ్' అన్నారు. డా॥ రావు తదేక దృష్టితో

ఆ రాతి ముక్కవైపు చూస్తూనే ఉన్నారు. కాని, దానిని డా॥ రావుకు, స్వామి తిరిగి ఇచ్చినపుడు అది అనూహ్యమైన రీతిలో పరివర్తన చెందింది. ఆ గ్రానైట్ శకలం మురళీకృష్ణుని ప్రతిమగా రూపాంతరం చెందింది.

స్వామి : చూచావా! అణువులకు, పరమాణువులకు అతీతంగా భగవంతుడు ఆ రాయిలో ఉన్నాడు. అంతేకాదు, భగవంతుడు మాధుర్యానికి, ఆహ్లాదానికి సంకేతం. ఆ ప్రతిమకాలును కొంచెం విరిచి, రుచి చూడు.

డా॥ రావుకు రూపాంతరం చెందిన ఆ గ్రానైట్ ప్రతిమకాలును త్రుంచడానికి ఏ మాత్రం శ్రమ అనిపించలేదు. స్వామి సూచించిన విధంగా నోటిలో ఉంచుకోగానే అతను గ్రహించాడు. అది కలకండయని. ఆ గ్రానైట్ శకలం కలకండ ప్రతిమగా మారిపోయింది.

'మాటలకందని, ఆధునిక విజ్ఞానశాస్త్రానికి అతీతమైన, యదార్థానికి, నేటి హేతువాదుల భావనకు అందని పాఠాన్ని నేను నేర్చుకున్నాను' డా॥ రావు అనుభూతి అది.

స్వామి తరచుగా చెబుతూ ఉంటారు.

"విశ్వమందు విభుడు వెలుగొందుచుండును
విభునియందు వెలుగు విశ్వమెపుడు
విభుడు లేకయున్న విశ్వంబు లేదయా
విశ్వవిభుల మైత్రి శాశ్వతంబు".

ఒక మహాశివరాత్రి పర్వదినంనాడు స్వామి హిస్లాప్ దంపతులను, కస్తూరిని, కొంతమంది విద్యార్థులను తీసుకొని బందిపూరు అడవులకు వెళ్ళారు. కార్లను రోడ్డు ప్రక్కన నిలిపి నదీతీరం వెంబడి నడక సాగించారు. దారిలో ఒక పొదవద్ద స్వామి ఆగి రెండు రెమ్మలను విరిచారు. వాటిని 'సిలువ' ఆకారంలో అమర్చి, హిస్లాప్ వంక తిరిగి, "ఇదేమిటి? హిస్లాప్'. అన్నారు. 'సిలువ, స్వామీ' హిస్లాప్ బదులిచ్చాడు. తదుపరి స్వామి, ఆ రెండు చిన్నరెమ్మలను తన అరచేతిలో ఉంచుకొని, రెండవ చేతిలో మూసివేసి 'ఉఫ్' అని చేతిపై ఊదారు. చేతులను తెరచి చూపారు. అక్కడ సిలువ వేయబడిన జీసస్ వెండి ప్రతిమ కనిపించింది. సిలువ కఱ్ఱతో చేయబడింది.

రెండువేల సంవత్సరాల క్రితం జీసస్‌ను ఏ కఱ్ఱపై సిలువ వేశారో ఆ కఱ్ఱనే ఉపయోగించి, ఈ ప్రతిరూపం సృజింపబడినదని స్వామి చెప్పారు.

నిపుణులు కఱ్ఱవయసును నిర్ణయించగలరేమోకాని, రెండువేల సంవత్సరాల క్రితం భూమిలో కలగలిసిపోయి ఆ కఱ్ఱ యొక్క ధాతువులను ఏ విధంగా కనుగొని, ఏర్చికూర్చి సిలువగా చేశారో వివరణ ఇవ్వగలరా? అది సైన్స్ పరిధికి అందని పరమాద్భుతమైన లీలావిశేషంకాక మరేమిటి? కొన్ని సంవత్సరాల క్రితం స్వామి అంటే ఏ మాత్రమూ విశ్వాసములేని ఒక అమెరికావాసి భార్య ప్రోద్బలంతో స్వామి దర్శనానికి ఏతెంచాడు. స్వామిని పరీక్షించేందుకే వెళుతున్నానని భార్యతో చెప్పాడు. స్వామి సృజించిన ఉంగరాలను, లాకెట్లను చూచి అతను ఏమాత్రం ప్రభావితుడు కాలేదు. సజీవమైనదానిని సృజించగలడమే దివ్యత్వానికి ప్రతీక అని అతను భావించి ఉండవచ్చు. అతను స్వామిని ఒక జీవిని సృజించమని కోరాడు. స్వామి అతనినే అడిగాడు, "ఏం సృజించమంటావు?". "కోతి" అతను సమాధానమిచ్చాడు. స్వామి ఒక కోతిని, దానికి ఆహారంగా అరటిపండును కూడా సృజించారు. తరువాత దానిని లయం కూడా చేశారు. శూన్యం నుండి దేనినీ సృజించలేము. ఒక పదార్థాన్ని ఇంకొక పదార్థంగా మార్చవచ్చు. ఒక శక్తిని ఇంకొక శక్తిగా మార్చవచ్చు అని సైన్స్ చెబుతున్నది. ఇది సైన్స్ యొక్క పరిమితి. కాని, ఆధ్యాత్మిక రంగంలో అసాధ్యమైనది ఏదీలేదు.

## టానిక్కులు

**"ఆరోగ్యమునకు ఔషధములు ప్రధానముకాదు. మంచి మాటలు, మంచి నడతలు, మంచి చూపులు, మంచి తలపులు, మంచి వినికిడి అవసరము. ఇవే దేహమునకు అమృతత్వాన్ని అందించే టానిక్కులు. దుర్భావములు, దుశ్చింతలు, దురాలోచనలు హృదయమున నింపుకొని, ఎన్ని విలువైన ఔషధములను సేవించినప్పటికీ, రోగ నివారణకాదు. ఏ ఔషధము లేకపోయినప్పటికీ, ఏ డాక్టర్లు మనకు చిక్కకపోయినప్పటికీ, సద్గుణములను కలిగి ఉన్నామంటే, సదాచారములను ఆచరించినామంటే, సచ్చింతనలను సంకల్పించుకున్నామంటే - అవే మనకు సరియైన ఆరోగ్యమును అందిస్తాయి, ఆత్మానందమును చేకూరుస్తాయి, -ఆత్మసందర్శనమును కూడా కలిగిస్తాయి".**

**- బాబా**

1976వ సంవత్సరంలో బ్లిట్జ్ పత్రికా సంపాదకుడైన ఆర్.కె. కరంజియా స్వామిని పరీక్షించదలచి పుట్టపర్తికి వచ్చాడు. అతని వైఖరి నిష్పక్షపాతం. యధార్థాన్ని హృదయ పూర్వకంగా అంగీకరించే విశాలభావాలుకల వ్యక్తి. అందుకే కాబోలు స్వామి అతనికి సుదీర్ఘమైన ఇంటర్వ్యూను అనుగ్రహించారు. అతని సందేహాలను మటుమాయం చేశారు.

'నా సంకల్పంతో నేను ఏదైనా సృజించగలను. ఇది అవతార పురుషునిగా మాత్రమే సాధ్యమయిన విశ్వవ్యాపకమైన సృజనశక్తి. భగవంతుని అపరిమితమైన శక్తికి మహిమలు సహజలక్షణాలు. ప్రజలపట్ల గల ప్రేమను నిరూపణ చేసే పరిచయ పత్రాలు నా మహిమలు' అన్నారు స్వామి. ఈ సందర్భంలో స్వామి సైన్స్ యొక్క పరిమితులను తెలియజేశారు. 'సైన్స్ మానవేంద్రియాలను దాటిపోలేదు. ఆధ్యాత్మికత ఇంద్రియాలకతీతమైనది. దీనిని అర్థం చేసుకోవాలంటే ఆధ్యాత్మిక మార్గంలోనే పోవాలికాని సైన్స్ ఉపకరించదు. ఈ అనంత విశ్వాన్ని అణుమాత్రం కూడా సైన్స్ అవగతం చేసుకోలేదు. అదృశ్యమైన చైతన్యం గురించిన సత్యాలేవీ దానికి తెలియవు. క్షణక్షణానికి మారుతూ వుండటం బట్టి శాశ్వత సత్యం తెలుసుకోవడం దానికి అసాధ్యమని చెప్పవచ్చు. కొంతకాలం క్రితం పరమాణువును ఛేదించలేమన్న శాస్త్రజ్ఞులు ఇప్పుడు దానిని ఛేదించగలిగారు. అయితే ఇప్పటికీ కూడా పరమాణువులో అంతర్గతంగా ఉన్న ప్రాణశక్తిని గురించి వారికి తెలియదు. సైన్స్ అణువణువును శోధించి, విషయసేకరణచేసిన మానవ శ్రేయస్సుకు తోడ్పడుతుందనడంలో సందేహం లేదు. అయితే రెండోవైపు' సైన్స్ చొరలేని అనంత సామ్రాజ్యాన్ని ఆధ్యాత్మికశక్తి పాలిస్తున్నది.



# ఆపద్బాంధవుడు సాయి

'కల్లోలిత సంఘమందు సత్యసాయి వ్యతిరేక వాయువులు వీచుతరి స్వామిపై నిశ్చలభక్తి కలిగి అడ్డంకులు, అపోహలనెల్లనెదిరించి స్థిరభక్తితో ది. 7-11-76 సం॥లో సాయి పద్మములయెడ అచంచల విశ్వాసముతో సేవా సమితి స్థాపించి, సేవా కార్యక్రమములలో 1980లో వంశధార వరద బాధితులకు ఆహార పొట్లాలు, బట్టలు, వంట పాత్రలు సేకరించి హెలీకాప్టర్ ద్వారా పంపిణీ చేయించినందుకో'

'1982వ సంవత్సరములో ఆముదాలవలస సహకార చక్కెర కర్మాగార మేనేజింగ్ డైరెక్టరు శ్రీ కె.యన్. స్వామి గారి మరియు సాయి భక్తులైన ఫ్యాక్టరీ సిబ్బంది సౌజన్యంతో డాక్టర్ పంచమూర్తి దంపతులు (హృద్రోగ నిపుణులచే) ఉచిత వైద్య శిబిరము నిర్వహించి 630 మందికి చికిత్స చేయించి మరియు అందు 11 మందికి Open Heart Surgery కై మద్రాసు పంపి శస్త్ర చికిత్సచేయించినందుకో".

'చినాలో సేవాకార్యక్రమములను సమీక్షించి జిల్లాలో అన్ని సమితులు తిరిగి స్వామి లీలా వైభవాలు తెల్పి భక్తుల హృదిలో నిశ్చల భక్తిని నెలకొల్పినందుకో" నా కుమారుని పెండ్లి ది. 16-2-97న నాచే చేయించుటకో మరియు ది. 26-5-97న కాశీ విశ్వేశ్వరుని శివలింగము మా గ్రామ మందలి శ్రీ కన్యకాపరమేశ్వరి కోవెలలో ప్రతిష్ఠచేయించుటకో'

ది. 28-1-97న యధావిధి విధులకు హాజరైన నేను నా పనిలో 45 అడుగుల ఎత్తున గల Pan Floor లో పనిచేయుచుండగా కాళ్ళక్రింద Asbestos సిమెంటు రేకు పగిలి అందుండి నేను జారిపోయి 'హా సాయి' అని చేతులెత్తిన నన్ను ప్రక్కన ఇనుప స్తంబాలకుగాని, కాంక్రీటు గట్టులకు గానీ తగులనీయక 15 అడుగుల లోతుగల్గి 43° C ఉష్ణోగ్రతగల ట్యాంకులో పడునట్లు చేసి నా శరీరంపై కాలిన బొబ్బగాని, రక్తబిందువు చిందుటగాని లేక ఈతరాని నన్ను ఒడ్డున వేసిరి. నిర్జీవుడనని భ్రమించిన అందరికి సజీవుడనని నిరూపించి నన్ను స్వామి రక్షించారు. అట్టి ఆపద్బాంధవుడు అనాథరక్షకుడు, నేను నడచి ఇంటికి వెళ్ళునట్లు చేసిన స్వామివారి పాదాలకు నిరంతరానందా శ్రువులతో అభిషేకిస్తూ సేవతోపాటు సాయి ఉద్యమంలో సమిధనౌతానని వాగ్దానం చేస్తున్నాను. ●

- **చేబ్రోలు సుబ్బారావు**, ఆముదాలవలస



# ఆధ్యాత్మిక జీవన సోపానాలు

యుగయుగములుగా ప్రపంచమునందెల్ల దేశము లోనే భారతదేశము ఒక అత్యున్నతమైన, ప్రత్యేకమైన, విశిష్టమైన, మహోన్నతమైన స్థానాన్ని అలంకరించుచూ వచ్చుచున్నది. అన్ని దేశములకూ గురుస్థానమునందుండి ఆధ్యాత్మిక జ్ఞానసంపత్తిని పంచి ఇచ్చుచూ మానవుడు తన జన్మను సార్థకత కావించుటకు తగిన మార్గములను నిర్ణయించి తెలియజేయుచునే యున్నది. మానవుడు ధర్మ మార్గమును విడచి అధర్మ మార్గాన ప్రవేశించి భగవంతునిచే తనకు ఈయబడిన 'మానవ జన్మ' అను సువర్ణావకాశాన్ని చేజార్చు కొనుచున్నప్పుడు భగవంతుడే స్వయముగా మానవాకారాన్ని ధరించి భూమిపై అవతరించి తిరిగి మానవుని ధర్మమార్గాన చరింపచేయుచుండుట కూడా మనకు విదితమే. శ్రీ కృష్ణ పరమాత్ముడు, శ్రీ రామచంద్ర ప్రభువు మున్నగు అవతారముల చరిత్రల ద్వారా భగవంతుడు మానవుని క్షేమము కొరకు శ్రేయస్సు కొరకు ఆనందముగా ఎట్టి కష్టములనైనా ఎదుర్కొనుట మనకు తెలిసిన విషయమే. వారు వారి అవతార కాలమునంతా మానవుని శ్రేయస్సు కొరకూ, అతని ఉద్ధరణ కొరకూ వెచ్చించి యుండుట కూడా మనకు గ్రాహ్యమే. మరల పుట్టపర్తినందు శ్రీ సత్యసాయిగా అవతరించి గత ఆరుదశాబ్దములుగా మానవోద్ధరణ మహాయజ్ఞాన్ని అవిరామంగా, అజరామరంగా, విజయ వంతముగా నడిపించుచున్నారు.

శ్రీ స్వామివారి అవతార కార్యక్రమమంతా రెండు ముఖ్యమైన ప్రధానమైన సూత్రముల ద్వారా మనము అవగాహన చేసుకొనుటకు ప్రయత్నించవచ్చు. అవి ఏవనగా 1) Sacrifice - అనగా త్యాగము. 2) Suffering - అనగా ఎట్టి ప్రాపంచిక, శారీరక కష్టాన్నయినా, బాధనైనా అవలీలగా అనుభవించి, భరించి ఏ మాత్రమూ చలించక, బెదరక, అదరక ప్రపంచానికి ఆనందాన్ని అందించుటకై దీక్షవహించి యుండుట. ఇంకా ఎన్నో అనేకానేక అద్భుతమైన, ఆశ్చర్య కరమైన, వర్ణనాతీతమైన సద్గుణంబుల రాశి అయినప్పటికీ ఈ ప్రత్యేకమైన రెండు గుణంబుల గురించి మనము తెలుసుకొనుట చాలా అవసరము. అనేకానేక సందర్భము లలో శ్రీ స్వామివారే ఈ గుణంబుల గురించి వివరించి యున్నారు.

ఒకానొక సమయమున శ్రీ స్వామివారు కాలేజీ ఉపాధ్యాయులను మాత్రమే ఆశీర్వదించి ప్రసంగించుటకై కాలేజీకి వచ్చియున్నారు. ఆ తరుణమున వారి వారి బాధ్యతల గురించీ, అధ్యాపక వృత్తి గురించి, ఎంతయో ఘనముగా తెలిపిన పిదప స్వామి ప్రతీ వ్యక్తీ తన వృత్తి ధర్మాన్ని ఎంత దీక్షగా నిర్వహించాలో కూడా తెలియజేసినారు. తాను నిర్వహించుచున్న ధర్మమే, వృత్తియే భగవంతుని పూజగా భావించి ప్రతీ వ్యక్తీ తన ధర్మాన్ని నిర్వర్తించాలి అని తెలిపిరి. అంతేకాక మానవుడు పరుల యొక్క ఆనందానికై వారివారి అభివృద్ధికై తన సర్వస్వాన్ని త్యాగం చేయడానికి కూడా సిద్ధంగా ఉండాలి. అప్పుడే జన్మ

డా॥ ఆర్. గంగాధరశాస్త్రి

సార్థకతనొందుతుందని తెలిపినారు. ఆ సందర్భమునందే శ్రీ స్వామివారు తాను ధరించిన కాషాయ అంగీని కొద్దిగా ముందుకు లాగి పట్టుకొని **'ఈ కాషాయ వస్త్రము యొక్క ప్రాధాన్యత మీకు తెలుసా?'** అని ప్రశ్నించినారు. ఎవ్వరూ బదులు పలుకుటకు సాహసించకపోగా వారే ఈ క్రింది విధముగా తెలియచేసిరి. కాషాయరంగు, రెండు ముఖ్యమైన గుణాలకు ప్రతీక. అవి 1. త్యాగము 2. కష్టపడటానికీ, దుఃఖాన్ని ఎదుర్కొనటానికి బాధలను సహించడానికీ కావలసిన శక్తిని కలిగియుండుట. శ్రీ స్వామివారు 'My Life is my Message" అని తెలుపు సత్యమునందు ఈ రెండు గుణములూ ప్రస్ఫుటముగా ప్రతిబింబించుచునే యున్నవి. చూడలేకపోవుట మన దోషము. స్వామి తనకంటూ ఏమీ కోరుకొనకయే సాధారణమైన జీవితాన్ని గడుపుచూ, భక్తుల ఆనందము కొరకు, వారి శ్రేయస్సుకై లోకకళ్యాణము నకై వారి కాయాన్ని, కాలాన్ని సర్వవేళ సర్వావస్థలయందూ ఖర్చుచేయుచుండుట మనము చూచుచున్న విషయమే. ఒక్క నిమిషము కూడా విశ్రాంతి లేకుండా, ఒక్కరోజు కూడా విరామమనునది ఎరుగక అహర్నిశలు లోకకళ్యాణమునకై సర్వశక్తులనూ త్యాగమొనరించుచున్న కలియుగ అవతారమూర్తి శ్రీ సత్యసాయి. స్వామివారు తన త్యాగ మార్గము ద్వారా ఇంకొక సత్యాన్ని కూడా మనకు తెలియ

చేయుచున్నారు. అది ఏమనగా మానవుడు ఏదయితే ప్రత్యేకముగా ఎంతో విలువయిన గుణమనీ, దానిని పెంపొందించుకొనుటకై ప్రత్యేకముగా శ్రమించాలని అనుకుంటాడో అట్టి 'త్యాగమనే' గుణము భగవంతునికి సహజసిద్ధము. వారు త్యాగమునకు ప్రతిబింబమే. త్యాగము చేయకుండా స్వామి అసలు ఏ పనియందూ ప్రవేశించలేరు. అట్టి విషయాన్ని మనము గ్రహించి కొంత వరకైనా త్యాగాన్ని అలవరచుకొని మన జీవితాలను సార్థక మొనరించుకొనుటకై ప్రయత్నించవలెను.

రెండవ ముఖ్యలక్షణము. ఎట్టి బాధలనైనా అనుభవించుటకు, ఎట్టి సమస్యలనైనా ఎదుర్కొనుటకు, తగిన శక్తిని కలిగియుండి ఆ శక్తి ద్వారా ఆధ్యాత్మిక అభివృద్ధికై శ్రమించుట, భగవాన్ బాబావారు తమ దివ్యోపన్యాసముల ద్వారా అనేకానేక సందర్భములలో ఒక ముఖ్యమైన వాగ్దానము చేయుచూ వచ్చినారు. అదేమనగా "ప్రశాంతి నిలయానికి వచ్చి స్వామిని దర్శించి మీ బాధలన్నీ ఇక్కడ నా వద్ద విడిచి పెట్టి ఇచ్చట నుండి శాంతిని, ఆనందాన్ని తీసుకొని వెళ్ళండి. మీ బాధలన్నింటినీ నేను భరిస్తానని" అని కూడా స్వామీవారు తెలిపియున్నారు. అనగా ఎదుటి బాధలను సహితము తాను సహించటానికీ, అనుభవించ టానికీ ప్రతీ మానవుడూ ఆధ్యాత్మికముగా ఎదగాలని భావము. సర్వవేళలయందూ, తనకు ఆనందమే కావాలనుకోవటము, సుఖమే కావాలనుకోవటము, తానే లాభపడాలని వాంఛించటమూ, తప్పక దుఃఖకారణాలు కాగలవు. 'జన్మదుఃఖం జరాదుఃఖం' అన్న సత్యాన్ని సర్వదా గుర్తుంచుకొని Self Confidence ను పెంచుకొని, త్యాగనిరతిని పెంచుకొని, ఎట్టి కష్టములనైనా ఎదుర్కొని, దుఃఖములను దిగమింగుకొని, బాధలను, భరించుటకు సిద్ధముగా ఉండుటయే ఆధ్యాత్మికానికి రాచమార్గము. ఇట్టి జ్ఞానమును పొందియున్నవారికి త్యాగము చేయుట కష్టములనెదుర్కొనే శక్తీ సహజసిద్ధములై అద్వితీయమైన ఆనందానికి రాచమార్గము నేర్పరచగలవు.

ఒకానొకరోజున శ్రీ స్వామివారు ఒక విధమైనట్టి ఆంతరంగిక చర్చా సందర్భమున వారి వద్ద చేరియున్న కొద్దిమంది ఉపాధ్యాయులనుద్దేశించి "ప్రపంచమునందలి వస్తువుల విలువలు ఏ కారణముచేత ఆకాశమునంటు చున్నవో చెప్పగలరా?" అని ప్రశ్నించిరి. అచ్చటచేరియున్న ప్రొఫెసర్లు ఆర్థిక పరిజ్ఞానమును ప్రదర్శించుచూ "Demand and Supply" సిద్ధాంతాన్ని గురించి వివరించి స్వామి వారి ప్రశ్నకు జవాబునీయ ప్రయత్నించిరి. స్వామివారు సంతుష్టులుకాక ఇంకేదో కారణము ఉండగలదా? అని తిరిగి ప్రశ్నించిరి. ఎవ్వరూ మాట్లాడక పోవుటచే స్వామివారు తామే ఈ క్రింది విధముగా వివరించిరి.

'మానవుడు తన విలువను మరచిపోయి బాహ్య ప్రపంచమునందలి వస్తువులకే వాటి వెంట పరుగులెత్తుచూ వాటి యందు ఆసక్తిని పెంచుకొని వ్యామోహము పెంచు కొని తానే వాటికి విలువను కలిగించుచూ తన విలువను పోగొట్టుకొనుచున్నాడు. వస్తువుల యందు నీ వ్యామోహము ఎంతగాఢముగా నుండునో, వాటి విలువ అంత అధికముగా నీ చేతనే ఏర్పరచబడుచున్నది. ఎప్పుడయితే నీవు వస్తువులయందు నీ వ్యామోహాన్ని త్రుంచేసుకుంటావో, పూర్తిగా విడిచిపెడతావో ఆ వస్తువుల విలువ నీ వరకూ శూన్యమై నీ విలువ ఎంతగానో పెరిగిపోవును. ఉదాహరణకు ఒక సన్యాసికి ఏ వస్తువూ ఏ విలువా కలిగియుండదు. ప్రపంచాన్ని త్యజించిన వానికి ప్రపంచము విలువా కలిగియుండకపోగా ఆ వ్యక్తికి ప్రపంచమున విలువ వర్ణించనంతగా ఎదిగిపోయి ఆ వ్యక్తి అందరిచే పూజింప బడును' అని స్వామి చెప్పారు. కనుక మానవుడు తన కోరికలను తగ్గించుకొని ఉన్నవాటితో సంతృప్తి చెంది, లేనివాటికై పరుగులు తీయక మనస్సునందలి శత్రువులను జయించి ఎంతేని సుఖసంతోషాలతో అద్భుతమైన ఆధ్యాత్మిక జ్ఞానాన్ని పొంది, తన జీవితమును సార్థకము కావించుకొనవచ్చును. భగవాన్ బాబావారు వారిదైన ప్రత్యేకమైన జీవన శైలి ద్వారా మనకు ఆధ్యాత్మిక జ్ఞానాన్ని అందించటానికి మనలను ఉద్ధరించటానికి సర్వదా సంసిద్ధులై తెలియచేయుచునే యున్నారు. "I am always ready to give. But you are not ready to take. What can I do?" అని పదేపదే స్వామి అంటూనేయుంటారు. మనము సిద్ధముగా యుండి వారి ప్రతీ చర్యద్వారా ప్రతీ కదలిక ద్వారా ప్రతీ కార్యక్రమము ద్వారా తెలుపబడుచున్న ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ఆరగించి జీర్ణించు కొని, మన దైనందిన జీవితాలలో కొంతవరకైనా ఆచరణలో పెట్టగలిగిన రోజుననే మన మానవజన్మకు ఒక అర్థమూ, పరమార్థమూ ఏర్పడ గలదు. స్వామివారి అనుగ్రహమున మనకందరకూ ఆ జ్ఞానము లభించగలదనీ వారి దయకు పాత్రులమై మన జన్మంబులను సార్థకమొనరించు కొనగలమని ఆశించెదముగాక'

ఓం శాంతిః శాంతిః శాంతిః





# సర్వాంతర్యామి శ్రీ సత్యసాయి



"విశ్వమంతయుతానెయై వెలయువాఁడు
సాయిలేనట్టి స్థానంబు జగతిలేదు
ఇందు నందున నెందైన - ఇతఁడెకలడు
ఇట్టి పర్తీశు గుర్తింప - ఎవరితరము?

"అంతట నిండియున్న పరమాత్ముఁడు - శ్రీకరసత్యసాయి;
విశ్రాంతియెరుంగడెన్నడును; సంతసమివ్వగనెల్లవారినె
అంతట తానెయైతనరి; ఆలన, పాలన చేయుండు; అ
త్యంతముభక్తులైనతలదాల్చును - వారల 'యోగక్షేమముల్'
"మత్తః పరతరం నాన్యత్కించిదస్తిధనంజయా!"

అని శ్రీ గీతాచార్యులు ప్రకటించినట్లుగా, ఈ చరాచర సృష్టి అంతా ప్రాకృతదృష్టితో చూస్తే భగవంతుని మాయోపాధియైన ప్రకృతిగా కనిపిస్తుంది. పారమార్థిక దృష్టితో సందర్శిస్తే సర్వాంతర్యామి అయిన సర్వేశ్వరుఁడు సాక్షాత్కరిస్తాడు.

అందుకోసమే స్వామి పదేపదే చెబుతుంటారు.

"కనులకగుపడు దృశ్యముల్ గాంచి మీరు
సత్యమిదియని ఎంచక సంబరమున
తెరనుదాగిన సత్యమును తెలిసికొనగ
విశ్రమింపక నాతోడ వెడలిరండు!"

'ఏకోహం బహుస్యాం' అన్న సంకల్పంతో పరమాత్ముఁడు తననుతానే ఈ సృష్టిలోని వివిధ ప్రకృతులు గల ఆకృతులుగా సృష్టించుకున్నాడు.

తానే ఆదిమధ్యాంతరహితుఁడు - నిరాకారంగా, తానే ఆదిమధ్యాంతసహితుఁడు - సాకారంగా, స్థూలదృష్టితో చూస్తే పరమాత్ముఁడు నిరాకారుఁడేగాని, సూక్ష్మదృష్టితో అవగతం చేసుకుంటే "సర్వరూపధారి" అని సుస్పష్టం అవుతుంది.

ఒకసారి స్వామి మాకు ప్రసాదించిన - 'ఇంటర్వ్యూలో', ఒక భక్తుడు స్వామి ఫోటోపై సంతకం చేసి ఇవ్వమని కోరటం జరిగింది. అప్పుడు స్వామి ఆ ఫోటోపై సంతకం చేస్తూ "నన్ను ఈ ఫోటోలో చూడు, తప్పు లేదు. కాని నన్ను ఈ ఫోటోకే పరిమితం చేయకు. నేను అందరిలో ఉన్నాను. అంతటా ఉన్నాను." అని వేదాంతమును, సర్వోపనిషత్సారమైన భగవద్గీతాంతర్గతమును అతి సామాన్యుడు కూడా అర్థం చేసుకొనే స్థాయిలో బోధించారు. షిరిడీ అవతారంలో కూడా స్వామి అందించిన సందేశం ఇదే!

ఎవరైనా షిరిడీలో బాబాను దర్శించానని చెబితే, అట్టివారు అసలు బాబానే చూడనట్లు అని శెలవిచ్చారు.

ఎందుకంటే, షిరిడీలో ఉన్నది తన భక్తులకు - దర్శన, స్పర్శన, సంభాషణలను అనుగ్రహించడానికి తాను సంకల్పించుకొన్న ఉపాధి మాత్రమే కాని, తాను 'సర్వాంతర్యామి'నని ప్రకటించారు. శ్రీ సత్యసాయిగా తన అవతారమునకు ఇచ్చిన వివరణ కూడా ఇదే.

**వి. వెంకటేశ్వర్లు (కవి కుమార్)**

"అవతరించుటయన్న అర్థమేమి
ప్రజలపై వాత్సల్య పఅత తోడ
వారి స్థాయికి దైవంబు వచ్చు భువికి
జీవ ప్రజ్ఞకు తోడుగా దైవ ప్రజ్ఞ"

అంతే కాదు, తమ సర్వాంతర్యామిత్వాన్ని గూర్చి ఉటంకిస్తూ ఇలా సెలవిచ్చారు.

"మున్ను షిరిడీ, నేడు పర్తి ఉన్నవాడను పేరె గాని
తనను భావన చేయు భక్తుల
తనువులందే నిలిచియుండు
కన్ను విప్పి చూడరోరన్నా
శ్రీ సాయి దేవుడు ఎన్నగా ఎందైన కలడన్నా!"

స్వామి అణువణువులోను నిలచియున్నారు కనుకనే,

"అడవిలోనున్న ఆకాశమునమున్న
పట్టణమునమున్న పల్లెనున్న
గుట్ట మీదనున్న నట్టేట పడియున్న
మదిని సాయి నిన్ను మఱువడెపుడు"

అని భక్తులకు అభయ ప్రదానమును చేయుచున్నారు. చెప్పడమే కాదు, చెప్పినదానికి మించిన అనుభూతులనే





ప్రపంచ వ్యాప్తంగా భక్తజనులు అనుభవిస్తున్నారంటే అతిశయోక్తి కాదు.

స్వామి నుండి విశ్వవ్యాప్తంగా ప్రవహిస్తున్న - కుల మత వర్గ - దేశాతీతమైన 'దివ్యప్రేమ' గంగా ప్రవాహంలో ప్రపంచ దేశాలలోని ప్రజలంతా కొట్టుకొని పుట్టపర్తికి చేరవస్తున్నారు.

ఎట్లాంటి ప్రచారమూలేదు; స్వామి ఏ దేశానికి పోరు. కాని ప్రపంచంలోని అన్ని దేశాల ప్రజలూ వారి నుండి స్ఫూర్తిని పొంది వారి అవతార కార్యక్రమంలో పనిముట్లుగా మారి స్వార్థంవీడి పరార్థమునకు, పరార్థము నుండి పరమార్థమునకు పురోగమిస్తూ, దీనజనసేవలో అహరహం శ్రమిస్తున్నారంటే, వారి సర్వాంతర్యామిత్వానికి ఇంతకన్నా ఏమి నిదర్శనం కావాలి!

స్వామి అంటుంటారు; 'సాయి మీ హృదయస్థాయి' అని. 'మీ స్థాయిలో నన్ను అర్థంచేసుకోవటంకాదు. నా స్థాయిలో నన్ను అర్థం చేసుకొని అనుసరించే ప్రయత్నం చేయండి' అని. స్వామి అంతట నిండియున్న పరమాత్ముఁడు అని చెప్పుటకు కోట్ల భక్తుల అనుభవాలు కోకొల్లలు.

సుమారు 40 సంవత్సరాల క్రిందట ఒకసారి మా తమ్మునికి బాగా సుస్తీ చేసింది. ఆ సందర్భంలో మా నాన్నగారి మిత్రుడు పుట్టపర్తికి ప్రయాణం పెట్టుకొని మా నాన్నగారికి తెలియజేయడానికి మా గృహానికి వచ్చారు.

అప్పుడు మా నాన్నగారు ఆయనతో మా తమ్ముని తీవ్ర అనారోగ్య పరిస్థితిని గూర్చి స్వామితో చెప్పి వారి అనుగ్రహ అభయ విభూతిని తీసుకొనిరమ్మని కోరినారు. ఆయన వెంటనే పర్తికి ప్రయాణమై వెళ్ళినారు.

స్వామి ఆయనకు ఇంటర్వ్యూ ప్రసాదించినారు. ఆయన ఇంటర్వ్యూలో మా నాన్నగారు చెప్పిన విషయం మరచిపోయి స్వామి నుండి శలవు తీసుకొని వస్తుండగా స్వామి ఆయనను వెనుకకు పిలిచి 'ఏం నాయనా! ఎంతసేపూ నీ కుటుంబ సమస్యలే చెప్పావు. కాని పాపం రాట్కవి వాళ్ళ రెండవ కుమారుఁడైన మురళి అనారోగ్యం గురించి నాకు చెప్పమని నీతో చెప్పిన విషయాన్ని పూర్తిగా మరచిపోయావు.

రాట్కవితో చెప్పు, ఏమీ ఫరవాలేదని, పాపం నా ఫోటో కూడా వాని తలక్రింద పెట్టారు. నేను వాళ్ళ వెంటనే ఉన్నాను త్వరలోనే మురళి కోలుకుంటాడని చెప్పు" అని స్వామి ఆయనతో చెప్పారు.

తాను ఎల్లవేళల భక్తుల వెంటనే ఉంటానన్న వాగ్దానానికి ప్రత్యక్ష నిదర్శనం చూపించారు. శ్రీ కృష్ణ పరమాత్మ అర్జునునికి తన విశ్వరూప సందర్శనమును అనుగ్రహించారు. అయితే, ఏమిటి ఈ విశ్వరూపము? విశ్వమంతా తన విరాట్స్వరూపమే అన్నఎఱుకను అర్జునునిలో కలిగించటమేనని అనిపిస్తుంది.

అర్జునుడు 'స్వామీ! అజ్ఞానమనెడి అంధకారంలో ఉన్న నాకు అంతయు అగమ్యగోచరంగా ఉన్నది. కావున, నాపై దయయుంచి నిన్ను విశ్వరూపంలో చూడగలిగే 'చూపు'ను ప్రసాదించు' అని ప్రార్థిస్తాడు.

అంతట కరుణాపయోనిధి అయిన కృష్ణుడు వైరాగ్య వార్ధిగా నిలచిన అర్జునుని అనుగ్రహించి 'జ్ఞానచక్షువును' ప్రసాదించి, అంతర్ముఖుణ్ణి చేస్తాడు. అంతర్దృష్టితో అర్జునుఁడు, విశ్వమంతా నిండి నిబిడీకృతమైయున్న కృష్ణతత్త్వమును గుర్తించి, శ్రీ కృష్ణుని సర్వాంతర్యామిగా దర్శించి, కృతార్థుడై కర్తవ్యోన్ముఖుడౌతాడు. ఈనాడు పూర్ణావతారియైన భగవాన్ శ్రీ సత్యసాయి అనుసరిస్తున్న విధానం ఇదే! అందరిలో, అన్ని జీవరాసులలో తనని చూచే ప్రయత్నం చేయమని ప్రబోధిస్తున్నాడు.

"నా ఫోటో ఒకటి బాగున్నదని, ఒకటి బాగాలేదని ఎవరైనా అంటే మీరు సహిస్తారా? అట్లే, ప్రపంచంలోని ప్రతి జీవి వివిధ ఆకృతులు కలిగిన నా ప్రతిబింబాలే. కనుక ఒకరు మంచి, ఒకరు చెడ్డ అన్న దృష్టిదోషములను నివృత్తి చేసుకొని అంతర్యామియైన నన్ను గుర్తించి, తదనుగుణంగా వర్తించమని సెలవిస్తున్నాను.

అందుకే సాయిరాం' అని సంబోధిస్తూ, అందరిలో ఉన్న తనను హృదయపూర్వకంగా ప్రేమతో ఆరాధించమని చెబుతున్నారు. అర్చనలు, అభిషేకములు, వ్రతములు, ఊరేగింపులకన్నా సదాచారములతో, సద్వాక్యములతో అందరిలో ఉన్న స్వామిని సేవింపుడు అన్నదే

వందే సుందర సత్యసాయి సుపదం సౌందర్య రత్నాకరం
భారద్వాజసుగోత్ర రాజశిఖరం ప్రేమప్రభావిగ్రహమ్ ।
ఆపస్తంబ సువర్ణ సూత్రతరలం లీలాజగన్నాయకం
శాంతిశ్రీ హృదయం - ప్రశాంతి నిలయం సత్యం శివం
సుందరమ్ ॥"

- శాంతిశ్రీ

సర్వాంతర్యామియైన శ్రీ సత్యసాయి వేదము. వెన్నవంటి మనస్సు, వెన్నెలవంటి హృదయం, తేనెవంటి తీయని పలుకులు, సాయిభక్తుల లక్షణములై ఉండాలి అన్నదే శ్రీ సత్యసాయిగీత.

దృష్టి ప్రేమమయమైనప్పుడే సృష్టి బ్రహ్మమయంగా గోచరిస్తుందనే శ్రీ సత్యసాయీశోపనిషత్తు. అందరాని ఫలంగా భావింపబడుతున్న మోక్షము, శ్రీ సత్యసాయీశ్వరుని ఆదేశములను తు.చ. తప్పక ఆచరించేవారికి కరతలామలకము.

మోక్షమంటే నాదీ, నీదీ, నేను, నీవు - అనే బేధభావములను వీడి కనులకగుపడే జగత్తులో మనం ఆరాధించే దైవాన్ని అంతర్యామిగా అనుభవించటమే అన్నది - శ్రీ సత్యసాయి సూక్తి. పుట్టపర్తిలో అత్యాధునికమైన, అత్యున్నతమైన 'ఆరోగ్య మందిరము'ను కేవలం 6 నెలల వ్యవధిలో నిర్మించి, జాతి, మత, కుల - వివక్షతను చూపక అందరికీ ఉచితంగా వైద్యసేవలు ప్రసాదిస్తున్నారు స్వామి. ఇంతకంటే పెద్దలైన మరొక సూపర్ స్పెషాలిటీ ఆసుపత్రిని ఈ సంవత్సరం నవంబరు 1వ తేదీన వైట్ ఫీల్డుకు సమీపంలోనే శ్రీవారు ప్రారంభించనున్నారు. అనంతపురం జిల్లా 'వాటర్ ప్రాజెక్టు' అచిరకాలంలోనే పూర్తికావటం - స్వామి అందరిలో ఉండి పనిచేసి, అంతటా ఉండి పర్యవేక్షించినరనుటకు ప్రబల నిదర్శనం.

కాలుకదపకుండా ప్రపంచ మానవాళిలో మానవత్వాన్ని మేల్కొలిపి, మాధవత్వంవైపు నడిపిస్తున్న - శ్రీ సత్యసాయి మానుషవేషధారియైన - మాధవుఁడే! ప్రపంచాన్నంతా, రష్యా, చైనావంటి కమ్యూనిస్టు దేశాలను సయితం ఆధ్యాత్మిక పథంవైపు నడిపించి, కలిమాయా ప్రభావంలో సమకాలీన సమాజానికి పట్టిన బుద్ధి జాడ్యమును సమూలంగా పెకలించి సన్మార్గంలో నడిపిస్తున్న శ్రీ సత్యసాయి ముమ్మాటికీ విశ్వమెల్ల వ్యాప్తియై వెలుగువిభుఁడే!

"ఎప్పుడు ధర్మహానియగు; నెప్పుడు ధర్మము వృద్ధిగాంచునో
అప్పుడు 'నేను పుట్టుదు సుమా!'యని కృష్ణుఁడు పల్కినట్లుగా
ఇప్పుడు పర్తిలోన పరమేశుఁడు పుట్టెను - సత్యసాయియై
ఇప్పుడు సుధర్మమును నిల్పుచునుండె ప్రశాంత పద్ధతి" ★

## భగవాన్ శ్రీ సత్యసాయి - సి.పి. బ్రౌన్ గ్రంథాలయం

తెలుగు భాషా సాహిత్యాల సముద్ధరణకు జీవితాంతం కృషిచేసిన సి.పి. బ్రౌన్ స్మృతి చిహ్నంగా కడపలో ఆ మహనీయుడు నివసించి సాహిత్య యజ్ఞం జరిపిన స్థలంలో గ్రంధాలయ భవన నిర్మాణం జరిగింది. ఆ గ్రంధాలయాభివృద్ధికి ఆశీస్సులందించవలసినదిగా అర్థిస్తూ, భగవాన్ సత్యసాయిబాబాగారికి 1997లో వినతి పత్రం పంపాను. దాదాపు రెండునెలల తర్వాత ఒక రాత్రి గం॥8-00 లప్పుడు ఒక వ్యక్తి బ్రౌన్ గ్రంధాలయానికి నాలుగు స్టీల్‌పెట్టెలనిండా పుస్తకాలు తీసుకొని లైబ్రరి వద్దకు వెళ్ళారు. వానవస్తున్నవేళ. చేరువలోనేవున్న లైబ్రరి వాచ్‌మెన్‌ను పిలిచి, తలుపు తీయించి మా ఇంటికి ఫోన్ చేశారు. "అయ్యా! నేను మీ లైబ్రరికి పుస్తకాలు తెచ్చాను. మీరు వస్తే వాటిని అప్పగించి వెళ్తాను"అన్నారు. సమాధానంగా 'అయ్యా వాన వస్తున్నది. చీకటివేళ, నేను రావటానికి సౌకర్యంలేదు. దయచేసి పుస్తకాలను వాచ్‌మెన్‌కు అప్పగించి వెళ్ళమనవి. ఉదయం వెళ్ళి సరిచూచుకొని, అందినట్లు తమకు వ్రాస్తాను" అన్నాను. ఆ వ్యక్తి నేరుగా మా ఇంటికి జీప్‌లో వచ్చి, ఎంతో ఆదరంగా మాట్లాడుతూ, 'బాబాగారు మీ లైబ్రరికి విలువైన పుస్తకాలు ఇచ్చారు. వారు మీకు ఆర్థికంగా సహాయం చేయగలరు. వారికి వ్రాయండి' అన్నారు. నేను వారిపేరు, ఊరు వివరాలు కోరగా 'నా పేరు పి.వి. రావు. పదిరోజులు పుట్టపర్తిలో, పదిరోజులు విజయవాడలో, పదిరోజులు హైదరాబాద్‌లో వుంటాను కాంట్రాక్ట్ పనులు చేయిస్తుంటాను. మీ లైబ్రరి చాలా బాగుంది' అంటూ, తన పేర పుట్టపర్తికి వ్రాయవచ్చు అని ఆ రాత్రే విజయవాడ వెళ్తున్నట్లు చెప్పి వెళ్ళిపోయారు. ఆ తర్వాత శ్రీ పి.వి రావుగారికి 3, 4 జాబులు వ్రాశాను. బదులేలేదు.

జరిగిన సంఘటన గురించి బాబాగారికి వ్రాశాను. శ్రీ రావుగారితో నాకు పూర్వపరిచయం ఏమీలేదు. వారు రాత్రివేళ లైబ్రరికి వెళ్ళి పుస్తకాలు అప్పగించి వెళ్ళిపోవటం, ఈనాటికీ ఒక మిస్టరిగా వుంది.

బాబాగారి ప్రసంగాలు విన్నాను. వారి సందేశాలు చదువుతున్నాను. శ్రీవాణి పత్రిక ద్వారా బాబాగారిని గురించి ఎన్నో విషయాలు తెలుసుకొంటున్నాను. కాని ఇంతవరకు నేను పుట్టపర్తి వెళ్ళలేదు. ఆ దర్శనప్రాప్తి ఎప్పుడో?!

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి



# సాయి అద్భుత శక్తి

భగవదానుగ్రహం వలన నేను 7వ తరగతి చదువ గలిగాను. I.T.I. చదివి 1969సం॥లో శ్రీశైలం ప్రాజెక్టు నందు క్యాజువల్ లేబరుగా ఎలక్ట్రీషియన్‌గా చేరాను. ఆ తరువాత 1976 సం॥లో ఆళ్ళగడ్డ ఆర్.టి.సి.లో ఎలక్ట్రీషియన్‌గా చేరాను. 1986లో ప్రమోషన్ యిచ్చి ఆళ్ళగడ్డ నుండి కడపకు బదిలీ చేసినారు. ఆ సమయంలో అనుకోకుండా డా॥ రామయ్యగారి టేబుల్ మీద నున్న నవంబరు '87 శ్రీవాణి ప్రత్యేక సంచిక ను చూచే అవకాశం లభించింది. దానిని ఆమూలాగ్రం చదివాను. అప్పటి నుంచి స్వామిని చూడాలనే ఆరాటం కలిగింది. స్వామిని గురించి ఎవరికి తోచినట్లు వారు మాట్లాడుతుండేవారు. ఆ మాటలు విని నిర్ణయానికి రావటానికన్నా, ఒకసారి వెళ్ళి, ప్రత్యక్షంగా చూచి వస్తే బాగుంటుందనిపించింది. ఎలాగో నాలుగు డబ్బులు కూడబెట్టుకుని 1988లో స్వామి జన్మ దినానికి పుట్టపర్తి వెళ్ళాను. నేను వెళ్ళేటప్పటికి స్వామి ఉపన్యాసం మొదలైంది. ఉపన్యాసమంతా శ్రద్ధగా విన్నాను. స్వామిని చూడకముందు వారి ఫోటోలు చూచి, 6 అడుగుల పొడుగుంటారనే భావం నాలో కలిగింది. తీరా చూస్తే 5 అడుగులు మాత్రమే ఉన్నారు. నాకు ఆశ్చర్యం వేసింది.

నేను అప్పటివరకు నిత్యమూ మద్యం త్రాగేవాడిని. ఆనాటి స్వామి ఉపన్యాసమంతా నన్ను గురించే చెప్పినట్లుగా ఉన్నదని భావించాను. ఇంటికి తిరిగి వచ్చినప్పటి నుంచి త్రాగుడు, మాంసాహారం మానాలని ఎంతగానో ప్రయత్నించాను. కాని సాధ్యం కాలేదు. మరల మరుసటి సంవత్సరం కూడా పుట్టపర్తి వెళ్ళాను. స్వామి ఉపన్యాసం మొదలైంది. "త్రాగేవారు 'సడన్'గా మానరాదు, అట్లా చేస్తే ప్రమాదం. మెల్లమెల్లగా తగ్గించుకుంటూ మానడం మంచిది." అని స్వామి ఉపన్యాసంలో చెప్పేరు. ఏది ఏమైనప్పటికీ త్రాగటం మానివేశాను. మాంసాహారమును సేవించడం కూడా మానుకొనగలిగాను.

నవంబర్ '87 శ్రీవాణి ప్రత్యేక సంచిక వలన నాలో పెద్ద మార్పు వచ్చిందనే చెప్పాలి. అప్పటి నుంచి శ్రీవాణి, సనాతన సారధి తెప్పించి చదవటం అలవాటైంది. నేను అందరికి చెబుతుంటాను. మనిషికి రెండు కండ్లు ఎంత అవసరమో, సనాతన సారధి, శ్రీవాణిలు అంత అవసరమని ప్రతివారికి చెబుతుంటాను. ఏ పుస్తకం చదివితే బాగుం టుందని ఎవరైనా నన్ను అడిగితే, స్వామి పైన సరియైన గురికుదరాలంటే 'ప్రేమజ్యోతి' చదవండని చెబుతుంటాను.

స్వామి దర్శనం, పాదనమస్కారం మాత్రమే నాకు లభించింది. వారితో సంభాషణ చేసే అవకాశం మాత్రం నాకు లభించలేదు. స్వామి అనుగ్రహం కోసం ఎదురు తెన్నులు చూస్తున్నాను. ఏదోవిధంగా కర్నూలు లక్ష్మీనగరు నందు 1994వ సం॥లో ఒక చిన్న ఇల్లు కట్టగలిగాను.

## పి. పిచ్చయ్య, కర్నూలు

అయితే దాని గోడలకు మాత్రం సిమెంటు చేయించ లేక పోయాను. వర్షాలకు నాని గోడల ఇటుకలు కరుగుతూ వస్తున్నాయి. పునాది సరిగా వేయకపోవటం వలన కుంగుతూ వస్తున్నది. ముందు గేటు, బాత్‌రూమ్ గడియలు సరిగా పడటం లేదు. ఇల్లు కట్టడానికే చాలా కష్టమైనది. ఇక రిపేర్లు చేయించే స్థితి నాకు లేదు. ఏమి చేయాలో తోచలేదు. ఒకనాడు స్వామి గుర్తుకు వచ్చారు. పూజా మందిరం వద్ద కూర్చొని ప్రార్థన మొదలుపెట్టాను. "పేదవాడనైన నేను ఈ ఇల్లు కట్టడానికి ఎంత కష్టపడ్డానో, మీకు తెలియనిది కాదు. ఇప్పుడు ఈ ఇల్లు కూడా క్రుంగి పోతున్నది. అలనాడు దేవతలు, రాక్షసులు మంధరగిరి పర్వతమును కవ్వముగా చేసుకుని సముద్రమును చిలుకు తున్న సమయంలో, ఆ మంధరగిరి పర్వతము దిగిపోతుంటే, కూర్మావతారము ఎత్తి కాపాడినావు. ఇప్పుడు ఈ నా ఇంటిని అలా కూర్మావతారివై కాపాడుతావో! నీట ముంచుతావో! నీదే భారము" అని హృదయపూర్వకంగా స్వామిని ప్రార్థించాను. అంతే! ఆపద్బాంధవుడు, అనాథ రక్షకుడు ఎలా కరుణ చూపాడో, చెప్పడానికి నోరు రావటం లేదు. వ్రాయడానికి చేతులు రావటం లేదు. మరుసటి దినమే బజారుకు వెళ్ళి యంత్రాలు అమ్మే కొట్టు వద్దకు వెళ్ళి "కూర్మ యంత్రం" ఉన్నదా? అని అడిగాను. ఆ కొట్టు యజమాని నా వైపు ఎగాదిగా చూచి సహజంగా

లక్ష్మీ యంత్రము, గణేశ్ యంత్రము, ఆంజనేయ యంత్రము అడుగుతుంటారు. నీవు కూర్మ యంత్రము అడుగుతున్నావు. నాకు ఆశ్చర్యంగా ఉన్నదని చెబుతూ వెతికి ఒకే ఒక యంత్రమున్నదని, దానిని నాకు ఇచ్చాడు.

భగవాన్ సాయి అనుగ్రహం వలననే 'కూర్మ యంత్రం' దొరికిందని సంతోషిస్తూ, దానికి ఫ్రేమ్ కట్టించి, ఇంటికి తీసుకొని వెళ్ళి, స్వామి వారి ఫొటో కాళ్ళ క్రింద పెట్టి స్వామిని తృప్తికరంగా ప్రార్థించాను. అంతే! ఆనాటి నుంచి గేటు, బాత్‌రూమ్ గడియలు వాటంతట అవే మంచిగా పడుతున్నాయి. నా ఇల్లు క్రుంగటం ఆగిపోయింది. ఇది నిజంగా సాయి అద్భుత శక్తి ప్రభావమే నని నా నమ్మిక. వారికి నా శతకోటి ప్రణామములు అర్పించు కుంటూ, నిర్భయంగా ఆ ఇంటిలో నివశించగలుగు తున్నాను. అసలు స్వామి సన్నిధికి చేర్చడానికి కారణం 'శ్రీవాణి'యే గదా! భక్తులకు స్వామికి మధ్య వారధి వంటిది 'శ్రీవాణి'. ఒక్క భారతదేశమునందే గాక, యావత్ ప్రపంచము నందు కూడా శ్రీవాణి వారధి అయి నిలవాలని భగవాన్ సాయిని ప్రార్థిస్తున్నాను. శ్రీవాణిని అభినందిస్తున్నాను. ●

# శ్రీ సత్యసాయి - మంగళాశాసనమ్

ఓంకార రూపాయ సుప్రసన్నాయ,
శ్రీంకార రూపాయ సృష్టి కర్తాయ
హ్రీంకార రూపాయ హిత ప్రదాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

నరదేవ రూపాయ, నారాయణాయ
వరవేద వేద్యాయ, వారిజాక్షాయ
పరమార్ధ విజ్ఞాన తత్వ ప్రదాయ,
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

మహోపకారాయ, ముక్తి ప్రదాయ
మహేశ్వరారాధన, తత్పరాయ
బాహ్యాంతరస్థాయ, భద్ర రూపాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

సర్వాంతర స్థాయ, సాధుపూజ్యాయ
నిర్వాణ రూపాయ, నిత్య సత్యాయ
గర్వాపహారాయ, గంభీరాయ,
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

త్యకారి బృందాయ భక్త ప్రియాయ
శక్తి త్రయోపేత, సర్వప్రదాయ
ముక్తాయ, నిత్యాయ, మౌనీశ్వరాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

ఈశాయ శ్రీ శాయ, విశ్వలాత్మాయ
ఆశావిదూరాయ, ఆనందదాయ
దోషాపహారాయ దుఃఖ నాశాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

మాయా పరిచ్ఛిన్న భక్త రూపాయ
మాయా విదూరాయ మాన్యప్రదాయ
మాయా మాయాతీత భక్త ప్రియాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

యజ్ఞ స్వరూపాయ, యజ్ఞ ప్రియాయ
యజ్ఞ సంరక్షాయ, యజ్ఞ భోక్తాయ
యజ్ఞ సంస్థిత్యాయ యజ్ఞస్తుత్యాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

సాక్షి స్వరూపాయ, సర్వ ప్రియాయ
అక్షీణ భక్తిస్వతార్ధ ప్రదాయ
సాక్షాత్పరబ్రహ్మ, సాయిబాబాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

రామాయ శ్రీ పరంధామ రూపాయ
కామాది షడ్వర్గశత్యనాశాయ
శాంతాయ, దాంతాయ, సర్వాంతరాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

శ్రీ సత్య రూపాయ, దివ్య దేహాయ
శ్రీ సత్యభూషాయ శిష్ట రక్షాయ
శ్రీ సత్యసాయినే, నిర్మలాత్మాయ
ఓం నమో శ్రీ సత్యసాయి రామాయ

మంగళం రామాయ మాంగళ్యదాయ
మంగళం శ్రీ సత్యసాయి రామాయ
మంగళం నిత్యాయ, మహిమాన్వితాయ
మంగళం శ్రీ పుట్టపర్తి స్థితాయ॥

- పి.యస్.వి.సుబ్రహ్మణ్యం, శ్రీకాకుళం

# నామస్మరణ అంటే భగవంతుణ్ణి పిలవడమే!

ఒకనాటి రాత్రి ప్రశాంతినిలయం ఆవరణలో చెట్లక్రింద ఇసుకలో పెద్దబొట్టమ్మ నిద్రపోతున్నది. అప్పుడు సన్నగా వర్షం, ఆరంభమయింది. ఆమె లేచి **'సాయిరామా! సాయిరామా!'** అనుకొంటూ నిలయం వరండాలోకి వెళ్ళుతున్నది. అప్పుడు సత్యసాయినాథుడు మేడమీద బాల్కనీ దగ్గర నిలబడి ఆమెను చూస్తూ "ఏయ్ దున్నపోతా! నన్ను నిద్రపోనివ్వవేమి?" అన్నారు. అప్పుడు పెద్దబొట్టమ్మ **'బాబా! మీరు నిద్రపోకుండగా నేనేమి అడ్డుపడ్డాను? నేనేదో నామస్మరణ చేసుకొంటుంటే'** అన్నది. అప్పుడు బాబా **'నామస్మరణ అంటే ఏమిటనుకున్నావు? భగవంతుణ్ణి పిలవటమే!'** అన్నారు. ఈ అమృతోపదేశం మనకు అందించటం కోసమే బాబా ఆ సంభాషణ జరిపారు కాబోలు అనిపిస్తుంది.

కాలిఫోర్నియాలో ఐడల్ ఫీల్డ్ అనే ఒక పర్వత ప్రాంతంలో చిన్నపిల్లలు ఒక ప్రమాదకరమైన కందిరీగల గుంపును రేపిన కారణంగా అవి వారిని కుట్టసాగాయి. ఆ పిల్లలు ఏడుస్తూ పరుగులు తీస్తున్నారు. ఆ పిల్లల తల్లి వారిని రక్షించడానికి వెళ్ళి కందిరీగలను తరమసాగింది. కాని ఫలితం లేకపోయింది. ఒక పెద్దాయన ధైర్యంచేసి వెళ్ళాడు కాని ఆ కందిరీగలు కుట్టగానే ఆయన వెనక్కి పరుగుతీశాడు. అప్పుడు ఆ దృశ్యం చూస్తున్న ఒక సత్యసాయి భక్తురాలు మేరియా సెంట్‌జాన్ అనే ఆమె 'బాబా! ఒక్కసారి నీ సహాయం కోరుతున్నాను. వెంటనే ఇక్కడకు రా బాబా!' అని మనసారా పిలిచి పరుగుపరుగున వెళ్ళి ఆతల్లీపిల్లలకు సహాయపడింది. ఆ చిన్నారి పిల్లల్ని కుట్టవద్దని కందిరీగల్ని బ్రతిమలాడింది. వెంటనే వారిని ఇంటికి తీసికొని వెళ్ళి శరీరం మీదకుడుతూవున్న, జుట్టులోపల ఇరుక్కున్న కందిరీగల్ని తీసివేసింది. వారి వంటినిండా దద్దులే. 'స్వామి! ఈ చిన్నారులకు వెంటనే స్వస్థత కలిగించు' అని ఆమె ప్రార్థించింది. ఒక్క కందిరీగ కూడా ఆమెను కుట్టకపోవటం, వారి కళ్ళఎదుటనే ఆ దద్దులన్నీ మాయమవటం వారికి ఆశ్చర్యానందాలను కలిగించింది. సప్తసముద్రాలు దాటి భగవాన్ బాబాను దగ్గరకు రప్పించుకొనే శక్తి నామమునకు ఉంది!

నార్వేదేశీయుడైన టడ్‌మన్ మహాశయునకు సత్యసాయి పరమాత్ముడు రక్షగా ఒక ఉంగరం ప్రసాదించారు. ఆయన బంగ్లాదేశ్‌లో చిట్టగాంగ్ నది దగ్గర సంచరిస్తున్నప్పుడు ఆ ఉంగరం నదిలో పడిపోయింది. మూడు నెలల తరువాత ఆయన బాబా సన్నిధికి వచ్చాడు. అప్పుడు బాబా' ఇదివరకు నేనిచ్చిన ఉంగరం ఏమయింది?' అని అడిగారు. 'బంగ్లాదేశ్‌లో చిట్టగాంగ్ నదిలో పడిపోయింది' అన్నాడు టడ్‌మన్. 'ఎన్నాళ్ళయింది?' అన్నారు బాబా. 'మూడు నెలలయింది' అన్నాడాయన. అప్పుడు

**డా॥ జంధ్యాల సుమన్‌బాబు**

బాబా వెంటనే హస్తచాలనం చేసి ఆ ఉంగరం ఆయనకు ఇస్తూ 'నేను ఆ సమయంలో అక్కడే ఉన్నాను. ఉంగరం నా చేతిలోనే పడింది. అక్కడేకాదు అన్ని నదులలోనూ నేను ఉన్నాను. నదులలోనే కాదు అంతటా నేనున్నాను' అన్నారు.

అటువంటి సన్నివేశమే ఇది - శ్రీకాకుళం జిల్లాలో అడవుల మధ్యలో మల్లెపీడు అనే అతి చిన్న కుగ్రామం ఉంది. అక్కడ ఒక వ్యక్తి తన ఇంటికి చేరటానికి దారిలో ఉన్న కాలువ దాటేటప్పుడు అతని చేతివ్రేలికున్న ఉంగరం కాస్త నీటిలో పడిపోయింది. నీటి అడుగున మునిగి వెదికాడు, వెదికాడు. ఎంతసేపు వెదికినా దొరకనేలేదు. విచారంతో ఇంటికి చేరాడు. అప్పుడతనికి బాబా గుర్తుకు వచ్చారు. 'బాబా! నీవు దేవుడవని అంటారు కదా. నీవు దేవుడవయితే నా ఉంగరం నాకు దొరికేలా చెయ్యి' అని ఒకటే ప్రార్థించాడు. మరునాడు ఉదయమే వెళ్ళి ఆ కాలువలోపల మునిగి చేతితో అడుగున ఉన్న గుప్పెడు ఇసుకను పైకి తీశాడు. ఆశ్చర్యం! ఆ ఒక్క ప్రయత్నంలోనే ఆ ఇసుకలో అతని ఉంగరం మెరిసిపోతూ కనిపించింది. అతనికేకాక ఆ గ్రామస్థులకు బాబా పై నమ్మకం ఏర్పడింది. ఆ రోజులలో I.T.D.A. (ఇంటిగ్రల్ ట్రైబల్ డెవలప్‌మెంట్ ఏజన్సీ) వారు ఆ ఊరు వచ్చి 'మీ ఊరికి రోడ్డు కావాలా? మంచినీరు కావాలా? బస్సు కావాలా? ఏదో ఒకటి కోరితే



తాము ఏర్పాటు చేస్తాము" అని అడిగారు. వారు ఏమని అడిగారో తెలుసా! సత్యసాయి ఆలయం కావాలి అని అడిగారు. వారు కట్టించిన చిన్న ఆలయంలో ఒక పెద్ద ఫోటో పెట్టుకొని ఆ గ్రామస్థులు భజనలు, సేవలు జరుపుకుంటున్నారు. బాబా సర్వాంతర్యామి. హృదయ పూర్వకంగా పిలిస్తే చాలు పలుకుతారు బాబా.

ఒక సాధకుడు స్వామిని 'స్వామి! శరణాగతి శరణాగతి అంటారు కదా. శరణాగతి చేయటం ఎలా?' అని అడిగాడు. అప్పుడు స్వామి 'నీవు శరణాగతి చేయడం కూడానా? నామస్మరణ చెయ్యి. భగవంతుడు నీకు శరణు అవుతాడు' అన్నారు. ఆ నామస్మరణ ఫలితములే ఈ ఉదాహరణ పూర్వకమైన సన్నివేశములు.

మొసలి బారినపడిన గజేంద్రుడు తన శక్తి చాలదని గ్రహించి చివరకు "నీవే తప్ప ఇతఃపరంబెరుగ రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!' అని ఆర్తితో తపించిన ఫలితంగా ఆ మహావిష్ణువు మృత్యువు నుంచి దానిని కాపాడాడు. లాల్‌బహదూర్‌శాస్త్రిగారు భారత ప్రధానిగా ఉన్నప్పుడు వారికి P.A.గా త్యాగరాజు పనిచేసేవారు. ఆ రోజులలో త్యాగరాజు గారికి ఆరోగ్యం బాగుండక బెంగుళూరులో పెద్ద హాస్పిటల్‌లో చెక్ చేయించు కొన్నప్పుడు ఆ డాక్టర్లు వారికి కేన్సర్ వచ్చిన విషయం చెప్పారు. మూడునెలల వ్యవధి మాత్రమే ఉన్నదని అన్నారు. ఆయన కొన్నిరోజుల తరువాత మళ్ళీ వచ్చి చెక్ చేయించు కున్నారు. ఆ డాక్టర్లు కేన్సర్ ముదిరిపోయిందని నెలరోజులు మాత్రమే ఆయుష్షు ఉన్నదని అన్నారు. అప్పుడాయన పుట్టపర్తికి ప్రయాణమై వచ్చి బాబాను దర్శించారు. దయామయుడైన బాబా ఆయన దగ్గరకు వచ్చి 'కేన్సరా!' అని అడిగారు దుఃఖాశ్రువులతో బాబా పాదపద్మములపై పడిపోయాడు. బాబా మూడు రోజులు విభూతి సృష్టించి ఇచ్చి, నోట్లో వేసుకోమని చెప్పి మూడవరోజున "కేన్సర్ కేన్సిల్డ్" అన్నారు. అంతే. ఆయన ఆరోగ్యవంతుడయ్యారు. ఇది జరిగి ఎన్నాళ్ళయిందో తెలుసా? దాదాపు ముప్పయి అయిదు సంవత్సరాలయింది. అదీ సత్యసాయిబాబా అంటే. ఇప్పటికీ ఆయన ఎంతో ఆరోగ్యంగా పర్తిలో సేవ చేస్తున్నారు. బాబా అంటే శ్రీమహావిష్ణువే.

ఒకరోజున విజయవాడ ప్రక్కనగల గొల్లపూడిలో బేబీ గారింట్లో సత్యసాయిభజనకు వెళ్ళాము. భజన ఆరంభం అయింది. దీపం బాగా వెలగటంలేదని విజయమ్మ అనే ఆమె స్నేహితురాలు అక్కడే గూట్లో ఉన్న సీసాలో నూనె ప్రమిద నిండా పోసింది. గంటసేపు ఆ జ్యోతి చక్కగా వెలిగింది. భజన, సత్సంగం అయిన తరువాత కొంతసేపటికి మళ్ళీ ప్రమిదలో నూనె పోద్దామని విజయమ్మ ఆ సీసా తీసింది. అప్పుడు బేబీగారు ఆమెతో 'నూనె సీసా లోపల ఉంది. అది నూనె సీసాకాదు. అది గోదావరి పుష్కరాల నుంచి తెచ్చిన గోదావరి నీళ్ళు' అన్నది! 'ఇంతకు ముందు ఇవే పోశాను' అన్నది విజయమ్మ. సీసావంచి చూస్తే ఎర్రగా ఉన్నాయి గోదావరి బురదనీళ్ళు. ఈ విషయం విన్నప్పుడు షిరిడీసాయి నాథుడు నీళ్ళతో దీపాలు వెలిగించిన సన్నివేశం గుర్తుకు వస్తుంది మనకు. నామస్మరణ వల్ల భగవంతుని దివ్య ప్రభావం ఎలా విరాజిల్లుతుందో మనకు ఆశ్చర్యం కలిగిస్తుంది.

రాజస్థాన్ రాజకుమార్తె మీరాబాయి తనకు సుమారుగా మూడువేల సంవత్సరముల క్రిందట నివసించిన శ్రీ కృష్ణుణ్ణి స్మరించి విషమును స్వీకరించింది. అది అమృతంగా మారిపోయింది. తరములు మారినా, యుగములు దాటినా భగవంతుని నామమునకు విలువతగ్గదు అని, అది సంపూర్ణమైన శక్తితో విలసిల్లుతూ ఉంటుందని మనకు అర్థమవుతుంది. అటువంటిది ఆ అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపుడు సత్యసాయి నాథునిగా భువిపై సంచరించే ఈ సమయంలో ఆ సాయిరామ నామస్మరణ ప్రభావము విలువ కట్ట తరమా?

ఒక శిశువు 'అమ్మా! అమ్మా!' అంటూ ఆడుకొంటూ ఉంటే ఆ తల్లి తనపనితాను చూసుకొంటూ ఉండిపోతుంది. అదే ఏదైనా ఆకలివేసిగాని, ఆందోళన కలిగిగాని, అమ్మా! అని ఒక్క కేకవేస్తే చాలు ఆ తల్లి పరుగుపరుగున వచ్చిచేరుతుంది. అందుకే నామస్మరణ చేసేటప్పుడు అంటే భగవంతుణ్ణి పిలిచేటప్పుడు ఆ పిలుపులో ఆర్తి తపన నిండా ఉండాలి అంటారు భగవాన్ బాబా.

**"పిలిచిన పలికెడి దైవము**
**కలడాయని సందియంబు కలిగిన యెడలన్**
**పిలిచి పరీక్షింపుడు, మీ**
**పిలుపు హృదయతరము నుండి పెకలగ వలయున్ !"**

అంటారు శ్రీ సత్యసాయి నాథుని గురించి తిరుపతి వేంకటకవుల శిష్యుడైన వేలూరి శివరామశాస్త్రిగారు! ☆

# సాయి ఆధ్యాత్మికతత్త్వ విశిష్టత

గరిమెళ్ళ కృష్ణమూర్తి

'మానవుని మనస్సు నుండికాక, ఆత్మనుండి ప్రవహించే అనంతమైన శక్తిని గుర్తించడమే ఆధ్యాత్మిక తత్త్వము. ఇది మానవజాతి అంతటికీ వర్తించే ఒక జీవన విధానము. భిన్నత్వములో ఏకత్వమును దర్శించడమే నిజమైన ఆధ్యాత్మిక తత్త్వము. అందరిలోను ఒకే పరమాత్మను దర్శించడమే నిజమైన ఆధ్యాత్మిక తత్త్వము' అంటాడు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా.

ఇటువంటి విశ్వజనీనమైన ఆధ్యాత్మిక దృష్టిని అలవరచుకోవాలంటే, మానవుడు ముందుగా తన్ను తాను తెలుసుకోవాలి, తన నిజతత్త్వమును గుర్తెరిగి వర్తించాలి. మానవజాతికి ఇటువంటి అవగాహన, ఎరుక కలుగజేయడమే భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారి అవతార లక్ష్యము. అదే ఆయన తన అవతార ప్రకటన చేసిన నాటినుండీ ఈనాటి వరకు నిర్విరామంగా, అవిశ్రామంగా బోధిస్తున్న ఆధ్యాత్మిక తత్త్వము.

అపౌరుషేయములైన వేదములు **'తత్త్వమసి'**, **'ప్రజ్ఞానం బ్రహ్మ'**, **'అయమాత్మా బ్రహ్మ'**, **'అహం బ్రహ్మాస్మి'** అనే మహావాక్యముల ద్వారా మానవుని నిజస్వరూపమును ఎఱుకపరుస్తున్నాయి. దురదృష్టవశాత్తూ ఆధునిక మానవుడు తన ఈ అద్వైత స్థితిని, విశిష్ట స్థాయిని మరచిపోయి, జంతు స్థాయికి దిగజారిపోతున్నాడు. ఇట్టి పరిస్థితులలో **'దైవం మానుషరూపేణ'**గా అవతరించిన భగవాన్ బాబా, మానవుడు మరచిపోయిన తనలోని దివ్యతత్త్వమును మరొక్కసారి అతనికి గుర్తుచేసి అతడు **'దివ్యాత్మస్వరూపు'**డని, ఆనందస్వరూపుడని, 'ప్రేమస్వరూపు'డని, 'అమృతస్వరూపు' డని తెలియజేసి మానవుని ఆధ్యాత్మిక మార్గములో నడిపిస్తున్నారు. తమ దివ్యబోధల ద్వారా, తాను ఆచరించి చూపిస్తున్న నైతిక, ఆధ్యాత్మిక విలువల ద్వారా మానవజాతిలో దివ్యచైతన్యము తీసికొని వస్తున్నారు. వేదవిజ్ఞాన సర్వస్వమును అతనికి అందిస్తున్నారు. మానవుడు, తాను సాక్షాత్తూ దివ్యతత్త్వమేనని అతడు గుర్తించేటట్లు చేస్తున్నారు. మానవజాతికి సంబంధించిన ప్రతి ఒక్క అంశమును స్పృశించే ఈ సాయి ఆధ్యాత్మిక తత్త్వమును మన బుద్ధికి తోచినంత వరకు కొంతవరకైనా అవగాహన చేసుకుంటే, అది ఎంతటి విశిష్టమైనదో, అద్వితీయమైనదో తెలుస్తుంది. ఉదాహరణకు కొన్ని అంశములు తీసుకుంటే,

**1) విశ్వజనీనత :** భగవాన్ బాబా బోధించే ఆధ్యాత్మిక తత్త్వము జాతి, మత, కుల, వర్ణ, భాషలకతీతంగా మానవజాతి మొత్తానికి వర్తించే విశ్వజనీనమైన, మౌళికమైన సత్యమును బోధించే తత్త్వము.

'ఈ ప్రపంచములో ప్రతిమానవుడు తెలిసో, తెలియకో దివ్యత్వమువైపు పయనించే ఆధ్యాత్మిక సాధన చేస్తూనే ఉన్నాడు. భగవంతుడు ఎక్కడో దూరముగా, నీ కంటే వేరుగా లేడు. ఆయన ఎల్లప్పుడు మీ ఇంట, వెంట, కంట, జంట ఉండి కాపాడుతూ, మిమ్మల్ని ముందుకు నడిపిస్తూ మీ అంతరంగములోనే ఉన్నాడు.

అన్ని రూపములు నావే. అన్ని నామములు నావే. నిజం చెప్పాలంటే, దైవము కంటే మీరు వేరుకాదు. మీరు ఈ రూప, నామములతో బంధింపబడిన వ్యక్తికాదు. మీరు సాక్షాత్తూ సనాతనమైన దివ్యతత్త్వమే. మీకు, నాకు మధ్య బేధములేదు".

**"ఉన్నది ఒకే మతము - అది ప్రేమమతము**
**ఉన్నది ఒకే కులము - అది మానవ కులము**
**ఉన్నది ఒకే భాష - అది హృదయ భాష**
**ఉన్నది ఒకే భగవంతుడు - ఆయన సర్వాంతర్యామి"**

అని చెపుతారు భగవాన్‌బాబా. జాతి, మత, కుల, వర్ణ, భాషలకతీతంగా ప్రపంచమంతటి నుండి వచ్చిన భక్తులతో నిండిన ఆధ్యాత్మిక కేంద్రమైన ప్రశాంతి నిలయమును, అచ్చట వారు పొందుతున్న దివ్యమైన ఆధ్యాత్మికానుభూతులను చూస్తుంటే స్వామి ఆధ్యాత్మిక బోధల విశ్వజనీనత మనకు ప్రత్యక్షంగా కనపడుతుంది.

**2) జీవితములో సవ్యమైన ఆలోచనా విధానము :** జీవితములో వ్యతిరేకమైన ఆలోచనా సరళిని విడిచిపెట్టి,

సవ్యమైన ఆలోచనా విధానమును అలవరచుకోమని భగవాన్ బాబా ఉద్బోధిస్తారు. సత్యమంటే ఆయన దృష్టిలో కేవలం అసత్యమాడకుండా ఉండడంకాదు; అంతకంటే చాలా అధికమైనది. శాంతి అంటే కేవలం యుద్ధములేని పరిస్థితికాదు; అంతకంటే అధికమైనది. ఆ అతీతమైన స్థితియే సవ్యమైన ఆలోచనా విధానములో చాలా ప్రధానమైన అంశమని ఆయన నొక్కివక్కాణిస్తారు. అదే విధముగా కేవలం భౌతిక సుఖమునకు, దివ్యమైన ఆనందమునకు మధ్య చాలా తేడా ఉంది.

భౌతిక సుఖములు వచ్చిపోయేవి, అశాశ్వతమైనవి. కాని ఆనందము శాశ్వతమైనది, చాలా విశిష్టమైనది. మనస్సును క్రమశిక్షణలో ఉంచుకోవడం, మనోవాక్కాయ కర్మలను సక్రమమైన మార్గములో నడిపించే దివ్యశక్తి యందు విశ్వాసమును పెంచుకోవడం ద్వారా మాత్రమే సుఖదుఃఖములకు అతీతమైన ఈ శాశ్వతానందము లభిస్తుంది' అంటారు బాబా.

**3) కర్మఫలము - దైవానుగ్రహము :** కర్మ సిద్ధాంతము ననుసరించి మనం చేసే మంచిపని కానివ్వండి, చెడుపని కానివ్వండి. దాని ఫలితము ఈ జన్మలోనే కాక మరుజన్మలోనే తప్పక మనకే వచ్చి చేరుతుంది. నిజానికి, కర్మఫల శేషమును అనుభవించడానికే పునర్జన్మ వస్తుంది. అయితే, భగవదనుగ్రహము కొరకు శ్రమించి దానిని పొందగలిగితే దాని ప్రభావమును కొంతవరకు తగ్గించుకోవచ్చు. కొన్ని కొన్ని సందర్భాలలో భగవదనుగ్రహము దానిని పూర్తిగా హరించివేయగలదు కూడా. అందువలన దైవానుగ్రహము కొరకు పాటుపడమని స్వామి ఉద్బోధిస్తారు.

'జీవులందరూ కర్మలు చేయవలసిందే. కర్మఫలమును తప్పించుకొనుటకు సాధ్యముకాదు. శారీరకమైన అనారోగ్యము, దారిద్ర్యబాధ, గృహకల్లోలము ఇవన్నీ కర్మఫలములే. అయితే, కర్మఫలము తప్పించుకొనడానికి వీలులేని సిద్ధాంతము మాత్రము కాదు. దాని యొక్క ప్రభావము కొంతవరకు తగ్గించవచ్చు. బాధ ఉన్నప్పటికి ఆ బాధను తెలియకుండా చేసే మత్తుమందు వంటిది దైవానుగ్రహము. మీరు అనుభవించవలసిన కర్మలయొక్క తీవ్రబాధను దైవానుగ్రహము ఒక్క చిటికెలో పూర్తిగా హరించి వేయగలదు. సర్వశక్తి వంతమైనది దైవానుగ్రహం' అని చెప్పారు భగవాన్ సాయి.

**4) త్రివిధమైన జీవన మార్గము :** విశ్వాసము, ప్రేమ, భక్తితో కూడిన జీవిత విధానమును అలవరచుకోమని, దాని వలన ఈ భువిపై మనజీవితం స్వర్గతుల్యముగా మారగలదని స్వామి నొక్కిచెపుతారు.

'విశ్వాసము అనే పునాదిపై మానవుడు తన జీవిత సౌధమును నిర్మించుకోవాలి. "దేవుడున్నాడు" అనే పంచాక్షరీ మంత్రము మీ జీవిత నౌకకు చుక్కాని కావాలి. భగవంతుడు ప్రతి ఒక్కరిలో అంతర్యామిగా ఉన్నప్పటికి, ఆయనయందు విశ్వాసము లేకపోతే మానవుడు దివ్యత్వ మును అందుకొనలేడు. ఆధ్యాత్మిక విషయాలలో విశ్వాసమే అత్యంత కీలకమైనది. సంశయము మన సాధన యొక్క పునాదులను సైతం కదిల్చివేస్తుంది. విశ్వాసము వలన భగవంతుని ప్రత్యక్షము చేసుకుని నీవు కోరుకున్న కోరికలను ఆయన అనుగ్రహించేటట్లు చేయవచ్చును. విశ్వాసము త్యాగముగా రూపొంది, ఆయన దివ్య సంకల్పములో ఒక పనిముట్టుగా తప్పించి నీకంటూ వేరే ఒక వ్యక్తిత్వమేదీ లేదని నీవు తెలుసుకుంటావు. విశ్వాసమే నీ శక్తి'.

'భగవంతుని చేరుకోవాలనే ఆర్తిని 'ప్రేమ' అనే పదముతో పిలువవచ్చును. ప్రేమ, మానవుని యొక్క అత్యంత మధురమైన, సుందరమైన తృప్తిని కలిగించే సంపద. మీ హృదయములను ప్రేమతో నింపండి. అప్పుడు మీ హృదయము నుండి వెలువడే మాటలు మంచి శక్తివంతమై ఉంటాయి. ప్రేమపూరితమైన పలుకులు వినేవారి హృదయములో ప్రవేశించి, వారు మీ మాటలను విశ్వసించి, అంగీకరించి, ఆచరించేటట్లు చేస్తాయి".

'నాదము ద్వారాగాని, వేదముద్వారాగాని భగవంతుని వశము చేసుకోవడానికి సాధ్యముకాదు. కేవలం భక్తిచేతనే భగవంతుని వశము చేసుకోవచ్చును. భగవంతుని కంటే తాను వేరుకాదనే భావన కలిగిన ఒక మానసిక స్థితి, భక్తి. భక్తి వలన అసలు మీ ప్రవర్తనే మారిపోవాలి.

భగవంతుని చేరుకోవడానికి, ఆయన సాన్నిధ్యమును పొందడానికి, ఆయన తత్త్వమును, లీలలను అర్థము చేసుకోవడానికి ప్రేమ, భక్తి మార్గముల ద్వారానే ఎక్కువగా వీలుపడుతుంది'.

**5) భగవాన్ బాబావారు బోధించే ఆధ్యాత్మిక తత్త్వము శుష్కవేదాంతము కాదు :** భగవాన్ బాబావారు బోధించే ఆధ్యాత్మిక తత్త్వము కేవలం వేదాంత చర్చలకే, గ్రంధములకే

పరిమితమైనదికాదు. అది మానవుల నరనరాలలో నిండిపోయి సేవ ద్వారా మానవజాతి సామూహిక, నైతిక, ఆధ్యాత్మికాభివృద్ధికి దోహదం చేసేది. స్వామి దృష్టిలో లౌకికము, ఆధ్యాత్మికము వేరువేరు కాదు. వ్యక్తి జీవితంలో, సమాజంలో అడుగడుగునా అన్ని రంగాలలోనికి ఇది చొచ్చుకునిపోయి సుఖశాంతులతో నిండిన ఒక నవసమాజ నిర్మాణానికి దోహదం చేస్తుంది. విద్యా, వైద్య రంగాలలో, సమాజరూప సర్వేశ్వరుణ్ణి సేవించడంలో సత్యసాయి సేవాసంస్థలు అందిస్తున్న బహుముఖ సేవలు ప్రపంచానికే ఆదర్శప్రాయమైనవి. సేవను ఒక ఆధ్యాత్మిక సాధనగా స్వీకరించమని స్వామి చేసే ఉద్బోధలు చాలా విశిష్టమైనవి.

"సేవద్వారా మానవ జీవితము సాఫల్యత చేకూరుతుంది. సేవ, భక్తి యొక్క ప్రారంభదశగాని, భక్తికి ఫలముగాగాని కాదు. ఇది సాక్షాత్తూ భక్తిలో ఇమిడియున్న తత్త్వమే. సేవ, భక్తుని ఊపిరి, అతని స్వభావము. ఈ విశ్వమంతా భగవంతుని నివాసస్థానమని, జీవులందరు ఆయన బిడ్డలని, జీవరాసుల దేహములన్ని ఆ పరమాత్మ. అదివసియించి యుండే దైవమందిరములని విశ్వసించి, అట్టి తత్త్వమును అనుభవించిన భక్తుని హృదయము నుండి సేవ ఉద్భవిస్తుంది. నీవు ఏ సేవ చేశావనికాని, ఎటువంటి భావముతో సేవ చేశావని భగవంతుడు అడుగుతాడు. సహృదయము, నిష్కల్మషమైన మనస్సు, పవిత్రమైన సంకల్పములు, ఇవీ భగవంతుడు కోరేవి. జపతపాలు, తీర్థయాత్రలు, శాస్త్రాధ్యయనం ఇవేవీ నిన్ను సంసారసాగరము నుండి దాటించలేవు. సేవ ఒక్కటే సంసార బంధము నుండి విముక్తిని కలిగించే సాధన.

6) సాయి ఆధ్యాత్మిక తత్త్వము, జాతి పునర్నిర్మాణమునకు దోహదం చేసేది : భగవాన్ బాబావారి ఆధ్యాత్మిక కార్యక్రమం నైతిక విలువలు కోల్పోయి, సమాజం అన్నివిధాల అధోగతికి దిగజారిపోతున్న ప్రస్తుత తరుణంలో, సమాజానికి కేంద్ర బిందువైన మానవునిలో ఉత్తమమైన శీల నిర్మాణము గావించి, జాతిపునర్నిర్మాణానికి దోహదం చేస్తుంది. సమాజంలోని స్త్రీలు, పురుషులు, పిల్లలు - ప్రతి ఒక్కరిలో ఉన్నతమైన నైతిక విలువలు పెంపొందించి, శీలనిర్మాణము గావించి ఆదర్శవంతమైన వ్యక్తులుగా తీర్చిదిద్దడానికి స్వామి కృషి చేస్తున్నారు. అందునా ఈ జాతి పునర్నిర్మాణ కార్యక్రమాన్ని ఆయన భారతదేశం లోనే ప్రారంభించారు.

'భారతదేశము ఈనాడు ఏడు ఘోరపాపముల యొక్క ఫలితములను అనుభవిస్తోంది. నీతి బాహ్యమైన వ్యాపారము, నైతిక విలువలులేని రాజకీయములు, శీలములేని విద్య, త్యాగబుద్ధిలేని పూజలు, కష్టపడకుండా సంపాదించిన ధనము, శాస్త్రములందు గౌరవములేని మానవ జీవితము మరియు నియమనిష్టలు లేని భక్తి'.

అనంతమైన సాయి తత్త్వమును గురించి ఎంత చెప్పినా తక్కువే. 'నీటిలో మునిగియుండే చేప అనంతమైన ఆకాశము యొక్క వైశాల్యమును కొలువగలదా? నా యొక్క దివ్యతత్త్వము ఇది, అది అని నిర్ణయించడానికి ప్రయత్నము చేయకండి. అంతకంటే, మీలోనే అంతర్గతముగా నున్న దివ్యతత్త్వమును గుర్తించడానికి ప్రయత్నము చేయండి' అని భగవాన్ బాబా మనలను హెచ్చరిస్తారు. అందువలన సాయి ఆధ్యాత్మిక తత్త్వము లోని ఏ కొన్ని అంశములనైనా మనం గుర్తుచేసుకుని, మన స్వస్వరూపమును గుర్తించి, భగవాన్ శ్రీ సత్యసాయి అవతార కార్యక్రమంలో ఒక చిన్న పనిముట్టుగా మనవంతు పాత్ర నిర్వహించగలిగితే, మన జన్మధన్యమైనట్లే. ఈ నూతన సత్యసాయి శకమునకు వైతాళికులుకావడమే మానవజన్మ ఎత్తినందుకు సార్థకత. స్వామి ఉద్బోధిస్తున్నది కూడా అదే. ✪

## దుడ్డు - బిడ్డు

**"ధనం కాలిబూట్ల వంటిది. బూట్లు కాలికి, సరిపోనూ వుంటేనే నడవటానికి వీలవుతుంది. టైట్‌గావున్నా, లూజ్‌గావున్నా నడవటానికి సాధ్యంకాదు. అదేవిధంగా ధనం అధికంగావున్నా జీవితంలో సుఖపడలేడు. ధనం లేకపోయినా జీవితం గడవదు. ఎంత వరకో, అంత వరకు ఉన్నప్పుడే జీవితంలో సుఖశాంతులను అనుభవించ గలుగుతారు. ధనం అధికంగా ఉన్నవారు, దానిని పవిత్ర కార్యాలకు మళ్ళించాలి. పిసినారితనంతో కూడబెట్టిన ధనం చిట్టచివరికి దొంగలకో! దొరలకో! ఎవరు చెప్ప గలరు? దేహంలో వున్న రక్తం ప్రసరిస్తుంటేనే ఆరోగ్యం. అదేవిధంగా ధనం కూడా చెలామణిలో వుంటేనే దేశానికి క్షేమం. కనుక దుడ్డు,బిడ్డు రెండూ నిరంతరం ప్రవహిస్తునే వుండాలి".**

**- బాబా**

# ఆయనే దేవదేవుడు - అది కల్పవృక్షం

పసితనంలోనే అతని దివ్యశక్తులు అద్భుత మహిమలు ఆధ్యాత్మిక జగత్తులో సంచలనం కలిగించేయి. సృష్టికర్త చేతులలో అతడులేడు. సృష్టిచేసే శక్తి అతని హస్తాల్లోనే ఉంది. చిత్రావతి నదీతీరంలో వెలకట్టలేని విద్యలెన్నో ప్రదర్శించేవారు.

బహుముఖ ప్రజ్ఞావంతుడు బాలుడు సత్యం ఆటపాటల్లో మేటి. గుణగణాలలో ఘనత అతనిదే. విద్యా విజ్ఞానంలో అందెవేసిన చేయి. నటనాకౌశలం నృత్యకళాభి వేషం అతనికి పుట్టుకతోనే అబ్బేయి. ఆయన అవతరించిన శుభఘడియల్లో వారి యింట్లో మృదంగం మ్రోగింది. వాణి వీణ మీటింది. గజ్జెలు మ్రోత వినిపించింది. అలవోకగా సత్యంనోట వెలువడిన ప్రతిమాట పాటగా మారింది. ప్రతీ పలుకూ ఒక పదంగా తయారైంది. రచనా వ్యాసంగానికి నుడికారం చుట్టిన తొలిరోజుల్లోనే సత్యం సంగీత సాహిత్య నృత్య విన్యాసప్రతిభ నటనా వైదుష్యం అందర్ని ముగ్ధులను చేసేవి.

సర్వతోముఖ ప్రజ్ఞావంతుడని బాల్యంలోనే బాబా కీర్తిప్రతిష్ఠలు గడించేడు. మంత్ర సిద్ధుడని దైవశక్తి సంపన్నుడని మధురగాయకుడని మహిమాన్వితుడని అందరినోటా కీర్తించబడేవాడు. అతని రచనా కౌశలం, కవితా ప్రతిభ గ్రంథరచనా నైపుణ్యం సర్వులకూ తెలిసి పోయింది.

**జీవితమథనంలో ఆవిర్భవించిన అమృత కలశం బాబా**

జైలులో జన్మించాడు కృష్ణుడు. ఈ అవతారంలో మాత్రం బాల బాబాకు కష్టపరంపరలు తోడునీడగా నిలిచేయి. సేవా, సహనం సత్యానికి సహజ కవచ కుండలాలు. గతుకుల బ్రతుకును వరించి, అవతరించేడు మహాను భావుడు. పల్లెసీమల్లో పర్తివాసంలో బాల్యప్రాయంలోనే బాధల భాగస్వామ్యముతో నిందలు, నిష్ఠూరాలు, తలంబ్రాలుగా పోసుకొని, దూషణలే భూషణాలుగా ఆదర్శాలే సర్వస్వంగా భావించి, పుడమిని పుట్టిన అవతార తత్త్వము ఎలా తెలుసుకోగలము! కర్మమర్మాలు! జన్మధర్మాలు ఎవరికి తెలుసు?

**నిరుపేద కుటుంబంలో జన్మించావెందుకు?**

ఏరి కోరి నిరుపేదల ఇంటిలో జన్మించింది ఎందుకు! మారుమూల కుగ్రామము గొల్లపల్లె, పుట్టపర్తిలో పుట్టింది ఎందుకు? సంపన్న కుటుంబంలో అవతరించలేదు. బంగారు చెంచా పట్టుకుని పుట్టలేదు. ఒక కుగ్రామంలో చాలీచాలని స్వగృహంలో పేదరికంలో పవ్వళించడానికి అవతరించేడు సాయీశుడు! బొడ్డుకోసిన బిడ్డను ఒడిలోకి చేర్చుకుంటే చీరె అడుగున సుడులు తిరిగి ఉన్న త్రాచుపాము తటాలున ప్రాకి బయటికి పోయింది. సర్పం మీద పవ్వళించిన స్వామి తన తల్లి కళ్ళకు చక్కని చుక్కలా, చల్లని చందమామలా కనిపించాడు! మయమరిపించాడు!

## భాట్టం శ్రీరామమూర్తి

పేదరికం ఒక పెనుభూతం. దారిద్ర్యం ఒక మహమ్మారి, కడుపున తిండిలేక మలమలమాడే గర్భదరిద్రుల గోడు బాబా వినలేక కంపించి పోయేవాడు. తన హృదయం ద్రవించి పోయేది. ఇంటి ముందుకు వచ్చిన ముష్టివాళ్ళకు ఏమీ పెట్టకుండా విసిరికొడితే, కసిరి కోప్పడితే బాబా తట్టుకోలేక గుక్కపెట్టి ఏడ్చేవాడు. నాడేకాదు, నేడు కూడా, పేదల బాధలు బాపుటే పరమ ధర్మముగా బాబా భావిస్తారు. అతడు నరుడుకాదు నారాయణుడు. దరిద్ర నారాయణుడు అంటారు. ఇట్టి మహత్తరమైన, మహోన్నత మైన మానవతావిలువలను జీర్ణించుకుని, దయామయుడుగా, ధర్మపరుడుగా, సత్యకర్మలు ఆచరించే 'మానవుడే మాధవుడు' అని బాబాగారు నేటికీ బోధిస్తారు. తన జీవిత సారాంశమే ఈ దివ్య సందేశాన్ని మానవాళికి అందించింది.

**దయధర్మవినాసత్యకర్మనహీ**

బృందావనంలో ప్రజలను, పొదలను, నదులను, పర్వతాలను పశుపక్షి మృగసంతతి అంతటినీ పరవశింప జేసిన వేణుగానలోలుడు బాలకృష్ణుడే నేడు సనాతన సారథి పాత్ర నిర్వహిస్తూ, సర్వజీవరాసులపట్ల, సకల జీవలోకం పట్లా దయామృతాన్ని వర్షిస్తూ తన దివ్య అవతార తత్త్వాన్ని

మానవాళికి చాటి చెప్తున్నాడు. 'దయ, ధర్మ, వినాసత్యకర్మ నహీ'. ఇదే బాబాగారు మధుర గానములో మన హృదయాన్ని కదిలించే సుధాస్రవంతి. ఇదే మన 'గుండెల్లో సదా నింపుకొని జీవించవలసిన బాబాగారి దివ్యప్రేమ సందేశం.

బాబాగారికి పశుపక్ష్యాదుల యందు గొప్ప ప్రేమ. విశ్వాసానికి, కృతజ్ఞతకీ మారుపేరుగా నిలిచే ఆ జీవగణం పట్ల అపారమైన కృపా విశేషాలు చూపించేవారు. భూమాతఅన్నా, గోమాతఅన్నా బాబాగారికి గొప్ప గౌరవం. జీవకారుణ్యానికి స్వామిది పెట్టింది పేరు. కరుణా మూర్తులు, దయాస్వభావులు స్వామి.

## దయామయుడు - కృపాసాగరుడు

స్వామి అపార కృపాసాగరుడు, దయాసముద్రుడు, సర్వప్రాణులపట్ల సమభావం కలిగిన కరుణామూర్తి. పక్షి మొదలు వృక్షం వరకు, చీమ మొదలు ఏనుగు వరకు అన్ని ప్రాణులూ సర్వేశ్వరుని స్వరూపాలేనని స్వామి భావిస్తారు. జీవ జాలమేకాదు. నిర్జీవ పదార్థాలపట్ల కూడా వారికి ప్రేమ భావమే ఉంటుంది. సహన సానుభూతులే ప్రదర్శిస్తారు. జంతుజాలంలో ఉండే మంచి స్వభావాన్ని మానవులకు ఎంచి చూపిస్తారు. మానవుడు సకల సద్గుణరాశికాడు. అదేవిధంగా జంతు జాలానికి కూడా ప్రేమానురాగా లున్నాయి. సహన సానుభూతులున్నాయి. కృతజ్ఞతాపూరక మైన ప్రవర్తన ఉంది. మానవునకు మించిన మంచి లక్షణాలు ప్రదర్శించిన స్వల్ప ప్రాణులు అనేకం ఉన్నాయి.

**పశ్చిమగోదావరి జిల్లా భీమవరంలో శ్రీ గుడివాడ వెంకటేశ్వరరావు దంపతులచే నిర్మించబడిన శ్రీ సత్యసాయి కళ్యాణమందిరం మేడపైన ఉచిత కుట్టు మిషన్ శిక్షణా కేంద్రం ఏర్పాటు చేయబడినది. ఇచట ప్రతిరోజు ఉదయం 15 మందికి, సాయంత్రం 15 మందికి మూడునెలల పాటు శిక్షణ యివ్వబడుతుంది. సంవత్సరం మొత్తం మీద ఈ విధంగా 120 మందికి ఉచితంగా శిక్షణ యిస్తున్నారు. ప్రతి సంవత్సరం పేదవారికి రెండు కుట్టుమిషన్లు కూడా ఉచితముగా శ్రీ సత్యసాయి భజన మండలి వారు ఇస్తున్నారు. ఈ సదవకాశమును వినియోగించుకోమని శ్రీ గుడివాడ వెంకటేశ్వరరావుగారు తెలియజేయుచున్నారు.**

సత్యధర్మాల కోసం, శాంతి ప్రేమల కోసం అవతరించాడు

శ్రీరాముడు సత్యధర్మాల కోసం అవతరించాడు. శ్రీ కృష్ణుడు శాంతి ప్రేమల కోసం పుడమిని అవతరించాడు. బుద్ధ భగవానుడుఅహింసాతత్త్వం ప్రబోధించాడు. ఈ ఐదు మానవతా విలువలను అనగా సత్యధర్మశాంతి ప్రేమ అహింసా తత్త్వములను ప్రత్యేకించి ప్రబోధించేందుకు పర్తిక్షేత్రంలో వెలసిన, పూర్ణావతారం భగవాన్.

యీ అవతారంలో ప్రత్యేక ఆయుధధారణ అంటూ జరగదు. శ్రీ కృష్ణుడు సుదర్శన చక్రం పట్టుకున్నాడు. శ్రీరాముడు కోదండపాణియై వెలిసాడు. పర్తీశుడు సత్య, ధర్మ, ప్రేమ, శాంతి, అహింసలే ఆయుధాలుగా స్వీకరించి త్రిభువన సంచారం చేస్తున్నారు. మానవత్వానికి మాధవత్వానికి మధ్యన సరిహద్దులులేవని చాటిచెపుతున్నారు. నరుడే నారాయణుడుగా, మానవుడే మాధవుడుగా, జనుడే జనార్ధనుడుగా రూపొంది, దైవత్వానికి ధీటుగా, ధర్మ సామ్రాజ్యాన్ని నెలకొల్పాలని సంకల్పించారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబా.

అహంకారానికి కత్తిపోటుగను, అంధకారమునకు వెలుగువలెనూ, కుంటివాని చేతికి కర్రవలెనూ, దుర్గమారణ్యా ములో బాటవలెనూ, ముళ్ళపొదల మధ్య రోజా పుష్పము వలెనూ, ప్రపంచంలో దైవత్వం ప్రకాశిస్తూనే ఉంటుంది. ఆ శక్తిని సంగ్రహించి, లోకహితం కోసం, విశ్వశ్రేయస్సు కోసం, వినియోగించడమే మానవుని ప్రధాన కర్తవ్యం అన్నారు బాబాగారు.

ద్వాపరయుగంలో శ్రీ కృష్ణపరమాత్ముడు రెండే రెండు సందర్భాల్లో ప్రవక్తగా ప్రబోధకుడుగా, ప్రవర్తించి ఉపదేశించడం జరిగింది. కురుక్షేత్ర సంగ్రామంలో అర్జునుడికి గీతోపదేశం చేయడం అందులో మొదటిది. ఉద్ధవునితో సంభాషణ జరిపినపుడు చేసిన ఉపదేశం రెండవది. సత్యసాయీశుడు మాత్రం పసిబాలుడుగా ఉన్ననాటి నుండి బిడ్డలు గురువుగా వ్యవహరిస్తూ జగద్గురువుగా భాసిస్తూ విశ్వమానవకోటిని, ఉత్తేజపరుస్తున్న, కోటాను, కోట్ల సందర్భాలు మనకు తెలుసు.

శ్రీ కృష్ణుడు బోధించిన భగవద్గీతను కేవలం నలుగురు మాత్రమే వినగలిగారు. ఎవరికోసం అయితే గీతోపదేశం చేయబడిందో, ఆ అర్జునుడు విన్నాడు. తన రథంపై ఎగురుతున్న జెండాపైనున్న హనుమంతుడు

(తరువాయి 80వ పేజీలో.....

# ఇంటర్వ్యూలు కాదు - సేవలు చేయాలి

భగవాన్ సాయి తరుణమాసన్నమైనప్పుడు మనం కోరకుండానే మనజీవితంలో ఆయన ప్రవేశించుతారు. మనం ఒకవేళ ఆయనను విడిచినా, ఆయన మాత్రం మనల్ని విడిచిపెట్టరు. మన వెంట, జంట, ఇంట, కంటనే ఉంటారు. మనకు జరిగే ప్రతి మంచి, చెడు మనకు పాఠములు నేర్పుతునే ఉంటాయి. మంచికన్నా చెడు నుంచే మనం గుణపాఠములను నేర్చుకుంటాం. సాయి పిలుపు లేనిదే మనం పుట్టపర్తి వెళ్ళలేము. ఆ దేవుని దర్శనం చేసుకోలేము. మన మనసులో ఏమున్నదో ఆయనకు బాగా తెలుసు. ఆయన సర్వాంతర్యామి. దర్శన సమయంలో స్వామి ఒక్కొక్కసారి మన ఇరుప్రక్కలా వున్నవారిని చూస్తారు. మన వెనుకనున్నవారిని మాట్లాడిస్తారు కాని మనల్ని మాత్రం చూడనట్లునటిస్తారు. అప్పుడు మనం బాధపడుతాం, సాయి మనల్ని చూడలేదేయని సహజంగా విలపిస్తాం. **'ఎవరినైతే స్వామి చూడరో వారే అదృష్టవంతులు'** అంటారు మర్ఫెట్. ఎందువలనంటే స్వామి మనల్ని చూడకపోవటం వలన మనలో మధన ప్రారంభమవుతుంది. మనలోని దోషాలు ఏమిటో అన్వేషణ చేస్తాము. వాటిని తెలుసుకొని వాటిని మన నుండి వైదొలగించుకోవటానికి ప్రయత్నిస్తాము. సాయికి మరింత చేరువకావటానికి ప్రయత్నిస్తాము. ఆ విధంగా చేయాలిగాని సాయి మనల్ని చూడలేదని బాధపడరాదు. సాయిని నిందించరాదు. మనలో మార్పురావడానికే సాయి ఆ విధంగా చేస్తుంటారని మనం భావించాలి. సాయి చూచినా చూడకపోయినా స్వామి దర్శనం బాగా జరిగినందులకు సంతృప్తి జెందాలి. దర్శన సమయంలో ఏకాగ్రత ముఖ్యము. ప్రక్కవారితో మాట్లాడ కూడదు. వారి ఏకాగ్రతను భంగం చేయకూడదు, అంతరాయం కలిగించకూడదు.

పుట్టపర్తి వెళ్ళిన భక్తులలో సహజంగా ఒక కోరిక ఉంటుంది. ఇంటర్వ్యూ కావాలని అభిలాష ఉంటుంది. ఇంటర్వ్యూ దొరకలేదని బాధపడుతుంటారు. వెళ్ళిన వారందరికి ఇంటర్వ్యూ దొరకటం సాధ్యంకాదు. అది వారివారి పూర్వజన్మ సుకృతంపై ఆధారపడి ఉంటుంది. అంతేకాదు మనదేశం వారేగాక ఎన్నో విదేశాలనుంచి అక్కడకు వస్తుంటారు. వాళ్ళను కూడా సంతృప్తిపరచి, సంతోష పెట్టాలి గదా! భగవాన్ సాయి చేయతలబెట్టిన అవతారతత్త్వ కార్యక్రమాలు, సేవాకార్యక్రమాలు అన్ని దేశాలలో విస్తరించేట్లు చూడాలి. అటువంటి బృహత్తర కార్యక్రమాలను అన్ని దేశాలవారు చేబట్టేటట్లు చూడాలి. ఈ విధంగా నిత్యమూ ప్రపంచం నలుమూలల నుండి వేలాది మంది పుట్టపర్తి వస్తుంటారు, పోతుంటారు. వారి యోగక్షేమాలను కూడా చూడవలసిన గురుతర బాధ్యత భగవాన్ సాయి మీద ఉన్నది. అటువంటి స్థితిలో అక్కడికి వెళ్ళిన వారందరికీ ఇంటర్వ్యూ కావాలని కోరుకోవటం విజ్ఞత అనిపించుకోదు.

**డా॥ ఎస్.ఆర్.వై. భక్తప్రియాదేవి, పుట్టపర్తి**

ఒకవేళ ఇంటర్వ్యూ యిచ్చినా, 15 నిముషాలు, అరగంటే గదా! అదికాదు మనం కోరవలసింది. సాయిని మన హృదయంలో ప్రతిష్ఠించుకోవటానికి ప్రయత్నించాలి. అప్పుడే మనకు ఆనందం కలుగుతుంది. ఇంటర్వ్యూలు యివ్వలేదని, బహుమతులు ప్రసాదించలేదని బాధపడరాదు. సాయి సాన్నిధ్య దర్శన భాగ్యంకన్నా సువర్ణ అవకాశం వేరొకటి లేదు. సాయి చేబట్టే సేవా కార్యక్రమాలలో పాల్గొంటూ అందరినీ ప్రేమించటం నేర్చుకోవాలి. అప్పుడే భగవన్ సాయి అనుగ్రహం మన మీద వర్షిస్తుంది. అప్పుడు మనం శాశ్వతంగా తరిస్తాం. కనుక అట్టి శాశ్వత ఆనందాన్ని పొందడానికి ప్రతి ఒక్కరూ కృషి చేయాలి. కనుక ఇంటర్వ్యూల కోసం తాపత్రయపడక సేవలలో పాల్గొనాలి. ☆

"పుడమికి సరిమధ్య పుట్టపర్తి అనగ
ఆత్మ విద్య ఇందె అవతరించె
విశ్వమానవ కోటి విజ్ఞాన మొందంగ
విశ్వవిద్యాలయము లిచట వెలసె
శాంతి సౌఖ్యములను సర్వదేశములందు
వెదజల్లెడి విజ్ఞుండిచట వెలసె
నియతి తప్పని మహానిష్ఠగల భక్తులు
వేయి లక్షలు కోట్లు వెలసిరిచట
సత్య ధర్మ శాంతులు జగతిని
స్థాపించే భూమిలో చక్కగా సాయి ప్రభువు
సత్యసాయి భువిని సంపూర్ణ
ప్రేమమూర్తి అగుచు పుట్టె మోదమలర"

- బాబా

# విజ్ఞానానికి ఆధ్యాత్మిక ప్రజ్ఞానమును జోడించాలి

### సృష్టి - సృష్టికర్త :

"ఈనాడు సాంకేతిక విజ్ఞాన శాస్త్రము ఎంతో వికసించినప్పటికి, మానవునిలో దివ్య భావములు అభివృద్ధి కావటం లేదు. టెక్నాలజీ (సాంకేతిక శాస్త్రము) సైన్సు (విజ్ఞాన శాస్త్రం) కు బిడ్డ. దీనికి ముందే పుట్టినది వేదము. సైన్సు సృష్టిని తెలుసుకుంటే, వేదము సృష్టికర్తను తెలుసుకుంటున్నది. విజ్ఞాన శాస్త్ర విభాగాలన్నీ పుట్టిన, సృష్టించబడిన వాటిని పరిశోధించేవే. కాని, అన్నింటికీ ఆధారమైన సృష్టికర్త ఒకడున్నాడు. కేవలం సృష్టిని అనుసరిస్తూ పోవటం చేత, మానవుడు సృష్టికర్తను మరచిపోతున్నాడు. సృష్టికర్తను మరచిపోవటం చేత, మానవుని యందు ప్రేమ అభివృద్ధి కాలేకపోతున్నది. కారణమేమిటి? ప్రేమనే పరమాత్ముడు. ప్రేమను మరచినప్పుడు పరమాత్మనే మరచినవారమవుతాము. పరమాత్మనే మరచిన తరువాత ప్రేమ మన యందు ఎక్కడ వృద్ధి చెందుతుంది?

### సైన్సు చెడ్డది కాదు :

విజ్ఞాన శాస్త్రము ఈనాడు ఎంత ఉపయోగకరంగా, సహాయకారిగా, అత్యద్భుతమైనదిగా కనిపిస్తున్నదో, అంత అపకారాన్ని కూడా కలిగిస్తున్నది. అయితే సైన్సు స్వతహాగా చెడ్డది కాదు. ఉపయోగించుకొనే విధానంలో , మనం దానిని పెడమార్గం పట్టిస్తున్నాం. జగత్తు మర్మములను, రహస్యాలను వెలువరించేది సైన్సు. అయితే రహస్యాలను గుర్తించటం చేత, మనకు కలిగిన ఫలితమేమిటి? గుర్తించటం వేరు, ప్రవర్తించటం వేరు. గుర్తించిన దానిని ఆచరణలో పెట్టడానికి మనం ఏమాత్రం ప్రయత్నించటం లేదు. ప్రతిచోట అణువు ఉన్నది. అణువులు ఒకచోట చేరటం వలన పెద్ద స్వరూపం ఏర్పడుతున్నది. అణువు లేనిది జగత్తులో లేనే లేదు. సర్వత్రా ఉన్న అణువుల కూడికనే విశ్వరూపమని చెప్పవచ్చు. అణువులేని ప్రదేశమే లేదని మనం బోధిస్తున్నాం. కాని, అణువును ఉపయోగించుకునే విధానమును మనం సక్రమంగా తెలిసి కోవటం లేదు. ఆచరణలో పెట్టగలిగినప్పుడే సైన్సు వల్ల కలిగే ప్రయోజనాలు, పవిత్రమైనవిగా ఉంటాయి.

### సైన్సు - ప్రేమ :

మన ప్రేమను అభివృద్ధి పరచే సైన్సు, మనకు ఈనాడు అత్యవసరం. Science of Love ప్రేమను పెంచే విజ్ఞాన శాస్త్రాన్ని మనం అభివృద్ధి పరచుకోవాలి. కాని ఈనాడు Split of Love ప్రేమ విచ్ఛిత్తి జరుగుతున్నది. ప్రేమను పెంపొందించే విజ్ఞాన శాస్త్రాన్ని ఛేదిస్తున్నాము, విచ్ఛిన్నం చేస్తున్నాం. కనుకనే మన ప్రేమ భగ్నమై

## భగవాన్ సాయి హితబోధ

పోతున్నది, ప్రేమ సంకుచిత స్థానాన్ని చేరిపోతున్నది. ఆధునిక కాలంలో విజ్ఞానం వికసించిన ఈ సమయంలో నవీన నాగరికత యుగంలో మానవుడు ఎంతటి ఉన్నత స్థితిలో ఉండాలో మీరు యోచించుకోవాలి. సాంకేతిక విజ్ఞానం తెలియని ప్రాచీన కాలంలో ఏ విద్య కూడా లేని అంధయుగంలో మానవుడు ఒక దివ్యభావంతో ఉండేవాడు. కాని, క్రూర మృగములకంటే హీనంగా ప్రవర్తిస్తున్న నేటి యుగంలో మానవుడని చెప్పడానికి కూడా సాధ్యం కాకుండా ఉంది. మానవుడు తన తోటి మానవుని చంపే క్రూరత్వానికి పాల్పడుతున్నప్పుడు, విజ్ఞానం ఎక్కడ అభివృద్ధి అయినట్లు? దీని అభివృద్ధి లక్షణాలేమిటి? సైన్సు అభివృద్ధి చెందినది గాని, ప్రేమ మాత్రం అభివృద్ధి గాంచ లేదు. ఈనాడు మానవుడు తోటి మానవుని చంపుతున్నాడు. మానవ జాతిని, మానవజాతే అంత మొందించుకుంటున్నది.

### బింబము - ప్రతిబింబము :

సైన్సులో ఏవిధమైన దోషము లేదు. సైన్సును సక్రమ మార్గంలో అనుభవించాలి. సైన్సుకు, ఆధ్యాత్మికానికి సన్నిహిత సంబంధం చేకూర్చాలి. అప్పుడు మనము జీవితమును సరియైన మార్గంలో అనుభవించగలుగుతాం. అయితే ఈనాడు సత్యమైన దానిని విశ్వసించటం లేదు. కృత్రిమమైన దానిని విశ్వసిస్తున్నాము. సత్యమైన విషయాన్ని ఏనాడు అనుభవిస్తామో, ఆనాడే సైన్సు అభివృద్ధి జెందు

తుంది. సత్యాన్ని విశ్వసించాలి, సైన్సునూ విశ్వసించాలి. అయితే ఈనాడు ఒక్క సైన్సును మాత్రమే విశ్వసిస్తున్నారు. అయితే అది ప్రతిబింబము మాత్రమే. బింబము ఆధ్యాత్మికము. బింబ ప్రతిబింబములు రెండు వేరు, వేరైనా రెండింటికి సంబంధమున్నది. బింబాన్ని పట్టుకుంటే, ప్రతి బింబాన్ని కూడా పట్టుకుంటావు. ఈ రెండింటి ఏకత్వాన్ని అనుభవించడానికి మనం ప్రయత్నించాలి.

**విజ్ఞానము - ఆధ్యాత్మికము :**

ప్రకృతికి పరమాత్మ తత్త్వమునకు సన్నిహిత సంబంధమున్నది. చంద్రునికి, సముద్రానికి, మానవుని మనస్సుకు సామ్యమున్నది. సముద్రం పూర్ణిమనాడు ఉప్పొంగుతుంది. సముద్రానికి, చంద్రునికి ఏమిటి సంబంధం? చంద్రునికి మనస్సుకు సన్నిహిత సంబంధ మున్నది. ప్రకృతి, మనసు బింబ ప్రతిబింబాలు. "చంద్రమా మనసో జాతః" అంటుంది వేదము. మీకు మీరు పరీక్షించుకోవచ్చు. పూర్ణిమనాడు మనకు తెలియ కుండానే ఏవో ఉద్రేకాలు వస్తుంటాయి. ఫిట్స్ వచ్చే వారికి, పిచ్చివారికి ఉద్రేకం పెరుగుతుంది. సముద్రంలోను, చంద్రునిలోను ఉన్న పదార్థములు, మనస్సులో ఏకమై పోవటం చేత, ఈ ఏకత్వమును ప్రకృతి నిరూపిస్తుంది. ప్రకృతి, విజ్ఞాన ఆధ్యాత్మికముల సమన్వయం. మానవుడు ఈనాడు ఆధ్యాత్మిక, విజ్ఞాన సిద్ధాంతముల గురించి చెప్ప గలుగుతున్నాడు గాని, సమన్వయ పూర్వకంగా ఆచరణలో చూపలేకపోతున్నాడు. చెప్పునది చేసినప్పుడే - ఈ రెండింటి దివ్యత్వాన్ని మనము అనుభవించగలము.

**అహంకారం కాదు వినయం:**

ఈనాటి చదువులలో క్రమశిక్షణ ముఖ్యంగా కాపాడు కోవాలి. ప్రేమతత్త్వాన్ని పెంచుకోవాలి. నేటి విద్యా విధానం లో అహంకారమే అధికంగా పెరుగుతున్నది. నాలుగు కాగితాలు ఎక్కువ తిరగవేసినాడంటే, వాడు మహా అహం కారిగా తయారవుతున్నాడు. అహంకారం అనేక అనర్థాలకు దారి తీస్తుంది. ఎంత ఎక్కువ చదివితే అంత ఎక్కువ వినయ విధేయతలు పెరగాలి. అయితే ఈనాడు ఏదో కొంచం తెలుసుకొని విర్రవీగుతున్నారు. విర్రవీగేవాడు వెర్రివాడే గాని తెలిసినవాడు కాదు. నిజమైన విద్యా వంతునికి అహంకారం ఏమాత్రం ఉండదు. వాని భావాలు, వినయ విధేయతలు ఉట్టి పడు తుంటాయి. నేటి కృత్రిమమైన చదువులు కృత్రిమ జీవితాన్నే రూపొందింపజేస్తున్నాయి.

**విశ్వాసము :**

కరుణ ప్రేమలు లేకపోతే అది హృదయమే కాదు. ప్రతి మానవునిలో స్నేహతత్త్వం ఉండాలి. ఈ స్నేహ తత్త్వం ప్రేమవల్లనే కుదురుతుంది. ప్రేమ విశ్వాసం నుండి వస్తుంది. విశ్వాసం వల్లనే శాంతి కలుగుతుంది. శాంతి వల్ల ఆనందం చిక్కుతుంది. ఆనందంలో దైవత్వము ప్రాప్తిస్తుంది. దైవత్వాన్ని పొందాలనుకుంటే విశ్వాసాన్ని అభివృద్ధి పరచుకోవాలి.

## సూ          క్తి

తాను దేహమంటే తప్పదు బంధంబు
తానె బ్రహ్మమనెడి తత్త్వమరసి
అహము వీడి సోహమనుమంత్రమెఱిగించు
సత్యసాయి సూక్తి భుక్తి ముక్తి.

మనసు తొడిగి నరుడు మానవుడాయెను
మనసు వీడినంత మాధవుడగు
మనసు మర్మ మెఱిగి మసలుకోవలెనను
సత్యసాయి సూక్తి భుక్తి ముక్తి.

పెండ్లి గాక మునుపు పిల్లెవరో! వరుడెవరో!
మూడు ముళ్ళు వేసి, ముదముతోడ
భార్య భర్తలగుచు బండి లాగుదురను
సత్యసాయి సూక్తి భుక్తి ముక్తి.

పుల్లనైన తేడు పుట్టిన సమయాన
పోవునపుడు వెంట పొల్లు రాదు
కర్మఫలము తప్ప మఱి యేమి రాదను
సత్యసాయి సూక్తి భుక్తి ముక్తి.

పరుల మేలు గోరి బ్రతుకుటె సార్థంబు
పరులకెగ్గు దలప పాపమంటు
సకల వేద శాస్త్ర సమ్మత మిదియను
సత్యసాయి సూక్తి భుక్తి ముక్తి.

- యం. మునికృష్ణారెడ్డి, తిరుత్తణి





నిజమైన శాంతి :

ఈనాడు లోకంలో మనం అనుభవించవలసినవన్నీ అనుభవిస్తూనే ఉన్నాం. కాని తృప్తి మాత్రం లేదు. అసంతృప్తి వెంటాడుతూనే ఉన్నది. కారణమేమిటి? స్వస్థానమైన ఆత్మ తత్వాన్ని చేరుకొనేంత వరకు తృప్తి కలుగదు. లోకంలో ఎన్ని సుఖాలు ఉన్నప్పటికీ, నిజమైన సుఖాన్ని అవి అందించవు. ఒక బంగారు గిన్నెను తయారు చేసి, దాని చుట్టూ వజ్ర వైఢూర్య మరకత మాణిక్య గోమేధిక పుష్యరాగాలను పొదిగించి, దానిలో ఒక చేపను పెట్టినా మనుకోండి. అంతటి విలువైన గిన్నెలో సుఖంగా ఉంటుందా చేప? అందులో చేపకు ఏమాత్రం శాంతి ఉండదు. తన స్వస్థానమైన జలములోనికి చేరినప్పుడే దానికి శాంతి. అదే విధముగా ఎన్ని సంపదలు, సౌకర్యములూ ఉండినప్పటికీ - అవి తాత్కాలిక సుఖాలనే అందిస్తాయి గాని, శాశ్వతమైన శాంతిని మాత్రం అందించలేవు. ఈనాడు సంపన్నులకు శాంతి లేదు. రాజకీయ నాయకులకు శాంతి లేదు. మినిష్టర్లకు శాంతి లేదు. అయితే వాళ్ళకు ఏదీ తక్కువ లేదే? సకల సౌకర్యాలు ఉంటున్నాయి గదా! అయితే శాంతి లేకుండా పోవటానికి కారణమేమిటి? లౌకిక ఆనందములు కావలసినన్ని ఉన్నాయి గాని, ఆత్మానందం మాత్రం లేదు. ఇది ఎలా లభిస్తుంది? తన స్వస్థానము ఆత్మస్థానము. దానియందు మనస్సు అమర్చినప్పుడే, తనకు నిజమైన జీవితము, నిజమైన శాంతి.

అహంకారం - ఆసక్తి :

శాంతి ఎలా లభిస్తుంది? ఆశలను తగ్గించుకోవాలి. ఆశలను తగ్గించుకుంటే అశాంతి మనలను బాధించదు. అనేకమంది నా దగ్గరకు వచ్చి 'స్వామీ! నాకు శాంతి కావాలి' అని అడుగుతుంటారు. "నాకు", "కావాలి" - ఈ రెండింటిని తీసివేస్తే మిగిలేది శాంతే గదా! "నాకు" అనేది అహంకారం, "కావాలి" అనేది కోరిక, ఆసక్తి. అహంకారాన్ని ఆసక్తిని తొలగించుకుంటే ఉండేది శాంతే. ఇవి ఉన్నంత వరకు అశాంతే తప్ప శాంతి ఉండదు.

కోరికలు తగ్గించుకోవాలి :

మన జీవితం ఒక దీర్ఘ ప్రయాణం. మీరు రైల్వే స్టేషన్లలో చూస్తుంటారు. Less luggage is more comfort make the travel a pleasure. తక్కువ సామానుతో ఎక్కువ ఆనందంతో మీ ప్రయాణాన్ని సుఖప్రదం చేసుకోండి! అని వ్రాసి ఉంటుంది. లగేజి ఎక్కువైతే వర్రీ ఎక్కువౌతుంది. శాంతి ఎక్కడ ఉంటుంది? వేదాంతం కూడా 'న శ్రేయో నియమం వినా' అని చెబుతున్నది. మితిమీరిపోరాదు. నియమం ఉండాలి. మితి మీరిన కోరికలు మతిని చలింపజేస్తాయి. కోరికలు తగ్గించుకున్నవారే మనశ్శాంతిని పొందగలుగుతారు.

సమన్వయపరచాలి :

సైన్సుకు జీవిత సామర్థ్యాన్ని పెంచే స్తోమత, అధికారం లేదు. జీవిత సమగ్రతను పోషించే అధికారం ఆధ్యాత్మికతకు మాత్రమే ఉన్నది. మానవతావిలువలు ఒక ఆధ్యాత్మికత్వంతో జోడించినప్పుడే అభివృద్ధి కాగలవు. కేవలం సైన్సుతో ముడిపెడితే అవి ఏమాత్రం అభివృద్ధి కావు. సైన్సు వేరు ఆధ్యాత్మికత వేరు అని విభజించరాదు. ఈ రెండింటిని సమన్వయ పరచినప్పుడే సమగ్ర విజ్ఞానాన్ని పొందగలుగుతాం. విజ్ఞానానికి ఆధ్యాత్మిక ప్రజ్ఞానాన్ని జోడించినప్పుడే ఆనందం లభిస్తుంది. కనుక ఆధ్యాత్మిక తత్వంపైన సంపూర్ణ విశ్వాసం పెట్టుకొని, విజ్ఞాన శాస్త్రంలో తగిన పరిశోధనలు సలపండి!

*(భగవాన్ సాయి దివ్యోపన్యాసములనుండి)* ★



## మనోదౌర్బల్యమే మహోపకారి

ఒక గ్రామంలో కలరాపడి చాలామంది చనిపోయినారు. ఒక సన్యాసి ఆ గ్రామమునకు వచ్చి తిరిగి పోవుచు, దారిలో కనపడిన కలరా దేవతను, 'ఎందరిని కాజేసితివి?' అని అడిగెను. 'పదిమందిని మాత్రమే' అని ఆమె బదులు చెప్పెను. సన్యాసి, 'వందకు పైగా చనిపోయినట్లు విన్నానే! నిజం చెప్పు' అనెను. అప్పుడా దేవత, 'నిజంగా నేను చంపేంది పదిమందిని మాత్రమే. తక్కినవారు భయపడి చచ్చినవారు' అని చెప్పెను. కాబట్టి మనోదౌర్బల్యమే మానవునకు మహోపకారి.

- బాబా



# నీ కర్మఫలమే నిన్ను కాపాడింది

"ఓం నమో హిరణ్యగర్భాయ
ప్రాణాయ జగతాత్మనే
సకలైశ్వర్య శరీరాయ,
నమస్తే యోగహేతవే"

సకల చరాచర జగత్తులోని సమస్త జీవరాసులకు ప్రాణశక్తిదాత అయిన హిరణ్యగర్భశక్తిప్రదాత, సృష్టికర్త, స్థితికారుడు, లయకారుడు అయిన భగవాన్ సాయి దివ్యశ్రీ చరణాలకు నమోవాకములు. లీలామానుష వేషధారి, ఆధ్యాత్మిక జ్ఞాననిధి, దివ్యఅవతారమూర్తి. తన సృష్టిలోని జీవరాసుల యోగక్షేమాలను చూస్తూ, వారిపై తన దయామృతాన్ని వర్షింపజేస్తున్న ఆ కరుణామూర్తి సాయిరాముని దివ్యచరణాలకు మరొకమారు సమస్కృతులు తెలుపుకుంటున్నాను.

21వ శతాబ్దంలోనికి భగవానునితో కలిసి మనమందరం అడుగిడినాము. 20వ శతాబ్దంలో భగవాన్ సాయి షిర్డీసాయి అవతారంలో 1918 వరకు వుండి, అటు పిమ్మట పరిపూర్ణ అవతారమైన శ్రీ సత్యసాయిగా, 1926లో తిరిగి వచ్చి, 20వ శతాబ్దం నుండి 21వ శతాబ్దంలోనికి మనతో కల్సి అడుగిడారు. అంటే షిర్డీసాయి, పర్తిసాయి అవతారాలు రెండూ కలిపి భగవంతుడు 20వ శతాబ్దంలో మనతో 92 ఏళ్ళు గడిపారు. ఎందుకు? ఒక తల్లి తన బిడ్డను పాఠశాలకు పంపుతుంది. అతని రాకకై ఆతృతగా ఎదురు చూస్తుంటుంది. ఆ పిల్లవాడు ఇంటికి సమయానికి రాకుండా తిరుగుతూవుంటే, ఆ తల్లి పాఠశాలకు వెళ్ళి పిల్లవాడ్ని వెదకి పట్టుకొని ఇంటికి తీసుకొని వస్తుంది. అదేవిధంగా అమ్మలగన్న అమ్మ సాయిమాత దివి నుండి భువికి ఏతెంచి తన బిడ్డలకు త్రోవచూపిస్తూ, ఈ భూమిపై వారు సాధించవలసిన కార్యక్రమాన్ని తెలియజేస్తోంది. మనలోని అజ్ఞానాన్ని రూపుమాపి, మన నిజతత్వాన్ని గుర్తించేందుకు మనం చేయవలసిన ఆధ్యాత్మిక సాధనను తెలియపరచి మనం చేరవలసిన గమ్యస్థానానికి త్రోవ చూపేందుకు దిగివచ్చిన దివ్యజనని మన సాయిమాత.

నేను యువకుడుగా ఉన్నప్పుడు 'పూతన'తో పోల్చబడేవాడిని. 'పూతన' అనే ఆడరాక్షసి చిన్ని కృష్ణునికి విషం ఇవ్వాలని ప్రయత్నిస్తుంది. సంస్కృతంలో 'పూతం' అంటే పవిత్రమైనది అని అర్థం. పూతన అంటే పవిత్రం కానిది. అనగా ఆమె అపవిత్రమైనది, దుర్భావములు కలది. ఈ పూతన శ్రీ కృష్ణుడు మూడు నెలల పసిపిల్లవాడిగా వున్నప్పుడు అతనిని అంతమొందించాలని గోకులానికి వెళ్తుంది. భాగవతంలో వ్రాసిన ప్రకారం ఆమె గోకులానికి చతుర్దశినాడు వెళ్తుంది. దాని అర్థం ఆమె శరీరంలో పదునాలుగు (చతుర్దశి) చోట్లు విషపూరితమైనవి. అవి అయిదు కర్మేంద్రియాలు, అయిదు జ్ఞానేంద్రియాలు,

**టి.జి. కృష్ణమూర్తి, మద్రాసు**

మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము. వీటన్నింటితో ఆమె గోకులానికి వెళ్తుంది. గో - అనగా భక్తి, కులము - అనగా గుంపు. భగవంతుడు ఎల్లప్పుడూ భక్తుల గుంపుల మధ్య నివసిస్తాడనడానికి నిదర్శనం, గోకులం. ఇక నా స్వవిషయానికి వస్తే పూతనవలెనే నాకు కూడా భగవంతునిపై ఏ మాత్రం విశ్వాసం వుండేదికాదు. ఆమె గోకులానికి భగవంతుని అంతమొందించాలని వెళ్తే నేను భగవాన్ సాయి భగవంతుడు కాదని నిరూపించాలనే ప్రయత్నంతో పుట్టపర్తి వెళ్ళాను. పూతన గోకులానికి చాలా ఆర్భాటమైన వేషధారణలో వెళ్తుంది. అదే విధంగా నేను కూడా ఆర్భాటంగా వెళ్ళాను. పూతనకు శరీరంలో 14 చోట్లు విషపూరితమైతే, నా శరీరంలో ఎన్ని భాగాలు కలుషితమయినవో నేను లెక్కించలేను. గోకులంలో ప్రవేశించగానే పూతన చిన్నికృష్ణుని సాన్నిహిత్యాన్ని పొందగల్గుతుంది. వ్యాసులవారు ఆ దృశ్యాన్ని ఈ విధంగా వర్ణిస్తారు. పూతన చిన్నికృష్ణుని సమీపించగానే భగవానుడు కనులు మూసుకొని ధ్యానమగ్నుడవుతాడు. గోకులంలోని ప్రశాంత వాతావరణమును భగ్నపరచకుండా ఈమెకు ముక్తిని ఎలా ప్రసాదించాలా అని ఆలోచనామగ్నుడయి కనులు మూసుకుంటాడు.

సందర్భం వచ్చింది కాబట్టి ఇక్కడ కాలాంతరంలో జరిగిన చిన్న విషయం చెప్తాను. బృందావనంలో స్వామి దివ్యసమక్షంలో విద్యార్థుల నడుమ నేను భాగవతం మీద ఉపన్యసిస్తుండగా ఈ ఘట్టం గురించిన వర్ణన చెప్తున్నాను. ఉపన్యాసమునకు అంతరాయం కల్గిస్తూ, స్వామి మధ్యలో 'ఎవరు చెప్పారు?' పూతనకు ముక్తిని ప్రసాదించేందుకు చిన్నికృష్ణుడు కనులు మూసుకున్నాడని' అన్నారు. నేను 'స్వామీ! శ్రీమద్భాగవతంలో వేదవ్యాసులవారు ఆ విధంగా వ్రాసారు' అన్నాను. అప్పుడు స్వామి ఇలా అన్నారు. 'నేను ఏం చేసానో వ్యాసుడు చూసాడా? నేను ఆనాడు కనులు ఎందుకు మూసుకోవలసి వచ్చిందంటే నా దృష్టి ఎవరిపైనైనా, ఎప్పుడైనా ప్రసరిస్తే, నా అనుగ్రహం ఆ వ్యక్తిపైన వర్షించి అతను పరిశుద్ధుడు అవుతాడు. అయితే నేను అప్పటికే పూతన యొక్క విధిని నిర్ణయించుకుని ఆమెకు ముక్తిని ప్రసాదించదల్చుకున్నాను. కాబట్టి ఆమెను చూడకుండా వుండేందుకు కనులు మూసుకున్నాను' అన్నారు.

ఇక నా విషయానికి వస్తే, పూతన వలెనే కలుషితమైన భావములతో నేను 1967లో ప్రశాంతినిలయం చేరాను. వెంటనే నాకు స్వామి సాన్నిహిత్యం లభించింది. అయితే స్వామి కనులు మూసుకొనలేదు. బదులుగా నా వైపే తీక్షణంగా చూసారు. తన విశాలదృష్టిని నాపై ప్రసరింప జేసారు. ఆయన అనుగ్రహామృత వర్షం నాపైన కురిసింది. నేను ఆ క్షణమే పునీతుడనయ్యాను. నాలో కలుగుతున్న మార్పు నేను గమనించగలిగాను. లౌకిక విషయవాసనల నుండి ఆధ్యాత్మిక తత్త్వంవైపు నా మనసు ప్రయాణిస్తున్నట్లు, నరకం నుండి స్వర్గంలోకి ప్రవేశిస్తున్న అనుభూతిని పొందాను. అప్పటి నుండి నా జీవనయానం సాయిపథంలోకి మారింది. విదేశాలకు వెళ్ళటం, అక్కడ ప్రాపంచిక సుఖాల నిమిత్తమై విచ్చలవిడిగా ఎంతో ధనం ఖర్చుచేయటం వంటి నా అలవాట్లు అనవసరమైనవి, స్వామిపథంలో పయనించేందుకు అవన్నీ అవరోధములు అవుతాయని గ్రహించగలిగాను. మెల్లగా స్వామి సంకల్పంతో ఒక్కొక్క అలవాటు నుండి బయటపడ్డాను. స్వామిని గురించి తెలుసు కుంటున్నకొద్దీ, ఆయన పట్ల నా ప్రేమ అధికమవుతూ వచ్చింది. నా చెడు అలవాట్లు దూరం అవుతున్న కొద్దీ, నేను స్వామికి దగ్గర అవుతున్నట్లుగా భావించేవాణ్ణి. స్వామి ప్రబోధాలు నా ఉనికిలో భాగంగా మారిపోయాయి. ఈ మార్పులు అన్నీ నాలో చోటుచేసుకొనగానే భగవానుని అనుగ్రహం వలన నేను ఆధ్యాత్మికోన్నతిపై దృష్టి సారించ గలిగినాను. 1986లో అనుకుంటాను. స్వామి నాకు సంభాషణాభాగ్యాన్ని ప్రసాదించారు. కానీ ఆనాడు స్వామి ఇచ్చిన అమూల్యసలహాలు నేను పొందిన అపురూప అనుభూతులు పూర్తిగా వ్యక్తిగతమైనవైనందున అవి నేను అందరితో పంచుకోలేను. అయితే ఆనాడు నేను స్వామి చెప్పిన విధంగా నడచుకుంటానని ప్రమాణం చేసాను. కానీ మద్రాసు తిరిగి వచ్చిన తర్వాత ఒక పక్షం రోజులలో నేను అన్నీ మర్చిపోయి, స్వామి చెప్పినట్లుకాక వ్యతిరేకంగా నడచుకొని స్వామికి ఇచ్చిన మాట తప్పినవాడనైనాను. స్వామి నా ప్రవర్తనకు కలత చెందారేమో, నాతో మాట్లాడటం మానివేసారు.

స్వామి నాతో మాట్లాడటంకానీ, నా వంక చూడటం కానీ మానివేసిన తర్వాత నా పరిస్థితి తల్లి ప్రేమను పోగొట్టుకుని కష్టాలలో మునిగితేలుతున్న చిన్నపిల్లవాడి పరిస్థితివలే తయారయింది. మెల్లమెల్లగా నేను నా ఆస్థిని, నా ఉనికిని, సర్వస్వాన్ని కోల్పోవసాగాను. ఏది పోగొట్టుకున్నా బాధలేదు, కానీ స్వామిని పోగొట్టుకుంటున్నానని ఎంతో బాధపడ్డాను. స్వామి అనుగ్రహాన్ని తిరిగి పొందటమెలా అని కొంతమంది పెద్దలను ప్రశ్నించాను. వారు నన్ను స్వామిని ఇంకా ఎక్కువగా ప్రేమిస్తూ, పవిత్ర గ్రంధాలైన పురాణేతిహాసములను చదివి, స్వామిని అర్థం చేసుకోవలసినదిగా సలహాలిచ్చారు. ఎవరో నన్ను శ్రీమద్భాగవతము చదవమని ప్రోత్సహించారు. సంస్కృతంలో పదునాలుగువేల, నాలుగు వందల శ్లోకాలు కలిగిన వేదవ్యాస విరచిత శ్రీమద్భాగవతాన్ని కొని తెచ్చుకుని, ఒక సంస్కృత భాషాపండితుని వద్దకు వెళ్ళి నాకు భాగవతం నేర్పవలసినదిగా కోరాను. కానీ నాకు ఉపనయనముకానందున, నేను భాగవతము చదివేందుకు అనర్హుణ్ణని, తాను నేర్పనని ఆ వ్యక్తి చెప్పాడు. నేను పట్టుదలతో ఇంగ్లీషు - సంస్కృతం నిఘంటువును కొని తెచ్చుకుని సంస్కృత శ్లోకంలోని ప్రతి పదానికి ఆంగ్ల అనువాదం వెతుక్కుంటూ, వాటిని ఒక నోట్సులో వ్రాయటం మొదలెట్టాను. శ్రీ కృష్ణుని ప్రతి చర్యను సాయికృష్ణుని చర్యలతో పోల్చి అధ్యయనం చేయసాగాను. ఈ విధంగా దాదాపు 7 సంవత్సరాల కాలంలో 14,400 శ్లోకాలను అధ్యయనంచేసి దానిపై వివరణాత్మక వ్యాసం వ్రాయగలిగాను. ఈ ఏడు సంవత్సరాల కాలంలో నేను



పొందిన ఆనందం వర్ణించేందుకు మాటలు చాలవు. నాలో నేను మౌనంగా రోదించేవాడిని. ఆనందంతో గంతులు వేసేవాణ్ని, పాటలు పాడేవాడిని. ఈ కాలంలో స్వామి అవతారతత్త్వం కొద్దికొద్దిగా ఆకళింపు చేసుకోగలిగాను. వేదవ్యాసుడు పూర్ణావతారమైన శ్రీ కృష్ణుని వర్ణించిన ప్రతి వర్ణన స్వామికి ఖచ్చితంగా సరిపోతుంది. అందువలన కృష్ణుడే సాయి, సాయే కృష్ణుడు అనే నిర్ణయానికి వచ్చాను.

1992లో ఒకనాడు అనుకోకుండా స్వామి నన్ను పలకరించారు. 'నీవు భాగవతాన్ని అధ్యయనం చేసావు కదా, నా విద్యార్థుల ముందు ఉపన్యసించు' అన్నారు. నేను భాగవతంలోని పూతన కథ చెప్పాను. అప్పటి నుండి తిరిగి నేను సాయి ప్రపంచంలో చేర్చుకోబడ్డాను. ఇందుకు కారణం స్వామి జీవిత చరిత్ర అయిన శ్రీమద్భాగవతాన్ని అధ్యయనం చేయడమేనని నా భావన.

1993 జనవరిలో స్వామి మద్రాసు వచ్చారు. అప్పుడు నేను తమిళనాడు శ్రీ సత్యసాయి ట్రస్ట్‌లో సభ్యుణ్ని. స్వామి ఉపన్యసించే ప్రదేశం అయిన 'అబ్బొట్స్‌బరీ'లో నేను దర్శన నిర్వహణాభారం చేపట్టాను. ఒకరోజు స్వామి దర్శనంలో నన్ను తనను అనుసరించమన్నారు. ఆ రోజు భక్తుల రద్దీ చాలా ఎక్కువగా వుంది. జనాన్ని నియంత్రణలో పెట్టడం చాలా కష్టం అయింది. ఒకసారి నలుబది, యాబది మంది భక్తులు స్వామి పాదాలపై వ్రాలాలని ప్రయత్నించారు. ఆ గుంపును వెనక్కి లాగేందుకు శాయశక్తులా ప్రయత్నించాను. అయితే దురదృష్టవశాత్తు ఆ హడావిడిలో నేను స్వామి అంగీపై కాలు వేసాను. స్వామి వెనుతిరిగి "నీవు నా అంగీపై నిలుచున్నావు' అన్నారు. నేను నివ్వెరపోయాను. నాకేం చెయ్యాలో తోచలేదు. పవిత్రమైన స్వామి అంగీపై పాదం మోపానని ఎంతో బాధపడ్డాను. ఆవేదన చెందాను. వెళ్ళి అదే హాలులో ఒక చివర కూర్చుని నాలో నేను కుమిలి కుమిలి ఏడవటం మొదలుపెట్టాను. దర్శనం పూర్తయిన తర్వాత స్వామి బాలవికాస్ పిల్లల కార్యక్రమాలు చూస్తున్నారు. నేను మాత్రం ఆ హాలు చివరలో కూర్చుని క్షమించలేని మహాపరాధం చేసినందుకు నన్ను నేనే నిందించుకోసాగాను. నాకు ఇక బ్రతికివుండే అర్హత లేదని భావించాను.

ఈ విధంగా చిన్నపిల్లవాడిలా ఏడుస్తున్న నన్ను ఎందరో సోదరసభ్యులు ఓదార్చారు. స్వామి ఇటువంటి చిన్నచిన్న విషయాలను పట్టించుకోరని ఎన్నివిధాలుగా ఓదార్చినా నా మనసుకు శాంతి కలుగలేదు.

బాలవికాస్ కార్యక్రమాలు పూర్తయినాయి. స్వామి లేచి కారువద్దకు వెళ్తున్నారు. నా కనులవెంబడి అశ్రుధారలు కారుతుండగా నా జీవితాన్ని అంతం చేసుకోబోయే ముందు చివరిసారిగా పాదనమస్కారం చేసుకుందామని స్వామి దగ్గరకు వెళ్ళాను. స్వామి ఎంతో ఆప్యాయతతో నా తల నిమురుతూ 'ఆ విషయం ఇక మర్చిపో బంగారూ' అన్నారు. కానీ ఆ సంఘటనను నేను మర్చిపోలేకపోయాను. ఆ తర్వాత ప్రతిరోజూ నాకు ఒక భయంకరమైన స్వప్నం వచ్చేది. అందులో శ్వేతవస్త్రధారియై ఒక దేవత సింహాసనారూఢియై చేత త్రిశూలం ధరించి నా వైపే వచ్చి నా హృదయంలో త్రిశూలం గుచ్చుతున్నట్లు కనిపించేది. ఈ విధంగా తొంభైతొమ్మిది రోజులు ఇదేకల నన్ను నిద్రకు దూరం చేసింది. 1993 ఏప్రియల్‌లో స్వామి కొడైకెనాల్ వచ్చినపుడు నాకు ఇంటర్వ్యూను అనుగ్రహించారు. స్వామి దివ్యశ్రీ చరణాలవద్ద నా శిరస్సును వుంచి కలలో మరణిస్తూ నిజజీవితంలో బ్రతుకుతున్నానని స్వామితో నా గోడు వెళ్ళబోసుకున్నాను. స్వామి ఎంతో ప్రేమతో నన్ను లాలిస్తూ, 'ఇక మీదట ఆ కల మళ్ళీ రాదులే' అన్నారు. ఇక ఆ రోజు నుండే ఆ కల రావటం ఆగిపోయింది.

1993 జూలై 29న నేను బెంగుళూరు నుండి పుట్టపర్తికి మారుతీవ్యాన్‌లో వెళ్తున్నాను. నాతో నా భార్య, స్వామి భక్తుడైన ఒక వస్త్రాల వ్యాపారి కూడా వున్నారు. మేము రెండు పెట్టెలను (Tow Box) తీసుకుని వెళ్తున్నాము. ఒకటి స్వామికి సంబంధించినది, రెండవది నాది. స్వామి పెట్టెపైన పెట్టబడి ఉన్నది. మేము చిక్‌బల్లాపూర్‌కు 7 కిలోమీటర్ల దూరంలో వుండగా హఠాత్తుగా మా వ్యాన్ నాలుగు పల్టీలు కొట్టి రోడ్డు మధ్యలో నిలిచిపోయింది. వ్యాన్ తలక్రిందులయింది. ఇంధన ట్యాంక్ నిండుగా వుంది. వ్యాన్‌పై భాగమంతా పూర్తిగా పాడైపోయింది. నా సామాను అంతా బయటపడిపోయింది. స్వామి సామాను మాత్రం కారులోనే వుండిపోయింది. వ్యాను గాలిలో పల్టీలు కొడుతున్నప్పుడు, మేము ముగ్గురం లోపల తలక్రిందులై ఈడ్చబడినాము. నా భార్య, మాతో వచ్చిన వస్త్రాల వ్యాపారి, వారికి ఎటువంటి గాయములు తగులలేదని చెప్పారు. నా కుడిమెడ ఎముక విరిగినట్లుగా నేను గమనించాను. ఏదో విషంగా కష్టపడి అదే వ్యానులో మేము చిక్‌బల్లాపూరు చేరుకున్నాము. బెంగుళూరులోని మా బంధువులకు ఫోన్‌చేయగా వారు వచ్చి మమ్మల్ని బెంగుళూరు తీసుకొని వెళ్ళారు. నేను వెంటనే మమ్మల్ని

ఆపద నుండి కాపాడినందులకు కృతజ్ఞతలు తెలియజేస్తూ స్వామికి ఒక టెలిగ్రాము ఇచ్చాను. ఇది జరిగిన ఇరువది రోజుల అనంతరం నేను ప్రశాంతి నిలయం వెళ్ళాను. అక్కడ నేను కలిసిన మొదటి వ్యక్తి శ్రీ సత్యసాయి ఎయిర్‌పోర్ట్ కెప్టెన్ ఓబరాయ్. ఆయన నన్ను కార్ యాక్సిడెంట్ గురించి అడిగారు. ఆయనకు ఈ విషయం ఎలా తెలిసిందా అని నేను ఆశ్చర్యపోయాను. యాక్సిడెంట్ జరిగిన సరిగా అదే సమయానికి స్వామి తనతో ఆ విషయం చెప్పారని ఆయన తెలిపారు. జూలై 29న స్వామి ఉదయం గం॥ 10-49 ని॥లకు బయటకు వస్తూ ఓబరాయిని చూస్తూ 'నీ స్నేహితుడు మద్రాసు కృష్ణమూర్తికి ఇప్పుడే యాక్సిడెంట్ జరిగింది. కారు గాలిలో నాలుగు పల్టీలు కొట్టింది. రోడ్డుపై రెండువైపుల నుండి వాహనాలు రాకుండా నేనే చూసుకున్నాను. లేకుంటే చాలా ఘోరం జరిగిపోయి వుండేది. అంతే కాకుండా ఇరువది అడుగుల గొయ్యిలో కారును పడకుండా రోడ్డు మీదే ఆపాను. దున్నపోతు కృష్ణమూర్తి చాలా వేగంగా కారు నడుపుతున్నాడు. అందువలన అతని బాధ్యత తీసుకుని కాపాడవలసి వచ్చింది" అన్నారుట. స్వామి నన్ను చూసినపుడు నా గాయాల గురించి అడిగారు.

రెండు నెలల తర్వాత నేను వైట్‌ఫీల్డు వెళ్ళాను. అప్పుడు రెండు వందల మంది జపనీయ భక్తుల మధ్య స్వామి నన్ను ప్రసంగించమని ఆదేశించారు. నేను ఏం మాట్లాడాలో నిర్ణయించుకోలేకుంటే స్వామి నా స్వీయ అనుభవాల గురించి చెప్పమన్నారు. నాకేమీ గుర్తుకు రాకపోవటంతో స్వామి నా కారు ఆక్సిడెంట్ ఉదంతం గుర్తు చేసారు. అప్పుడు నేను ఉపన్యసించాను. స్వామి నన్ను ఎలా కాపాడారో వివరించాను. స్వామి మధ్యలో అన్నారు 'నేను నిన్ను కాపాడటమేమిటి? నిన్ను నేను కాపాడలేదు'. నేను అయోమయంలో పడ్డాను. స్వామి కాకపోతే నన్ను రక్షించే దిక్కు ఎవరు? స్వామి రక్షించకుంటే నేను ఏమైపోయి వుండేవాడిని? నాకేం పాలుపోక స్వామినే చూస్తుండి పోయాను. అప్పుడు స్వామి నవ్వుతూ అన్నారు. 'నీ కర్మ ఫలమే నిన్ను కాపాడింది. నీవు సంస్థలో సభ్యుడుగా వుంటూ ఎంతో సేవ చేసావు. నీ చేత లాభం పొందినవారు నీకు కృతజ్ఞతలు చెప్పబోతే నీవు అంగీకరించకుండా స్వామికే కృతజ్ఞతలు తెలియజెయ్యమనేవాడివి. అందువలన వారి కృతజ్ఞతలు నన్ను చేరి నీ కర్మఫలంలో జమ చెయ్యబడ్డాయి. నీవు చేసిన సత్కార్యాల ఫలం నా అనుగ్రహంగా మారి నీపై వర్షించింది. ఆ రోజు ఉదయం గం॥10-49 ని॥లకు యాక్సిడెంట్ జరగడానికి అరనిమిషం ముందుగానే నేను నీ కర్మఫలం తాలూకు ఖాతా (అకౌంట్)ను సరిచూచి నీ క్రెడిట్ బాలన్స్ చాలా వున్నదని నిర్ణయించుకున్నాను. అందువలన నా ప్రమేయం లేకుండానే నీ కర్మఫలమే నిన్ను, నీ కుటుంబాన్ని కాపాడింది" అన్నారు. సమాజానికి మనం చేసే నిస్వార్థపూరితసేవ విలువ ఎంతటిదో ఈ సంఘటన ద్వారా స్వామి నిరూపించారు. స్వామి చేత స్థాపించబడిన శ్రీ సత్యసాయి సేవాసంస్థలు సేవ ద్వారా మానవునిలో మాధవ తత్త్వాన్ని దర్శింపజేయటమే ప్రధానలక్ష్యంగా పని చేస్తున్నాయి. మానవుడు ఆపదలలో ఉన్నప్పుడు అతను సంపాదించిన ఆస్తి అతనిని కాపాడదు. బంధువులు, బ్యాంక్‌బాలన్స్, ఇళ్ళు, పొలాలు ఇవేవీ అతన్ని రక్షించలేవు. అతను చేసిన సత్కర్మలే అతనికి రక్షగా నిలుస్తాయి. ఈ కలియుగంలో సేవ ద్వారానే మోక్షాన్ని పొందగలము. జనన మరణాల చక్రము నుండి మనలను తప్పించేది సేవ ఒకటే. మనమందరం భగవంతుడు మన మధ్య నివసిస్తున్న సమయంలో జన్మించినందుకు ఎంతో అదృష్టవంతులము.

*God is Love, Love is Sai, Live in Sai.* *

తెనుగుసేత : కొమరగిరి మాధవి

## రావణతత్త్వం - రామతత్త్వం

**ఈనాడు మానవులలో రెండు తత్త్వములు ప్రధానంగా కనిపిస్తున్నాయి. 1. రావణతత్త్వం 2. రామతత్త్వం. రాగద్వేషఅహంకారములతో కూడినది రావణతత్త్వం. నిర్మల, నిస్వార్థ, నిరహంకారములతో కూడినది రామతత్త్వం. లోకకళ్యాణ నిమిత్తమై, తనకున్న సర్వభోగ భాగ్యములను త్యజించి, కారడవులలో ప్రవేశించి, రాగద్వేషఅహంకారములతో కూడిన రాక్షసులను సంహరించాడు 'రాముడు'. 'గ్రామ సేవే రామసేవ' అంటున్నాం. గ్రామసేవ చేస్తున్నాం. రామసేవ అంటే ఏమిటి? రాముడు దేనిని త్యజించాడో, దానిని మనం కూడా త్యజించాలి. రాముడు భోగభాగ్యములను త్యజించాడు. రాగద్వేష అహంకారములను నిర్మూలనం గావించుకొన్నాడు. కనుక మనం కూడా రాగద్వేష అహంకారములను నిర్మూలనం గావించుకొని సేవలలో పాల్గొనాలి. అప్పుడే 'గ్రామసేవే రామసేవ' అన్నదానికి సార్థకత.**

**- బాబా**



*******************************



# మహిళామణులు భారతజాతికే మణిపూసలు



*******************************

"శబ్దబ్రహ్మమయీ! చరాచరమయీ!
జ్యోతిర్మయీ! వాఙ్మయీ
నిత్యానందమయీ! పరాత్పరమయీ!
మాయామయీ! శ్రీమయీ"

ప్రణవస్వరూపమయినటువంటి ఓంకారము శబ్దబ్రహ్మము. పిపీలికాది బ్రహ్మపర్యంతము ప్రకాశవంతమై, తేజోవంతమైనటువంటి శక్తితత్త్వము. అదే వాగ్రూపమగునట్టి శక్తి. నిత్యమయినది, సత్యమయినది. విజ్ఞాన ప్రజ్ఞానములతో కూడిన బ్రహ్మానందమునందించే టటువంటిదే ఈ శబ్దబ్రహ్మము. అష్టైశ్వర్యములతో కూడిన ఈ శక్తియే సర్వప్రాణులకు జీవాధారము. ఈ శ్లోకమునకు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు అర్థం ఈ విధంగా చెప్పారు.

1. శబ్దబ్రహ్మమయీ - యంత్రశక్తి 2. చరాచరమయీ - ఉష్ణశక్తి 3. జ్యోతిర్మయీ - కాంతిశక్తి 4. వాఙ్మయీ - ధ్వనిశక్తి 5. నిత్యానందమయీ - అయస్కాంతశక్తి 6. పరాత్పరమయీ - రసశక్తి 7. మాయామయీ - విద్యుచ్ఛక్తి 8. శ్రీమయీ - అణుశక్తి. కాబట్టి సర్వశక్తులు స్త్రీయందు ఉన్నాయన్నమాట. అందుకే స్త్రీని అష్టైశ్వర్య స్వరూపిణి అన్నారు భగవాన్ శ్రీ సాయి. స్త్రీలను ఎంతో ఉన్నతమైన వ్యక్తిత్వం కలదిగా చెబుతుంటారు. స్త్రీలు వారి కుటుంబములను కాపాడుకుంటూ అనేక విధములుగా జగత్ కళ్యాణానికి కూడా తోడ్పడుతుంటారు. స్త్రీ అనగా, 'స' కార, 'త' కార, 'ర' కార సమ్మిళితమే అన్నారు స్వామి. ఓర్పు, సహనం, శాంతం, త్యాగం, అనురాగం, మంచి మర్యాదలు స్త్రీ యొక్క సహజ లక్షణములు. **'ఇంటిని చూసి ఇల్లాలిని చూడు'** అన్నారు పెద్దలు. మన పవిత్ర భారతావనిలో ఎందరో స్త్రీలు పవిత్రములయిన వ్రతములు, నోములు నోచి భర్త యొక్క ఆయురారోగ్య సౌభాగ్యములను పొందారు. సీత, సావిత్రి, దమయంతి వంటి ఎందరో పతివ్రతామ తల్లులను కన్నది మన భరతమాత' అన్నారు భగవాన్ సాయి.

"గతజీవుడగు పతిన్ బ్రతికించుకొన్నట్టి
సావిత్రి భారతసతియెకాదే
తన సత్యమహిమచే దావాగ్ని చల్లార్చె
చంద్రమతి పవిత్రపడతి గాదే
కులసతీత్వమునకై గుండానదూకిన
సీత భారతధరాజాతకాదే
కినిసి దుర్మద కిరాతుని బూది గావించె
దమయంతి భారతరమణిగాదె
సత్యసాగర పరివేష్టితోర్వితలము
భరతజాతి పాతివ్రత్య ప్రతిమలంబు
భావసంపద కిది మహాపంట భూమి
అఖిల దేశాలది ఉపాధ్యాయికాదే ॥"

## కొమరగిరి జయప్రద

అని స్వామి పదే పదే చెబుతుంటారు. స్త్రీకి గృహలక్ష్మి అని పేరు. స్వామి కూడా భక్తులను పలుకరించే సమయంలో నీ 'గృహలక్ష్మి' కూడా వచ్చిందా? అని అడుగుతుంటారు. గృహలక్ష్మి అనగా గృహమును గృహపరిసరాలను గృహములోని పాత్రలను సహితము పరిశుభ్రముగా ఉంచి గృహమును లక్ష్మీనిలయముగా మార్చగలిగినదే గృహలక్ష్మి. ఆమె మనసు కూడా అంత నిర్మలమైనదే. శ్రీ కృష్ణుడు కూడా స్త్రీలకు గృహలక్ష్మి, ఇల్లాలు, ధర్మపత్ని, అర్ధాంగి అని ఎన్నో బిరుదులనిచ్చి ఆశీర్వదించాడు. స్త్రీ లేనిదే పురుషుడు లేడు. పురుషుడు లేనిదే స్త్రీలేదు. వారిది అవినాభావ సంబంధం. వారు ప్రకృతి పురుషులు. జీవాత్మ పరమాత్మలు, అన్నారు స్వామి. స్త్రీలను లక్ష్మీస్వరూపులుగా గౌరవించండి. అప్పుడు లోకం ఎంతో సుఖసంతోషాలతో విలసిల్లుతుంది. ప్రపంచంలో ఏ రాజ్యమునైనా చూడండి. గుణవంతులైన స్త్రీలున్న రాజ్యం సుక్షేమంగా ఉంటుంది. యుద్ధాలలో ఎన్నో రాజ్యాలు నాశనం అయిపోయినాయి. గుణవంతులైన స్త్రీలు భారత దేశంలో అధికంగా ఉండటం చేతనే అన్నిదేశముల లోకి భారతదేశం తలమానికమైనది. అటువంటి స్త్రీలు ఎటువంటి పరిస్థితులలోను కంట నీరు పెట్టకూడదు. అది ఆ గృహానికి మంచిది కాదు. పురుషునకు మూడు శక్తులు

ఉంటే స్త్రీ కి ఐదు శక్తులు ఉన్నాయి. స్త్రీ తన శక్తితో సాధించలేనిది ఏదీ లేదు. ప్రస్తుత పరిస్థితులలో ఆధ్యాత్మిక కార్యక్రమాలకు ఇంత ఆదరణ లభించింది అంటే అది స్త్రీల వలననే అన్నారు భగవాన్ సాయిబాబావారు. అటువంటి స్త్రీలకు అడ్డు చెప్పకూడదు. చేతనయిన సహాయ సహకారములను అందించండని పురుషులను కూడా హెచ్చరించారు శ్రీ స్వామివారు.

స్వామి తమ ప్రతి ప్రసంగములోను తల్లిదండ్రులను గౌరవించమని వారిని సంతోషపెట్టమని చెబుతుంటారు. భారతీయ సంస్కృతియందు మాతకు ప్రథమ స్థానాన్ని ఇవ్వబడింది. మాత అనే పదమునకు ఎంతో విలువ ఉన్నది. అందుకే దేవతలను, లోకమాత, జగన్మాత, దుర్గామాత అని ఎంతో పూజ్యభావంతో, గౌరవభావంతో, ప్రేమభావంతో సంబోధిస్తారు. ఎవరికి ఏ రకమయిన బాధ కలిగిన 'అమ్మా!' అనే అంటారు కానీ 'అయ్యా!' అనరు. 'అమ్మ' అనే పదము పవిత్రమైనది, ప్రియమైనది., విలువైనది, శక్తివంతమైనది. 'అమ్మ' అనే పదము వచ్చిన తరువాతనే 'నాన్న' అనే పదము వచ్చింది. భారతదేశ సంస్కృతియందు తల్లికి ఎంతో ప్రాధాన్యత ఇవ్వబడింది. పార్వతీపరమేశ్వరులు, లక్ష్మీనారాయణులు, రాధాకృష్ణులు, సీతారాములు. ఈ విధంగా ఏ దేవతను ప్రార్థించినా ముందు తల్లియే వస్తుంది. అందుకే మాత పిత గురుదైవం అన్నారు. అనాది నుండి భారతీయులు పంచమాతలను పూజించేవారు. 1) వేదమాత 2) గోమాత 3) భూమాత 4) దేశమాత 5) దేహమాత. ప్రతి ఒక్క భారతీయులు ఈ ఐదుగురు మాతలను పూజించి, గౌరవించి, సేవించి తరించాలన్నారు స్వామి. కాబట్టి తల్లిప్రేమకు సాటియైనది ఏదీ లేదు. అటువంటి తల్లిని అగౌరవపరచిన వారికి భవిష్యత్తులేదు. "అమ్మలేని జీవితం చుక్కానిలేని నావ వంటిది' అన్నారు స్వామి.తల్లిని గౌరవించండి. తల్లి ఆజ్ఞ శిరసావహించండి. తల్లి మనసు సంతుష్టి చెందుతే లోకమంతా సంతుష్టి చెందుతుంది. తల్లిని పూజిస్తే ఆ లోకమాతను పూజించినట్లే అని చెప్పారు భగవాన్ సాయిబాబావారు.

తల్లి ఆజ్ఞను శిరసావహించి తరించిన తనయులెందరో మన పురాణాలలో కనిపిస్తారు. తల్లి తలచినప్పుడల్లా ప్రత్యక్షమై ఆమె ఆజ్ఞను పాలించిన వ్యాసుడు వ్యాస భగవానుడుగా వాసికెక్కాడు. తల్లి మాటను నిలుపుటకై తన ఆరాధ్యదైవమయిన శ్రీరామునితోనే యుద్ధానికి సిద్ధమయినాడు అంజనిసుతుడు ఆంజనేయుడు. తల్లి కైకసి ఆత్మలింగమును కోరగా కఠోరమైన తపస్సుచేసి కైలాసవాసుని మెప్పించి ఆత్మలింగమును తెచ్చి అమ్మకిచ్చాడు రావణాసురుడు. తల్లి దీవెనలనందుకొన్న తరువాతనే సన్యసించిన శంకరులు, ఆమె కోరికమేరకు అంత్యకాలమున ఆమె సన్నిధిలో నిలచి అంత్యక్రియలు జరిపి మాతృఋణం తీర్చుకున్నారు. జగద్గురువు అయినారు ఆదిశంకరులు. తనయులను పురాణ పురుషులుగా, ఆదర్శమూర్తులుగా తీర్చిదిద్దిన మహాతల్లులు ఎంతోమంది మన భారతదేశంలో ఉన్నారు. ఈశ్వర చంద్ర విద్యాసాగర్ సంఘసంస్కర్తగా మారటానికి అతని తల్లియే కారణం. నరేంద్రుని వివేకానందునిగా తీర్చిదిద్దినది ఆతని తల్లియే అని మరువవద్దు. జాతిపిత మహాత్మాగాంధీ సత్యవాక్యపరిపాలనకు, శివాజీ మహారాజు మహారాష్ట్ర వీరకిశోరంగా పేరుపొందటానికి వారి మాతృమూర్తులే కారణం అని మరువరాదు. ఈ విధంగా మన భారతదేశ ఔన్నత్యమును దేశవిదేశములలో చాటిచెప్పి మహామహులను కన్నమహిళామణులు మన భారతజాతికే మణిపూసల వంటివారు. వారి అడుగుజాడలలో మీరూ నడవండి! అని స్వామి ప్రతిసారీ చెబుతుంటారు.

తల్లి దీవెనకు ఎంతో బలము ఉన్నదని అంటారు స్వామి. తల్లి కోరిక తీర్చటం తనయుని ప్రథమ కర్తవ్యం. ఆమె ఆజ్ఞను నెరవేర్చటంకన్నా వ్రతం మరొకటిలేదు. స్వామి ఈశ్వరమ్మ (గృహం అమ్మాయి) కోరిన మూడు కోరికలు తీర్చాడు. ఆమె ఎంతో సంతోషించింది. మీరు హిమాలయములలోకి, కొండలలోకి పోవద్దు. ఇక్కడే ఉంటానని మాటఇవ్వండి' అన్నది ఆమె. పుట్టపర్తినే స్వామి అవతార రంగస్థలంగా ఎన్నుకున్నారు. ఆమెను అనేక పుణ్యక్షేత్రాలకు తీసుకొని వెళ్ళారు. ఆమె కోరిన ప్రకారం పుట్టపర్తిలో ఒక బడి, గుడి (స్వామి మందిరం) హాస్పిటల్ కట్టించారు. ఆనాడు కన్నతల్లి కోరికపై మంచినీటి బావి త్రవ్వించారు పర్తిలో. ఈనాడు ఎంతోమంది తల్లులకోసం ఆకాశగంగనే భువికి రప్పించారు. అందుకనే **'నా జీవితమే నా సందేశం'** అంటారు స్వామి. అందరిని ఉద్ధరించే అవతార పురుషుడే అయినా ఒక తల్లికి ముద్దుల బిడ్డడే కదా? మరచి పోయిన మానవ ధర్మాన్ని గుర్తు చేయటానికే మాధవుడు మరల మరల మానవజన్మఎత్తి కర్తవ్యకర్మలను తాను ఆచరిస్తూ అందరిచేత ఆచరింపజేస్తుంటాడు. దైవము

యొక్క లీల అదే. అవతార పురుషుల లక్ష్యము అదే. ఒకసారి సాయిమాత భగవద్గీతను 'గీత జగదేకమాత' అని వర్ణించారు. గీతామాత భిన్నప్రవృత్తులుగల తన బిడ్డలకు భిన్నత్వంలో ఏకత్వాన్ని చూపిస్తుంది. పిల్లవాడికి ఏది హితమో దానిని ప్రియముగా అందించేది తల్లి ఒక్కతే. పిల్లల ఇష్టాఇష్టాలు తల్లికి మాత్రమే తెలుస్తాయి.

స్త్రీలకు నీతి నిజాయితీలతో కూడిన సౌశీల్యమే ప్రాణం. ఈనాడు లోకపరిణామమంతా స్త్రీలపైనే ఆధారపడి ఉన్నది. స్త్రీలలో ఉన్న మూడుగుణములలో సాత్విక గుణమునకు ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. స్త్రీలు ఉద్యోగములు చేయవచ్చు. కానీ దానివలన కలిగే ఇబ్బందులను కూడా గమనించాలి. ఎంతో అవసరం అనుకుంటే చేయవచ్చు. దానికన్నాముందు మిమ్ములను కనిపెంచిన తల్లి తండ్రులను సంతోషపెట్టండి. తరువాత గృహిణి ధర్మమును చక్కగా నిర్వర్తించండి. తల్లిగా మీ పిల్లలను తీర్చిదిద్దండి. ఇంటిలోనివారందరితోనూ ప్రేమగా ప్రవర్తించండి. పిల్లలను ఆదర్శపౌరులుగా తీర్చిదిద్దటం మీ కర్తవ్యం. స్త్రీలు అబలలు బలహీనులుకారు. స్త్రీ అనగా సర్వశక్తిరూపిణి. నిర్మాణమునకు, నిర్మూలనకు, త్యాగమునకు, భోగమునకు అన్నింటికిని రెండువైపులా పదునుగల కత్తివంటివారు స్త్రీలు. వేదము స్త్రీలకు విశిష్టమయిన స్థానమును ఇచ్చింది. ఎందరో అవతార మూర్తులకు జన్మనిచ్చినది స్త్రీలే. పురుషునిలోని ప్రతిభను వెలికితీసి ప్రజ్ఞావంతులనుచేసేది స్త్రీలే. కాబట్టి ఈనాడు మరుగునపడిన మానవత్వాన్ని, మరచిపోయిన మానవతా విలువలను పునరుద్దరించవలసినది స్త్రీలే. ప్రతి మానవునికి తల్లిఒడియే ప్రథమ బడి, గుడి. ప్రతి స్త్రీ ఉత్తమ గృహిణిగా, ఆదర్శమాతృమూర్తిగా ఉండటం చాలా అవసరం. మంచి హృదయం గల మాతృమూర్తి ప్రపంచానికే ఆదర్శమూర్తి అవుతుంది అని భగవాన్ శ్రీ సాయి తమ ప్రసంగాలలో ఎప్పుడూ చెబుతుంటారు.

తల్లి ప్రేమకు సాటియైనది ఈ ప్రపంచంలో మరేదీలేదు అంటారు స్వామి. ఒక స్త్రీ తల్లిగా తన యొక్క కుటుంబము లోని పిల్లలనే తీర్చిదిద్దగలుతుంది. కానీ సాయిమాతది విశ్వకుటుంబం. అందుకే ఆమె విశ్వజనని. జగజ్జనని. ఆమెది కోటి తల్లుల ప్రేమ. పసివారి దగ్గర నుండి వయసు పైబడినవారి వరకు ఆమె చల్లని ఒడిలోని ప్రశాంతిని పొందుతారు. ప్రశాంతి నిలయాన్ని చేరుకున్న ప్రతివారిని తన యొక్క కరుణారసదృష్టి చూసి ప్రేమామృతమైన మృదువైన మాటలతో పలుకరించి, లాలించి, బుజ్జగించి ఎవరికి తగినట్లుగా వారికి బుద్ధులను, సుద్దులను చెప్పి పంపిస్తుంది ఆ సాయిమాత. ఆ తల్లి దృష్టిలో స్త్రీలకు చాలా ఉన్నతమైన స్థానమున్నది. దానిని మనం గుర్తించి స్వామి చెప్పిన విధంగా ఇంటాబయటా నడుచుకుంటూ స్వామి చూపిన బాటలో పయనించి మన జన్మలను సార్థకం చేసుకోవాలి. అందుకు తగిన శక్తి సామర్థ్యములను ప్రసాదించమని స్వామిని మనసారా కోరుకుంటూ, వేడుకుంటూ....

జై సాయిరాం

## ఓంకారము

ఓంకారము మూడు పర్యాయములే ఎందుకు చెప్పాలి? శాంతి: శాంతి: శాంతి: అని మూడు పర్యాయములే ఎందుకు చెబుతారు? రెండు లేక నాలుగు పర్యాయములు ఎందుకు చెప్పుటలేదు? అనే సందేహం చాలామందికి సహజంగా వస్తుంటుంది. దీనికి స్వామి ఒకసారి చక్కగా సమాధానం చెప్పారు. 'ప్రణవము ఆధారశబ్దం. సర్వశబ్దములకు మూలాధారము. ప్రణవంలేని మంత్రం మందులేని తుపాకి వంటిది. దేహముగన్ను, 'ఓం' బుల్లెట్. మూడుపర్యాయాలెందు కంటే - ఆది భౌతిక, ఆధిదైవిక, ఆధ్యాత్మిక శాంతి నిమిత్తం. మానసిక శాంతి, దేహశాంతి, ఆత్మశాంతి నిమిత్తం. ఆత్మశాంతిలేనిదే, దేహశాంతి ఉండి లాభం లేదు. నీవునుకునే నీవు, ఇతరులనుకునే నీవు, నీవైన నీవు. (The one you think you are, The one others think you are, The one you really are). నీవనుకునే నీవు దేహం - ఇది భౌతికం. ఇతరులనుకునే నీవు - ఇది మానసికం. ఆది భౌతికము (అది దైవికం). నీవైన నీవు నీ ఆత్మస్వరూపం. ఇది ఆధ్యాత్మికం. ఈ మూడు స్థితులలోనూ 'శాంతి' కావాలని మూడుసార్లు శాంతి పాఠం చెబుతున్నాం. త్రికాల త్రిమూర్తులవలె మూడు స్థానాలలో ఓంకారము నిలిచి ఉంటుంది. త్రికాలముల పవిత్రతను, త్రిలోకముల దివ్యత్వమును ఉచ్ఛరించడానికి ప్రణవం చేర్చాలి. ప్రణవం పవిత్ర జ్యోతివంటిది. దీనిని శ్రద్ధావిశ్వాసాలతో చేయడం ముఖ్యం

- బాబా

# విదేశాలలో సాయిసేవా సంస్థల ప్రగతి

ఏ.యం.ఆర్. శర్మ

అవతారపురుషుడైన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా వారు తమ తల్లికోరికపై పుట్టపర్తి గ్రామంలోనే తమ నివాసము ఏర్పరచుకొని 'ప్రశాంతి నిలయమ'ని పేరుపెట్టినారు. భక్తుల సంఖ్యరోజురోజు పెరిగేకొలది, వారి సౌకర్యార్థమై సేవాదళ్ బృందాన్ని 1955 దసరా మన్మధనామ సంవత్సరము ఏర్పరచినారు. తామే స్వయంగా భక్తులలో కొందరిని అనుభవమున్నవారిని, ఎన్నుకొని, బాడ్జీలు ఇచ్చి చేయవలసిన సేవలను గురించి వివరించేవారు. ఆ అనుభవమే ఈనాటి శ్రీ సత్యసాయి సేవాసంస్థలకు అంకురము, పునాది. అలాఅలా దినదినాభివృద్ధి చెందుతూ వచ్చిన సంప్రదాయము, 1967లో మద్రాసులో మొట్టమొదటి అఖిలభారత సత్యసాయి సేవాసంస్థల కాన్ఫరెన్సు జరుపుకొన్నది. మరుసటి సంవత్సరమే 1968లో మొదటి వరల్డ్ కాన్ఫరెన్స్‌గా బొంబాయిలో సమావేశమైనది. అచ్చట నిర్ణయించిన ప్రకారము విదేశాలలో కూడా సాయి సంస్థలు ప్రారంభమైనాయి.

ముఖ్యంగా ఉత్తర, దక్షిణ అమెరికాలో, ఆఫ్రికాలో, యూరప్‌లో ఇంగ్లాండులో, ఆసియా ఖండంలో ఈ సాయి సంస్థలు ప్రారంభమై, ప్రస్తుతము 167 దేశాలలో వ్యాపించినది. బాబాగారు ఈ సంస్థకు పెట్టినపేరులోనే దాని ముఖ్యఉద్దేశ్యము - సేవ విదితమవుతుంది. ఈ సేవా సంస్థలు ఐదు విభాగాలుగా పనిచేస్తున్నాయి. భజనమండలి, సమితి, మహిళా విభాగము, సేవాదళ్, బాలవికాస్. భగవాన్ బాబావారి ప్రేరణ, ప్రేమవల్ల తమతమ కార్యక్రమాలు సక్రమంగా నిర్వర్తిస్తున్నాయి.

శ్రీ సత్యసాయి సేవాసంస్థలు సేవలు అందించడంలో, ప్రభుత్వ ఆర్థిక సహాయముగానీ, ఎటువంటి ఫలాపేక్షగానీ కోరడములేదు. ఈ సేవకులు, స్వేచ్ఛతో, సమాజములోని అన్నివర్గాల నుండి, జాతి, మత, కుల బేధాలు లేకుండా, ప్రతి వృత్తిలోని స్త్రీ, పురుషులు సేవాకార్యక్రమాలు చేపట్టుతారు. తమ స్వంతఖర్చుతో సంస్థ నుండి ఎటువంటి ఆర్థిక సహాయము కోరకుండా, తమకు తామే ముందుకు వచ్చి, సేవలందించడము మరి ఏ ఇతర సేవాసంస్థలలో కానరాదు. దీనికన్నిటికీ మూలాధారము భగవాన్ బాబావారే. Help Ever - Hurt Never, - Love All - Serve All, ఎల్లప్పుడూ సహాయం చేయి - ఎవరినీ బాధించవద్దు; - అందరినీ ప్రేమించు - అందరికీ సేవలందించు. అన్న సర్వపురాణాల సారాంశం ప్రకారం బాబాగారు ఆదేశించిన విధంగా ఈ సేవాసంస్థలు పనిచేస్తున్నాయి.

శ్రీ సత్యసాయిబాబాగారు మొట్టమొదటిసారి అంతర్జాతీయ యాత్ర ఆఫ్రికా ఖండంలోని టాంజానియా, కెన్యా, యుగాండా దేశాలలో జూన్, జూలై 1969లో సాగింది. అక్కడ భజన మండలి, సేవాసంస్థలు స్థాపించబడటానికి ప్రోత్సహించినారు. అలా ప్రారంభమై, ప్రస్తుతం 167 దేశాలలో, 2190 కేంద్రాలు స్థాపించబడినాయి. ఇవి అన్ని ఖండాలలో, రష్యా, చైనా వంటి కమ్యూనిస్టు దేశాలలో, మధ్య అరేబియా దేశాలలో కూడా పనిచేస్తున్నాయి.

మచ్చుకకై కొన్నిదేశాలలో జరుగుతున్న కార్యక్రమాల గురించి తెలుసుకొందాం. 1995లో (బాబాగారి 70వ) జన్మదిన ఉత్సవాలఅనంతరం, బాబాగారి ఆదేశానుసారం శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయ్యర్ లెర్నింగ్ వృక్షశాస్త్ర అధ్యాపకుడు శ్రీ అనిల్ కుమార్ జపాను దేశానికి వెళ్ళి అచ్చట భక్తుల సమావేశాలలో పాల్గొని, తిరుగు ప్రయాణంలో సింగపూర్, హాంకాంగ్, మలేషియా దేశాల పర్యటనచేసి ఆ దేశాలలో సాయి సందేశాలను వినిపించారు.

భారతదేశానికి చుట్టుప్రక్కలనున్న, శ్రీలంక, బంగ్లాదేశ్, నేపాల్, బూటాన్, మయన్మార్ (బర్మా) దేశాలలో సాయి సంస్థలు దినదినాభివృద్ధి చెందుతున్నాయి. శ్రీలంక దేశాభూతపూర్వ అధ్యక్షులు శ్రీ జయవర్ధనే, బాబాగార్ని దేశం తరఫున, ప్రజల తరఫున శ్రీలంకకు రమ్మని అనేకమార్లు ఆహ్వానించినా, ఆ అవకాశం దొరకలేదు. కానీ ఏప్రియల్ 1990లో బెంగుళూరులో SAARC మీటింగు జరిగినప్పుడు శ్రీ జయవర్ధనే

బృందావనం (Whitefield) కు వచ్చి బాబాగారి దర్శనం చేసుకున్నప్పుడు, బాబావారు వారికి ఇంటర్వ్యూ ఇచ్చారు.

ఉత్తర కొరియా (కమ్యూనిస్టుల దేశం), దక్షిణకొరియా, జపాన్, హాంకాంగ్, సింగపూర్, మలేషియా (ముస్లిముల జనసంఖ్య ప్రపంచములో జాస్తిగా వున్నదేశం)లో సమితులు ప్రారంభమై సక్రమంగా నడుస్తున్నాయి. సాంఘిక, సాంస్కృతిక రంగాలలో సాయి సందేశము యొక్క ప్రభావము అధికంగా కనిపిస్తున్నాయి. అంతర్జాతీయ గోష్టులలో సాయి సంస్థల ప్రగతి గురించి ప్రశంసలందు తున్నాయని డా॥ జాం సాయి, శ్రీ జగదీశన్ గార్లు (మలేషియా) విన్నవించినారు. మానవతా విలువలగు గురువుల శిక్షణలో చాలామంది ప్రశాంతి నిలయానికి వచ్చి శిక్షణ పొందారు.

ఆస్ట్రేలియా దేశం ప్రక్కనవున్న 'న్యూజిలాండును' బాబావారు 'న్యూసాయిలాండ్' అని చమత్కరించినారు. అక్కడ నివాసమేర్పరుచుకొన్న, వలస వెళ్ళిన భారతీయులు, భజనమండలిలు స్థాపించి, మన పండుగలకు, ముఖ్యంగా మహాశివరాత్రి, గురుపూర్ణిమ, శ్రీకృష్ణజన్మాష్టమి, బాబాగారి జన్మదినము ఆహ్లాదకరంగా, ఉత్సాహంగా జరుపు కొంటున్నారు. కానీ అన్నింటికంటే ముఖ్యము. మానవతా విలువల శిక్షణ పొందిన గురువులు అచ్చటి విద్యాశాలల్లో ఈ కార్యక్రమ ప్రణాళిక ప్రారంభించి ఉత్సాహంగా నిర్వహిస్తున్నారు. ఈ శిక్షణవల్ల క్రమబద్ధత, సంఘజీవనం, కుటుంబ సభ్యులమధ్య అన్యోన్య ప్రేమానురాగాలు పెరిగిందని అక్కడి గురువులు అభిప్రాయం. 1982లో ఆక్‌లాండులో ఒకే ఒక సమితి ఏర్పాటయి, 30 మంది భక్తులకు మించకుండా వుండినది. కానీ 1995 నాటికే 6 సెంటర్లు, 4 గ్రూపులు, 21 సెంటర్ల వరకు పెరిగింది. న్యూజిలాండు మొత్తం దేశం విస్తీర్ణత జపాన్ లేదా ఇంగ్లాండ్‌కు పోలివుంటుంది. కానీ జనాభా 30 లక్షలే. అంటే బెంగుళూరు సిటీఅంత. అందులో యూరోప్ నుండి వలస వెళ్ళినవారి సంఖ్య జాస్తి. ఆదివాసులు 12 శాతమే. మిగతా జనాభా, చైనా, జపాన్, శ్రీలంక, భారతదేశాల నుండి వలస వెళ్ళినవాళ్లే. సేవాదళ్ సభ్యులు ఫ్రీ మెడికల్ క్యాంపులు నిర్వర్తించినారు. నేషనల్ లేండింగ్ లైబ్రరీ స్థాపించి, పుస్తకాలు, క్యాసేట్లు, వీడియోకాసెట్లు, ఉచితంగా కావలసినవారికి అందిస్తున్నారు. ప్రక్కనేవున్న ఆస్ట్రేలియాలో కూడా ఇదేరీతిగా, కొంచెం హెచ్చుస్థాయిలో భజన సెంటర్లు, సేవాకేంద్రాలు, ఆరోగ్య శిబిరాలు జరుగుతున్నాయి. వయస్సు మళ్ళినవారు, నిరాశ్రితులు, అవయవాలు ఉడిగినవారికి స్థాపించిన Old AGe Homes తరుచువెళ్ళి వారికి తగిన సేవలందించడమూ, క్రమబద్ధంగా జరుగుతున్నాయి. ఆస్ట్రేలియాలో (SWARA (Sunshine Welfare And Remedial Association) అనే సంస్థను దోరోతి, మెయోబ్రయన్లు, బాబావారి ఆశీర్వచనంతో స్థాపించి రెండువందల మంది వికలాంగులకు తగురీతిగా సపర్యలు జరిపి వారి జీవితం అర్థవంతంగా, సారంగా జీవించతగినదిగా తయారుచేయడం ఈ కార్యక్రమ విశేషం. వాళ్ళిద్దరికి ఇచ్చిన ఇంటర్వ్యూలో 'అందరినీ ప్రేమించండి - అందరికీ సేవలందించండి. నేను సర్వదా వారి దగ్గరలోనే వుంటానని' భరోసా ఇచ్చినారుట బాబావారు.

ఆఫ్రికా ఖండములో 37 దేశాలలో, 248 సాయి సేవా సంస్థలు, ప్రభుత్వ కార్యక్రమాలలో, ఆరోగ్య ప్రణాళిక, రక్తదాన శిబిరాలు ఏర్పాటుచేసి చాలా ఉత్సాహంగా జరుపు తున్నారు. జాంబియా దేశంలో శ్రీ సత్యసాయి ఉన్నత పాఠశాల స్థాపించి 600పైగా విద్యార్థులకు క్రమశిక్షణతో విద్య నేర్పుతున్నారు. నైజీరియా, కెన్యా, ఘనా దేశాలలో మానవతా విలువల శిక్షణ ప్రభుత్వ పాఠశాలల్లో అనివార్యంగా (Compulsory) గా ప్రారంభించారు. 1991 నుంచి ఇతర విద్యాసంస్థలపై ఈ స్కూలు ప్రభావం బాగా కన్పడుతున్నది. సేవాసంస్థలు రక్తదాన శిబిరాలు ఏర్పరచడము, ప్రభుత్వ వైద్యరంగంలో సహాయం చేయడం, ఉచితంగా సాయి క్లినిక్ నడపటం జరుగుతున్నాయి.

## నన్ను చేరుకొనే మార్గం

"బాహ్య విషయముల ద్వారా నా సామీప్యమును పొందలేరు. మీరు నా ప్రక్కనే ఉన్నప్పటికీ, చాలా దూరంగానే ఉన్నట్లే, సత్య, ధర్మ, శాంతి, ప్రేమలను అంటిపెట్టుకొనియున్నచో, మీరు ఎంత దూరంలో వున్ననూ, నాకు అతిసమీపంగా ఉన్నట్లే. నేను కూడా మీకు అట్లేయందును. అవియే మిమ్ములను నా దగ్గరకు చేర్చుమార్గములోని మైలురాళ్ళు. వినయము, విశ్వాసము మొదలగు మధురమైన, వాంఛనీయమైన గుణములను సాయికి మీరు యిచ్చినచో, మీరెక్కడ వున్నను, ఏమి చేయుచున్నను 'సాయి' మీకు సహాయ సహకారములు అందించును".

- బాబా

యూరోప్ ఖండంలో శ్రీ సత్యసాయి సేవా సమితి 'సేవా' అనే పథకంలో యూగోస్లోవియా, క్రోషియాలో యుద్ధరంగంలో తీవ్రంగా గాయపడినవారికి వైద్యసహాయం, ఆహారపానీయాలు అందజేయడం, గృహనిర్మాణానికి తోడ్పడటం డిసెంబరు 1991 నుండి మార్చి 1995 వరకు జరిగినది. నిరాశ్రితులైన 2500 మందిని అడాప్ట్ చేసి (దత్తత తీసుకొని) నేరుగా సహాయం అందించినారు. ప్రేమ సందేశంతోపాటు నిరాపేక్ష సేవలందించినారు.

రష్యాలో సెయింటు పీటర్సు బర్గు సమితివారు శ్రీ సత్యసాయిబాబా గురించి ఒక గంట ప్రోగ్రాము ది. 23-11-1991న (బాబా జన్మదినోత్సవ సందర్భమున) రేడియోలో ప్రసంగించిన తర్వాత, అచ్చట టి.వి. ప్రోగ్రాం కర్తలు బాబా గురించి వీడియో ప్రోగ్రాములు చూపించినారట. అలాగ సాయిబాబావారి ప్రేమతత్త్వము, దివ్యతత్త్వము, కమ్యూనిష్టుదేశమైన రష్యాలో చాలా వ్యాపించినది.

అనంతపురం జిల్లాలో అమలులోవున్న శ్రీ సత్యసాయి వాటర్ ప్రాజెక్టు (మంచి నీటిపథకం)ను అనుసరించి, దక్షిణ అమెరికాలో ఎల్‌సాల్వదార్‌లో శ్రీ సత్యసాయి సేవాసమితి సభ్యులు, ఇంజనీర్ల సహాయంతో, మ్యూసిలాపా గ్రామంలో ఒక డాం (ఆనకట్ట) కట్టి నీరు నిల్వ చేసేటట్లు ఏర్పాటు చేసినారు. లాప్రిమవేర అనే మరొక గ్రామంలో, ప్రభుత్వ సహాయంతో ఒక స్టోరేజ్ ట్యాంకుకట్టి, విద్యుత్‌శక్తి ఏర్పాటు చేసి, పంపు బిగించి పైపులద్వారా మంచినీటి సరఫరా చేసినారు.

అమెరికా నుండి 18 మంది విద్యార్థులను బాబావారు పిలిపించి, 1995 సమ్మర్ కోర్సులో (వేసవి తరగతులలో) శిక్షణ పొందడానికి అవకాశం కల్పించినారు. ఆ సదవకాశం వల్ల వారి జీవితాలలో గొప్ప మార్పు సంభవించింది. బాధ్యతకల భావి అమెరికా పౌరులుగా తయారైనారు.

అమెరికాలో 'Earth - Help ever - Hurt never' అనే శీర్షికపై సమితివారు దేశవ్యాప్తమైన చర్చ జరిపి, భూవనరులు ఎలాగ సంరక్షించి, ఉపయోగించుకోవాలో, ప్లాస్టిక్ సంచులు, పేపరు, కాగితం) వాడుకలోను ఎలాగ తగ్గించుకోవాలో, మొదలగు అంశాలపై కార్యప్రణాళిక తయారుచేసి నిర్వర్తిస్తున్నారు. ఉత్తర కొరియాలో జూన్ 1997లో సంభవించిన వరదలవల్ల, పీడితులైన 20 లక్షల ప్రజలకు, సింగపూర్ సమితివారు, అక్కడి పరిస్థితి అవగాహన చేసుకొని, భోజన వసతులు ఏర్పరచినారు.

అమెరికా సాయిసంస్థలు 1968లో స్థాపించబడినాయి. 1965 జూలై నుండి శ్రీ చార్లెస్‌పెన్‌గారు, కాలిఫోర్నియా నివాసి. బాబాగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుచుండినారు. బాబావారు తమ జవాబులలో అతనికి మార్గదర్శనము చూపించేవారు. అక్కడ సాయి సంస్థలు ప్రారంభమైనప్పటి నుంచి Study Circles లో తమ అనుభవాలు అందరికీ తెలియచేసేవారు.

క్రైస్తవ మతానికి కేంద్రబిందువైన రోమ్‌నగరంలో అక్టోబరు 1983లో సాయిసంస్థల కాన్ఫరెన్స్ జరిగినది. బాబావారు శ్రీ వి.కె. నరసింహన్‌గార్ని (సనాతన సారధి ఎడిటర్) కీలకమైన ఉపన్యాసము (Keynote Address) ఇవ్వమని పంపినారు. ఆ తర్వాత యూరోప్ దేశంలో చాలా నగరాలలో సాయిసంస్థలు స్థాపించబడినాయి. అప్పటి ఇటలీదేశ ప్రధానమంత్రి శ్రీక్రాక్స్ సకుటుంబంగా, మంత్రులతోసహా బాబాగారి దర్శనార్థమై 1985లో ప్రశాంతి నిలయమునకు వచ్చారు. ఈ విధంగా అనేక విదేశాలలో శ్రీ సత్యసాయి సేవాసంస్థలు సేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ అక్కడి ప్రజలను విశేషంగా ఆకర్షిస్తున్నాయి. ☆

## సాయిరాం

ప్రశాంతి పయనం - శాంతి పర్వం
ప్రశాంతి నిలయం - స్వర్గధామం
ప్రశాంతి సేవలు - పరమానందం ॥ ప్రశాంతి ॥

అందరి గుండెల - నిండు ప్రేమయేకాని
ఎందునా హుండీలు - కానరావండీ
అందచందాల - పలకరిపంపులె కాని
చందాల బందాలు - చూడబోరండీ
ప్రతి అడుగడుగునా - క్రమశిక్షణయేకాని
మరి ఒక్కరైన - దక్షిణ అడగబోరండీ ॥ ప్రశాంతి

మన సాయి దర్శనం - నేత్రపర్వమండీ
మన సాయి భాషణం - కర్ణపేయమండీ
పసులకాపరికైన - వేదపండితునికైన
'సాయిరాం సాయిరాం' ప్రణవ మంత్రమండీ
'సాయిరాం సాయిరాం' తారక మంత్రమండీ
'సాయిరాం సాయిరాం' మహామంత్రమండీ ॥ ప్రశాంతి ॥

*మంత్రిప్రగడ సత్యం, కాకినాడ*





# వ్యక్తిత్వ నిర్మాణంలో శ్రీ సత్యసాయి బాలవికాస్



నేటి ఆధునిక మానవుడు అసాధ్యములైనవాటిని సాధించటం నేర్చుకొన్నాడు. ఆకాశంలో పక్షిలా ఎగురు గలుగుచున్నాడు. నీటిలో చేపలా ఈదగలుగుచున్నాడు. కానీ భూమిపై మానవత్వం కలిగిన మానవునిలా జీవించ లేకపోతున్నాడు. ప్రేమ, నీతి, నిజాయితీ, సేవాతత్పరత, సానుభూతి, సమానత్వము వంటి మానవుని సహజ గుణములను మరచిపోయి పశుప్రవృత్తులైన హింస, ద్వేషము, అసూయ, క్రోధము వంటి దుర్గుణములను పెంపొందింప జేసుకొనుచున్నాడు. అతి త్వరలో ఈ దుష్ట ప్రవృత్తులను తొలగించి, మనిషిలో మానవత్వ గుణములను పునర్నిర్మింపక పోయినట్లయిన భూమిపైనున్న సమస్త జాతియంతయు మారణ హోమమునకు గురియై అశాంతి తాండవం చేయగలదు.

**బాలవికాస్ ఆవిర్భావము :**

అయితే ఎన్నో ఏండ్లుగా ఇటువంటి ప్రవృత్తులకు అలవాటుపడిన పెద్దవారిలోకంటే పవిత్రములైన పసిపిల్లల లేత హృదయములలో సద్భావములను ప్రవేశపెట్టి, వారిని ఉత్తమమైన వ్యక్తులుగా తీర్చిదిద్దుటే సులభతరము. 'The Child is the father of the Man' అన్న విలియం వర్డ్స్‌వర్త్ సూక్తి ఎంతయో అర్థవంతమైనది. ఈనాటి పిల్లలే రేపటి ఉద్యోగులు, రాజకీయ నాయకులేగాక పౌరులు కూడా! వారిని గురించి భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ప్రవచించిన తీరు వారి మాటల్లోనే గ్రహిద్దాం. "**పిల్లలు దేశభవిష్యత్తుకు పునాదులు. వారి మనస్సులు పెద్ద చెట్ల చుట్టూ అల్లుకునే లేత తీగలవంటివి. పెద్దలయినవారు, ఈ లేత తీగెలను సరియైన మార్గములో అల్లుకునేటట్లు చూడవలెను. మొక్క చిన్నదిగా ఉన్నప్పుడే వంపులతో పెరిగితే, పెద్దదయ్యాక ఆ వంపులు పోవటం కష్టమే! పుట్టుకతోనే పవిత్రములైన పిల్లల మనస్సులకు పవిత్రములైన విషయములను మాత్రమే నందించాలి. వారిలో ఆత్మ విశ్వాసము, మనోస్థైర్యము నశిస్తున్నాయి. 'ఓం నమో నారాయణాయ' అని చెప్పవలసినదిపోయి 'బ్యా బ్యా బ్లాక్ షీప్' అని చెప్పిస్తున్నారు.**

దీనిని దృష్టిలో ఉంచుకొని, పిల్లల హృదయాలలో మానవతా విలువలను ప్రవేశపెట్టి వారిలో భౌతిక, మానసిక, నైతిక, ఆధ్యాత్మిక, అంతర్గత శక్తులను పెంపొందించే నిమిత్తమై, భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు 1969లో 'శ్రీ సత్యసాయి బాలవిహార్' అనే విద్యావిభాగాన్ని స్థాపించటం జరిగింది. దానినే 1971లో 'శ్రీ సత్యసాయి బాలవికాస్'గా

## దిట్టకవి శ్రీనివాసాచార్యులు

మార్చబడి, ప్రతి సత్యసాయి సెంటరులో 'బాలవికాస్' తప్పనిసరిగా ఉండితీరాలని తీర్మానించారు. ఆసక్తి కలిగి, స్వామి సాహిత్యంతో పరిచయమున్నవారు గురువులుగా చేరి బాలవికాస్ నడుపవచ్చును. వారికి గురువులకు గురువైన స్వామే అనేకసార్లు శిక్షణ ఇవ్వటం జరిగింది.

**బాలవికాస్ లక్ష్యములు :**

ఈ క్రింది సూచించిన లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని భగవాన్ బాలవికాస్ స్థాపించడం జరిగింది.

1. బాలబాలికలలో సమగ్రమైన వ్యక్తిత్వాన్ని Integrated Personlity) అభివృద్ధి చేసేందుకు, తగినటువంటి ఆరోగ్యకరమైన పరిసరాలను, అనుకూలమైన వాతావరణాన్ని ఏర్పాటు చేయుట.

2. ఇంటిలో తల్లిదండ్రుల యెడల, పాఠశాలలో తోటి విద్యార్థులపట్ల, సమాజంపట్ల, తమ బాధ్యతను సక్రమంగా నిర్వర్తించేలా జీవితాన్ని సరియైన విధంగా ఎదుర్కొనేలా, వారిలో క్రమశిక్షణను, కర్తవ్యదీక్షను, విచక్షణా శక్తిని ప్రవేశ పెట్టుట.

3. వారిలో మానవత్వపు విలువలైన సత్యము, ధర్మము, శాంతి, ప్రేమ, అహింసలను ప్రవేశ పెట్టుట.

4. సమాజంలో దీనులు, అనాథలపట్ల ప్రేమతోకూడిన సేవాభావాన్ని, త్యాగభావనను, నీతినిజాయితీలను అభివృద్ధి పరచుట.

5. వ్యక్తిగతమైన పరిశుభ్రతను, ఆరోగ్యాన్ని, సామాజిక సామరస్యభావనను పెంపొందించుట.

**ఉపాధ్యాయుడు కాదు - బాలవికాస్ గురువు :**

బాలవికాస్ బోధించేవారిని 'ఉపాధ్యాయులు'గా కాకుండా 'గురువులు'గా సంబోధిస్తారు భగవాన్ బాబా. ఈ సంబోధన ప్రాచీన కాలంలో ఉపనిషత్తులలో చెప్పబడిన వేదవిద్యను, గురుకుల విద్యాభ్యాసాన్ని గుర్తుకు తెస్తుంది. ఈ గురువుల బాధ్యత బాలబాలికలలో దివ్యత్వాన్ని, మేలుకొల్పేలా, సత్య, ధర్మ, శాంతి, ప్రేమలను ప్రబోధింప జేయటమే!

ఈ గురువులు కేవలం 'పాఠాలను బట్టీపట్టించే Explaining Teachers లాగా కాకుండా, వారిలోని ప్రతిభా, సామర్థ్యాలను వెలికితెచ్చి, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించే, Inspiring Teachers లా వ్యవహరిస్తారు. "తన వ్యక్తిగత జీవితానికి, క్లాసురూములో బోధించే విలువలకు సామరస్యాన్ని చూపగలవారే గురువులని చెబుతూ భగవాన్ బాబా గురువుని డ్రిల్లు మాస్టరుతో పోలుస్తారు. డ్రిల్లు మాస్టరు ఒకటి, రెండు, మూడు అంటూ తాను ఆచరిస్తూ, విద్యార్థులకు ఎలా నేర్పుతాడో, బాలవికాస్ గురువుకూడా,

"కౌసల్య వరశుక్తి గర్భమౌటను కదా
రాముడు దేవుడై రమణ గాంచె
సీతా మహాసాధ్వి చెలగి పెంచుట కదా
కవలు లవకుశులు ఘనులు అగుట
జిజియా లలామ చెలగి పెంచుట కదా
వీర శివాజియు పేరు గాంచె
పుతలీ బాయి రంజిల్లి పెంచుట కదా
గాంధీ మహాత్ముడై ఘనత గాంచె
ఈశ్వరాంబా సాధ్వి ఎత్తి పెంచుట కదా
సత్యనారాయణునకు విశ్వఖ్యాతి కలిగె
ప్రాణి కోటి యీ రీతి పరిమళించె
అహరహంబును బ్రోచెడి అమ్మకంటె
ఆదరంబగు వ్యక్తులు యీ అవని గలరె?
అమ్మ ప్రథమాక్షరంబు-ఆద్యక్షరంబు"

- బాబా

తాను ఏ విలువలను బోధిస్తున్నాడో, వాటిని తన నిత్యజీవితంలో అనుసరించి చూపాలని చెబుతారు.

భగవాన్ ఆశించేది బాలబాలికల మెదడు నిండుగా ఎన్నో విజ్ఞానవిశేషాలను చొప్పించపజేసే Information కాదు. వారిలో సంకుచిత భావాలను తొలగింపజేసి విశాలమైన ప్రేమ తత్త్వాన్ని, ఆత్మన్యూనతా భావాన్ని చెరిపివేసి, ఆ స్థానంలో అఖండమైన ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింపజేసే మానసిక మైన, నైతికమైన మార్పు (Transformation) మాత్రమే!

బాలవికాస్‌లో చేరిన విద్యార్థి యొక్క వ్యక్తిత్వంలో క్రమంగా అనేక రకములైన అభివృద్ధి జరుగుచూ అతనిని బహుముఖ ప్రజ్ఞాశాలిగా, సమగ్రమైన వ్యక్తిగా, ఉత్తమ సమాజ పౌరునిగా మార్చివేస్తున్నది.

**మానవ వ్యక్తిత్వ వికాసము (Blossoming Human Excellence)** : బాలవికాస్ విద్యార్థి మొదట ఇంటిలో వెలిగించిన దీపం వలె, ఇంటిని ప్రకాశవంతం చేస్తాడు. తర్వాత బజారులో వెలిగించిన దీపస్తంభము వలె, ఆ వీధికంతటికీ, వెలుగును అందించి, క్రమంగా అనేకమందికి గమ్యాన్ని సూచించే ఆకాశంలో వెలిగే లైట్ హౌస్‌లా ప్రకాశిస్తాడు. స్వామి దృష్టిలో బాలవికాస్ విద్యార్థులు భగవాన్ బాబా ఏర్పరచిన పూలతోటలో బాలవికాస్ తరగతులనెడి మొక్కలపై ఏర్పడ్డ మొగ్గల వంటి వారు. వీరందరూ భగవాన్ పర్యవేక్షణలో, వారి దివ్యాశీస్సులతో సుమనోహర పుష్పాలుగా వికసించి, స్వామి ప్రేమను, స్వామి వెలుగును, ఆనందాన్ని ప్రపంచానికి పంచిపెట్టడమే బాలవికాస్ లక్ష్యం.

భగవాన్ ప్రేమకిరణాలను వెదజల్లే, సాయిజ్యోతు లనెడి బాలవికాస్ విద్యార్థినీ విద్యార్థులను వేల సంఖ్యలో అందిస్తున్నది బాలవికాస్. ఈ విద్యార్థులు పెరిగి యువతీ యువకులుగా తయారై, సత్యపథంలో సంచరిస్తూ, ధర్మ మార్గాన్ని అనుసరిస్తూ, దైవవాణిని వినిపిస్తూ, ప్రపంచానికి ప్రేమను, శాంతిని పంచిపెట్టే మణిదీపాలుగా తయారు కావాలని భగవాన్ బాబా ఆశయం.

**" నేను వివేకానందుడు, గాంధీజీ, అరవిందుడు వంటి మహాత్ములు కలలు గన్న దేశం కన్నా, ఉన్నత స్థాయిలో భారతదేశాన్ని తీర్చిదిద్దుతాను"** అన్న భగవాన్ బాబా ప్రకటన వెనుక ఉన్న ఆంతర్యం ఇదేనేమోననిపిస్తుంది. ✻





# షిర్డీసాయి - పర్తిసాయి



ఇది సాయి యుగం. సాయి జీవిత చరిత్ర అనే సముద్రంలో మునిగి ఎవరికి వారే భక్తి జ్ఞానాలను పోగు చేసుకుంటున్నారు. "సంభవామి యుగే యుగే" అని చెప్పిన భగవంతుడు తానై అవతరిస్తున్నాడు. యోగులు, తపస్వులు, మహాపురుషులు భగవదంశతో ప్రభవిస్తున్నారు. ఇటువంటివారి సాంగత్యం అహంకారాన్ని, శరీరాభిమానాన్ని, జనన మరణ బంధాలను తొలగిస్తుంది. ఒక్కొక్కరు వారి వారి పరిధులలో కార్యక్రమాలనెంచుకుంటారు. వారివారి పరిమితులలో మహా పురుషులుంటారు. కాని అపరిమితమై బ్రహ్మాండాన్ని ఆవరించిన వారు 'షిర్డీ సాయి - పర్తిసాయి' షిర్డీబాబా తానున్న చోటునుండే భక్తి జ్ఞాన వైరాగ్యాలను పంచినారు. సత్యసాయి విద్యా వైద్య సౌకర్యాలు ప్రాణాధారమైన నీరు ఉచితంగా అందిస్తున్నారు. వివిధ రంగాలలో మానవ సేవ ప్రాముఖ్యాన్ని, సత్య ధర్మ శాంతి ప్రేమలను భారత దేశంతో పాటు ప్రపంచ దేశాలన్నిటా పంచుతున్నారు. సర్వ శక్తి మంతుడు, సర్వాంతర్యామి, సర్వజ్ఞుడు అన్నవి షిర్డీబాబాకు, సత్యసాయిబాబాకు మాత్రమే వర్తించేవి. అటువంటి గుణాలున్నవారే భగవత్స్వరూపులు. ఇద్దరూ బాల్యంలోనే పరబ్రహ్మ స్వరూపులుగా గుర్తింపబడినారు. షిర్డీబాబా స్వయంగా దేహయాత్ర చాలించే ముందు చేసిన అవతార ప్రకటన - ముందు ముందు ఎనిమిదేండ్ల బాలుడిగా ప్రత్యక్ష మౌతానని (సాయిబాబా జీవిత చరిత్ర - 43,44 అధ్యాయాలు) చెప్పిన విషయం, సత్యసాయి తన అవతార ప్రకటనలో తానే షిర్డీబాబానని తెలియజేసిన సత్య విషయానికి సాక్ష్యం, పెద్ద బొట్టమ్మగా పిలువబడే గాలి శారదాదేవి. షిర్డీబాబాను సేవించి ఆ తరువాత ఆ అవతారమూర్తే సత్యసాయి అని నమ్మి రుజువు చేసి జీవితాంతం స్వామి సన్నిధిని అనుభవించి ధన్యురాలైన తపస్విని ఆమె.

షిర్డీబాబా తనను ఫకీరుగా చాటుకున్నాడు. భగవంతుణ్ణి ఫకీరే అన్నాడు. తన పరబ్రహ్మ స్వరూపాన్ని వాచా చాటలేదు. సత్యసాయి తానే కాక మనందరినీ దివ్యాత్మ స్వరూపులుగా పేర్కొంటారు. భగవద్గీత శ్లోకానికి అర్థం వివరించినప్పుడు కాని నానా సాహెబ్ వంటివారికి బాబాకు సంస్కృతం కూడా తెలుసని అర్థమైంది. సర్వజ్ఞుని పట్ల తమకున్న అభిప్రాయాన్ని తమ అజ్ఞానాన్ని గుర్తించారు. ప్రపంచదేశాల వారికి సత్యసాయి ఇంటర్వ్యూలు ప్రసాది స్తున్నారు. వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు వల్లె వేసిన వారంతా స్వామికి ఆయా శాఖల్లో ఉన్న సర్వజ్ఞతకు విస్తు పోతున్నారు. అందరూ సంతృప్తిగా స్వామి నుండి సమాధానాలను పొందుతున్నారు. భాషాబేధాలు, ప్రాంతీయ బేధాలు, జాతి బేధాలు స్వామి వద్ద ఐక్యతతో భాసిస్తున్నాయి. ఇతరులకేమైనా చేయగలిగితే ఎప్పుడూ మేలు మాత్రమే చేయాలని స్వామి బోధనలలోని పరమార్థం.

## బి. రుక్మిణీ, హైదరాబాద్

ఇవ్వదలచిన దక్షిణ భక్తుడు మరచిపోతే జ్ఞాపకం చేసి మరీ తీసుకునేవారు షిర్డీబాబా. ఇచ్చినందుకు వందరెట్లు అనుగ్రహం పొందేవారు భక్తులు. అదేవిధంగా తన సన్నిధికి వచ్చిన భక్తులకు, కళాకారులకు ధనాన్ని పంచి కానుకలిచ్చి బాబా సత్కరించే వారు. సత్యసాయి తమ భక్తులకు ప్రసాదించిన కానుకలు లెక్కలేనన్ని. శారీరక, మానసిక రుగ్మతలను పోగొట్టే దివ్యౌషధం, భౌతిక - ఆధ్యాత్మిక ప్రాధాన్యం కలిగి లౌకిక - పారలౌకిక జ్ఞానాన్ని ప్రసాదించే విభూతి ప్రసాదాన్ని, వివిధ అనుభవాలను పొందినవారు లెక్కకు అందరు. షిర్డీబాబా తాను చేయదలచిన పనులు గురించి ఎప్పుడూ చెప్పేవారు కారు. దానికి తగిన సందర్భం యుక్తిగా ఏర్పాటు చేసేవారు. సమాధి మందిర నిర్మాణంలో ఆ విషయాన్ని గమనించవచ్చు. సత్యసాయి తాను సంకల్పించినవి, చేయదలచినవి ప్రజల సమక్షంలో ప్రకటించి నెరవేరుస్తున్నారు. విద్యా సంస్థలు, సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్స్ నిర్మాణం, వాటర్ షెడ్ పథకాలు, స్వామి తప్ప మరెవరూ అనుకున్న సమయానికి నెరవేర్చ లేరని దేశ విదేశీయులు ముక్త కంఠంతో అంగీకరించిన విషయాలు.

రాహతా, రుయి, నీమ్‌గావ్ దాటి ఎక్కడికీ పోని షిర్డీ సాయి వివిధ రూపాలలో భక్తుల ఇండ్లకుపోయి వారి కోరికలు నెరవేర్చారు. పుణ్యతీర్థాలను దర్శించి రావాలను కున్న దాసగణు కోరిక బాబా పాదాల నుండి ప్రవహించిన గంగా యమునలను చూడగానే తీరింది. గొలిబువాకు, కాకా సాహెబ్‌కు విఠలునిగా, కొందరికి వారి ఆరాధ్య గురువుగా, మరికొందరికి శ్రీరామునిగా, శ్రీ కృష్ణునిగా, దత్తాత్రేయునిగా, మారుతిగా, అల్లాగా దర్శన మిచ్చారు. హిందువుల శ్రీరామ నవమిని, గొప్ప మహమ్మదీయ ఫకీరుల గౌరవార్థం చేసే చందనోత్సవాన్ని సమంగా జరిపించేవారు. జాతి మతాల పట్ల భేదాన్ని చూపించని బాబా తన జాతి మతాన్ని ప్రత్యేకంగా తెలియజేయలేదు. సందర్భానుసారంగా సమస్త జీవరాశిలో తానున్నాననే భావనను భక్తులకు కలిగించారు. ఆజానుబాహువైన బాబా జానెడు వెడల్పు, నాలుగు మూరల పొడవున్న చెక్కబల్లను పాతగుడ్డ పీలికలతో మసీదులో వేలాడదీసేవారు. నాలుగు వైపులా దీపాలు వెలిగించి ఉంచి ఆ బల్లపై హాయిగా పడుకొని సమస్త జీవరాశి తానైన భావం కలిగించటంలో వింతేమీ లేదు. పుట్టపర్తి ప్రశాంతి నిలయంలో అడుగు పెట్టిన వారికి సర్వ మత స్తూపం (స్వామి చిహ్నంగా అన్ని చోట్లా అదే రూపం) దర్శనమిస్తుంది. అక్కడున్నంత వరకు ఎవరికి జాతి, మతాలు, ఆచార వ్యవహారాలు, ఇతర లౌకిక విషయాలు జ్ఞప్తికిరావు. సమస్తము సాయిరామ్ అన్న మాటలో ఇమిడి పోతవి. స్వామి దర్శన స్పర్శనల కోసం తపన తప్ప ఇతర మైన ఆలోచనలుండవు. విశ్వవ్యాప్తంగా స్వామి తన భక్తులకు ప్రత్యక్ష అనుభవాలెన్నో ప్రసాదిస్తున్నారు. సాయి రాముడుగ, సాయి కృష్ణుడుగ, దుర్గాభవానిగ, సాయి మాతగ భజన కీర్తనలలో భక్తులు అనేక దివ్యరూపునిగా సాయిని స్తుతిస్తున్నారు. ఆధ్యాత్మిక సాధనలో గురువు ప్రాధాన్యాన్ని షిర్డీ - పర్తిసాయి లిరువురూ వివరించారు. షిర్డీబాబా తన గురువు గూర్చి తరచూ భక్తులతో ప్రస్తావించే వారు. గొప్ప కృషి చేసి శ్రమించి ఇతరులివ్వలేని దానిని అతి సులభంగా గురువు నుండి పొందవచ్చని చెప్పారు. తన గురువు కోరిన రెండు కాసులు ఒకటి నిష్ఠ(నమ్మకము) రెండవది సబూరి (ఓపిక) గురించి తెలిపేవారు. గురువు తనని పరీక్షించే వాడని, గురువుకు సంతృప్తి కలిగేలా తాను ప్రవర్తించే వాడినని తనకు కావలసిన ఆత్మానందానుభూతి పొందినానని చెప్పేవారు. ఒక ఒడ్డున ఉన్న తాబేలు మరొక ఒడ్డున ఉన్న తన పిల్లలపై దృష్టిని నిలిపి వాటికి జీవశక్తి నిచ్చి కాపాడే విధంగా గురుశిష్యుల సంబంధం ఉంటుందని, అవతారపురుషులైన రామకృష్ణులు గురువుల వద్ద విద్యాభ్యాసం చేసి ఆత్మసాక్షాత్కారం పొందినారని బాబా బోధించేవారు. సత్యసాయి విశ్వవిద్యాలయ స్థాపనమే గురువుకున్న ప్రాధాన్యం విద్యార్థులకు వివరించడానికి. స్వామి చెప్పిన మొదటి ప్రార్థన. **"మానవ భజరే గురు చరణం - దుస్తర భవ సాగర తరణం".**

వివిధ రోగాలకు షిర్డీబాబా వైద్యం చిత్రంగా ఉండేది. ఏది రోగాన్ని పెంచుతుందో, దాన్నే ఔషధంగా భక్తులపై ప్రయోగించేవారు. కాని అద్భుతంగా రోగం నయమయ్యేది. ప్రత్యక్షంగా పరోక్షంగా సత్యసాయి భక్తుల అనుభవాలలో రోగం తగ్గడానికి మందు విభూతే కాక పరోక్షంగా స్వామి చేత శస్త్ర చికిత్సలు పొంది వ్యాధి నయమైన భక్తులెందరో ఉన్నారు. స్వామి భవరోగ వైద్యుడు. షిర్డీసాయి జీవిత చరిత్రలో - కీర్తి, ధనం. అభిమానం లేకుండటం, జ్ఞానం, మహిమ, ఔదార్యం - ఇవి భగవంతుని ఆరు గుణాలని చెప్పబడినవి. భక్తుల కొరకు బాబా పలికిన మాటలు - "బానిసలలో బానిసనగు నేను మీకు ఋణస్థుడను. మీ దర్శనముచే నేను తృప్తు డనైతిని. మీ పాదములు దర్శించుట నా భాగ్యము. మీ యశుద్ధములో నేనొక పురుగును. అట్లగుట వలన నేను ధన్యుడను.'' (సాయిబాబా జీవిత చరిత్ర-10 అధ్యాయము) శుద్ధ చైతన్య స్వరూపమైన భగవంతుడు తప్ప మరెవరూ ఈ ప్రకటన చేయలేరు. ఆడంబరాలు వద్దని, వినయ విధేయతలు కలిగుండాలని పరోపకార చింతన తప్ప అన్యం పనికిరాదని నిరంతరం బోధించే సత్యసాయి తనకే భోగ భాగ్యాలు సౌకర్యాలు అక్కరలేదనీ ప్రజల సౌకర్యార్థం ప్రశాంతి నిలయాన్ని అమ్మవలసి వచ్చినా వెనుదీయనని చాటి చెప్పారు. భిక్షాటనతో జీవిత సత్యాలను (ఆత్మ సాక్షాత్కారం, మోక్షసాధనం) ఆచరించి చూపిన నాటి షిర్డీ సాయి నేడు కోట్లు వర్షింపజేస్తూ ప్రజోపయోగ కార్యాలు చేస్తున్నారు. సాయి ఉనికితో గ్రామమైన షిర్డీ గొప్ప యాత్రా స్థలంగా మారింది. అంతకన్నా విజృంభించిన ప్రగతి పుట్టపర్తిలో కనబడుతున్నది. విశ్వవిద్యాలయం ~~మొదలు~~ విమానాశ్రయం వరకు నామమాత్రపు ఉదాహరణలు. ఇటువంటి భగవంతునికి సమకాలీనులం కావటం దర్శన, స్పర్శన, సంభాషణలను, విభూతి ప్రసాదాలను అందుకున్న మనం ధన్యాతి ధన్యులం.

# విలువలతో కూడిన విద్యావిధానం అమలులో ఎదురవుతున్న సమస్యలు

బి.యన్. నరసింహమూర్తి

'ఈనాడు మనకు కావలసింది నూతన సాంఘిక కానీ, నూతన రాజకీయ, ఆర్థిక విప్లవంకానీ కానేకాదు. ఈ రోజున మనకు కావల్సింది సచ్ఛీలవంతులైన యువతీయువకులు మాత్రమే' అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. ప్రపంచంలోని మేధావులు అందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్న సత్యం ఇదే. మానవులలోని శీలరాహిత్యమే నేడు జాతి ముందున్న ప్రధాన సమస్య. ఈనాడు ప్రజలు మానవత్వంతో కూడిన సాంకేతిక విజ్ఞానం కొరకు, మానవత్వంతో కూడిన ఆర్థిక విధానాల కొరకు అన్వేషిస్తున్నారు. మానవత్వం మూర్తీభవించిన వ్యక్తులు మనకు దొరికినపుడు మాత్రమే ఈ అన్వేషణ ఫలప్రదం అవుతుంది. కావున మన తక్షణ కర్తవ్యం 'శీల నిర్మాణం' మరియు వ్యక్తిత్వ నిర్మాణం. 'వ్యక్తిత్వ నిర్మాణం అసంపూర్తిగా ఉన్నప్పుడు గొప్పగొప్ప పట్టణాల నిర్మాణం వలన ప్రయోజనమేమిటి?' అంటాడో కవి. 'ఒక వ్యక్తి ఉత్తమమైన జీవితాన్ని గడిపేందుకు శిక్షణనివ్వకుండా జీవనాన్ని సాగించేందుకు రకరకాల పద్ధతులు, ఉపాయములు నేర్పటం వలన, అతడు తాను చెడిపోవటమేకాక, సమాజాన్ని కూడా చెడగొడ్తాడు' అంటారు భగవాన్ బాబా. కావున నేడు ధనం కంటే విలువలకు ఉన్నత స్థానాన్ని ఇచ్చి, ఆనందాల కంటే నియమాలకు ప్రాధాన్యతనిచ్చే శీలసంపత్తి కలిగిన వ్యక్తుల నిర్మాణం అత్యవసరంగా జరగాలి. 'మానవునికి అయిదు మానవతా విలువలు, అయిదు ప్రాణశక్తుల వంటివి. వీటిని కోల్పోయిన వ్యక్తి మరణించిన వానితో సమానము' అంటారు బాబా. ఆ అయిదు విలువలే సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలు. అందరు మహాపురుషులు దివ్య పురుషుల వలెనే భగవాన్ సాయి యువతను మానవజాతిని రక్షించే శక్తులుగా భావిస్తారు. అయితే సమకాలీన ప్రపంచం మహద్భాగ్యం ఏమిటంటే ఆ దివ్యహస్తాలు ఈనాటి విద్యావ్యవస్థ ప్రక్షాళనకై శ్రమిస్తున్నాయి. భగవాన్ సాయి స్థాపించిన విద్యాసంస్థలలో నేర్పబడుతున్న విలువలతో కూడిన విద్య ఈనాటి మానవ జాతిని దురవస్థలకు లోనుచేస్తున్న అనేక రుగ్మతలకు చక్కని తరుణోపాయమును సూచిస్తోంది.

**విలువలతో కూడిన విద్య ఎదుర్కొంటున్న సవాళ్ళు :**

'మానవ ప్రవృత్తి వలన, బయట పరిస్థితుల వలన, (ఆదర్శయుత విద్యావిధానాన్ని అమలుపరచటంలో) మనకెన్నో అడ్డంకులు ఎదురవుతుంటాయి' అన్నారు. రవీంద్రనాథ్‌టాగూర్. ఒకసారి విద్యలో తనకు గల అనుభవంతో. ఈ ఒక్క వాక్యం ప్రస్తుత సమాజంలో విలువలతో కూడిన విద్య అమలులో ఎదుర్కొంటున్న ఎన్నో సవాళ్ళను తెలియచెప్తుంది. అందులో కొన్నిటిని ఈ దిగువ చర్చించుకుందాము. ఇవి కేవలం భారతదేశంలోనేకాక ప్రపంచం నలుమూలలా నైతిక విద్య ఎదుర్కొంటున్న సవాళ్ళను తెలియచేస్తుంది.

1. నైతిక విలువలు ప్రబోధించడానికి, కావలసిన సరియైన ఉపాధ్యాయులను తీర్చిదిద్దడం, వారిని ఉత్తేజితులను చేయటం మొదటి సవాలు.

2. నేడు విశ్వవిద్యాలయాలలో ప్రబలుతున్న హేతువాద దృక్పధము విలువలతో కూడిన విద్యను అమలుపరచటానికి జాతీయవ్యూహాన్ని తయారుచేయడంలో వ్యతిరేక ప్రభావాన్ని చూపిస్తోంది. విలువలకు, ఆధ్యాత్మిక దృష్టికి మరియు ఆధ్యాత్మికతకు, మతములకు మధ్య విద్యార్థులలో సరియైన అవగాహనను కల్పించడంలో ఇబ్బంది ఏర్పడుతుంది.

3. ప్రచార సాధనాల ప్రభావం వలన యువత పెడత్రోవన పట్టకుండా జాగరూకత వహించవల్సి వస్తోంది.

4. ఈనాటి యువత యొక్క మనస్తత్వం పట్ల అధ్యాపకులకు సరియైన అవగాహన ఏర్పడినట్లయితే, విలువల బోధన సులభతరమవడమేకాక ఉపాధ్యాయులు, విద్యార్థుల మధ్య చక్కటి అనుబంధం ఏర్పడుతుంది. కావున యువత మనస్తత్వాన్ని అవగాహన చేసుకోవడం ఒక సవాలు వంటిది.

5. తల్లిదండ్రుల సహకారము, అవగాహన లేనిదే విలువలతో కూడిన ఏ విద్యావిధానమూ అమలుపరచటం

విజయవంతం కాదు. కావున వారి సహకారము పొందటం చాలా అవసరము.

6. విలువల ప్రాతిపదికగా పాఠ్యాంశముల బోధన జరగాలి. అయితే ఈ బోధన కృత్రిమమైనదిగానీ పేరుకు మాత్రమే కానీ చేయకూడదు.

ఈ సవాళ్ళు అన్నింటినీ ఎదుర్కొనటం ఒక ఎత్తైతే, మొట్టమొదటి సమస్య అయిన సరియైన గురువులను తయారు చేయటం అనేది అన్నింటికంటే పెద్ద సమస్య. ఎందుకంటే మిగిలినవన్నీ దానిపైనే ఆధారపడుతాయి.

ఇ.ఎఫ్. స్క్యూమకర్ అన్నట్లు 'ఇవాళ మనం విద్యా రంగంలో ఎదుర్కొంటున్న సమస్యలు నిజానికి నిన్నటి మన తరానికి చెందిన సమస్యలు ప్రతిబింబములే. తత్త్వ సంబంధమైన వ్యాధులతో ఈనాడు మనం బాధపడుతున్నాం కాబట్టి తత్త్వ విచారణ ద్వారానే ఇవి పరిహారం కావాలి. ప్రస్తుతంవున్న ఈ తత్త్వవ్యతిరేకత ఇదే విధంగా కొనసాగితే, మానవుని గొప్ప సంపదగా భావిస్తున్న విద్య అతని వినాశనానికి దోహం చేస్తుంది"

విలువలతో కూడిన విద్యావిధానమునకు పునాది ఆధ్యాత్మికమైన మార్పు. ఎందుకంటే ఆత్మ లేదా భగవంతుడు అన్ని నైతిక విలువలకు ప్రధానమైనవాడు. ఆధ్యాత్మికత అనేది అన్ని మతములలో, అంతర్భూతమైన భావనయేనవి, విశ్వజనీన మానవతా విలువలు అనేవి అన్ని మతముల సారాంశమని ప్రతి ఒక్కరూ తెలుసుకున్ననాడు వివిధ విద్యాకమిటీలు కోరినవిధంగా విలువలతో కూడిన విద్యా విధానమును అమలుపరచటానికి ఒక జాతీయ వ్యూహమును ఏర్పరచుటకు సుసాధ్యం అవుతుంది.

## GOOD MAN - GOD MAN

**"కర్మఫలత్యాగమే భగవంతుని చేరడానికి అతి సులభమైన మార్గం. కాని ఈనాడు ప్రజలు త్యాగమును విస్మరించి, భోగమును ఆశించి, తుదకు రోగములలో మునిగి పోతున్నారు. త్యాగము ద్వారానే అమృతత్త్వము సిద్ధిస్తుంది. కనుక మీరు సమాజంలో ప్రవేశించి సేవలు చేయాలి. దీనులను ఆదుకోవాలి. మానవసేవే మాధవ సేవకదా! ఈనాడు భగవంతుని పూజించటం కూడా ఒక వ్యాపారమై పోయింది. ఆధ్యాత్మికంపేరుతో కొందరు వ్యాపారం చేస్తున్నారు. ఇది మంచిదికాదు. నీవు మంచి మనిషి (GoodMan) గా జీవించాలి. Good Man గా నీవు తయారైనప్పుడే God Man గా రూపొందగలవు. కానీ, ఎన్నటికీ ఛీ ఛీ గా మారవద్దు. నిరంతరమూ నాలుక మీద భగవన్నామం నాట్యం చేస్తుండాలి. చేతులతో సమాజసేవ చేస్తుండాలి".**

**- బాబా**

### అనాత్మవాద ప్రచారంలో విస్తరిస్తున్న ప్రచార సాధనాల పాత్ర

మానవతా విలువల ప్రబోధం కేవలం కళాశాలలు, పాఠశాలల వరకే పరిమితమైతే అది అరణ్యరోదన అవుతుంది. ఈనాడు ప్రచార సాధనాలైన ప్రెస్, టి.వి., రేడియో, చలనచిత్ర, నాటక, వాణిజ్య రంగాలు మానవుని చేతలను, ఆలోచనలను, రుచులను, మాటలను, అన్నింటినీ మార్చివేస్తూ, పాశ్చాత్య ధోరణులను ప్రోత్సహిస్తు, నిశ్శబ్దంగా తమ పని తాము చేసుకుంటూ విస్తరిస్తున్నాయి. విలువల విషయంలో మానవుడిని అధః పాతాళానికి అణగద్రొక్కి, శాంతి సంతోషాలను దూరం చేస్తూ అనాత్మవాదాన్ని పెంచి పోషిస్తున్నాయి. భారతదేశపు ఉన్నత సంస్కృతీ సంప్రదాయాల పరంపరకు ఎనలేని విఘాతాన్ని కల్గిస్తున్నాయి. ఈ ప్రచార సాధనములకు కళ్ళెం వేసినపుడే మానవతా విలువలను పెంపొందించుకోగల్గుతాము.

ఒక చైనా తత్త్వవేత్త ఇలా అంటాడు. 'నీవు కొన్ని శతాబ్దాల సమాజ భవిష్యత్తు గురించి ఆలోచించేట్లైతే ఈనాటి యువహృదయాలలో ఆదర్శమనే బీజాలు నాటు.' **'నాకు ఒక వంద మంది బలవంతులు, బుద్ధిశాలురు, నిస్వార్థపరులైన యువకులను ఇస్తే, ఈ ప్రపంచ స్థితిగతులనే మార్చివేస్తాను'** అన్నారు స్వామి వివేకానంద. విలువలతో కూడిన విద్యావిధానం అమలుకు దోహదం చేసే ఒక ముఖ్యమైన భాగముంది. అది ఏమిటంటే యువతలో చక్కని స్ఫూర్తిని, ఉత్తేజాన్ని కలిగించి దేశాభ్యుదయంలో ముందుకు నడిపించటం. ఎందుకంటే యువశక్తిని నిర్మూలనానికి కానీ నిర్మాణానికి కానీ ఉపయోగించగలము. అందుకే Transformation కావాలి. Information కాదు అంటారు స్వామి.

సాహసం చేయటం, దేనినైనా, ఎవరినైనా ఎదురించి నిలవటం యువతలో ఆ వయస్సుకుండే సహజ లక్షణాలు. అందువలన అధ్యాపకుడు యువతను సమర్థంగా ఉపయోగించుకొనగలగాలి. నిజానికి అతని నిస్వార్థ ప్రేమయే అతని చేతిలోని శక్తివంతమైన ఆయుధము.

ప్రామాణిక విద్య అమలులో తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల పాత్రలు చాలా పటిష్టమైనవి. పిల్లలతో పాటు తల్లిదండ్రులు కూడా విలువల పట్ల సదవగాహన కల్గివుండి సచ్ఛీలవంతులైతే వారి ప్రభావం వలన పిల్లలు సన్మార్గంలో సంచరించగల్గుతారు. సచ్ఛీలవంతులైన యువతీ యువకుల నిర్మాణంలో తల్లిదండ్రుల పాత్ర అమోఘమయినది. **మంచి ఉపాధ్యాయులు, మంచి తల్లిదండ్రులు వున్నట్లయితే చెడ్డ విద్యార్థులు వుండనే వుండరు.** అయినప్పటికీ చుట్టుప్రక్క వాతావరణంలోని స్నేహితుల ప్రభావాన్ని కొంతవరకు పరిగణనలోకి తీసుకొనక తప్పదు.

ఇక ఏ విషయాన్నయినా, పాఠ్యాంశాన్నయినా విలువల సహితంగా, సహజంగా బోధించగలగాలి అంటే ఈ విశ్వంలో ప్రతీది భగవంతుని వలననే ఏర్పడినది అనే సత్యాన్ని మనసావాచా విశ్వసించాలి. శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ ప్రథమ వైస్‌ఛాన్సలర్, సాహిత్యం, వేదాంతం, విద్య మున్నగు రంగాలలో నిష్ణాతులయిన డా॥ వి.కె. గోకాక్ అభిప్రాయం ప్రకారం సత్యము, సౌందర్యం, శక్తి, విలువ, ప్రేమ, ఆనందములు అనేవి ఆరు ముఖ్యమైన విలువలు. ఏ విషయాన్నయినా విజ్ఞానశాస్త్రం మరియు మానవత్వపు దృక్పథంతో అధ్యయనం చేసినపుడు ఆ విషయం సంపూర్ణంగా అవగతమవుతుంది. ఏతావాతా ఆధ్యాత్మిక దృష్టికల ఉపాధ్యాయులు విద్యార్థులకు పాఠ్యాంశములతోపాటు విలువలను కూడా బోధించి వారిని సన్మార్గంలో నడిపించగల్గుతారు.

**'విద్యాబోధనకు ప్రధానంగా కావల్సినది విద్యనేర్పే వ్యక్తి. ఈనాడు మనం ఎదుర్కొంటున్న కొరత ఇదే'** అంటారు జె. కృష్ణమూర్తి. సంవత్సరాలు గడుస్తున్నా ఈ కొరత తీరటం లేదు. ప్రాచీన కాలంలో భారతదేశంలో గురువుకు ఉన్నత స్థానాన్ని ఇచ్చేవారు. గురువులు ఏదో ఒక విషయం మాత్రమే అధ్యయనం చేయకుండా, ఇహమునకు పనికి వచ్చే అపర విద్య, పారమార్థికమునకు దారిచూపే పరవిద్య (ఆత్మ విద్య) అను రెండింటి యందు నిష్ణాతులై విద్యార్థులకు రెండింటి సారాన్ని రంగరించి ఒకే గురువు అందించేవారు. విద్యావాహినిలో భగవాన్ బాబావారు 'తన హృదయములో ఆత్మజ్ఞానాన్ని పదిలపరచుకోగల్గినవాడే నిజమైన గురువు' అన్నారు. కానీ నేడు భారతదేశంలో గురువులు తమ విషయజ్ఞానాన్ని పరిమితం చేసుకుని, ఆధ్యాత్మిక విద్యలను విస్మరించి, లౌకిక విద్యలను మాత్రమే నేర్పుతున్నారు. ఫలితంగా సమాజంలో అనాత్మవాదం పెచ్చిరిల్లి నైతిక విలువల పతనం జరుగుతోంది. **'అధ్యాత్మ విద్యా విద్యానాం'** అన్న భగవద్గీత వాక్యాన్ని గురువులు విశ్వసించినపుడే విద్యలో విలువలు చిగురించడం మొదలు పెట్టాయి. తమ జీవితాన్ని దృష్టిలో వుంచుకొని బోధన చేసే ఉపాధ్యాయులు, తాము నేర్చుకునే చదువు ద్వారా తమకు రాబోయే ఉద్యోగాన్ని దృష్టిలో వుంచుకొని విద్యనభ్యసించే విద్యార్థులు, ఈ ఇరువురూ వున్నంతకాలం విద్యారంగంలో విలువల పునరుద్ధరణ సాధ్యం కాదంటారు భగవాన్ శ్రీ సత్యసాయి.

మన జన్మాంతర సుకృత విశేషం వలన గురువులకే గురువైన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా మనందరి మధ్యన ప్రత్యక్షంగా వుండి, గురువులకు కావలసిన నైతిక ధైర్య స్థైర్యములను ప్రసాదిస్తూ, ఉత్తేజాన్ని కల్గిస్తూ వారి ద్వారా సమాజంలో, దేశంలో, ప్రపంచంలో శాంతిస్థాపన చేస్తున్నారు. అయితే ఇతర విద్యాసంస్థలలో కూడా శ్రీ సత్యసాయి ఉన్నత సంస్థలలో వలెనే, అవగాహనా తరగతులు (Awareness Programme) బోధించుటకు ప్రత్యేకంగా గురువులు నియమింపబడాలి. వీరు అత్యధిక సామర్థ్యము, తెలివితేటలు, ఆధ్యాత్మిక శక్తిని కలిగివుండి విద్యార్థులలో విలువలు పెంపొందిస్తూ శాంతి, సౌభ్రాతృత్వములను పెంపొందింపగల్గాలి.

విలువలతో కూడిన విద్యావిధానం అమలులో ఎదురవుతున్న పై సమస్యలన్నింటినీ శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ సమర్థవంతంగా, అద్వితీయంగా ఎదుర్కొంటూ, భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి ఆదర్శపూరితమైన, ఉత్తేజనాభరితమైన పర్యవేక్షణలో కార్యాచరణను చేపట్టింది. ఈ సంస్థలో విలువల ప్రబోధం వలన అధ్యాపకులకు, విద్యార్థులకు మధ్య చక్కటి అనుబంధం ఏర్పడుతుంది. ఇక్కడ గురువులు కూడా తమను తాము విలువలు నేర్చుకుంటున్న విద్యార్థులుగానే భావిస్తారు. ఈ విశ్వవిద్యాలయంలో పట్టభద్రులై బయటకు వెళ్ళి భారత దేశంలోనేకాక ప్రపంచం నలుమూలలా ఆదర్శవంతమైన సేవలను అందిస్తున్న యువత ప్రవర్తనే ఈ ప్రయోగం విజయవంతమైనదనటానికి తార్కాణం. నేటి సమకాలీన ప్రపంచంలో **'విలువలతో కూడిన విద్యా విధానం అమలు ఒట్టి భ్రమ'** అనే అభిప్రాయం తప్పని వీరు నిరూపిస్తున్నారు. ✵

- తెనుగుసేత : **మల్లాది కిషోర్**

# సాయి అనుగ్రహాన్ని పొందటం ఎట్లా?

"పిలిచిన పలికెడు దేవుడు
చిలికించుము ప్రేమధార శ్రీ కృష్ణుండై
కలిదోష హరము చేయును
మరి జన్మము లేని మంచి మార్గము చూపున్"

మానవ జన్మ ఎత్తిన ప్రతి వ్యక్తి కూడా మూడు కోర్కెలు తప్పకుండా కలిగి ఉంటాడు. 1) తాను బ్రతకాలనీ, 2) తాను తెలుసుకోవాలనీ, 3) తాను సంతోషంగా ఉండాలనీ. ఎందుకు ఈ మూడు కోర్కెలు కలిగి ఉంటాడు అంటే తనలో ఉన్న పరమాత్మ సత్య స్వరూపుడు, తాను నిత్యుడు కనుక జీవ భావం ఆవరించిన తాను కూడ శాశ్వతంగా ఉండాలనే కోరుకుంటాడు. తర్వాత తనలో ఉన్న పరమాత్మ చైతన్య స్వరూపుడు 'ప్రజ్ఞాన ఘన ఏవ' అన్నట్లుగా జ్ఞాన స్వరూపుడు భగవంతుడు. కనుక జీవభావంతో ఉన్న తాను కూడా తెలుసుకోవాలి అనుకుంటాడు. మూడవది తాను సంతోషంగా ఉండాలని. ఎందుకు? సహజంగా ప్రత్యగాత్మ ఆనంద స్వరూపుడు కనుక తాను కూడా ఆనందంగా ఉండాలని కోరుకుంటాడు. అయితే యీ మూడు కోర్కెలు తీరేదెప్పుడు? తన సహజమైన స్వరూపాన్ని తాను అనుభవిస్తున్నప్పుడు తానే సత్యం, జ్ఞానం ఆనందం అయిపోతాడు. అలా కావాలి కూడా. ఆ విధంగా మానవుని మాధవునిగా మార్చటానికే మన సత్యసాయిబాబా వారు అవతరించారు. అయితే అవతారతత్త్వం ఏ వుద్దేశ్యంతో వచ్చిందో తెలుసుకున్న తర్వాత ఆ వుద్దేశం నెరవేరాలంటే మనం సాయి అనుగ్రహం పొందాలి. ఆయన అనుగ్రహం వలననే మనం మన సహజ స్వరూపాన్ని తెలుసుకొని స్వస్వరూప అనుసంధానం చేయటం జరుగుతుంది. 'మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసి, స్వస్వరూపాను సంధానం భక్తిరిత్యభిధీయతే' అన్నారు శంకరాచార్యులు. అంటే భక్తి మోక్షానికి సాధనం. అయితే భక్తి అంటే ఏమిటి? స్వస్వరూపాను సంధానం చేయటమే నిజమైన భక్తి. స్వామి అంటారు. Bhakti is no crying at all nor any negative condition. The seeing of all in all we see". 'సర్వులలోను సర్వేశ్వరుని సందర్శించటమే నిజమైన భక్తి' అన్నమాట. ఏతావాత, తన సహజ స్వరూపాన్ని తెలుసుకొని ఆనందస్థితిలో ఉండటమే మానవ జన్మ లక్ష్యము, గమ్యము. అయితే దానికి సద్గురువు కావాలి. మన అదృష్టవశాత్తు "సాక్షాత్తు దేవుడే సాయి బాబాగా ఉండి మరియొక గురువుపై మనసు ఏల? అన్నట్లుగా మనం మరొక గురువును వెదక నవసరము లేదు.

ఆదూరి శ్రీనివాసరావు

ఇప్పుడు స్వామి వారి అనుగ్రహం పొందటమెట్లా? స్వామి అనుగ్రహం సహజమైనది. స్వార్థరహితమైనది. సూర్యరశ్మిలాగా అందరి మీద ప్రసరిస్తుంది. ఆ ప్రసరింప జేసుకోవటమే మన సాధన.

**1. అహంకారం నిర్మూలించుకోవాలి :** ప్రతి భక్తుడికి, దూడకు వయస్సుతో పాటు కొమ్ములు పెరిగినట్లుగా భక్తితోపాటు అహంకారం పెరుగుతుంది. నా అంత భక్తుడు ఉన్నాడా ఎక్కడైనా అనిపిస్తుంది. అది మాయ యొక్క వికారమే. అందుకనే స్వామి ముందుగా మనలో ఉన్న అహంకారాన్ని తొలగిస్తూ ఉంటాడు. ప్రశాంతి నిలయంలో తెల్లవారు ఝామునే లేచి లైన్లలో కూర్చోవాలి. అంత కూర్చున్నా ఏ పదోలైను రావచ్చు. ఫస్టు లైనొచ్చినా స్వామి మనలను చూడకపోవచ్చు. ఆయన చూడదల్చుకోకపోతే ప్రక్కన ఉన్నా, కన్ను తప్పించే కమల నేత్రుడు స్వామి. కనుక మన స్థాయి ఎంతైనా అక్కడ క్రింద కాచుకుని కూర్చునేటట్లు చేస్తాడు. అయితే నిలయం వదలగానే మరల అహంకారం ప్రవేశిస్తుంది. అదేమి చిత్రమో మరి. అష్టోత్తరంలో కూడా "అహంకార నాశకాయ నమః" అని ఉంది. మనం ఎప్పుడూ కూడా "నేనంతటి వాడిని" అని చెప్పుకుంటూ ఉంటే అహంకారం తెలియకుండా పెరుగుతుంది.

**2. ద్వేషము :** మనకు యిష్టమయినదానిని ఎవరైనా చేస్తే మనకు ద్వేషం ప్రారంభమవుతుంది. లేదా మనలను



తప్పులు పట్టినా ద్వేషం పెరుగుతుంది. స్వామి అంటారు. See your faults and others merits" కనుక ఎప్పుడూ నేనే కరెక్టు అనుకోకూడదు. "I may be wrong" అని అనుకుంటే ఎవరైనా మనలను తప్పు పట్టినప్పుడు మనకు ద్వేషము, కోపము పెరుగదు కదా. ప్రేమ ఉన్నచోట ద్వేషం ఉండదు. ద్వేషమనే మూలధనానికి కోపమనేది వడ్డీ లాంటిది. ద్వేషం లేక పోతే కోపం రాదు. వచ్చినా క్షణికం మాత్రమే.

**3) దంభము :** స్వామి ముందు మనం ఏమాత్రం దంభం ప్రదర్శించినా మన వద్దకు రాడు. 'నేను స్వామికి దగ్గర' అన్నట్లుగా యితరులు తెలుసుకునేటట్లుగా ప్రవర్తిస్తే అంతే సంగతులు. ఇక మన మొహం చూడడు. స్వామికి మనం తెలియనట్లుగా ప్రవర్తిస్తే స్వామికి యిష్టం. కనుకనే మనలను స్వామి చూసినా ఎరగనట్లు ఉంటారు. కానీ స్వామికి తెలియని వారు లేరు. ఎవరు ఎప్పుడు వచ్చినది ఎప్పుడు పోయేది, ఎందుకు వచ్చింది సర్వం తెలుసు. ఆయన సర్వజ్ఞుడు కనుక.

**4) సేవానిరతి :** స్వామి వారికి సేవాదళ్ అంటే అమితమైన అభిమానం. చాలాసార్లు స్వామి మన సేవాదళం వారిని పొగిడినారు. వారుండ బట్టే యీ ఆసుపత్రికి యింత పేరు వచ్చింది. నిజానికి సేవాదళ్ వారు నిస్వార్ధంగా సేవలు చేస్తున్నారు అన్నారు. కనుక **'నోటితో నామము, చేతితో సేవ' 'దిల్ మే రామ్, హాత్ మే కామ్'** అంటారు స్వామి. అయితే సేవ కోసం మనం ప్రాకులాడాలి. సేవలో వుచ్ఛము, నీచము అనేవి ఉండవు. అంతా సేవే. **'యద్యత్ కర్మ కరోమితత్త దఖిలం శంభో తమిరాధవం":** అన్నట్లుగా మనం ఏ సేవజేసినా స్వామికే అర్పితం అనే భావనతో సేవ చేయాలి. ఒకరి మెప్పు కొరకు కాదు. నా కోసమే. నాలో ఉన్న అహంకారము, దుష్ట భావాలు పోవటానికే నేను సేవ చేస్తున్నాను అనే భావన మనలో ఉండాలి.

**5) మృదువుగా మాట్లాడటం :** ఎవరు ఎన్ని మాటలన్నా మనం react కాకూడదు. మన స్వభావం మారకూడదు. **'తుల్యనిందా స్తుతిర్మౌని'** అంటే ముని నిందాస్తుతులను సమానంగా చూస్తాడు. మనం కూడా గౌరవ అగౌరవాలను లెక్క చేయకూడదు. స్వామి మెచ్చుకుంటే చాలు. సమితి సభ్యులతో కలిసి ఉండాలి. మనం కలిసి ఉంటే స్వామికి ఇష్టం. అందుకనే గ్రూపులుగా వస్తే ఇంటర్వ్యూ యిస్తారు. Help ever, Hurt Never అంటున్నారు స్వామి. ఇతర లోపాలు ఎంచకుండా మన లోపాలను సరిదిద్దుకుంటుంటే స్వామి అనుగ్రహం తప్పక మన మీద ఉంటుంది.

**6. ప్రేమ :** ప్రేమ మనకు బలము, తేజము, ప్రేమే దైవం. మన ప్రేమ నిస్వార్ధమై ఉండాలి. సహజమై ఉండాలి. ఇతరుల మాటలకు మనం react కాకూడదు. "Only Act never Reacth" అంటారు స్వామి.

**7. ఆగ్రహించిన వ్యక్తిపై ఏవిధమైన దుష్ట భావాలు లేకుండుట :** ఏ వ్యక్తి అయినా మనలను దూషించినపుడు సహజంగా ఆ వ్యక్తి మీద మనం కోపం వహించటం, తిరిగి దెబ్బ కొట్టాలని ప్రయత్నిస్తాము. స్వామి వారు ఎవరైన మనలను దూషించినపుడు మనం సహనం వహించి నట్లయితే సంతోషపడతారు. మనలను దగ్గరకు తీసి అనుగ్రహం పంచుతారు. అలా కాకుండా మనం కూడా react అయి కక్ష వహించినట్లయితే తటస్థంగా ఉంటారు. అంతా స్వామికి తెలుసుకదా. మనం ఎందుకు react కావటం. అయితే మౌనంగా ఉంటే మనదే తప్పంటారు. కదా! కానీ! సత్యం జయిస్తుంది. అసత్యం నశిస్తుంది. కనుక ఎవరేమన్నా, ఏ విధంగా విమర్శించినా మనం react కాకుండా సాయి మార్గాన నడుస్తే స్వామి అనుగ్రహం తప్పక లభిస్తుంది.

సాయి అనుగ్రహం పొందటానికి అనేక మార్గాలు ఉన్నాయి. ఏ విధంగానైనా మనం స్వామి అనుగ్రహం పొందవచ్చు.

జై సాయిరామ్!!



## భగవంతుడే అమాయకుడు!

'స్వామీ! మేము అమాయకులం' 'అని మీరు అనుకొంటూ ఉంటారు. అమాయకుడంటే మాయలేని వాడని అర్థం. మాయలేనటువంటివాడు భగవంతుడొక్కడే. ఎవడేమి కోరినా మాయ లేకుండా ఆశీర్వదిస్తుంటాడు. వీడు మోసం చేస్తున్నాడా? అనే భావానికి భగవంతు డేనాడూ చోటివ్వడు. అందరినీ నమ్ముతాడు. అయితే, భగవంతుని మోసం చేయాలని చూసేవారు తమను తామే మోసం చేసుకుంటారు. కారణమేమనగా, వారి నమ్మకం ఎలాంటిదో అలాంటి ఫలితమునే పొందుతారు. ముందు ఒకటి, వెనుక ఒకటి నటించేవారికి అట్లే ముందు ఒక ఫలితం, వెనుక ఒక ఫలితం వస్తుంది.

- బాబా

# రోజులు మారాయి - ఇంకా ఎంతో మారాలి

'**చెట్టుముందా! విత్తనం ముందా?**' అని ప్రశ్న వేశారు, శాస్త్రజ్ఞులు. ఇలాంటి చొప్పదంటు ప్రశ్నలు వెయ్యడం సులువే. జవాబు చెప్పటం మటుకు చాలా కష్టం. సాంఘిక శాస్త్రజ్ఞులు (Social Scientists) వేసిన ఇంకొక చొప్పదంటు ప్రశ్న, '**పెళ్ళిముందా, పాపాయి ముందా?**' అని. రోజులు మారాయి. ఈ మధ్య ఒక పాశ్చాత్య దేశంలో నూరుమంది పిల్లలుపుడితే, అందులో ముప్పయి మందికిపైగా పెళ్ళికాని తల్లులకు పుట్టినవారే! ఇలా ఉన్నాయి. 21వ శతాబ్దంలో మన సాంఘిక కట్టుబాట్లు, విలువలు.

రోజులు మారాయి. '**యుద్ధంముందా? శాంతి ముందా?**' అని మరొక ఘాటైన సంశయం బయలుదేరింది ఈనాడు ప్రపంచంలో. ఈ ప్రశ్నలకు జవాబు చూపిస్తున్నారు, భగవాన్ శ్రీ సత్యసాయిబాబా.

యుద్ధాలు రకరకాలు. మనిషి, మనిషి, మల్లయుద్ధం చేసి గెలిచినవాడే పెళ్లికొడుకన్నారు ఒకప్పుడు. రాజ్యాల కోసం, రాణులకోసం యుద్ధరంగంలోకిదిగేవారు రాజులు. గెలిచినవారే రాజాధిరాజులనిపించుకొనేవారు. తమ మతం వ్యాపింపజేయడానికి మతాధిపతులు కూడా రంగంలోకి దిగేవారు. ఆనాడు భారతదేశం సిరిసంపదలతో తులతూగు తూండేది. విదేశీయులు మనకు నాగరికత నేర్పుతామన్న పేరుతో రాజులుగా బైఠాయించారు నిన్నమొన్నటిదాకా ఈ దేశంలో.

యుద్ధాలు ప్రపంచానికి క్రొత్తకాదు. చరిత్రకారులు చెప్పినట్లు, వేలకువేలు యుద్ధాలు జరిగేయి. గత అయిదువేల సంవత్సరాలలోను, పదిహేనువేల యుద్ధాలు జరిగేయట! ఈ యుద్ధాలలో కోటానుకోట్ల సైనికులు మరణించారు. అయితే, ఇరవయ్యవ శతాబ్దంలో జరిగిన రెండు ప్రపంచ యుద్ధాలను గురించి చెప్పుకోవలసివస్తే, అవి ప్రపంచ నాశనానికే దారితీశాయి. '**కలియుగం కలహాయుగం**' అని ఋజువు చేశాయి. ప్రపంచ దేశాలన్నీ రెండు పార్టీలుగా చీలిపోయాయి. మొదటి ప్రపంచ యుద్ధం **(1914-18)**ని మించిపోయింది రెండవ ప్రపంచ యుద్ధం **(1939-45)**, మానవ మారణహోమంలో.

చరిత్రకారుల అంచనాల ప్రకారం, రెండవ ప్రపంచ యుద్ధానికి ప్రపంచ దేశాలన్నీ కలిసి సుమారు **13.8** బిలియన్ల అమెరికా డాలర్లు ఖర్చు చేశాయి. ఒక బిలియను అంటే, మిలియను మిలియన్లు, అనగా ఒకటి తరువాత పన్నెండు సున్నాలు. ఇదిగాక, ఐదుకోట్లకుపైగా జననష్టం కలిగింది. విచిత్రమేమంటే, అందులో సైనికులు రెండుకోట్ల ఇరవై లక్షలమంది మాత్రమే. మిగిలినవారంతా పౌరులే. ఇంతటి దారుణ మారణహోమం జరిగింది.

## మంత్రిప్రగడ నరసింహారావు

భగవాన్ బాబావారు ఒక సందర్భంలో "ప్రపంచం యీనాడు కొన్ని ఈతి బాధలతో విలవిల కొట్టుకుంటోంది. ఒకమూల యుద్ధభయం, ఇంకోమూల కరువుకాటకాలు; మనిషికి మనిషికి మధ్య విరోధం, కులానికి కులానికి మధ్య కుళ్ళు; మరోమూల పదవులంటే దురాశ, హద్దుమీరి చెలరేగుతున్న స్వార్థపరాయణత్వము; నీతినిజాయితీలు నశించిపోతున్నాయి; యిటువంటి కఠిన సమస్యలతో బాధపడుతున్నాడు మానవుడు' అని వ్యాఖ్యానించారు.

రోజులు మారాయి. ఇలాగే మారుతూ వస్తే ప్రపంచం నాశనమవుతుందని అవతరించారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు. గడిచిన యుగాల్లో పరిస్థితులువేరు. కలియుగంలో పరిస్థితులువేరు. పాముకి విషం కోరల్లోనే ఉంటుంది. కోరలు పీకేస్తే చక్కగా నాట్యము చేస్తుంది పాములవాడి నాదస్వరం వింటూ. తేలుకి తోక చివర విషం. దానిని కత్తిరించేస్తే తేలుతో ఆడుకుంటారు పిల్లలు. గడిచిన యుగాల్లో ఏదో కొద్దిమందిలో ఉన్న రాక్షసస్వభావం, కొన్ని అవతారాలు ఉద్భవించివారిని నిర్మూలిస్తే సమసి పోయిందే. పరస్త్రీ వ్యామోహంలో సీతాదేవిని అపహరించిన రావణుణ్ణి సంహరించి రామరాజ్యమును నెలకొల్పాడు అవతార పురుషుడైన శ్రీరామచంద్రుడు. అలాగే కృష్ణావతారం. దుర్మార్గులైన కౌరవులను పద్దెనిమిది రోజులపాటు జరిగిన కురుక్షేత్రయుద్ధంలో పాండవులచే చంపించి దేశంలో శాంతిని స్థాపించాడు.

ప్రస్తుత కలియుగంలో విషం, దుష్టస్వభావం మానవులందరిలోను అంతోయింతో ఉన్నది. యుద్ధాలు పెరిగిపోతూన్నాయి. యుద్ధాలతో శాంతిస్థాపన చేయవచ్చు నన్న ఆశలు అడుగంటాయి. ఈ పరిస్థితులలో మానవత్వం లోంచి పశుత్వంలోకి జారిపోకుండా దైవత్వానికి మళ్ళించ డానికి సంకల్పించారు, అవతార పురుషులైన భగవాన్ శ్రీ సత్యసాయిబాబా. స్వామి సంకల్పం, వజ్ర సంకల్పం అని కూడా తెలియజేశారు. ప్రపంచం అంతా శాంతి సైన్యాలను పెంచుతున్నారు. ఇందుకొరకు నూటఅరవై దేశాలలో అహర్నిశలూ పనిచేస్తున్నాయి శ్రీ సత్యసాయి సేవాసంస్థలు. వీటన్నింటికి కేంద్రస్థానము, ప్రశాంతి నిలయం. ఈ ప్రపంచవ్యాప్త కార్యక్రమాన్ని నడిపిస్తున్నవారు, అవతార పురుషులు, బాబా. అద్వితీయమైన వారి ఆధ్యాత్మిక తత్త్వం లోని కొన్ని ముఖ్య విషయాలు :

**నీవేదేవుడు :**

మనిషికి మనసే ప్రధానమైనది, కీలకమైనది. ఇది మనిషిని దైవత్వములోనికి తీసుకువెళ్ళగలదు, పశుత్వము లోనికి తీసుకువెళ్ళగలదు, అధః పాతాళములో పడవేయ గలదు, ఉన్నతస్థాయికి చేర్చగలదు కూడా. అట్టి మనస్సును సక్రమమైన మార్గంలో పెట్టగలిగేది నీ చిత్తమే. అదే నీ అంతరాత్మ. అదే నీ దేవుడని ఘంటాపథంగా చెబుతున్నారు భగవాన్ బాబా.

**ఆనాటి భారతదేశము - ఈనాటి హిందూదేశము (ఇండియా) :**

రోజులు మారేయి. దేశాలపేర్లతోబాటు మనుష్యుల పేర్లు కూడా మారుతున్నాయి. ఉదాహరణకు, మా యింటి చాకలిపేరు, మేరీ పెంటమ్మ; ఆఫీసులో బంట్రోతు పేరు, జాన్ అప్పల నరసయ్య. శ్రీలంకలో మా స్నేహితుడు లక్ష్మన్ డిమెల్. హైద్రాబాదులో మా ప్రక్కయింట్లో బాబుపేరు, కెన్నడీ. ఇదీ ఈనాటి పరిస్థితి.

ఆనాటి భారతదేశము, ఈనాటి హిందూ దేశమూ ఎంత మాత్రము ఒకటికాదు. 'భారత' అన్న పేరు శ్రీరామ చంద్రుని సోదరుని పేరుకాదు. 'భ' అంటే భగవంతుని యందు, 'రత' అంటే ప్రేమ. భారతదేశం అంటే దైవప్రేమతో నిండిన దేశం. 'హిందూ దేశం' అన్న పేరు పరదేశీయులు పెట్టిన పేరు. భారతదేశాన్ని కత్తిరించి కుంచింపజేయగా మిగిలినది, హిందూ దేశం.

ఆనాటి భారతదేశము యొక్క సరిహద్దులు తూర్పున ఇప్పటి బర్మా, థాయ్‌లాండు వగైరా దేశాలు. ఉత్తరాన, హిమాలయ పర్వతశ్రేణిలోని టిబెట్టు, నేపాలు వగైరా దేశాలు. దక్షిణాన నేటి శ్రీలంక మొదలగు ద్వీపాలు. పశ్చిమోత్తర దిశలో విశిష్టమైన విశ్వవిద్యాలయమున్న తక్షశిలా నగరము, మహాభారత యుద్ధము జరిగిన కురుక్షేత్రమూ ఉన్నాయి. అదే పేరుతో ఇంకా రైలుస్టేషను కూడా వుంది.

**నాగరికత, సంస్కృతి :**

మూడు, నాలుగు శతాబ్దాల క్రితం ఐరోపా ఖండవాసులు సముద్రాలు దాటుకుంటూ మిగతా ఖండాల్ని దౌర్జన్యంతో ఆక్రమించుకున్నారు, పంచుకున్నారు. ఒక చేతిలో తుపాకులు, ఇంకొక చేతిలో బైబిలు పట్టుకుని ఆయాదేశాలలో ప్రవేశించి అక్కడి తరతరాలుగా వస్తున్న సంస్కృతిని మంటగలిపారు. ఈ దేశాలవారంతా అనాగరికులని, వాళ్ళకి నాగరికత నేర్పుతున్నామని సాకు చెప్పారు. అయితే, భారతదేశంలో మటుకు వారెంత ప్రయత్నించినా, యుగయుగాలుగా, తరతరాలుగా వస్తున్న సంస్కృతి నాశనమవలేదు. కారణం, భారతీయ సంస్కృతి వైదిక విజ్ఞానముపై ఆధారపడియుండడమే. భారతీయ సంస్కృతి ఒక్క భారతదేశానికేగాదు, మొత్తం మానవాళి మనుగడకే ఆధారమైన సంస్కృతి అని నొక్కి చెపుతున్నారు భగవాన్ బాబా. అందువలన భగవాన్ బాబావారి దర్శన, స్పర్శన, సంభాషణ భాగ్యము పొంది ఆయన అవతార కార్యక్రమంలో పాలుపంచుకోవడానికి ప్రపంచమంతటి నుండి జాతి, మత, వివక్షత లేకుండా సమస్త దేశాల ప్రజలు సంవత్సరం పొడుగునా ప్రశాంతి నిలయానికి వస్తూనే ఉన్నారు, దివ్యానుభూతులు పొందుతూనే ఉన్నారు.

నాగరికతవేరు, సంస్కృతివేరు. కారణాంతరాల వలన ప్రస్తుతం కొంత మరుగున పడిన భారతీయ సంస్కృతిని పునరుద్ధరించి, దానికి పూర్వవైభవాన్ని చేకూర్చడానికి కంకణం కట్టుకున్నారు, భగవాన్ బాబా.

**శాంతిసేన :**

రోజులు మారిపోతున్నాయి. శాంతిభద్రతలు ప్రపంచంలో నానాటికి దిగజారిపోతున్నాయి. శాంతి అనేది ఒక యుద్ధమునకు మరొక యుద్ధమునకు మధ్యనున్న విరామమేనంటున్నారు చరిత్రకారులు. ప్రపంచ వ్యాప్తంగా

ఇటువంటి దారుణ పరిస్థితి నెలకొన్న తరుణంలో అవతరించారు బాబా. యుద్ధసేనలు, యుద్ధతంత్రాలు, వ్యూహాలు నేర్చుకుంటూ వచ్చాయి ఇప్పటిదాకా. స్వామి వారు అవతరించి ప్రపంచానికి బుద్ధిచెబుతూ శాంతి సేనలను నెలకొల్పి, కోట్లాదిమంది శాంతిసైనికులకు తర్ఫీదు ఇస్తున్నారు. ఇన్నాళ్ళూ మనుష్యత్వమును పశుత్వస్థాయికి దిగజార్చింది ప్రపంచం. ఇప్పుడు స్వామి అవతరించి మనుషుల మనసులు మార్చి మనుష్యత్వాన్ని దైవత్వంలోకి మార్చేస్తున్నారు.

ప్రపంచానికి యుద్ధాలమీద విముఖత కల్పించి, భారతీయ సంస్కృతిని వ్యాపింపజేసి, శాంతి సైనికులతో దివ్యత్వమును స్థాపిస్తున్నారు. మానవునిలో సహజంగా ఉన్న దివ్యత్వాన్ని వెలికితీయడానికి కృషిచేస్తున్నారు.

**ఈ శాంతి సైనికులెవరు ?**

ప్రపంచములోని అన్నిదేశాల నుండి కోటానుకోట్లు తండోపతండాలుగా ప్రశాంతి నిలయానికి వచ్చే తీర్థ యాత్రికులు. ప్రశాంతి నిలయంలోనే స్థిరోభవ! వరదోభవ' అంటూ వుండిపోయిన వాళ్ళు నాలాంటి నగరవాసులు. ఇంకా, స్వామివారి విద్యాసంస్థలలో చదువుకునే విద్యార్థులు కూడా.

స్వామి రకరకాల అభ్యాసాలు నేర్పుతారు వారికి. దర్శన, స్పర్శన, సంభాషణ భాగ్యం కల్పిస్తారు. సమస్త మానవాళి యొక్క భూత భవిష్యద్వర్తమానాలు తెలిసిన స్వామి వేదోపనిషత్తులు, పురాణాలు, శాస్త్రాలలోని మర్మాలను తెలియజేసి అవన్నీ నిత్యసత్యములని ప్రబోధించి, మానవులను దివ్యత్వంవైపు నడిపిస్తున్నారు. మానవాళి అజ్ఞానాంధకారంలో మునిగిఉండే రోజులు పోయాయి. భగవాన్ బాబావారు ఒక నూతన సత్యసాయి శకానికి నాందిపలికారు. మానవుడు మాధవుడుగా రూపొందే రోజు ఇంకెంతో దూరంలో లేదు. ✷

ఆయన దేవదేవుడు..... 54వ పేజీ తరువాయి)

విన్నాడు. యుద్ధరంగంలో అక్కడ సంఘటనలను, ఘట్టాలను ప్రత్యక్షంగా వీక్షించి వినగల దివ్యవరప్రసాద ప్రభావముతో సంజయుడు తెలుసుకున్నాడు. రణరంగ విశేషాలను సంజయుని ద్వారా వింటున్న ధృతరాష్ట్రునికి కూడా బోధలు తెలుసు. వీరు నలుగురు మాత్రమే భగవద్గీతను స్వయంగా వినగలిగారు.

ఈనాడు ఆధునిక యుగంలో సత్యసాయి శకంలో పర్తీశుని ప్రబోధం ప్రపంచ వ్యాప్తం అయ్యింది. ముముక్షు జనకోటి స్వామి సందేశాలను అందుకొని ఆనందించే అదృష్టానికి నోచుకున్నారు. యిది నేటితరం భాగ్యవిశేషం.

**బాబాగారి వరదానాలు - వాగ్దానాలు**

భక్త రక్షణే, దీన జనరక్షణే తన ప్రధాన కర్తవ్యంగా భావించిన పర్తి భగవానుడు తన ఆశ్రితులకు శరణాగతులకు, భక్తజనులకు చరిత్ర ప్రసిద్ధులైన వాగ్దానము చేసేరు. ఏ యుగంలోను, ఏ పురాణ ఇతిహాసాల్లోను, ఏ అవతార పురుషుడు ఏ భక్త సంరక్షకుడూ యియ్యని వరదానం చేయని వాగ్దానం పర్తీశుడు నోట వెడలిన మాటలు, మాణిక్యాలు యిక్కడ స్మరించుకోవడం ఎంతైనా అవసరం. 'నన్ను పిలిచినా, పిలువకున్నా బాధల్లోనున్న భక్తుడిని దివ్యదృష్టితో చూసి ఆపదలో ఆదుకుంటాను. ప్రమాదము నుండి రక్షిస్తాను. రెప్పపాటులో చర్య తీసుకుంటాను. మీరు నన్ను విస్మరించినా, మిమ్మ్ము నేను వదలిపెట్టను. దారితెలియనట్టి వారికొరకే తెలిసినా విశ్వాసము లేనివారి కొరకే నేను వచ్చేను. దాహంతో మీ దోసిలి పడితే మీరు ఎక్కడ ఉన్నా, ఏ వేళనైనా నేను వచ్చి అమృతమును పోస్తాను. మీరు కలవరపడనవసరంలేదు'.

'నేనెప్పుడూ మీ జంట, మీ వెంట, మీ ఇంట ఉంటాను. మీ ముందు నడవను. మీ వెనుక నడవను. మీ పక్కనే నడుస్తాను. మీతోనే అన్నీ చూస్తూ ఉంటాను. అన్నీ వింటాను. ఆపద వచ్చినప్పుడు ఆటంకం వచ్చినప్పుడు ఆవేదన వచ్చినప్పుడు ఒక్కమారు ప్రక్కకు తిరిగి స్వామీ అంటే చాలు రంగములోకి ఉరుకుతాను'.

నేను మీ హృదయంలో ఉండే ఆ టెలిఫోన్ ద్వారా నేను పలుకుతాను. నాకు ప్రత్యేకమైన తంతి తపాలాశాఖ ఉంది అని మరచిపోకండి. ఆ పరికరాలు మన హృదయాల మధ్య పనిచేస్తాయి. మీ హృదయాలను, నా హృదయమును కలుపుతున్న తంతి తపాలాశాఖ కొన్ని నిబంధనలకు లోబడి పనిచేస్తూ ఉంటుంది. ఆ నియమావళినే శాస్త్రాలు ప్రకటిస్తున్నవి. వాటిని మీరు శాస్త్రాల ద్వారా తెలుసుకోగలరు. ✢



# శ్రీ సత్యసాయి అవతారమే ప్రపంచములోని అద్భుతములలోకెల్ల మహాద్భుతమ్

ప్రపంచములో ఏడు అద్భుతములున్నాయని (Seven Wonders of the World) ప్రతీతి. శ్రీ సత్యసాయి బాబావారి దివ్యసంకల్పములతో వెలసిన ఏ సంస్థా భవనమును ఉదాహరణగా తీసికొన్ననూ అది ప్రపంచము లోని ఏడు అద్భుతములను తలదన్నగల మహాద్భుతం అనడము అతిశయోక్తికాదు. స్వామి జీవితమే మానవాళికి సందేశము. ఈ 2000 సం॥, నవంబరు 23వ తేదీ స్వామి 75వ జన్మదినము. స్వామి అవతార ప్రకటన గావించినది మొదలు ఈనాటి వరకూ మానవసమాజసేవకు అవసరమైన ఉచిత సౌకర్యములు కల్పించడములోనూ, మానవతా విలువలను పెంపొందించి, కులమత దేశభాషా బేధములేని వసుధైక కుటుంబమును స్థాపించుటలోనూ, ప్రేమతత్త్వములో మానవుల మనస్సులను ధర్మమార్గవర్తనులుగా మరల్చుట లోనూ స్వామి చేసిచూపిన సేవ ప్రపంచములో ఏ దేశ ప్రభుత్వము గాని, ఏ ఇతర సంస్థ గాని మానవాళికి ఇంతవరకు చరిత్రలో చేయలేదని నొక్కివక్కాణించవచ్చును.

స్వామివారు ఎంతోమందిని ప్రాణప్రమాదముల నుండి కాపాడి, మరణమాసన్నమైన వారికి ఆయుఃప్రమాణమును పెంచి కాపాడిన ఉదంతములెన్నోయున్నా అట్టి ప్రయోజనము పొందినవారిలో ఎంతోమంది ధనవంతులున్నా స్వామి ఎవరినీ, ఎప్పుడూ చెయ్యిచాచి ఏమీ అడుగలేదు.

కేవలము, మానవాళికి సేవ ఎలా చెయ్యాలో మాకు తెలియడంలేదు, మంచి పద్ధతిలో మీరే ఈ ధనమును మానవసేవకు ఉపయోగించండి అంటూ ఎన్నో విధముల స్వామిని భక్తితో, నిరహంకారముతో, ప్రేమతో ప్రార్థించిన ధర్మమార్గసంపాదనాపరులైన వారొసంగిన విరాళములతో కొన్ని సంస్థలను తమ దివ్యసంకల్పంతో స్థాపించి, నడిపించి, తద్వారా మానవసేవ చేస్తున్న దైవం 'భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు'.

అలా స్వామి దివ్యసంకల్పముతో ఏర్పాటు గావింపబడి ఇంతవరకూ జాతికంకితముగావింపబడిన వానిలో ముఖ్యమైనవి. 1) శ్రీ సత్యసాయి ఉన్నత విశ్వవిద్యాలయము 2) పుట్టపర్తి శ్రీ సత్యసాయి సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటలు 3) అనంతపురం - మెదక్ - మహబూబ్‌నగర్ జిల్లాలలో ఉచిత మంచినీటి పథకాలు ముఖ్యమైనవి.

అమెరికాలో ఒక సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్ నిర్మించడానికి సుమారు ఏడు సంవత్సరములు పడుతుంది. అటువంటిది కేవలం 7 మాసములలో నిర్మించిన పుట్టపర్తి సూపర్ స్పెషాలిటీస్ ఆస్పత్రిని అమెరికన్సు వేనోళ్ళ కొనియాడారు. పైగా అమెరికాలో కూడా ఉచితంగా హార్టు ఆపరేషన్లు చేయుట అనునదిలేదు.

## యస్.బి.యస్. రామారావు

లోయర్ K.G. నుండి Post G.aduate (P.G.) వరకూ ఉచిత విద్యావిధానం ఏ దేశంలోనూ లేదు. అందులోనూ మానవతా విలువలు, ఆధ్యాత్మికతతో కూడిన విద్యావిధానం. ఉచిత జలసరఫరా పథకమునకు వస్తే అనంతపురం జిల్లాలో 751 గ్రామాలకు సుమారు 300 కోట్లు ఖర్చుతో; మెదక్, మహబూబ్‌నగర్ జిల్లాల్లో 270 గ్రామాలకు 66 కోట్ల రూపాయిల ఖర్చుతో ఏ ప్రభుత్వము ఇంతవరకూ చెయ్యలేని పనులను స్వామి చేసిచూపించారు.

ప్రజల నిత్యావసరాలకై స్వామి ఏర్పాటుచేసిన వానిలో పుట్టపర్తిలో అంతర్జాతీయ విమానములు దిగగలిగిన విమానాశ్రయము, సనాతన సంస్కృతీ మ్యూజియం, ఢిల్లీలోని అంతర్జాతీయ సత్యసాయి సమాచార సెంటరు షుమారు 150 దేశములలో విస్తరించిన సత్యసాయి స్వచ్ఛంద సేవాసంస్థలు మొదలైనవెన్నో ఇంకా, ఇంకా కళ్యాణ మండపములు, మహిళా కళాశాలలు, పాఠశాలలు ఎన్నెన్నో ఉన్నాయి.

స్వామి తరచుగా **"Slow and Steady wins the Race"**, **"My Life is my Message"** అనియు రెండు సామెతలను చెబుతూవుంటారు. సేవ కూడా స్వామి అలాగే చేసి చూపిస్తారు. ఇప్పటి వరకూ స్వామి తమ నిత్యజీవితంలో ఎంతోమంది దేశ, విదేశస్థుల పండుగలను పుట్టపర్తి ప్రశాంతి మందిరంలో నిర్వహింపజేసి వారివారి

సంస్కృతిని విశ్వవ్యాప్తం చేసారు. ఒకరి సంస్కృతి పట్ల మరొకరికి అవగాహన ఏర్పాటుచేసారు.

ఇంటర్వ్యూలద్వారా మానవాళికి మానవతావిలువలతో కూడిన ఆధ్యాత్మికత నేర్పుతూ, రోగులైనవారికి విభూతితో ఆరోగ్యము ప్రసాదిస్తూ, పరోక్షంగా రాత్రింబవళ్ళు జపతపములు చేయువారికి కలలో కన్పించి, వారివారి దేశాలలో సాక్షాత్కారమిచ్చి రక్షించుచూ, 'సాయీ' అన్నవారి నందరినీ 'ఓయీ!' అని ఆదుకొంటున్న సత్యసాయి అవతారాన్ని మించిన ప్రపంచ వింత (మహాద్భుతం) మరొకటిలేదు. ఆయన అవతారమే అద్భుతములలోకి మహాద్భుతం.

స్వామి నెమ్మదినెమ్మదిగా అభివృద్ధి చేసికొంటూ వస్తున్న తమ అవతార కార్యక్రమంలో ఈ సంవత్సరం శ్రీవారి 75వ జన్మదినం నాటికి ఆవిష్కరణకు తయారు చేయబడిన కొన్ని అద్భుతముల వివరాలను తెలిసికొందాము.

**1. బెంగుళూరులోని శ్రీ సత్యసాయి సూపర్ స్పెషాలిటీస్ హాస్పిటల్.**

**2. పుట్టపర్తిలోని సంగీత కళాశాల.**

**3. స్వామి 75వ జన్మదిన వేడుకల సభాభవనము.
(75th Birthday Community Hall).**

**4. పుట్టపర్తి రైల్వేస్టేషను**

**5. అనంతపురం జిల్లాలోని పేదరిక నిర్మూలనకు అభివృద్ధి పనులు.**

**బెంగుళూరు : శ్రీ సత్యసాయి సూపర్ స్పెషాలిటీస్ ఆసుపత్రి:**

బెంగుళూరులో వైట్‌ఫీల్డుకు దగ్గరలోగల ఇన్‌ఫర్మేషన్ టెక్నాలజీ పార్కుప్రక్కనే ఉన్న 70 ఎకరాల విస్తీర్ణంగల ఎకరాఒక్కింటికి కోటిన్నర రూపాయలు విలువచేసే భూమి, ఉచిత నీటి సరఫరా, ఉచిత విద్యుత్ సరఫరాలను కర్ణాటక రాష్ట్రం స్వామివారికర్పించి రిజిస్ట్రేషన్ చేసి ఇచ్చారు. స్వామి ఈ హాస్పటలు నిర్మాణానికి అంగీకరించారని తెలియగానే 'సింక్లేరు' వంటి భక్తులు విరాళాలు ప్రకటించారు.

స్వామి యొక్క దివ్యసంకల్పం ప్రకారం - ఆనాటి మయ బ్రహ్మను మించి మనోహర శిల్పసుందరమైన భవన సముదాయం - శ్రీ సత్యసాయి బాబావారి సూచనల మేరకు తయారైంది. 300 లక్షల చదరపడుగుల ప్లింత్ ఏరియాలో హాస్పటలు భవంతులు 2 లక్షల చదరపడుగుల ప్లింత్ ఏరియాలో మెడికల్ స్టాఫ్‌కు గృహవసతులు నిర్మింప బడ్డాయి. 12 ఆపరేషన్ థియేటర్సు, అందులో 4 మైనరు ఆపరేషను థియేటర్సు, 8 మేజరు ఆపరేషన్ థియేటర్సు, ఎలక్ట్రోకండెక్టివ్ ఫ్లోరింగ్, అత్యాధునిక పద్ధతులతో కూడిన ఆపరేషను థియేటర్సు తయారయ్యాయి. "కార్డియాలజీ మరియు న్యూరాలజీ" అను రెండు ప్రత్యేక స్పెషాలిటీస్ ఏర్పాటు గావింపబడ్డాయి. 350 పడకలుగల హాస్పిటలు వీధివైపున 3 అంతస్థులలోనూ వెనకవైపు నాలుగు అంతస్థులలోనూ తీర్చిదిద్దారు.

70 కోట్లరూపాయల ఖర్చుతో హాస్పటలు భవనములు L & T కంపెనీ వారు, 12 కోట్ల రూపాయల ఖర్చుతో గృహవసతులు Medical & Paramedical Staff కు నాగార్జున కన్‌స్ట్రక్షన్ కంపెనీవారు కాంట్రాక్టు తీసికొని కట్టి ఇచ్చారు. హాస్పిటలుకు అవసరమైన యంత్రసామాగ్రి 120 కోట్ల రూపాయల ఖర్చుతో స్వామి దేశవిదేశముల నుండి తెప్పించుచున్నారు.

ఇంతవరకూ ఏ సంస్థలోనూ భారతదేశంలోలేని ఎక్కువ మెగావాట్ల పవరు గలిగిన (UTS)Un Interrupted Supply of Electricity సబ్‌స్టేషన్ అమర్చారు. అంటే విద్యుత్ సరఫరా ఆగిపోతే ఒక సెకను కూడా ఎడము (విరామం / ఆలస్యం) లేకుండా జనరేటరు కరెంటు ప్రవహించే విధానం.

ఇటువంటి మహాద్భుతమైన సూపర్ స్పెషాలిటీ హాస్పటలును అతి తక్కువ కాల వ్యవధిలో ఎక్కువ సదుపాయములతో స్వామి తన 75వ జన్మదినము నాడు ప్రారంభోత్సవముచేసి బెంగుళూరులో జాతికంకితము చేయబోతున్నారు.

**2. పుట్టపర్తిలో సంగీత కళాశాల :**

జూలై 1999లో పుట్టపర్తిలో ఒక వ్యాపారవేత్త, స్వామి భక్తుడు అయిన **'పూరీ'** అనబడు వ్యక్తి ఇండోనేషియా నుండి వచ్చి, 'స్వామీ! ఇక్కడొక సంగీత కళాశాలను పెట్టండి. నేను 'పదికోట్లు' ఇస్తానన్నాడు. అప్పటికే స్వామికా సంకల్పం మనసులో ఉంది. కానీ స్వామి ఎవరికీ చెప్పలేదు. గోకులం దగ్గర స్వామి సంగీత కళాశాల భవన నిర్మాణం ప్రారంభించారు. అందులో సంగీతమేకాకుండా, నృత్యము,

భరతనాట్యం, బుఱ్ఱకథలు, చెక్క భజనలు సహితం నేర్పాలని సంకల్పించినట్లుగా స్వామి ఒకసారి సూచించారు.

ఎదర రెండు పెద్దవీణలు, కొమ్ముబూరలు, ఇరుప్రక్కల డోలు మద్దెలలు ఆకారాలలో ఆ భవనం మయబ్రహ్మను మించిన సాయిబ్రహ్మ సృష్టితో నయనవైభవంగా తయారై రంగులు దిద్దుకొంటోంది.

భవన నిర్మాణం మొదలైందోలేదో ప్రఖ్యాత సంగీత విద్వాంసశ్రేష్ఠుడు **"ఉదయ శంకర్"** సతీమణి రెండు లారీల నిండుగా ప్రపంచంలో దొరికే అన్నిరకాలైన వాయిద్యాలు "Musical Instruments" తీసికొచ్చి స్వామికి సంగీత కళాశాల నిమిత్తం సమర్పించింది. అట్టి సంగీత కళాశాల లను కూడా స్వామివారి 75వ జన్మదినోత్సవ సందర్భంలో ఆవిష్కరింపనున్నారు.

3. స్వామి చిన్ననాటి సంఘటనలన్నీ ఒక మ్యూజియంగా ప్రత్యేక పద్ధతిలో మరియు ప్రపంచ దేశాల సంస్కృతు లన్నింటినీ **'భిన్నత్వంలో ఏకత్వం'** అనే శీర్షిక క్రింద Exhibition గా పెట్టాలని స్వామి జన్మదిన వేడుకలన్నీ జరుపుకోడానికి వీలుగా స్టేడియం నుండి ప్రజలందరూ వీక్షించడానికి వీలుగా విద్యాగిరి క్రింద భాగములో ఒక ప్రత్యేక భవనము నిర్మాణం జరిగింది. ఇది కూడా స్వామి ఆవిష్కరణకై ఎదురుచూస్తోంది.

4. దూరతీరాల నుంచి బస్సులలో ప్రయాణం కష్టతరమై పయనములు చేసికొనుచూ, ధర్మవరం నుండి పుట్టపర్తి వరకూ ట్రైనులలోనూ, బస్సులలోనూ ప్రయాణించు భక్తవరుల సౌకర్యార్థం, రైల్వేలైను, పుట్టపర్తిలో రైల్వేస్టేషను నిర్మింపజేసారు స్వామి. అది కూడా స్వామి చేత ఆవిష్కరింపబడాలని కోరుకొంటోంది ఈ 75వ స్వామి జన్మదినం నాటికి.

5. **అనంతపురం జిల్లాలో పేదరిక నిర్మూలనం :** రాళ్ళసీమను రాయలసీమ వైభవంలోకి మారుస్తూ అవతరించిన బ్రహ్మంగారు చెప్పిన వీరభోగవసంతరాయలు వీరేనా అన్నట్లుగా భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు ది. 6-10-2000 తేదీన దసరా సందర్భంలో ఇలా ప్రకటించారు. స్వామి 75వ సం॥ పుట్టినరోజు సందర్భంగా అనంతపురం జిల్లాలోగల అన్ని గ్రామాలకు స్వామి విద్యార్థులు వెళ్ళి సర్వే జరిపి బీదవారిని గుర్తించగా అట్టి బీదవారందరికీ ఒ లక్షరూపాయలు ఫిక్సెడ్ డిపాజిట్టులో పెట్టి దానిపై వచ్చే వడ్డీని ఆ కుటుంబం నెలనెలా అనుభవించేలాగా మరియు సొంత ఇల్లులేనివారికి సుమారు ఒక లక్షరూపాయల విలువగల ఇల్లు కట్టించి ఇవ్వడానికి అవసరమైన ధనమంతా స్వామియే ఇచ్చి ఈ ఏర్పాట్లు చేయుటకుగాను ప్రకటన చేసారు.

సేవ చేయదలచుకొన్న వారందరూ స్వామి 75వ జన్మదినంనాడు అనంతపురం జిల్లాలోగల అన్ని గ్రామాలకు లారీలపై నూతన వస్త్రములు, ఆహారపు ప్యాకెట్లు తీసికొని వెళ్ళి బీదవారందరికీ పంచి పెట్టాలని, అనంతపురం జిల్లాలో ఆకలిచావులు ఉండరాదని, తానొక వార్తాపత్రికలో ఆకలి చావుపై వచ్చిన వార్త చదివి విచారించి ఇట్టి నిర్ణయం తీసికొన్నానని దసరా యజ్ఞ సందర్భంగా ది. 6-10-2000 మధ్యాహ్నం భక్తుల హర్షధ్వానాలమధ్య ప్రశాంతి నిలయంలో స్వామి ప్రకటించారు.

ఇంతటి ప్రేమమూర్తి, కలియుగ అవతారపురుషుడు వీరి అవతారాన్నిమించిన అద్భుతం (Wonder) ప్రపంచంలో మరేమి ఉన్నది? భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారికి ఇవే నా నమఃస్సుమాంజలులు. ❑

"స్మరియించినంజాలు సత్యస్వరూపమై
కోరినకోర్కె చేకూర్చు స్వామి
దరిసించినం జాలు ధర్మస్వరూపమై
కష్టమ్ములెల్ల పోకార్చుస్వామి
చెంత చేరిన జాలు శాంతి స్వరూపమై
బ్రతుకు బాటలు తేటపరచు స్వామి
పిలిచినచో చాలు ప్రేమస్వరూపమై
సిరిసంపదలు కటాక్షించు స్వామి

అఖిలమాన సాంతర్యామియైన స్వామి
మేలుకొల్పెడి స్వామిమమ్మేలు స్వామి
లంచమెరుగని స్వామి ప్రంచచక్ర
పర్తి మన స్వామి శ్రీ పుట్టపర్తి స్వామి"

**- డాక్టర్ కరుణశ్రీ,** గుంటూరు



# నేను - నా సాయి

అవి నేను S.S.L.C. పరీక్షలు వ్రాసిన రోజులు. స్వామి రేపల్లెలోని ఇసుకపల్లిలో షిరిడీ సాయి విగ్రహ ప్రతిష్ఠకు వచ్చినప్పుడు దర్శనం చేసుకొనే మహద్భాగ్యం నాకు లభించింది. మొట్టమొదటి సారిగా స్వామిని చూచినప్పుడు స్వామి తల చుట్టూ దివ్య తేజోవలయము చూశాను. ఆ తరువాత 'జాన్ హిస్లాప్' వ్రాసిన "Conversation with Baba" అనే పుస్తకంలో "తేజోవలయము" గురించి, స్వామి చెప్పిన సమాధానం చదివిన తరువాత, నేనెంత ధన్యుడనో తెలుసుకొని ఆనందించాను. ఆ తరువాత మొట్టమొదటి సారిగ పుట్టపర్తి వెళ్ళాను. నాకు, స్వామి ఇంటర్వ్యూ ప్రసాదించి "పిచ్చి పిచ్చి ఆలోచనలు చేస్తూ కూర్చోకు. నీ ఆరోగ్యం సరిఅవుతుంది. ఒక Subject పూర్తిగా చెడగొట్టావు. ఈ తడవ వ్రాయి. పాసవుతావు" అన్నారు. ఆ తరువాత పరీక్ష వ్రాసి పాసైనాను. ఆ తరువాత P.U.C. లో చేరి చదివి పరీక్షలు వ్రాసి మరల పుట్టపర్తి వెళ్ళాను. నాకు తెలిసినంతవరకు కెమిస్ట్రీ పేపరులో కేవలం ఒకే ఒక ప్రశ్న వ్రాసాను. ప్రాక్టికల్ ఎగ్జామినేషన్ కూడా పోయింది. తప్పటం ఖాయం అనుకున్నాను. స్వామి మరల నాకు ఇంటర్వ్యూ ప్రసాదించారు. స్వామి గట్టిగా కోప్పడుతూ "ఎన్నాళ్ళు నీ తల్లిదండ్రుల మీద ఆధారపడుతావు? ఎప్పుడు నీ స్వంత కాళ్ళ మీద నిలుచుంటావు? నీ తల్లిదండ్రులు నిన్ను గురించి ఎంత ఆదుర్దా పడుతున్నారో తెలుసా! ఒక పేపరు పూర్తిగా చెడగొట్టావు. పరీక్షల వరకు పుస్తకం తెరువవు. గాలిలో దీపం పెట్టి దేవుడా! దేవుడా! అంటే దీపం నిలుస్తుందా! స్వామి! స్వామి! అంటావు. స్వామి ఏమి చేస్తాడు" అని మందలించారు. నేను ఏమీ మాట్లాడలేదు. ఆతరువాత నెమ్మదిగా 'స్వామీ! Postal, Bank ఉద్యోగాల ప్రకటనలు పడ్డాయి. వాటికి Apply చేయమంటారా?" అని అడిగాను. 'అవేం వద్దులే బంగారూ! నేను చూస్తానులే' అన్నారు స్వామి. ఆ తరువాత బాపట్లలో ఉన్న మా అన్నయ్యను పిలిపించమని, మా అమ్మగారికి చెప్పగా, మా అన్నయ్య రాగానే, వాడిని ఇంటర్వ్యూకు పిలిచారు. మా అన్నయతో పాటు నేను కూడా ఇంటర్వ్యూ గదిలోనికి వెళ్ళాను. మా అన్నయ్యతో మాట్లాడారు కాని, నా ముఖం కూడా చూడలేదు స్వామి. అందరికీ విభూతి పొట్లాలు యిచ్చారు. నాకు మాత్రం ఇవ్వలేదు. బాధపడుతూ 'స్వామీ! నా పరీక్ష' అన్నాను. నా ముఖం కూడా చూడకుండా చరచర నా ముందుగానే వెళ్ళుతూ 'తట్టుకున్నావు' అంటూ వెళ్ళిపోయారు. ఇంక స్వామితో మాట్లాడే సాహసం చేయలేకపోయాను. ఆ తరువాత మా ఊరికి వెళ్ళాను. స్వామి అనుగ్రహంతో అత్యంత ఆశ్చర్యకరంగా P.U.C. పరీక్ష పాసైనాను. బొటా బొటీగా మార్కులు వచ్చాయి.

## ముప్పాళ్ళ రామకృష్ణ, తాడేపల్లి

ఆ తరువాత B.Sc., లో చేరి చదివి III Year B.Sc., పరీక్షలు వ్రాసి మరల పుట్టపర్తి వెళ్ళాను. అప్పట్లో, ఇప్పటి లాగా సేవాదళ్ లేదు. పండుగ ముందు కొందరిని పిలిచి, హాల్‌లో సమావేశపరచి, స్వామి వారే స్వయంగా వారికి సూచనలు చేసి బాడ్జీలు అందచేసారు. ఆ సమావేశంలో నేనూ ఉన్నాను. నాకు మాత్రం బాడ్జీ యివ్వలేదు. అప్పుడు 'స్వామీ! నాకు బాడ్జీ యివ్వలేదు' అన్నాను. నీకు Special Badge తరువాత ఇస్తానులే అంటూ వెళ్ళిపోయారు. నాకు ఏడుపు వచ్చింది. ఉదయం, సాయంత్రం కూర్చున్నాను. ఎన్నిసార్లు, ఎన్నిచోట్ల మారినప్పటికీ నన్ను స్వామి పిలువలేదు, బాడ్జి యివ్వలేదు. నాకు 'టెన్షన్' ఎక్కువైంది. ఇంతలో మా నాన్నగారి నుంచి లేఖ వచ్చింది. పరీక్షలలో కొన్ని సబ్జెక్ట్స్ పోయినాయి గనుక, ఇంటికి వచ్చి చదివి మరల పరీక్ష వ్రాయమని వ్రాసారు. వెళ్ళిపోదామని "స్వామీ! వెళ్ళిరానా! అని అడిగాను. 'కూర్చో' అన్నారు. వరండాలో స్తంభం ప్రక్కన కూర్చున్నాను. ఒకసారి స్వామి అంగీ రాసుకుంటూ నా దగ్గరగానే వెళ్ళారు. కాని నన్ను మాట్లాడించలేదు. అయినా నేను తల ఎత్తలేదు. దుఃఖంతో పాటు, కోపం కూడా వచ్చింది. మిగతా వారిని

ఇంటర్వ్యూకి పిలిచి, లోపలకు వెళ్ళబోతూ, నా వాలకం చూచి 'పాపం! చాలా అవస్థ పడుతున్నావు. లోపలికి వెళ్ళు' అన్నారు. కోపం పోయింది, దుఃఖం మటుమాయమైంది. అమితోత్సాహంతో, లేడిపిల్లలా లేచి ఒక్క దుముకులో ఇంటర్వ్యూకు పిలువబడ్డ వారిలో వెళ్ళి కూర్చున్నాను. స్వామి మా అందరినీ ఇంటర్వ్యూ రూం లోనికి పిలిచారు. పరీక్ష ఎలా తేలిపోయింది. స్వామి నాకు ఎందుకు బాడ్జి యివ్వరు? ఈ విషయమును గురించి స్వామిని గట్టిగా అడుగుదామనుకున్నాను. బిడ్డకు తల్లి దగ్గరేకాక, ఇంకా ఎవరి వద్ద స్వతంత్రం ఉంటుంది? అలిగితే తల్లి దగ్గరనే అలగాలి అనుకున్నాను. ఇంతలో ఒక అద్భుత అనుభూతి కలిగింది. నా వంతు వచ్చింది. 'స్వామీ!' అన్నాను. మాట్లాడటానికి అవకాశం యివ్వకుండానే "నీకు పరిపూర్ణంగా భగవదానుగ్రహం ఉంది." అన్నారు స్వామి. ఆ క్షణంలో నా మనస్సు ఉప్పొంగింది. నోట మాట రాలేదు. నిశ్చేష్టుడనై స్వామి వైపు చూస్తున్నాను. "నీవు ఎప్పుడు, ఎక్కడ నుండి కోరినా స్వామి సహాయం లభిస్తుంది" అన్నారు. నాకు చాలా సంతోషం వేసింది. ఈ జన్మకు ఇది చాలనుకున్నాను. స్వామి అంతకు ముందు చెప్పిన ఉపన్యాసం గుర్తుకు వచ్చింది. 'మీకు నేను యిచ్చిన బాడ్జీలు మీరు సేవ చేయటానికి బాహ్య గుర్తులు మాత్రమే. దైవానుగ్రహం పొందటం మాత్రమే నిజమైన బాడ్జీని పొందటం. కనుక దైవానుగ్రహానికి ప్రయత్నించండి!' అని చెప్పి పాండవులు కృష్ణుని అనుగ్రహం పొందటం చేతనే విజయం సాధించగలిగారని ఆ ఉపన్యాసంలో చెప్పారు స్వామి.

స్వామి, పరిపూర్ణంగా భగవదానుగ్రహం ఉందని నన్ను అనుగ్రహించినందులకు, నా అదృష్టంగా భావించి సంతోషించాను. ఇక నీవు వెళ్ళు అనగానే "స్వామి! ఎప్పటికైనా నన్ను నీ సన్నిధికి చేర్చుకో!" అన్నాను స్వామి గంభీరంగా "ఊ" అన్నారు. దీని భావం స్వామికే తెలియాలి. ఆనాటి నుండి ఈ సుదీర్ఘమైన ముప్పది ఏండ్ల కాలంలో నాకు మరల ప్రత్యక్షంగా ఇంటర్వ్యూను ప్రసాదించ లేదు గాని, సంస్థాపరంగా అన్ని అవకాశాలు నాకు యిచ్చారు. సంతోషకరమైన, సంతృప్తికరమైన జీవితాన్ని నాకు ప్రసాదించారు. ఆనాటి నుండి నేటికీ స్వామి సేవా కార్యక్రమాలలో పాల్గొంటూ ఆనందంతో జీవితాన్ని గడుపుతున్నాను. స్వామి నిరంతరం నాలోనే ఉండి, నాతో మాట్లాడుతున్నట్లుగానే భావిస్తుంటాను. ■

# భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారి పుట్టు పండుగ సంబరం

**(జానపదగేయం)**

పోదాము రండిరా - పుటపర్తికి
చూదాము రండిరా - సత్యసాయిని

పుట్టు పండుగనాడు - పట్టూ బట్టలు కట్టి
పట్టాపుటేనుగు - వెంట నడుస్తుండంగా
పట్టుగొడుగుల నీడ - మంగళవాద్యాల తోడ
పట్టపగలు సూర్యునిలా-బయలుదేరి వస్తారట ॥పో॥

అంగరంగ వైభవంగ - మంగళవాద్యాలు మ్రోగ
చెంగట వేదావిదులు - చేరి స్వస్తి పలుకంగా
ముంగిట ముత్తైదువలు - మంగళహారతులివ్వగ
నింగి నేలలేకమై - నిలిచి కొలుచు చుండంగా ॥పో॥

ముసలివాళ్లు పడుచువాళ్లు - పసివాళ్లూ మహిళలు
దిశల కొసల నుండి దిగిన - దేశాదేశాల వాళ్లు
అసలు సిసలు భక్తులంత - ఆర్తితోడ వచ్చి చేర
ఇసుక వేస్తే రాలదంట - విసవిసానడిచి మనం ॥పో॥

ఎక్కడబడితే అక్కడ - చక్కనైన భోజనాలు
బక్కవాళ్లందరికీ - పంచలూ చీరలు
మొక్కులందుకుంటసాయి - ముసిముసి నవ్వుల తోడ
సుక్కల్లో సెంద్రునిలా - సూడగ వస్తారంట ॥పో॥

అయ్యారే మన సాయి - ఇయ్యాలే పుట్టెనంట
తియ్యని మనసున్నవాడు - దేవాది దేవుడు
ఉయ్యాలా జంపాలా - ఊగుతుంటె చూడ్డానికి
వెయ్యికళ్లు సాలవంట - అయ్యలార! అన్నలార ॥పో॥

- 'విద్వాన్' గుబ్బల మాధవమూర్తి, జగ్గన్నపేట

# మానవత్వం, ప్రేమతత్త్వంలేని భక్తి నిరుపయోగం

భగవద్విభూతులనంతమనుటకు విశ్వమొక నిదర్శనము. విశాలమైన విశ్వంలో ఒక చైతన్యక్రమము అంతర్లీనమై యున్నది. చేతనాచేతనములన్నింటిలో దివ్యత్వము నిండి నిబిడీకృతమైయున్నది. సృష్టిలో మానవుడు ఉత్కృష్ట జీవి కావటము ఈశ్వరానుగ్రహము. మానవుడు తనలోని ఈశ్వరత్వమును విస్మరించి వర్తించుటయే మాయయని చెప్పబడుచున్నది. మాయయనలేనిది ఉన్నదనుకొనుట, ఉన్నది లేదనుకొనుట అని వేదాంతులు చెప్పుదురు. మన పరిభాషలో దేహభ్రాంతి, స్వార్థము, మాయఅని నిర్వచించ తగును. దేహాభిమానము స్వార్థ చింతన వలన మానవుడు మార్గము మరిచి జీవన యాత్ర చేయుచున్నాడు. తన్నుతాను తెలిసికోలేని దుస్థితికిలోనై దుఃఖభాజనుడై అశాంతికి గురియగుచున్నాడు.

గమ్యము, గమనము మృగ్యమైనందున నేటి మానవ జాతి తీవ్ర అశాంతి అనుభవిస్తూ సృష్టిసంతులనమునకు భంగకరమైనది. సమదృష్టియు లోపించి స్వార్థము ప్రబల మగుటకు మనిషిని పీడించేందుకు రోగములు అహంకార, మమకారములు. అవి మానవత్వమును నశింపజేయు మూలకీటకములు.

మానవత్వమనగా త్రికరణ శుద్ధితో ప్రవర్తించుట. తలచునది చెప్పునది, చేయునది ఒకటిగానుండుట. యోచన, మాట, క్రియకు పొంతనలేనందున మనిషిని కృష్టజీవిగా మారి తన్నుతాను మోసగించుకుంటూ వంచితు డౌచున్నాడు. మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం, మహాత్మానాం అన్నారు. ఇవిలేనిచో దురాత్ముడనబడుటలో దోషములేదు. అనగా మానవత్వము కోల్పోయిన వాడౌతాడు.

మానవత్వము స్థిరపడుటకు తాను దైవమునకు చెందినవాడినని దృఢ విశ్వాసము కలిగియుండిన దైవమే మార్గోపదేశకుడగును. అంతఃకరణశుద్ధి ఏర్పడనంతవరకు భగవదాభిముఖ్యము అసంభవము. భగవదభిముఖుడైనచో భక్తి ఆవిర్భవించును. భక్తిప్రపత్తులు భారతీయుల సనాతన సంస్కృతి. కాని నేటి భక్తికృతకమైనందువ వికృతమైనది. బాహ్యాడంబరాలు, భక్తిమిషతో బహుకార్యక్రమాలు, భౌతిక లబ్ధిని ఆశించి నిర్వహింపబడుట, పాల్గొనుట అనర్థదాయక మైనవి. భక్తిభావసంబంధికాని బాహ్యసంబంధి కాదు. భావశుద్ధిలేని భక్తి కపటభక్తి. వాస్తవాలను గుర్తించుట విమర్శ అనబడదు. సరియైన విచారణలేనిచో దోషములు ధృడమగును. అంతర్ముఖులగుటకు వీలుపడదు.

మానవత్వము హృదయమునందావిష్కరింపబడును. ఆత్మననుసరించిన అది బహిర్గతమగును. ఆత్మతత్త్వము ప్రేమమయము. కోరికలు ఫలించుటకు చేయు నియమనిష్ఠల వలన, నిర్మల ప్రేమావిష్కరణకు అవకాశము లేదు. ప్రేమ లేనిచో ప్రగతి లేదు, శాంతిలేదు. ప్రేమతత్త్వము, మానవత్వము భక్తి అభిన్నములు. ఒకటి ఏర్పడిన, మిగతా రెండు సమైక్యత పొందును.

యస్. వెంకట్రావు

నేటి విజ్ఞానశాస్త్ర సాంకేతిక ప్రగతి సమాజ సంస్కరణకు అననుకూలమై నిలచినది. మానవుడు యంత్రాధీనుడై, అమిత వాంఛాలోలుడై, భౌతిక భోగభాగ్యము లందధికాసక్తుడై, తన్ను తాను గుర్తించలేని హీనస్థితికి పతనమైనాడు. సృష్టిసమస్తము ప్రేమతత్త్వమని తెలియుటకు ఆత్మననుసరించవలెను. ఏకాత్మభావ స్ఫురణలేనంత వరకు, మానవత్వము స్థిరపడుట దుసాధ్యము. సమదృష్టి లేనిచో సమాజ సంతుష్టిలేదు.

మానవత్వము, ప్రేమతత్త్వములేక, భక్తి అనుభవైక వేద్యమగుటకు అవకాశములేదు. భక్తి ఎవరేవిధముగా తలంచినా, ఆచరించినా, విడివడని శ్రద్ధతో కూడిన దైవప్రీతి తప్ప, మరొకటైన అది భక్తికానేరదు. దైవము గుణాతీత, సుగుణ సంపన్నుడు. ప్రేమ, కారణతత్త్వమైనందున కార్యజగత్తంతా ప్రేమమయమే.

భగవాన్ సాయి గురుపూర్ణిమ దివ్యానుగ్రహ సందేశంలో ప్రేమ గుణాతీతమని తెలియపరచినారు. అదియే ఆత్మ తత్త్వమని తెలియబడుచున్నది. సత్య, ధర్మ, శాంతి, ప్రేమలు, మానవోద్ధరణకు మౌలికమైన విలువలు. ఈ మానవతా విలువలు ఫలించుటకు సేవయే ఏకైక సాధనగా గ్రహించుట ఆవశ్యము. ప్రేమ, సేవలేక మానవత్వమునకు పరిపూర్ణతలేదు. మానవత్వము క్షీణించినందున దైవము పుట్టపర్తిలో నవతరించి, యావత్ప్రపంచమును ప్రేమతో బిగించి సర్వమత సమైక్యతకు, ఆదర్శమార్గోపదేశ కుడగుట మానవజాతి మహాభాగ్యము. ( )

## శ్రీ సత్యసాయి పథంలో

# సమన్వయ విద్య - సంపూర్ణ జీవితం

జి.యస్.ఆర్.సి.వి. ప్రసాదరావు, ఐ.ఎ.యస్.

భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయిబాబా ఛాన్సలర్‌గా వున్న శ్రీ సత్యసాయి ఉన్నత విద్యాసంస్థలో నేర్పుతున్నది సమన్వయ విద్య. సత్యసాయిని సద్గురువుగా చేసుకుని గడిపేది సంపూర్ణ జీవితం.

శ్రీ సత్యసాయి ఉన్నత విద్యాసంస్థలో లౌకిక విద్యను, పారమార్థిక విద్యను- పరావిద్యను, అపరావిద్యను - ప్రాపంచిక విద్యను, ఆధ్యాత్మిక విద్యను వేరుపరచి విడిగా చూపే సరిహద్దులు లేవు. సత్యసాయి పథంలో నడిచే సంపూర్ణ జీవితానికి ఇది లౌకికం. ఇది ధార్మికం అనే పరిధులు లేవు. అందుకే సత్యసాయి అవతార కాలంలో మన పురాతన భారతీయ సంస్కృతి, సనాతన ధర్మం పునరుద్ధరింపబడుతుందని ఆశ. ఆ ఆశాసౌధానికి పునాదులే నేటి సత్యసాయి విద్యాసంస్థల విద్యార్థులు, ఆ ఆశా సౌధనిర్మాణ కార్మికులే ప్రశాంతి నిలయం (పుట్టపర్తి) వాసులు, సందర్శకులు, భక్తులు మొదలగువారు.

భారతదేశానికి ఎంతో ఉన్నతమైన సనాతన సంస్కృతి వుండి, ఎన్నో సహజ వనరులు వుండి, విభిన్న జాతులకు, మతములకు, భాషలకు చెందిన మానవ వనరులు వుండి ఎందుకు గత 50 ఏళ్ళ స్వతంత్ర దేశచరిత్రలో జరగవలసినంత, అనుకున్నంత ప్రగతి ఎందుకు సాధించలేదో ఒక్కముక్కలో చెప్పండి అని అడిగితే. త్రికరణ శుద్ధి లేకపోవటంఅనాలి లేక సమన్వయం లోపించటం అనవచ్చును.

మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం సదాత్మానాం - నాటిమాట
మనస్యన్యత్, వచస్యన్యత్, కర్మణ్యన్యత్ దురాత్మానం - నేటితీరు

చాలామంది రాజకీయనాయకులు, వుద్యోగస్తులు, వ్యాపారస్తులు, దేవాలయ ధర్మకర్తలు పైకి చెప్పేది ప్రజా సంక్షేమం, దేశశ్రేయస్సు గురించి; లోన ఆలోచించేది స్వార్థప్రయోజనార్థం డబ్బు, పదవి, కీర్తి - కాంక్షలు గురించి; చేసే పనులైతే అస్తవ్యస్థం.

ప్రాచీన భారతదేశంలో ఆధ్యాత్మికత అనేది మానవుని ప్రతిఆలోచన, మాట,చేతలో అంతర్లీనంగా, విడదీయలేనట్లుగా అల్లుకుని వుండేది. ప్రతి దినచర్యలో అంతర్భాగమయ్యేది. మానవాతీత శక్తి ఒకటి విశ్వాన్ని నియంత్రించి, నడిపిస్తుందని నమ్మేవారు. 'ఈశావాస్యమిదంసర్వం......' అనే ఉపనిషత్ సూత్రాన్ని విశ్వసించేవారు. పరమాత్మ, సృష్టిలోని ప్రతి జీవిలోను జీవాత్మగా వున్నాడనే అనుభూతి పొందేవారు. అందుకే దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి ఉండేది. 'మానవుడే మహనీయుడు' అని పిర్రవీగేవారు కాదు. మహనీయతను ఆచరణలో చూపేవారు. అప్పటికి తమకువున్న జ్ఞానానికి అందని, నిరూపణకాని సనాతన సత్యాల్ని 'లేవు-కావు' అని తృణీకరించేవారు కాదు. పూజామందిరములోను, పెద్దల ఎదుట ఒకలాగున, చాటుగ ఒకలాగున ప్రవర్తించేవారు కాదు. ఎవరు చూసినా, చూడకపోయినా - ఎవరికి తెలిసినా, తెలియకపోయినా, ఒకలాగునే ప్రవర్తించేవారు. అందర్ని ప్రేమించేవారు - అందరికీ సేవ చేసేవారు. అంతేకాని, తన కులం, తన మతం, తన ప్రాంతం, తనవారు అనుకునే వారిని ఒకలాగున, ఇతరులను వేరొకలాగున వేర్పాటు భావంతో చూచేవారు కాదు.

కాని వందల సంవత్సరాల పరాయిపాలనవల్ల, పాశ్చాత్య ప్రభావాల వల్ల, శాస్త్రసాంకేతిక విజ్ఞానము మెరిపించిన ఆశలవల్ల, సగటు మానవులు ప్రాచీన భారతీయ సంస్కృతిని వదిలిపెట్టారు. జీవితాన్ని - ఆధ్యాత్మికతను వేరుచేసారు. చదువుని - విజ్ఞానాన్ని, విజ్ఞతను వేరుచేసారు. సాంఘిక విద్య, శాస్త్రీయవిద్య, సాంకేతిక విద్యద్వారా మానవుడు కనిపెడుతున్నామనుకుంటున్న కొత్త సిద్ధాంతాలు, పనిముట్ల ద్వారా మానవజాతి యొక్క పురోభివృద్ధి, సుఖసంతోషాలు సాధ్యమని నమ్మారు. శాస్త్రీయంగా నిరూపణ కానిది దేనినీ నమ్మకూడదనే వాదన ప్రబలింది. సాంకేతిక విజ్ఞానము మానవ దేహానికి సమకూర్చి పెడుతున్న సౌకర్యాల మీద మోజు పెరిగింది. విజ్ఞత తగ్గింది. విద్యాసంస్థల నుంచి ఆధ్యాత్మికత దూరం చేయబడింది. చదువుకునేది ఉద్యోగాల కోసం, తద్వారా సౌకర్యవంతమైన జీవితం గడపడం కోసం అనే ధోరణి పెరిగింది. చదువుల, వుద్యోగాల వేటలో పల్లెల నుంచి పట్టణాలకు వలసపోవటం

పెరిగింది. తరతరాలుగా వస్తున్న స్వయంవృత్తులు మానేశారు. ;యంఉపాధి కల్పించుకునే మనోస్థైర్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని 'ల్పోయారు. సనాతన ధర్మం, ప్రాచీన సంస్కృతి గురించి పట్టించుకునేందుకు సమయం లేకుండా పోయింది. దేవాలయాలు, ఆశ్రమాలు కొంతమందికి పిక్నిక్‌లకు వెళ్ళే ప్రదేశాలుగా మారాయి. లేదా కొద్దిమంది ఛాందసులు అనబడేవారు శ్రద్ధ చూపే కేంద్రాలుగా మారాయి. దేవుడనే వాడు రోజుకొకసారో, వారానికొకసారో, నెలకొకసారో, సంవత్సరానికొకసారో తలచుకోవలసిన వ్యక్తిగా మిగిలాడు. లేక మానవుడు తెలిసిచేస్తున్న తప్పులను ఒకసారి తలచుకోగానే, ప్రార్థించగానే, హుండీలో డబ్బు వేయగానే క్షమించేసే బ్రహ్మ పదార్థంగా మిగిలాడు. ఇదే కాలంలో కొందరు మతాధిపతులు, మఠాధిపతులు, పురోహితులు, మత ఛాందసులుగామారి, మతానికి వక్రభాష్యాలు చెప్పారు. యజ్ఞయాగాదులను, పూజా కార్యక్రమాలను, దేవాలయాలను వారివారి స్వార్థపరాయణతకు, గొప్పలకు వుపయోగించు కున్నారు. ప్రాచీన ఆచార వ్యవహారాలను అర్థంలేని మూఢాచారాలుగా మార్చి చదువుకున్నవారికి, శాస్త్రీయంగా ఆలోచించే వారికి రోత కలిగించే విధంగా ప్రవర్తించసాగారు.

ఫలితంగా విద్యాసంస్థలలో, జీవితాల్లో లౌకికం - ఆధ్యాత్మికం పూర్తిగా వేరు చేయబడ్డాయి. విద్యలో సమన్వయం లోపించింది. జీవితంలో సంపూర్ణత కొరవడింది. డబ్బు కోసం, పదవి కోసం, కీర్తికోసం వెంపర్లాట ఎక్కువయింది. అవి సాధించుటకోసం మంచి మార్గం - చెడుమార్గం అనే విచక్షణ తగ్గింది. దేవాలయములు, విద్యాలయములు, వైద్యాలయములు, గ్రంథాలయములు మొదలగు 'ఆలయములు' వాటి పవిత్రతను కోల్పోయాయి. కనీసం దేవస్థానాలుగా, విద్యాసంస్థలుగా, వైద్యశాలలుగా, గ్రంథశాలలుగానైనా మిగలలేదు. దేవుడి పేరు మీద డబ్బు సంపాదించే సంస్థలుగా దేవస్థానాలు, సరస్వతిని అమ్ముకొనే లక్ష్మీ నిలయాలుగా విద్యాసంస్థలు, కారుళాంటి యంత్రాలను రిపేరు చేసి పాతపార్టులు తీసి కొత్తపార్టులు వేసే గ్యారేజీలుగా వైద్యశాలలు, చెదపురుగులకు ఆలవాలంగా గ్రంథశాలలు మిగిలాయి. మనిషి ఏ పనిచేసినా తనకోసమే చేసుకుంటూ సంఘాన్ని విస్మరించాడు. తను చదివే చదువులు, చేసే పనులు సుఖసంతోషాలను తెచ్చిపెడ్తాయని భ్రమించాడు.

ఈ భ్రమ ఏ జీవికి ఎంతోకాలం జీవితంలో వుండదు. నిజమైన, శాశ్వతమైన ఆనందము డబ్బులోనో, పదవిలోనో, కీర్తిలోనో లేదని మనిషి గ్రహించుతున్నాడు. డబ్బు అన్నాన్ని పెట్టగలదు కాని ఆకలిని యివ్వలేదు. డబ్బు మందులు కొనిపెట్టగలదు కాని ఆరోగ్యాన్ని యివ్వలేదు, డబ్బు దేహానికి భోగాలను తెచ్చిపెట్టగలదు కాని మానసిక శాంతిని యివ్వలేదు వగైరా సత్యాల్ని గ్రహించగల్గుచున్నాడు. కాని, సరియైన దారి దొరకటంలేదు. సరియైన దారి ఎలాదొరుకుతుంది? గత శతాబ్దంగా తను చదివిన లౌకిక చదువు అటువంటిది! తన సుఖాన్వేషణలో మనిషి ఎక్కడో చెవులో మంత్రం చెప్తారని, వేరెక్కడో పూజలు చేయిస్తారని, వేరొకచోట వుపదేశాలిస్తారని పరుగులు తీస్తున్నాడు. అందుకే గాబోలు గతకొన్ని దశాబ్దాలుగా దేవాలయాల సంఖ్య పెరుగుతున్నది, దేవాలయాల్లో రద్దీ పెరుగుతున్నది. అయినా సమాజంలో నేరస్థుల సంఖ్య పాపుల సంఖ్య గతం కంటే పెరుగుతూనే వుంది. మనిషి వెతలు తీరటంలేదు. ఎక్కడుందీ లోపం? ఏమిటి పరిష్కారం!?

ఒంటె అనే జంతువుకి ఆహారం వెళ్ళే తిత్తి వేరు, నీరు వెళ్ళే తిత్తి వేరుగా వుంటాయి. కాని మనిషి నోటిగుండా ఆహారం వెళ్ళినా, నీరు వెళ్ళినా ఒకే తిత్తిలోకి వెళ్తాయి. అటువంటి మనిషి లౌకిక విద్యవేరు - విజ్ఞానం వేరు, జీవితం వేరు - ఆధ్యాత్మికత వేరు అనే వేర్వేరు తిత్తులు ఎందుకు ఏర్పాట్లు చేసినట్లు?! విద్యలో సమన్వయం రావాలి, జీవితంలో సంపూర్ణత్వం రావాలి. మనిషి అంటే కేవలం దేహంగాని, మనస్సుగాని, బుద్ధిగాని, కాదని వాటిలో ఏ ఒకటో, రెండో సంతోషంగా వుండడం శాశ్వత సుఖాన్ని యివ్వదని తెలుసుకోవాలి. మనిషి యొక్క మనస్సు ఎప్పుడూ బుద్ధి యొక్క దర్శకత్వంలో నడుచుకోవాలి. ఆ బుద్ధి ఎప్పుడూ ఆత్మయొక్క ప్రకాశంలో వెలుగుతూ వుండాలి. అట్టి అంతరాత్మ ప్రకాశంలో వెలుగుతున్న బుద్ధి యొక్క మార్గదర్శకత్వంలో సంచరించే మనస్సే మానవుణ్ణి (ఇంద్రియాలని) సరియైన పనిలో, సరియైన దారిలో నడిపిస్తుంది. సత్యసాయి విద్యాసంస్థలలో అడుగడుగునా, క్షణక్షణానా ఈ సాధనా మార్గం వుంది. అక్కడ విద్య నేర్పడం జీవిత పరమావధి కోసం, కేవలం జీవన భృతి 'కోసంకాదనే స్పృహలో విద్యార్థులు వుంటారు. అక్కడ చెప్పే ఫిజిక్స్‌లో, కెమిస్ట్రీలో, బయాలజీలో, ఎకనామిక్స్‌లో, కంప్యూటర్స్‌లో, మేనేజ్‌మెంట్‌లో, యితరత్రా అన్ని పాఠ్యాంశాలలో ఆధ్యాత్మికత యిమిడివుంది, మన సనాతన ధర్మాచరణ వుంది. అంతేకాని కొంతమంది విద్యావేత్తలు

సల: ...గా

వారానికి కొన్ని గంటలు లౌకిక పార్యాంశాలు, కొన్ని గంటలు ఆధ్యాత్మిక తరగతుల పద్ధతికాదు. పైపెచ్చు భగవాన్ బాబా విద్యార్థులను ప్రతి క్షణం, ప్రతి అడుగులోను ప్రభావితులను చేస్తూ, వేయి తల్లుల ప్రేమతో విద్యాబుద్ధులు చెప్పిస్తూ భావిభారత పౌరులను తీర్చిదిద్దుతున్నారు. తనను చేరినవారందరికీ జీవితం అంటే సరియైన అవగాహన కల్పించడానికి ప్రయత్నిస్తున్నారు. జనం కూడ సరియైన కృషి చెయ్యాలి. గాలిలో దీపం పెట్టి దేవుడా నీదే భారమంటే కుదరదు. పురుష ప్రయత్నం పరమాత్మ కృప, రెండూ ముఖ్యమే. పరమాత్మ కృప అనే '1' అంకెకు కుడి ప్రక్కగా మానవ ప్రయత్నం ద్వారా ఎన్ని '0' లు చేరిస్తే అంత పెద్ద ఫలితం జీవితానికి వుంటుంది. '1' ని అంటిముట్టనట్లు '1' గానే వుంచుతారో, లేక 100 చేస్తారో, 1,00,0000 చేస్తారో, యింకా ఎక్కువ చేస్తారో, జనుల కృషి మీద ఆధారపడి వుంటుంది. చదువుని, జీవితాన్ని సరిగా అవగాహన చేసుకొని సంపూర్ణ జీవితం గడపాలి. మానవుడు సాధించగలవాటిల్లో ఆత్మదర్శనమే అత్యుత్తమము, అంతిమము. ●

## అమృతధార

భగవాన్ శ్రీ శ్రీ శ్రీ సత్యసాయి బాబాగారి దివ్య సన్నిధిలో ఆ రోజుల్లో జరుగుచుండిన వైకుంఠ ఏకాదశి పర్వదినము యొక్క మహత్వము సువర్ణాక్షరాలతో లిఖింప దగినది. బాబాగారి దివ్యహస్తము నుండి అమృతము ప్రాదుర్భవమగు చుండినది. ఆ అమృతమును భక్తులందరికి పంచుతూ వుండిరి. దేశమునందు ప్రసిద్ధమైన ఏ దేవాలయమునందుననూ లభ్యము కాని యీ మహా ప్రసాదమును ఏకాదశి మహా పర్వదినా బాబా గారు తమ దివ్యహస్తములతో స్వయముగా భక్తులకు పంచెడివారు.

1958వసంవత్సరము, ముక్కోటి ఏకాదశినాడు బాబా గారు-కేరళ రాజధానియైన తిరువనంతపుర మందుండిరి. ఆనాటి సాయంత్రము బాబాగారు అక్కడి నుండి 7 మైళ్ళ దూరమందున్న కోవళం అను గ్రామానికి వెళ్ళినారు. ఆ గ్రామము సముద్ర తీరమునందున్నది. జన సంచారములకు దూరముగా మహాసాగర తరంగాలకు స్పృశిస్తూ చాలా దూరము నడచి వెళ్ళిరి. అక్కడే యిసుక తిన్నెపై స్వామి ఆశీనులైరి. చేరిన భక్తులకు భజనలు ప్రారంభించమని చెప్పిరి. శ్రీవారే స్వయముగా నాలుగైదు భజన పాటలు పాడిరి. కొంత మంది బెస్తవాళ్ళు కూడ గుంపుగా వచ్చి ఆ భజనలందు పాల్గొనిరి. ఆ సందర్భము నందు సముద్ర తీరపుటిసుక నుండి శ్రీ చందనముతో అత్యంత సుందరమైన మురళీధరుని విగ్రహమును సృష్టించి తీసిరి. ఒక భక్తునికి రాధా కృష్ణ రూపము కల్గియున్న ఒక బంగారు వుంగరమును సృష్టించి యిచ్చిరి. మళ్ళీ బాబాగారు వేగముగా తాళములు వేస్తూ భజన పాటలు పాడడము ప్రారంభించిరి. అందరూ-భక్తి పారవశ్యముతో పావనమైన భజనగాన గంగా తరంగములందు మునిగి యుంటిమి. అక్కడచేరిన 60, 70 మంది భక్తులకునూ అద్భుతాశ్చర్య ములు కల్గుచున్నవి. ఎందుకనగా స్వామి కూర్చొన్న 2 దిశ నుండి సుగంధ పరిమళాత్మకమైన వీచికలు ప్రసారముగుచుండెను. ప్రపంచమునందు ఏ సెంటునకుగాని, సుగంధముతో నిండి పుష్పాలకుగాని, ఏ విధమైన అత్తరునకుగాని పోల్చడానికి వీలుపడని ఆ సుగంధ వీచికలు తోచుచుండినవి అపుడు బాబాగారిట్లు చెప్పిరి, అందరూ ఆశ్చర్యపడుతున్నారా! యీ సువాసన లెక్కడ నుండి? యని. యివిగో యీ హస్తముల నుండి అని అంటూ నా చేతులను ముట్టి చూడండి అని దగ్గరగా కూర్చొన్న భక్తులకు చెప్పిరి.

### ఎన్. కస్తూరి

ఏ స్వర్గలోకపు సౌరభమో ఆ సువాసన అని భక్తులకు తోచినది. ఆ దినమునందు శ్రీ రంగమునందు స్వర్గపు ద్వారములు తెరచుచున్నారు కదా అని భక్తులకందరకు స్మరణకు వచ్చినది. ఆ సమయాన బాబాగారు తమ రెండు హస్తములను కలిపి, కదిలించి వొక వెండి గిన్నెను సృష్టించి వుంచిరి. స్వామి దివ్యహస్తముల నుండి అమృతము ధారగా కురిసినది. ఆ వెండి గిన్నె ముక్కాలు భాగము నిండినది. శ్రీవారు తమ స్వహస్తములతోఅక్కడ చేరిన భక్తులందరి నోళ్ళలోనికి బిందువులుగా వేస్తూ పంచినారు.

భగవన్నామ సంకీర్తనల మాధుర్యాన్ని ఆస్వాదించి పరుగున వచ్చిచేరిన ఆ బెస్తలకునూ ఆ అమృతము చవి చూచే భాగ్యము లభ్యమైనది. ఆ అమృతధారల రుచి వర్ణనా తీతము. మాధుర్యము, పరిమళము, యివి రెండే కాదు. భక్తులకు లభ్యమైన భావాతీతమైన దివ్యానందము, ఎవరికి వారు తమలో తాము అనుభవించుచున్న దివ్యానుభూతి మౌనమే రూపుదాల్చియుండినది. ఆ అమృతధారల రుచిని గురించి చెప్పడానికి భాషచాలదు. ఆ వైశిష్ట్యము' ఆత్మానుభవము, మహోన్నతమై వర్ణనాతీతమై విలసిల్లినది.

- తెనుగుసేత : పంచాంగము శీనప్పశాస్త్రి



ఓం శ్రీ సాయిరాం

# సాయి ప్రశాంత్ గెస్ట్‌హౌస్ & రిసార్ట్స్

**3-466, గోపురం గేటు వద్ద, కుమార్ విలాస్ కాంప్లెక్స్,**
**పుట్టపర్తి - 515 134, అనంతపూర్ జిల్లా**

## 1. FAMILY ACCOMODATION SCHEMES

ఎ. రు. 15,000/-లు చెల్లించినవారికి, 15 సం॥ పాటు, ప్రతి సంవత్సరము 8 రోజులు డీలక్స్ గదులు ఉచితముగా యివ్వబడును. బ్యాంక్ గ్యారంటీ సర్టిఫికేట్‌తో, 15 సం॥ తరువాత రు. 7,500/-లు రిఫండ్ యివ్వబడును.

బి. రు. 20,000/-లు చెల్లించినవారికి, 20 సం॥ల పాటు, ప్రతి సంవత్సరం 15 రోజులు డీలక్స్ గదులు ఉచితముగా యివ్వబడును. బ్యాంక్ గ్యారంటీ సర్టిఫికేట్‌తో, 20 సం॥ తరువాత రు. 10,000/-లు రిఫండ్ యివ్వబడును.

## 2. ROOMS OWNERSHIP SCHEMES

ఎ. అదే బిల్డింగ్‌లో,రు. 2 లక్షలు రూపాయిలు కట్టి డీలక్స్ రూమును రిజిష్ట్రేషన్ ద్వారా స్వంతం చేసుకొని, ప్రతి సంవత్సరం 2నెలలు ఒకేసారిగాని లేక అప్పుడప్పుడుగాని డీలక్స్ రూములు ఉచితంగా వాడుకొనవచ్చును.

బి. ఆ డీలక్స్ రూములు మా మేనేజిమెంటుకే వప్పజెప్పవలెను. అయితే మిగిలిన 10 నెలలకు, మా నుండి రు. 10 వేల రూపాయిల ఆదాయమును కూడా పొందవచ్చును.

**ప్రతి డీలక్స్ గది యందు DININGSET, TEA SET, MEALS CARRIER, HOT WATER, PHONE సౌకర్యములు కలుగజేయబడును.**



(ఇతర వివరములకు)

*Ch. Venkateswara Rao*, Proprietor,
SAI PRASANT GUEST HOUSE & RESORTS
PUTTAPARTHI - 515 134. Anat. Dist.



# భారతీయత - ఆధ్యాత్మికత

పూర్వం అజనాభ వర్షాన్ని పాలించిన భరతునిపేర అది భరత వర్షంగా పేరొందిందని భాగవతం చెబుతోంది. ఈ భరతుడే తరువాత జడ భరతుడుగా ప్రసిద్ధి చెందాడు. దుష్యంతునికీ, శకుంతలకూ జన్మించిన భరతునికన్న ఈయన ఎంతో ప్రాచీనుడు. భరతవర్షంలో భరత ఖండం, అందులో **'భారత్'** అని ప్రస్తుతం వ్యవహరించబడుతున్న మనదేశంభాగాలు. భారతీయుల సామాన్య లక్షణం భారతీయత.

భారతీయతలో అంతర్లీనంగా వుండే ఆధ్యాత్మికతకు అద్దం పడుతూ భగవాన్ శ్రీ సత్యసాయిబాబా భారత్‌కు కొత్త నిర్వచనం ఇచ్చారు. 'భా' అంటే భగవాన్, 'రతి' అంటే అనురక్తి. భగవంతుని యందు అనురక్తి కలిగి ఉండటాన్ని భారతీయతగా వర్ణించారు స్వామి. అంతేకాదు, భారతిపేర కూడా భారత్ అయింది. భారతి చదువుల తల్లి. వేదవాణి. సదా భగవత్‌తత్త్వంలో అనురక్తితో వుండేది.

ఆ

అంటే ఆత్మవలన కలిగింది' - అంటుంది శబ్దరత్నాకరం. పంచభూతాల వలన కలిగిన దేహం వేరు. ఆత్మవేరు. నేనెవరు? (కోఽహం) అన్న ప్రశ్న సనాతన ఆధ్యాత్మిక చింతనకు బీజం. నశించే దేహం తాను కాదు. తాను నిత్యుడైన ఆత్మ. దీనిని చిలుకపలుకుల్లాకాక అనుభూతి పూర్వకంగా గ్రహించే ప్రయత్నం సాధన. ఆ ప్రయత్నం అనేక రకాలుగా చేయవచ్చు. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్యాసాశ్రమాల గుండా జీవిత ప్రస్థానం సాగిస్తూ వ్యక్తి ఆత్మదర్శన ప్రయత్నం చేయవచ్చు. ఈ మార్గంలో వెళ్ళేవారు షోడశ (16) సంస్కారాల ద్వారా పురం పెట్టబడి, పునీతులై తరిస్తారు. ఎవరు ఏ వర్ణంలో వున్నా, ఏ ఆశ్రమంలో చరిస్తున్నా, 'ఏ కర్మను చేస్తున్నా కావలసింది తన కర్తవ్యాన్ని అనుష్ఠించటం పట్ల శ్రద్ధ, ఆసక్తి, దీక్ష, దక్షత, చేసే పని కోసమే కావచ్చు కాని దానిని పరమేశ్వరార్పణంగా భావించి చేయి. ఆ పని వలన లభించే ఫలితంపై కోరిక పెట్టుకోకు' - అంటుంది గీత. దీనిని నిష్కామకర్మయోగం అనవచ్చు.

వేదసాహితి :

వైదిక వాఙ్మయంలో ప్రధానంగా పేర్కొనదగినవి వేదాలు. ఇవి సంహితలు, బ్రహ్మణాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులు అని నాలుగు భాగాలుగా ఉన్నాయి. వీటికి శిక్షణ, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అని ఆరు అంగాలున్నాయి. వీటినే ఉపవేదాలంటారు. కొందరు మహర్షులు వేదములలోని సూక్తుల సారాన్ని తీసికొని వ్యక్తి తన ఉన్నతికోసం, సమాజ శ్రేయస్సుకోసం అవలంబించవలసిన నియమాలు నిర్దేశించారు. అట్టి నియమాలను తెలిపేవి స్మృతులు. ఇవిగాక వేదార్థ ప్రచారంకై

## భండారు పర్వతాలరావు

రామాయణమహాభారతాల వంటి ఇతిహాసాలు, అష్టాదశ (18) పురాణాలు, ఉపపురాణాలు, కుమారసంభవం వంటి కావ్యాలు వచ్చాయి. వీటన్నిటికీ వేదమే ఆలంబన, స్ఫూర్తి, ప్రమాణం. అన్నిటిగమ్యం ఆత్మసాక్షాత్కారమే.

పాశ్చాత్యులు వేదాల గురించి పరిశోధన చేసి పుస్తకాలు రచించారు. వారి కృషి అభినందనీయమేగాని వేదం ఉపయోగించే పదాల అంతరార్థాన్ని గ్రహించనందున అవి ఒక్కొక్కసారి అపోహలకు దారితీశాయి. వేదనాగరికత నిప్పు, నీరు, వాన, గాలి, చెట్లు, పుట్టల వంటి ప్రకృతి శక్తుల నారాధించే ఆదిమ నాగరికత అన్నవిధంగా వారి రచనలు రాసాగాయి. అగ్ని అంటే భౌతికంగా కనుపించే నిప్పు అన్న అర్థాన్నే వారు స్వీకరించారు. వైశ్వానరుడు, హవ్యవాహనుడు, సదానవ, వాకృతి - ఇవన్నీ అగ్నికి పర్యాయపదాలే. కాని వేదం ఏ పదాన్ని ఉపయోగించినా దానిని సందర్భశుద్ధితో, ప్రత్యేకార్థంలోనే ఉపయోగించింది కాని పర్యాయపదంగా కాదు. ఉదాహరణకు వైశ్వానరుడు దేహంలో వుండే ప్రాణాగ్నికాని నిప్పుకాదు.

పాశ్చాత్యులు వేదం కేవలం కర్మకాండను బోధిస్తున్నదనీ, అందులో ముక్తి ప్రసక్తి లేదనీ భావించారు. ఉపనిషత్తులు తరువాత ఎప్పుడో వచ్చినవని వారి భావన. ఈ వాదనల





నన్నిటినీ పరిశీలించిన కంచి కామకోటి పీఠాధిపతులు శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి (పరమాచార్య) పాశ్చాత్యులు ఎలా పొరపడిందీ విశదీకరించారు. ఆసాంతం ఆధ్యాత్మికతత్త్వ చోదితమే. కాని ఒక్కొక్కరు వాటిని అర్థంచేసికోవడంలో పొరపాటు పడుతుంటారు. కొందరికంతా గందరగోళంగా వుండవచ్చు. ఉదాహరణకు, వేదాల చివర వచ్చే ఉపనిషత్తులు వేదాంతంగా పిలువబడతాయి. వేదం 'యజ్ఞం చేయి' అంటే ఉపనిషత్తులు 'యజ్ఞం చేసేది అజ్ఞాని' అంటాయి. పాశ్చాత్యులు దీనిని 'పరస్పర వైరుధ్యం' అన్నారు. కాని ఇవన్నీ అధికారి తారతమ్యాన్నిబట్టి అనుసరించదగిన సాధనా విశేషాలేగాని వేరుకాదు అంటారు పరమాచార్య. బ్రాహ్మణునికి అగ్ని దైవం. మునికి హృదయంలోనే దైవం ఉన్నాడు. సమదర్శికి సర్వత్రా దైవమే. కాని అల్పబుద్ధికి ప్రతిమ దైవం. ఇలా సాధనలో తొలిదశలో ప్రతిమ అవసరం ఉంటుంది. అక్కడే ఆగిపోతే సాధకుడు ఎప్పటికీ మొదటి మెట్టుపైనే వుంటాడు. క్రమ పరిణతిని సాధిస్తే సమదర్శి అవుతాడు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' (అంతటా ఉన్నది బ్రహ్మయే) అన్న వేద మహావాక్యాన్ని అనుభూతిలోనికి తెచ్చుకోగలుగుతాడు.

వేదం **'ఏకం సత్'** (భగవంతుడొక్కడే) అంటుంది. పురాణాలు 33 కోట్ల దేవతలను గురించి చెబుతాయి. మనకు ముత్యాలమ్మ కొలువులు ఒక ప్రక్క, యజ్ఞయాగాదులు మరో ప్రక్క. భజన బృందాలు ఒక ప్రక్క, కుండలినీ యోగకేంద్రాలు మరో ప్రక్క. ఏమిటి ఈ గందరగోళం? ఈ ప్రశ్నకు కూడా పైన చెప్పినదే జవాబు. సనాతన ధర్మంలో గురువు ఎంతో ముఖ్యం. అన్నీ గురుముఖతః నేర్చుకోవలసిందే. ఎందుకని? నీ ఆధ్యాత్మిక పరిణతిని పరీక్షించి, నీకు అర్థమైన దానిని గురువు నీకు ఉపదేశిస్తాడు. సనాతన ధర్మం ఒకే దిశగా పారే నదికాదు. సర్వతోముఖమైన సముద్రం. పొరుతుంది. కాని సముద్రం పారదు. అలాగని అది నిశ్చలమా? నిరంతరం చలిస్తూ, చలించ కుండా ఉండటం సముద్ర సహజతత్త్వమే కాని వైరుధ్య లక్షణం కాదు.

**అవతార భావన :**

సనాతన ధర్మ విశిష్టతలలో ముఖ్యమైంది అవతార భావన. మన ఋషులు దైవాన్ని నిరాకారం, నిర్గుణం, నిరంజనంగా వర్ణించారు. కాని దైవం సంకల్పమాత్రంగా రూపాన్ని స్వీకరించగలడు. జన్మ కర్మవలన కలిగేది. అవతారం సంకల్పం మాత్రమే. దానికి కర్మబంధం లేదు. ధర్మస్థాపనకే అవతారాలు వస్తాయి. కొన్ని అవతారాలు దుష్టశిక్షణకు వచ్చాయి. ప్రస్తుత అవతారం శ్రీ సత్యసాయి. ఈ అవతారం ప్రేమను పంచటానికే వచ్చింది. స్వామి ప్రేమకు ఎల్లలులేవు. ప్రహ్లాదుడు 'నిస్సీమదయ' అని వర్ణించినదీ అనుగ్రహ భావననే. సత్యసాయి సంహారశీలికాదు. సంస్కరణశీలి. **'నీ పూజలు దేవునికి ఎందుకు?'** అంటారు స్వామి. **'నీ సేవలూ ఆయన కక్కరలేదు. నారాయణునికి సేవకులకు కొదువా? నీ సేవలు కావలసింది దరిద్ర నారాయణులకే'.**

**'ఈ చేయి ఇచ్చేదే కాని పుచ్చుకొనేది కాదు'** అంటారు భగవాన్. అయినా ఆయన ఆప్యాయంగా పుచ్చుకొనేవి లేకపోలేదు. అవి ప్రేమ, భక్తి. సేవకు తొలిమెట్టు ప్రేమ. త్యాగం మలిమెట్టు. **'త్యాగేనైకో అమృతత్త్వమానశు'** (త్యాగం వల్ల అమృతత్వాన్ని పొందు) అన్న ఉపనిషత్తు భగవాన్ మాటలలో ప్రతిధ్వనిస్తుంది. త్యాగం ప్రతిఫలాన్ని కోరదు. ప్రచారం, కీర్తి - ఇవి కూడా ప్రతిఫలానికి భిన్నరూపాలే. అందుకే **'ఈయి'. ఇచ్చిన సంగతి ఎవరికీ చెప్పకు'** అంటుంది ఉపనిషద్వాణి. భగవాన్ ఉపదేశించే సేవ తత్త్వం అలాంటిది. సేవ పరోపకారం కోసం అని మనం అనుకుంటాం. **'మరొకరికి మనం సాయం చేశాం'** అనుకోవటమే అహంకారం. 'బిచ్చగానికి పావలా కాసువేసి నీవతనికి సాయం చేశాననుకుంటున్నావు. కాని, దానం చేసే అవకాశాన్ని నీకను గ్రహించి, అతనే నీకు సాయం చేశాడు. అది గ్రహించు' అంటారు స్వామి. ప్రహ్లాదుడు దీనులను తల్లిదండ్రుల భంగి (ప్రత్యక్షదైవాలవలె) సేవించే వాడంటుంది భాగవతం. స్వామి మనలో వెలిగించే సేవా దీపం మనలోని అహంకారాన్ని పారద్రోలేదే. విద్య వినయాన్ని ఇవ్వాలి. వినయాన్నిచ్చే సేవ కూడా సద్విద్యే. స్వామి జీవితరంగాన్ని యావత్తూ అలాంటి సేవాపూరిత సద్విద్యారంగంగా మార్చారు.

'సనాతన ధర్మం అడవులకు పోయి ముక్కు మూసుక్కూచోమంటుంది' అని కొందరనుకుంటారు. మనిషి సాధించాల్సినవి నాలుగు. అందులో అర్థం (భౌతిక పరమైన సిరిసంపదలు). కామం (ఇంద్రియపరమైన భోగానుభవం) ఉన్నాయి. వీటి తరువాతే మోక్షాన్ని చెప్పారు. కాని నీవు ధనం సంపాదించినా, సుఖాన్ని అనుభవించినా, ముక్తిని సాధించినా అది ధర్మబద్ధంగానే చేయాలి. అందుకే ధర్మం ముందు ఉంది. స్వామి ధర్మం



పురుషార్థాలకు రైలింజన్ అంటారు. అర్థకామాలు బోగీలు. ముక్తి గార్డు.

సనాతన ధర్మం భారతదేశ భౌగోళిక పరిధులకే పరిమితం కాదు. యయాతి తన రాజ్యాన్ని కొడుకులకు పంచి ఇచ్చిన తీరు భాగవతం చెబుతోంది. ఒక్కొక్క కొడుక్కు ఒక్కొక్క ద్వీపాన్నిచ్చాడు. ద్వీపం అంటే అండమాన్ ద్వీపం వంటి చిన్న ద్వీపాలుకాదు. జంబూద్వీపం వంటి సనాతన భౌగోళిక విభాగాలు. మన సంస్కృతి విశ్వవ్యాపితం. విశ్వజనీనం. కొన్ని సంకుచిత భావాల పాలబడి మనల్ని మనం కుంచించుకున్నాం. ప్రస్తుత అవతారం ఈ దుస్థితి నుండి సనాతన ధర్మాన్ని ఉద్ధరించేందుకే వచ్చింది. సాయి సనాతన ధర్మానికి విశ్వజనీనతను తిరిగి సంతరించి పెట్టారు. ఆయన బోధలు ఏ ఒక్క మతానికో, జాతికో, భాషకో, భూభాగానికో పరిమితం కావు. సత్యసాయి బోధల సహజ తత్త్వం విశ్వజనీనమైన ప్రేమ. ఏ ఎల్లలూ ఎరుగని ప్రేమ. అలాంటి ప్రేమావతారునికిసమకాలీనులం కాగలగటం మనందరి పట్ల స్వామికి గల అవ్యాజప్రేమకు తార్కాణం.

"లోకాస్సమస్తాః సుఖినోభవంతు"



# శ్రీ సత్యసాయి దండకము

ఓం శ్రీ సాయిరాం సత్యసాయిరాం ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం భజేఈశ్వరాంబతనయం భజేపర్తివాసం భజేహంపవిత్రం భజేసత్యం భజేశివం భజే సుందరం బటంచున్ ప్రభాతంబు సాయంత్రంబు నీనామ సంకీర్తనల్జేసి నీరూపు వర్ణించి నీమీద నేదండకంబొక్కటిన్ జేయనూహించి నీమూర్తిగావించి నీ సుందరంబెంచి నీ పాదదాసుండనై నీదుభక్తుండనై నిన్నునేగొల్చెదన్ నీకటాక్షంబునన్జూచితే వేడుకల్జేసితే నామొరాలించితే నన్నురక్షించితే ఈశ్వరాంబగర్భాన్వయాదేవ నిన్నెంచ నేనెంతవాడన్ దయాశాలివైజూచితే దాతవైబ్రోచితే దగ్గరం బిల్చితే తొల్లి షిరిడి సాయి మహారాజువై అవతార కార్యంబు నందుండి హిందూముస్లింలంజూచి వారిన్విచారించి సమైక్యతన్ బోధించి యవ్వారినిం భక్తులంగావించి బేధభావంబులన్ మాపి సత్యసాయీశుండవై దయాదృష్టిన్వీక్షింప పుట్టపర్తిన్ వెలసి భక్తకార్యార్థమై ఉరవకొండకేతెంచియున్ మానసభజరే గురుచరణంబటంచు బోధించియున్ మూఢాచారముల తెగడియున్ సజ్జనులన్జూచి యానందముప్పొంగ యుంగరమ్మొలిచ్చి బహుమతులన్ సృష్టించి భక్తశిఖామణులకు యిచ్చి సంతోషులంజేసి తిరుమలప్ప నారాయణరెడ్డి సత్యనారాయణాది మిత్రులంగూడి చిత్రావతినదిందాటి నీనామస్మరణాసక్తుల భవరోగంబులన్ ద్రుంచగా అపరరావణులంత కోపాగ్నియుగ్రులై కోరి బహురకములైనట్టి అవనిందలన్వేసి భక్తవరేణ్యుల హృదయంబులన్ బాధనొందించగా భక్తులదరిజేరి విభూతిన్ సృష్టించి సర్వజనులకున్ యిచ్చి ప్రేమతో ఆశీర్వదించియున్ నాస్తికాది చెడుభావంబుల్ మనంబునందుండి తొలగన్ పరమం పవిత్రం బాబా విభూతిం పరమం విచిత్రం లీలావిభూతిం పరమార్థ ఇష్టార్థ మోక్షప్రదాతం బాబా విభూతిం ఇదమాశ్రయామి యన్న విభూతి మంత్రాగ్నిన్ వారల దురాలోచనలన్ పారద్రోలన్నంత లోకంబులానంద మైయుండ నవ్వేళలన్ ఆభక్తులన్ వేడుకన్ దోడుకన్వచ్చి ప్రశాంతినిలయ ప్రవేశంబుజేయించి సాయీశ్వరాయ విద్మహే సత్యదేవాయ ధీమహీ తన్న సర్వప్రచోదయాత్ అన్న సాయిగాయిత్రి మంత్రాభిషేకంబు సంరంభమైయున్న నీకన్న నాకెవ్వరున్ గూర్మిలేరంచు మన్నించినన్ ఆత్మాను సంధానముంజేసి నిన్ను నీనామ సంకీర్తనల్జేసితే పాపముల్బాయునే భయముల్దీరునే భాగ్యముల్కలుగునే సకల సామ్రాజ్యముల్ సకలసంపత్తులుంగల్గునే సుందరాకార యోభక్తమందార యోపుణ్యసంచార యోధీర యోసూర నీవేమహాఫలముగా వెలసి యాసాయిగాయత్రి మంత్రంబు పఠించుచున్ వజ్రదేహంబునుండాల్చి షిరిడిసాయీశ పర్తిసాయీశ ప్రేమసాయీశ యంచున్ సర్వస్యశరణాగతిన్ ఎప్పుడున్తప్పకన్దలతు నాజిహ్వాయందుండి నీ దివ్యదేహంబునన్ త్రైలోక్యసంచారివై భక్తరక్షాంకితధ్యానివై శివుడవై శివతేజంబునన్ లింగోద్భవ లీలామహిమన్ సాయి భగవంత ఓంకార ఓంకార నాదంబులన్ కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాది అరిషడ్వర్గంబులన్ నీదుమహిమ లంజుట్టి నేలంబడంగొట్టి నీదు బోధనామృత గానంబుతోడన్ సందేహనివారణల్ సల్పి దుష్టభావంబులన్ చెరిపి విశ్వ రూపుండవై సర్వదేవతాప్రభాసితంబైన నీదివ్య తేజంబు నుంజూచి రారా నాసాయీశ పర్తీశయంచున్ కొల్వగన్ దయా దృష్టివీక్షించి నన్నేలు నా స్వామి నమస్తే సదా బ్రహ్మచారీ నమస్తే ఈశ్వరాంబపుత్ర నమస్తే నమస్తే నమస్తే నమో నమః

- పి.వి. చలం

# సాయి దివ్యలీలా విద్యుత్తరంగాలు

## పద్మా హరగోపాల్

'అన్యధా శరణం నాస్తి' అన్నప్పుడే గజేంద్రుడు రక్షింప బడ్డాడు. స్వామి తన దివ్య విద్యుత్తరంగాలను భక్తుల మీద ప్రసరింపజేసినప్పుడే సంపూర్ణ శరణాగతిని పొంద గలుగుతాం. "దైవం మనుష్య రూపేణ" అని విని 1968 సం॥లో మొట్టమొదటసారి ప్రశాంతి నిలయంలో కాలు పెట్టేను. మా అక్క, చెల్లెలు కూడా వచ్చారు. మా అక్క అమెరికాలో స్వామిని గురించి విన్నదీ, చదివినదీ నాతో చెప్పినప్పటికీ, ప్రత్యక్షంగా చూచి తెలుసుకోవాలనే భావమే మనస్సులో స్థిరపడింది.

మేమందరమూ దర్శనానికి కూర్చున్నాం. స్వామి వచ్చారు, వెళ్ళారు. అచేతనంగా చూస్తూ ఉండిపోయా. కొంత సేపటికి స్పృహ వచ్చినట్లయింది. నా చేతిలో నున్న చిన్న పర్సు జారి ఎక్కడ బడిందో కనిపించలేదు. పరిసరా లలో వెదికాను. నేను కూర్చొన్న జంపఖానా క్రింద కూడా కలియ జూచినా దొరకలేదు. చేయగలిగేదేమి లేక మనసు లోనే స్వామిని ప్రార్థించాను. "స్వామీ! నీవు నిజంగా దేవుడ వైతే నా పర్సు నాకిప్పించు. కారణం? దాంట్లో నా తిరుగు ప్రయాణం టిక్కెట్లు, డబ్బు ఉన్నది." అని మనసులోనే స్వామిని అర్థించాను. మరల వెదికాను. నేను కూర్చున్న చోటనే జంపఖానా క్రింద పర్సు దొరికింది. ఆశ్చర్యానికి అంతులేదు. పరీక్షలో నన్ను ఓడించి, స్వామి గెలిచారని పించింది.

నా రెండవ అనుభూతి వీణా విక్రయం, శ్రీవారి ఉద్యోగ రీత్యా మేము అస్సాంలో ఉండేవాళ్ళం. బదిలీల వల్ల నా వీణను మద్రాసులోనే ఉంచేశాను. "షిరిడీ సాయి సచ్చరిత్ర" పారాయణం ముగించిన ఆఖరి రోజు అది. ముగించానో లేదో ఎవరో కాలింగ్ బెల్ మ్రోగించారు. తలుపు తెరిచి చూస్తే ఒక అపరిచిత స్త్రీ గుమ్మం వద్ద నిలబడి ఉంది. ఆమె మీ వీణను కొనుక్కునేందుకు వచ్చానని చెప్పి, వివరాలు తెలుసుకొని, మద్రాసు చిరునామాను కూడా తీసుకొని, అడిగిన పైకం ముట్టజెప్పి వెళ్ళిపోయింది. ఆ సంఘటనను తలచుకున్నప్పుడల్లా నా హృదయంలో విద్యుత్తరంగాలు చెలరేగుతాయి. ఆమె యిచ్చిన పైకంలో కొంత షిరిడీ సంస్థానానికి మనియార్డర్ ద్వారా పంపాను.

ఇక మూడవ అనుభవం మేము బొంబాయిలో ఉండగా జరిగింది. నా శ్రీవారు ఎంత చెప్పినా షిరిడీ సాయి - పర్తిసాయి ఒక్కరే అనే భావం నాటుకోలేదు. నేను ప్రతి నెలా షాపుకు ఫోన్ చేసి సామాన్లు తెప్పించు కొనేదానిని. అయితే ఒక పర్యాయం ఆ సామాన్లలో బెల్లం కనిపించకపోవటం వలన, నేనే కులాబాలోని మరాఠా స్టోర్సు కు వెళ్ళాను. అక్కడ అనుకోకుండా "Shiridi Sai Parthi Sai are one & the same" అనే పుస్తకం నా దృష్టిలో పడింది. ఆ పుస్తకం మీద ఇద్దరు స్వాముల ఫొటోలు ఉన్నాయి. క్యాష్ కౌంటర్ వద్దకు వెళ్ళి ఆ పుస్తకం కావాలి. వెల ఎంత? అని అడిగాను. ఇది పుస్తకాల షాపు కాదు, ఇది కిరాణా షాపు అని ఛలోక్తి విసిరి, కావాలంటే ఆ పుస్తకం తీసుకొని వెళ్ళండన్నాడు. ఆ షాపు యజమాని. నా మనస్సు పరవళ్ళు త్రొక్కింది. వచ్చిన పని కూడా మరచి పోయి, ఆ పుస్తకం తీసుకొని ఇంటికి చేరి సమగ్రంగా చదివి, ఇద్దరు స్వాములు ఒక్కటేననే అభిప్రాయానికి వచ్చాను. ఇప్పటికీ ఆ పుస్తకమును భద్రంగా దాచుకున్నాను.

బొంబాయిలో ఉండగానే నాల్గవ అద్భుతం జరిగింది. ఆ తరువాత కొంతకాలానికి ఒక రోజున 'టీ' పెట్టటానికి వంట గదిలోనికి వెళ్ళి, గ్యాస్ ఆన్ చేశాను. గ్యాస్ అయి పోయినట్లుగా గ్రహించి, గ్యాస్ కంపెనీకి ఫోన్ చేయగా స్టాక్ లేదని, వారం రోజుల వరకు రాదని చెప్పాడు. మా శ్రీవారు ఆఫీసు నుంచి వచ్చే సమయమయింది. "టీ" యిచ్చే అవకాశం లేదు. నా అశ్రద్ధకు నేనే సిగ్గుపడి 'నాకు వెంటనే గ్యాస్ వచ్చేట్లు చేయి స్వామి!అని మనసులోనే ప్రార్థించానో లేదో, వెంటనే కాలింగ్ బెల్ మ్రోగింది. తలుపు తెరిచాను. గ్యాస్ బండతో ఒక వ్యక్తి వచ్చాడు. అచేతనంగా చూస్తూ నిలబడిపోయాను. "ఎవరో గ్యాస్ కావాలని ఫోన్



చేసి, రాలేదమ్మా! ఆ సిలిండర్‌ను మీ కోసం తెచ్చాను. తీసుకోండి! అన్నాడు. డబ్బు యిచ్చి తీసుకున్నాను. మా ఇంటికి ఆ షాపు చాలా దూరం. అయినప్పటికి నేను తలచుకున్న ఒక్క నిముషంలోనే సిలిండర్ అందటం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇది కూడా స్వామి అద్భుతమే నని నా భావన. ఇక అయిదవ అద్భుతం. మా శ్రీవారు రిటైర్ అయ్యాక ప్రశాంతి నిలయంలో స్థిరపడ్డాము. నేను సేవలలో పాల్గొంటున్నాను. కాని అప్పటికి నన్ను 'పర్మినెంట్ స్టాఫ్'గా గుర్తించలేదు. దర్శనానికి వెళ్ళటం కష్టమయ్యేది. ఒకరోజున నాకు వచ్చిన లైను ఆఖరిదే అయినా మందిరం వెనుకవైపు ఆఖరి మెట్టు మీద కూర్చునే అవకాశం వచ్చింది. భజన మొదలైంది. స్వామి సింహాసనాన్ని అలంకరించారు. నా వైపే చూచి అభయ హస్తంతో దీవించినట్లు అనుభూతిని పొందాను. స్వామి హారతి అందుకొనే సమయంలో ఒక విదేశీ యువతి వచ్చి, నా చేతిని తన చేతిలోనికి తీసుకుంటూ, నా చేతిలో ఏదో పెట్టినట్లు అనిపించింది. హారతి అయిపోయింది. నా చేతిని తెరచి చూడగా, తీర్చి దిద్దిన స్వామి ముఖంగల వెండి నాణెం ఉన్నది. ఆశ్చర్య పోయి అటూ ఇటూ చూచాను. ఆ విదేశీ యువతి కనిపించ లేదు. దగ్గరలోని ఉన్న సేవాదళ్ వారిని అడిగాను. విదేశీ యువతి ఎవరూ రాలేదన్నారు. అసలు భజన మధ్యలో ఎవరినీ రానివ్వమని చెప్పారు. నేను నిర్ఘాంతపోయాను. ఆ వెండి నాణెమును మా పూజా గృహంలో పెట్టుకున్నాను. అది యిప్పటికీ మా పూజా మందిరంలో శ్రీ చక్రం ప్రక్కనే ఉండి పూజ లందుకుంటున్నది. ఈ విధంగా స్వామి విద్యుత్తరంగాలలో బంధించ బడ్డవారు ఎందరో.... అందులో నేను కూడా ఒకర్ని కావటం వలన నాకు ఎంతో ఆనందం కలిగింది. నా జీవితం ధన్యమైనదని భావిస్తున్నాను. స్వామికి శతకోటి నమస్కారాలు చెప్పుకుంటున్నాను. ●

## సాయిపిలుపు

'తత్త్వమసి' నీవే బ్రహ్మం! ఇవి చిలుక పలుకులయితే ఏం ప్రయోజనం? ఈ ఎరుకను అనుభూతి పూర్వకం చేసికో! నీవే సాయివి; ఈ గ్రహింపే 'సాయి'జ్యం; అదే నీకు సాయుజ్యాన్ననుగ్రహిస్తుంది

అనంతకోణాలు! అనేక వర్ణాలు! అశేషరాగాలు! అదిగో! నీ చుట్టూ విస్తరించిన రమణీయ ప్రకృతి విభావరిని తిలకించు! పరవశించు! ఆ అద్భుత సృష్టి ఎవరి లీల? అనంతుని అక్షరతత్త్వాన్ని మానసించు.

నీవు ఎవరు? వచ్చింది ఎందుకు? పోతున్నది ఎటు? - తెలిపే ప్రబోధను ఆలకించు. ప్రబోధ విని విడి చేసేది కాదు. ఆచరణలో గాని అది పర్యవసించదు. ఫలించదు. ఆ దిశగా ప్రయత్నం ఆరంభించు. మానవ జన్మ లభించి నందుకు కృతజ్ఞతను చూపే నీ కర్తవ్యం అది! 'నిరంతరం స్వధర్మం చేయి' అన్న గీతావాక్యానికి అసలైన అర్థం ఏమిటి? జీవాత్మ పరమాత్మతో కోరే తాదాత్మ్యం దిక్కుగా పయనించమనే. సాధనలో మొదటి మెట్టు నామమే. అది తొడిమె. పండు బాగా పక్వమై తనంతట తాను రాలే దాకా అది తోడుంటుంది, "కలిర్నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా" కలియుగంలో నామం, నామం, నామం తప్ప మరోదారి లేదు. నిజానికి కలి ఒక విధంగా చూస్తే, చెడ్డది కాదు. ముక్తిని కోరేవారికి ఇంతటి సులభమార్గం ఇంకే యుగం చూపగలిగింది? నామం నిన్ను పావనుని చేస్తుంది. సేవకు ఉన్ముఖుడిని కావిస్తుంది. మనసుతో, నోటితో నామం! చేతులతో సేవ! ఇలా ముందుకు సాగు!

సేవాలాలసత నీకు అలోలత్వాన్ని ప్రసాదిస్తుంది. అప్పుడు సౌశీల్యం నిన్ను వరిస్తుంది, సత్సంగం సాయి సంగమే. అది నిస్సంగమై నిర్మోహత్వానికి దారి తీస్తుంది, కాని అహం అంతం కానిదే ప్రేమ నీవంక చూడదే!

ప్రేమకు ఊపిరి త్యాగం. భక్తి దాని హృదయం విశ్వాసం అంతఃకరణం, ప్రజ్ఞానం మేధ, ప్రపత్తి ఆత్మ, అట్టి నిస్వార్థ ప్రేమే నీ జీవనం, ప్రేమే సత్యం! ప్రేమే దైవం! నిన్ను 'సాయి' జ్యానికి చేర్చు సద్గురువు ప్రేమే! ప్రేమా లింగనంలో పయనించు, ముందుకు, మున్ముందుకు! ప్రశాంతినిలయంలో సాయి నీకై వేచి ఉన్నాడు. ఆలసించకు! పోయి స్వామి సందర్శన, సంస్పర్శన, సంభాషణ, సంభావన భాగ్యాలతో నిన్ను నీవభిషేకించుకో ఎరుక అనే దివ్య కాంతుల శోభలో నీ ఆత్మను వెలిగించుకో! అమృతస్య పుత్రుడివికా! ఆనంద స్వరూపివై నిత్యుడివికా! ■

'సుశ్రీ'



# పాపభీతి - దైవప్రీతి - సంఘనీతి

'జాతి గౌరవంబు నీతిపై నిలుచును' అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు. ఏ జాతి అయినా పేరు ప్రఖ్యాతుల నందుకోవాలంటే, ఆ జాతి ప్రజల ప్రవర్తన మీద ఆధారపడి ఉంటుంది. ఏ దేశమైనా ప్రగతిని సాధించాలంటే ఆ దేశ ప్రజల నైతిక స్థాయి మీద ఆధారపడి వుంటుంది. జాతికి నీతి ముఖ్యం. నీతి గలవాడే నిజమైన మనిషి. నీతిలేనివాడు ఎంత గొప్ప మేధావి అయినా, ఎంత గొప్ప శాస్త్రజ్ఞుడైనా, ఎంత గొప్ప రాజకీయ నాయకుడైనా, అటువంటి నీతి భ్రష్ఠుల వలన ఆ దేశమునకు, ఆ జాతికి ప్రయోజనం లేక పోగా, ప్రమాదం కూడా సంభవిస్తుంది, అప్రదిష్ట కూడా వస్తుంది. ఈ మధ్యకాలంలో ముఖ్యంగా మన దేశంలో జరుగుతున్న సంఘటనలను పరిశీలిస్తే, ఇది వాస్తవమేనని ఋజువవుతున్నది.

'నీతి నియమాలు నరునకు ఖ్యాతిగూర్చు' అన్నారు భగవాన్ సాయి. ఇది వాస్తవం. యదార్థం. నీతి నియమాలు (Morals & Principles) వ్యక్తి కీర్తిప్రతిష్ఠలను పెంచివేస్తాయి. ఉన్న స్థితి నుంచి ఉన్నత స్థితికి తీసుకొని పోతాయి. ఖ్యాతిని చేకూరుస్తాయి. వీటివలన మానవుని వ్యక్తిత్వం వికసిస్తుంది. క్రమబద్ధమైన, నియమబద్ధమైన జీవితాన్ని గడిపేవారికి మాత్రమే వ్యక్తిత్వ వ్యక్తీకరణ అధికారం ఉంటుంది. నైతిక వ్యక్తిత్వమును అభివృద్ధి పరచుకొన్నప్పుడే, దివ్యత్వమనే ఆత్మశక్తిని కూడా అనుభవించవచ్చునంటారు బాబా. **'విచక్షణ ప్రతిబింబమే నీతి. మానవుని పవిత్ర నడతలతో కూడిన దివ్యమైన మాధుర్యసారమే నీతి. నీతి నియమాలు లేని మనిషికి సమాజంలో ఏమాత్రం గౌరవముండదు'.** అంటారు భగవాన్ సాయి. కనుక ప్రతి ఒక్కరూ నీతి నియమాలను పెంపొందించుకుంటూ జీవితమును సార్థకం చేసుకోవాలి. అప్పుడే తమకు గౌరవము, దేశము యొక్క ప్రతిష్ఠ ఇనుమడిస్తుంది. అయితే ఈనాడు ధనమును పెంచుకోవటానికి ప్రయత్నిస్తున్నారుగాని, నీతిని పెంచు కోవటానికి మాత్రం చాలా మంది ప్రయత్నించటం లేదు.

**'ధనము వచ్చును పోవును, నీతినియమాలు నిలుచును నిజముగాను'** అన్నారు భగవాన్ సాయి. (Money comes and Goes, But Morality comes and Grows) డబ్బు వస్తుంది, పోతుంది. కాని నీతి వస్తుంది, పెరుగుతుంది. నీతికి మించిన ధనం వేరొకటి లేదు. మానవునికి ఎన్ని రకములైన భౌతిక సంపదలు ఉండినప్పటికీ, నైతిక బలం గనుక లేకపోతే ఏమాత్రం రాణించడు, శోభించడు. ఈనాడు మానవునిలో నీతి లోపించటం వలననే పతనమై పోతున్నాడు, అప్రదిష్ట పాలవుతున్నాడు, దేశమును కూడా అప్రదిష్టపాలు జేస్తున్నాడు.

"If Wealth is Lost, Nothing is Lost. If Health is Lost, Something is Lost. If Character is Lost,

## కొమరగిరి కృష్ణమోహనరావు

Everything is Lost" అనే ఆర్యోక్తిని ఈనాడు విస్మరిస్తు న్నారు. **'ధనమూలం ఇదం జగత్'** ను విశ్వసిస్తున్నారు. ధనం ప్రధానం కాదు, గుణం ప్రధానం. ధనం కాదు ముఖ్యం, ధర్మం ముఖ్యం. **ధర్మమూలం ఇదం జగత్** అని విశ్వసించాలి. అప్పుడే లోకంలో శాంతి నెలకొంటుంది. ధనానికి ప్రాధాన్యత యిచ్చినంత కాలం అశాంతి చెలరేగుతునే ఉంటుంది. అయితే ధనం వద్దని కాదు. అవసరాలు తీర్చుకోవటానికి ధనం అవసరమే. ఎక్కువ సంపాదిస్తే మనశ్శాంతి ఉండదు. తక్కువైతే బాధలు పడవలసి వస్తుంది. బూటు వదులుగా వుంటే నడవటం కష్టం. బిగ్గరగా వుంటే కాలిని కరుస్తుంది. సరిపోనూ ఉన్నప్పుడే సాఫీగా నడువగలుగుతాం. కనుక ధనమే దైవమని, అదే సర్వస్వమని భావించరాదు. కేవలం నైతిక మార్గమే చాలదు. నైతికానికి తోడు ఆధ్యాత్మికంకూడా చేర్చాలంటారు బాబా. అప్పుడే పరిపూర్ణత చేకూరుతుంది. ఈ సందర్భమున బాబా వారు ఒక చక్కటి ఉదాహరణ చెప్పారు. మైకు చక్కటి కండిషన్‌లో ఉండినప్పటికీ కరెంటు లేకపోతే అది పలుకదు. కరెంటు ఉండినప్పటికీ, మైకు కండీషన్‌లో లేకపోతే

ప్రయోజనం లేదు. కనుక Positive మరియు Negative లు రెండూ చేరినప్పుడే మైకు ఫలుకుతుంది. అవియే నైతిక ఆధ్యాత్మికములు. ఈ రెండు నేత్రాల వంటివి. కనుక నైతిక, ఆధ్యాత్మికములను పెంపొందించుకొని వాటిని హృదయంలో నింపుకొని ధర్మబద్ధంగా నడిచే మానవుని జన్మమే సార్థకమవుతుంది.

'పాపభీతిని, దైవప్రీతిని మనం పెంచుకోవాలి. **సంఘంలో నీతిని అభివృద్ధి పరచుకోవాలి. ఈ మూడు మానవునికి ప్రధానమైన విలువలు'** అని అంటారు భగవాన్ సాయి. పాపభీతిలోనే అహింస, శాంతం లభిస్తాయి. దైవప్రీతి సత్యము, ప్రేమలను అభివృద్ధి పరుస్తుంది. సంఘనీతి మన ధర్మము, సత్య, ధర్మ, శాంతి, ప్రేమ, అహింసలు అని చిలుకపలుకులు పలికినంత మాత్రమున ప్రయోజనం లేదంటారు బాబా. నేటి రకరకాల విప్లవాలకు, కల్లోలాలకు కారణం పాపభీతి లేకపోవటం, దైవప్రీతి కోల్పోవటం, సంఘంలో నీతి లేకపోవటమే. నిజంగా మనలో దైవప్రీతి ఏర్పడుతే వెంటనే పాపభీతి కలుగుతుంది. ఈ రెండూ వుంటే వెంటనే సంఘంలో నీతిని సాధించగలము. అందు వలననే **'సంఘనీతి మానవ జాతికి జ్యోతి'** అని అంటారు బాబా. కనుక ప్రతి ఒక్కరూ మొదట దైవభావాన్ని పెంచుకోవాలి. అంతటితోనే తృప్తి చెందరాదు. అందరినీ ప్రేమించటం నేర్చుకోవాలి. అక్కడితోనే ఆగిపోరాదు. సంఘసేవకు నడుం కట్టాలి. ప్రేమ, సేవ రెండే రెండు నిజమార్గాలు. రెండూ రెండు కన్నులు. రెండు రెండూ రెక్కలు. కనుక పాపభీతిని, దైవప్రీతిని పెంచుకోవాలి. సంఘంలో నీతిని అభివృద్ధి పరచాలంటారు బాబా.

బాబా పలుకులు వేదవాక్కులు. అవి నిత్యసత్యాలు, బాబా చెప్పేది సత్యం. ఆచరించడం మన ధర్మం. ఆచరించుతే వస్తుంది శాంతి. శాంతి తెస్తుంది మనశ్శాంతి. మనశ్శాంతి యిస్తుంది ప్రశాంతి. ప్రశాంతి నిలయమే ప్రేమకు నిలయం. అదే పర్తీశ్వరుని ఆలయం. ఆ ఆలయానికి వెళ్ళి సాయీశ్వరుని దర్శిద్దాం, తరిద్దాం. ☆

# వినయ విధేయతలను నేర్పేది విద్య

విద్య, విజ్ఞాన నిమిత్తము కానీ ఉద్యోగ నిమిత్తము కాదు. Education is for Life and not for living. విద్య జీవితము నిమిత్తమై ఏర్పడినది. కానీ, జీవించే నిమిత్తమై కాదు. జీవితమంటే ఏమిటో అనే సత్యాన్ని గుర్తింప జేసేదే నిజమైన విద్య. అంతఃకరణమును పరిశుద్ధం గావించేది విద్య. దుర్గుణములను, దురాలోచనలను, దుష్ప్రవర్తనలను హృదయంలో నింపుకొనేటటువంటిది విద్య కాదు. నైతిక, ఆధ్యాత్మిక, శీల సంపత్తులను అభివృద్ధిగావించేటటు వంటిది విద్య. తప్పొప్పులు ఏమిటో అనే దానిని నిర్ణయించే సమయంలో, మానవునికి సహాయకారిగా ఉండేది విద్య. వినయ విధేయతలను నేర్పేది విద్య.

**వినయ విధేయతలు :**

పూర్వకాలమందు విద్యను నేర్చుకోవడానికి విద్యాలయములకు వెళ్లే విద్యార్థుడను 'వినేయుడు' అని పిలిచేవారు. అనగా వినయమును అభ్యసించే నిమిత్తమై విద్యాలయములకు వెళ్ళేవాడు అని అర్థము. అయితే ఈనాడు 'వినేయులు' ఎక్కడా కనిపించటం లేదు. అహంకారం, ఆడంబరములు మాత్రమే కనిపిస్తున్నాయి. అహంకారము మృగము యొక్క లక్షణం. ఆడంబరం అజ్ఞానానికి చిహ్నం. గురువుల వద్దగాని, తల్లిదండ్రుల వద్ద గాని, పెద్దల వద్ద గాని వినయ విధేయతలను ప్రకటించడం మానవత్వ లక్షణం. దీనిని నేర్పునదే విద్య.

> **"విద్య యొసగును వినయంబు వినయమునను**
> **బడయు బాత్రత పాత్రత వలన ధనము**
> **ధనము వలనను ధర్మంబు దాని వలన**
> **ఐహికాముష్మిక సుఖంబులందు నరుడు."**

అయితే ఈనాడు ధనార్జన కోసం విద్య నేరుస్తున్నారు గాని, వినయ విధేయతలు నిర్మూలమైనాయి. వినయము నకు క్రమశిక్షణ అత్యవసరం. క్రమశిక్షణ లేని జీవితం మృగసమానం. క్రమశిక్షణ శీలతత్త్వాన్ని అభివృద్ధి పరుస్తుంది. శీలమే ప్రాణము. ఈనాడు విద్యార్థుల యందు వినయ శీలములు కనిపించటం లేదు. కష్టించి, శ్రమించి పనిచేయడానికి విద్యార్థులు ఏమాత్రం ముందంజ వేయటం లేదు. సుఖాలను కోరుతున్నారు, సౌకర్యాలను ఆశిస్తున్నారు. సోమరితనం ప్రబలిపోతున్నది. ఇది ప్రగతికి అవరోధంగా నిలుస్తుంది. "Laziness is rust and dust, realization is best and rest " (సోమరితనమే తుప్పు, ధూళి. సాక్షాత్కారము ఉత్తమోత్తమమైనది.)

## భగవాన్ సాయి దివ్యోపదేశం

**BEGGARS - BIGGERS :**

ప్రాచీన గురుకులములయందు కేవలం జీవిత నిమిత్తమై భుజించేవారు. కాని, అన్నం నిమిత్తమై జీవించే వారు కాదు. కానీ, ఈనాటి యువకులు చాలామంది తిండి కోసం ప్రాకులాడుతున్నారు. పశుపక్షి మృగాదులు కూడా తినడం లేదా? దేహానికి ఆహారం అవసరమే. కానీ, నిరంతరం 'ఆహారం.... ఆహారం....' అని పరితపించే మూర్ఖత్వంలో మాత్రం ప్రవేశించకూడదు. దైవాన్ని వెతుక వలసిన బుద్ధితో ధనాన్ని వెతుకుతున్నారు. ఆత్మను వెతుక వలసిన బుద్ధితో అన్నాన్ని వెతుకుతున్నారు. ఆత్మాన్వేషణ చేయకుండా, అన్నాన్వేషణ చేయటం అజ్ఞానం కాదా? మనం బ్రతుకుతున్నది బ్రహ్మ కొరకు గాని, అన్నం కొరకు కాదు. ఆహారం దేహ సంరక్షణకే గాని ఆత్మ సంరక్షణకు కాదు. తినటానికోసం బ్రతకరాదు. బ్రతకటానికోసం తినాలి. Eat to Live, Not Live to Eat. ఈనాడు మానవుడు తన జీవిత పరమావధి ఏమిటో గుర్తించలేక పోతున్నాడు. ఏదోవిధంగా పొట్ట నింపుకోవాలని తాపత్రయ పడుతున్నాడు. విద్యార్థులు కూడా తమ లక్ష్యమేమిటో గుర్తించుకోలేక పోతున్నారు. విద్యార్థుల లక్ష్యము విద్య నార్జించడం, విజ్ఞానాన్ని సముపార్జించడం. అయితే ఈనాడు చాలా మంది విద్యార్థులు ఉద్యోగ నిమిత్తమై విద్యను అభ్యసిస్తున్నారు. డిగ్రీలు సంపాదిస్తున్నారు. ఆ సర్టిఫికేట్లు తీసుకొని ఆఫీసుల చుట్టూ తిరుగుతూ "ఉద్యోగం... ఉద్యోగం' అని Beg (అడుక్కొనుట) చేస్తున్నారు. మీరు Beggars (భిక్షకులు) కాకూడదు.



Biggers (గొప్పవారు) కావాలి. గొప్ప ఆదర్శమును చూపించినప్పుడే మీరు Biggers అవుతారు. విద్య కేవలం ఉద్యోగం చేయటానికి కాదు. విజ్ఞానాన్ని సముపార్జించాలి. సముపార్జించిన విజ్ఞానాన్ని దేశపురోభివృద్ధికి వినియోగించాలి.

**మార్కులు - ర్యాంకులు :**

ఈనాటి విద్యార్థులు చాలా తెలివిగలవారే. Gold Medals కూడా సంపాదిస్తున్నారు. మార్కులు చూస్తే ర్యాంకులు వస్తున్నాయి. కానీ, గుణము, అనుభవము మాత్రం బ్లాంకులు, జీరోలు. విద్య అంటే కేవలం చదవటం, వ్రాయటం మాత్రమే కాదు. డిగ్రీలు సంపాదించడం మాత్రమే కాదు, మార్కులు, ర్యాంకులు తెచ్చుకోవటమే కాదు. MARKS తోపాటు remarks రాకుండా కూడా చూచుకోవాలి. చదువుతోపాటు సంస్కారమును కూడా పెంచుకోవాలి. విద్యతోపాటు వినయమును కూడా అలవరుచుకోవాలి. విద్యావినయములు రెండూ కలిగి వున్న వాడే రాణిస్తాడు. అయితే ఈనాటి ఆధునిక విద్యలు తెలివి తేటలను మాత్రమే పెంచుతున్నాయి. కాని గుణమును ఏమాత్రం పెంచటంలేదు.

**"నేటివిద్యలు తెలివితేటలనే పెంచు**
**కొంచమైన గుణము పెంచబోదు**
**కోటివిద్యలుండి గుణములేకున్నచో**
**అట్టి విద్యకన్న మట్టి మిన్న"**

గుణములేని జీవితం దీపం లేని గుడి వంటిది. గుణం లేని జీవితం చెల్లని నాణెం వంటిది. గుణం కంటే మించిన బలం వేరొకటి లేదు. ఎన్ని విద్యలు నేర్చినా గుణం లేకపోతే ప్రయోజనం లేదు. కనుక ప్రతి విద్యార్థి విద్యార్జనతోపాటు గుణార్జన కూడా చేయాలి. ధనార్జన ప్రధానం కారాదు. అయితే ఈనాటి విద్యార్థులు విషయానందమునే విరివిగా ఆశిస్తున్నారు కానీ, విద్యానందమును అంతగా ఆశించడం లేదు. విద్యార్థులు విషయార్థులు కారాదు. ఈనాడు చాలామంది విద్యార్థులు విద్యనార్జించడం మీద అంత ఆసక్తి చూపటం లేదు. అనవసరమైన సంబంధం లేని విషయాలను సేకరించడానికి ఎక్కువ ఆసక్తిని చూపుతున్నారు. ఇది విద్యార్థి లక్షణంకాదు.

**అతిభాష మతిహాని :**

ఈనాడు విద్యార్థులలో అతిగా మాట్లాడే chatter Box (వదరుబోతులు)లు ఎక్కువై పోతున్నారు. సహజంగా ఎక్కువగా మాట్లాడే వారు తక్కువ పని చేస్తారు. అతి భాషమతిహాని, మితభాష అతిహాయి. అతిగా మాట్లాడటం వలన ఆత్మశక్తి, దివ్యశక్తి వ్యర్థమవుతుంది. అతిగా మాట్లాడం చేత ఆకలి అధికంగా అవుతుంది. ఆహారం అధికంగా తింటే ఇంద్రియములను నిగ్రహించుకోవటం సాధ్యం కాదు, తిని కూర్చుంటే సోమరులవుతారు. కనుక అధికంగా మాట్లాడకండి. మితంగా, హితంగా మాట్లాడటం నేర్చుకోండి. వాక్ శుద్ధిని పెంచుకొనే నిమిత్తమై సాధ్యమైనంత వరకు మౌనం వహించండి. మానసిక మౌనం, వాక్ మౌనం - ఈ రెండింటినీ పాటించండి. మానము, మౌనము - ఇవిమానవులకు ప్రాణశక్తులు. మనం ఇష్టమొచ్చినట్లు మాట్లాడుతుంటే వాక్శుద్ధి అంతా పోతుంది. వాక్శుద్ధి ఎప్పుడు పోతుందో, అప్పుడు మానవుడు పశువుగా మారుతాడు. కనుక అవసరం వచ్చినప్పుడు మాట్లాడవలసిందే కాని, మితిమీరి అనవసరమైన విషయాలలో ప్రవేశించరాదు.

"నీదు మంగళమూర్తి నిఱతంబు నా మదిన్
హత్తించి బ్రోవవే హరిహరాయ;
నీ దివ్య పదములన్నిటలంబు మోపంగ
భాగ్యంబు నా కిమ్ము భాగ్యదాత;
నీ దివ్య చరితమ్ము నిత్యంబు కీర్తించ
విద్యనే నా కిమ్ము విశ్వనాథ !
నీ దివ్య నామంబు నిరతంబు నా జిహ్వ
రమియించ రానిమ్ము రామచంద్ర;
నీదు భక్తుల సద్గోష్ఠి నిండు భక్తి
నీదు ఆజ్ఞల నెఱవేర్ప నిండు శక్తి
సదయ దయ సేయవే ప్రభు సత్యసాయి
ప్రేమ కారుణ్య సాగరా పర్తినాథ!"

**- చెన్నమళ్ళ సత్యం, జంషెడ్‌పూర్**

**పుస్తక జ్ఞానం - అనుభవ జ్ఞానం :**

ఈనాడు విద్యార్థులు కేవలం గ్రంథ పరిచయమును మాత్రమే ప్రోగు చేసుకుంటున్నారు. ఈ Bookish Knowledge (పుస్తక జ్ఞానం) వల్ల Practical Knowledge (అనుభవజ్ఞానం) ఏ మాత్రమూ ప్రాప్తించదు. ఈనాటి Bookish Knowledge రేపు Knowledge తరువాత Elergy గా వికటిస్తున్నది. అదికాదు Knowledge దివ్యమైన Energy (శక్తి) గా మారాలి గాని, Elergy గా మాత్రం కారాదు. ఈనాటి విద్యలన్నీ కృత్రిమంగానే ఉంటున్నాయి. కనుక, అనుభవైక వేద్యమైన విద్యనభ్యసించడానికి తగిన కృషి చేయాలి. శాస్త్ర జ్ఞానం లేనివాడు గ్రుడ్డివాడు. అనుభవ జ్ఞానం లేనివాడు కుంటివాడు. ఈ రెండు జ్ఞానములు సంపాదించినవాడే పరిపూర్ణుడు. కనుక.పుస్తక జ్ఞానంతో పాటు అనుభవజ్ఞానమును కూడా ప్రతి విద్యార్థి సంపాదించాలి.

**అనుకరణ :**

ఈనాడు విద్యార్థులలో అనుకరణ వ్యామోహం పెచ్చు పెరిగిపోతున్నది. అనుకరణ నాగరికత కానే కాదు. నీవు ఒక ప్రభువు వేషము ధరించవచ్చును. అంతమాత్రమున నీవు ప్రభువగుదువా? గాడిదకు పులి చర్మము కప్పినంత మాత్రమున పులి అగునా? అనుకరణ పిరికితనమునకు చిహ్నము. ఇది పురోగమన సాధనము కాదు. నిజంగా

"సర్వాణువుల సత్యసారమై వర్ధిల్లు
ప్రభువు సాయీశుని ప్రాభవంబు
లౌకిక విద్యల లలిత విలాసాల
పరిధికందని మహా వైభవంబు
యుగయుగాంతాల మహోజ్వల పురుషుడై
వెలయు పరంజ్యోతి విమలసాయి
అద్భుతాశ్చర్యాల ఆనంద లీలల
పరమాత్మయే పుట్టపర్తి విభుడు
నరుని నారాయణుని చేయు సరణి తెలిపె
జీవిత సమస్యలకు దివ్య భావమొసగె
అట్టి దేవదేవుని చేరి పట్టుపట్టి
మేలు పొందగ రండోయి - మిత్రులారా!

**- పంచాంగము శీనప్పశాస్త్రి, పుట్టపర్తి**

అది మానవుని భయంకర రూపమగు అధోగతికి సూచన. ఇతరులను అనుకరించవలదు కానీ, వారిలోని సద్గుణములను మాత్రం గ్రహించుము. ఇతరుల వద్ద నుండి నేర్చుకోవలసినది ఎంతయో ఉన్నది. శ్రేయస్కరమగు దానిని ఇతరుల వద్ద అభ్యసించుము. దానిని నీ స్వధర్మాను సారంగా నీలో యిముడ్చుకొనుము. అంతే కాని ఇతరులుగా మారరాదు.

**ఆత్మవిశ్వాసము :**

ప్రతి విద్యార్థి మొట్టమొదట ఆత్మ విశ్వాసమును అభివృద్ధి పరచుకోవాలి. అది లేకపోవటం చేతనే మానవుడు, దానవుడుగా మారుచున్నాడు. దౌర్బల్యుడుగా దిగజారి పోతున్నాడు. సమస్త క్షేమములకు, సమస్త ఆనందములకు మూలము ఆత్మ విశ్వాసమే. ఆత్మ విశ్వాసము (Self Confidence) పునాది (Foundation) వంటిది. ఆత్మ విశ్వాసము అనే పునాదిపైన, ఆత్మ సంతృప్తి (Self Satisfac tion) అనేటటువంటి గోడ (Wall) ను కట్టాలి. ఈ ఆత్మ సంతృప్తి అనే గోడపైన స్వార్థత్యాగం (Self Sacrifice) అనే టటువంటి కప్పు (Roof) వేయాలి. అందులో ఆత్మ సాక్షాత్కారము (Self Realisation) అనేటటువంటి జీవితం (Life) ను కాపురం పెట్టాలి. కనుక ఈ ఆత్మ సాక్షాత్కారము అనే నివాసమునకు ఆత్మ విశ్వాసమే పునాది. ఇది అతి భద్రంగా ఉండాలి. ఈ ఆత్మ విశ్వాసమునే కోల్పోయిన పతనమై పోతాం. "Faith in ourselves and faith in God, That is the secret of success" (తన యందు నమ్మకం, భగవంతునిమీద విశ్వాసం - ఇదే విజయమునకు కీలకం.) అయితే ఈనాడు చాలామందిలో ఈ నమ్మకం, విశ్వాసములు లోపించడం వలననే లక్ష్యమును చేరుకోలేకపోతున్నారు. "నమ్మకమను రెండు నయనమ్ములే లేని అంధులైరి అవని యందు". కనుక సాధకుడు ఏ పనిని సాధించాలన్నా ఆత్మ విశ్వాసంతో ముందుకు నడవాలి. ఆత్మ విశ్వాసం మానవుడి చేత పర్వతాలను సైతం కదలింపజేస్తుంది.

**మాతృదేవోభవ :**

తల్లిదండ్రులను దేవతలుగా భావించి పూజించండి. తల్లి దండ్రులను గురువులుగా భావించుకోండి. తల్లి శరీరాన్ని ఇస్తుంది. తండ్రి రక్షణ యిస్తాడు. గురువు

బుద్ధి వికాసానికి తోడ్పడుతాడు. అతిథులు సంఘంలో గౌరవాన్ని యిచ్చి సముచితమైన స్థానాన్ని కలిపిస్తారు. కనుకనే మన ప్రాచీన ఋషులు **"మాతృదేవోభవ! పితృదేవో భవ! ఆచార్య దేవో భవ!"** అని బోధించారు. తల్లికి మించిన దైవం వేరే ధరణిలో లేదండి. కనుక తల్లిని గౌరవించండి. **దుష్టుడైన కొడుకు లోకంలో ఉన్నాడేమో గాని, దుష్టురాలైన తల్లి లోకంలో లేదు.** కనుక తల్లిని ప్రేమించండి. ప్రతి తల్లీ తన బిడ్డ మహా వ్యక్తి కావాలని కాంక్షిస్తుంది. తల్లి స్వార్థం ఎరుగదు. పిల్లల శ్రేయస్సే తల్లి ఆశయం. కనుక తనువు నిచ్చిన తల్లిని పూజించడం పిల్లల ప్రధాన కర్తవ్యం. ఈనాటి బాలురు రేపటి తండ్రులు. ఈనాటి బాలికలు రేపటి తల్లులు. ఈనాడు మీరు మీ తల్లిదండ్రులను గౌరవించటం నేర్చుకుంటే, రేపు మీ బిడ్డల నుండి మీరు అట్టి గౌరవాన్ని పొందడానికి అర్హతను సంపాదించుకుంటారు. కనుక ప్రతి వ్యక్తీ తమ తల్లిని సంతోషపెట్టాలి. తల్లి యొక్క సంతోషమే దైవము యొక్క సంతోషం. తల్లిని సంతోషపెడితే స్వామిని సంతోషపెట్టినట్లే. చిన్నతనంలో బాలబాలికల ప్రవర్తన మంచిగా ఉండాలి.

**దేశభక్తి-సమాజసేవ :**

'జననీ జన్మ భూమిశ్చ స్వర్గాదపిగరీయసి' జన్మ యిచ్చిన తల్లి, జన్మించిన దేశం స్వర్గం కంటే గొప్పవి. లంక సువర్ణమయంగా ఉండవచ్చును. నా దేశం బీదది, పేదది కావచ్చును. కాని అదియే నా మాతృభూమి, అని చెప్పి, లక్ష్మణా! అయోధ్యకు వెళ్ళుదామంటాడు శ్రీరామచంద్రుడు. ఆదర్శమైన అవతార పురుషులు కూడా మాతృదేవికి, మాతృదేశమునకు అంతటి ప్రాధాన్యత యిచ్చారు. కనుక మాతృదేవిని, మాతృదేశమును ప్రతిఒక్కరూ గౌరవించాలి. మాతృదేశ క్షేమమును కోరండి. సమాజసంక్షేమాన్ని ఆశించండి. దేశభక్తిని పెంచుకోండి. భారతదేశము చాలా పవిత్రమైన దేశము. ఇది పుణ్యభూమి, ఇది వేదభూమి, ఇది కర్మభూమి. అలాంటి పవిత్రమైన భూమిని మనం కాపాడుకోలేకపోతే మనం చదివి ఏం ప్రయోజనం? ప్రతి గ్రామానికి వెళ్ళి సేవలు చేయండి, ఫలితాన్ని ఆశించకండి. దైవమే రక్షిస్తాడు. దైవమే భిక్షపెడతాడు. దేశసేవచేస్తే అది నిజమైన దైవ సేవగా మారిపోతుంది. అయితే ఈనాడు కొందరు యువకులు తల్లిదండ్రులనే సరీగా చూడటంలేదు. తల్లిదండ్రులను చూడనివారు దేశమును ఏవిధంగా చూడగలరు? మొట్టమొదట తల్లిదండ్రులకు సేవలు చేయండి. గ్రామ సేవలో పాల్గొనండి. తరువాత దేశసేవకు అంకితంకాండి. సమాజసేవ చేయండి. సమాజ సేవ చేయకపోతే చదివిన చదువులు వ్యర్థమవుతాయి. అయితే ఈనాడు చదువుకున్న వారందరూ సంపాదనలో మునిగిపోతున్నారు. ఎంతమంది సంపాదించలేదు. వారంతా ఏమి తీసుకొని పోయారు? సంపాదించండి. ఫరవాలేదు. కాని జనసేవకు కొంత వినియోగించండి. అయితే చిత్తమునందు భగవచ్చింతన మాత్రం చేయాలి. చేతులతో సమాజసేవ చేయాలి. అప్పుడే మీ జీవితం సార్థకమవుతుంది. అప్పుడు మీరుకూడా ఆదర్శవంతమైన విద్యార్థులుగా తయారవుతారు.

"సత్ప్రవర్తన సద్బుద్ధి సత్య నిరతి
భక్తి క్రమశిక్షణ కర్తవ్యపాలనంబు
నేర్పునదే విద్య విద్యార్థినేర్వవలయు
ఇంతకన్నను వేరెద్ది యెరుక పరతు."

(భగవాన్ సాయి దివ్యోపన్యాసముల నుండి గ్రహించబడినది)

## ఓం సాయి శ్రీ సాయి - జయజయ సాయి

**ఓం సాయి శ్రీ సాయి జయ జయ సాయి**
**మాంపాహి శ్రీ సాయి ద్వారకామాయి**
**షిర్డీసాయి అవతారం శ్రీ సత్యసాయి**
**॥ఓం సాయి॥**

**దత్తరూప, పాహిమాం - యోగిరాజరక్షమాం**
**సాయిరాం పాహిమాం - సర్వజనరక్షమాం**
**సద్గురు పాహిమాం - సత్యసాయి రక్షమాం. ॥ఓం సాయి॥**
**సప్తాహపారాయణం - సత్యసాయి కభీష్టం**
**ద్వాదశాక్షరీ మంత్రం - దైత్య గుణనాశనం**
**మధురమైనదా నామం - మనసుకెంతో ఆహ్లాదం**
**కామధేను, కల్పవృక్షం - కామిత ప్రదాయకం ॥ఓం సాయి॥**

**ఈతి బాధ నిర్వీర్యం - ఇంట వెంట రక్షణం**
**శతృ పీడ భయహరం - ప్రశాంత చిత్తం - మనోహరం ॥ఓం సాయి॥**

**- కోట శ్రీరామచంద్రమూర్తి**

# శక్తిప్రదాత శ్రీ సత్యసాయి భగవాన్

1960 నుండి హైదరాబాదులో ఉపాధ్యాయునిగా ఉండేవాణ్ణి. 1976లో క్లిష్టసమస్యలలో చిక్కుకొని శివం మందిరానికి అప్పుడప్పుడు వెళ్ళేవాణ్ణి. విభూతి పెట్టుకొనే అలవాటు అయింది. (అంతకు ముందు విభూతి అంటే ఎందుకో ఇష్టం ఉండేదికాదు). స్వామిని గురించి వివరంగా తెలుసుకోవాలనే తపన ప్రారంభమయింది నాకే ఆశ్చర్యంగా. అహర్నిశలూ అదే ధ్యాస! ఆ పరిస్థితుల్లో శ్రీమతి భారతి గారు (ఇంటియజమాని భార్య) 'అద్భుతమూర్తి' గ్రంథం ఇచ్చారు.

స్వామి గురించి నేను చదివిన మొదటి గ్రంథం అది. భక్తులను మోసం చేయడానికి ఉత్సాహపరచడానికి అచ్చువేసి లోకంలో వదిలేశారు! అని సంశయంతో కూడిన భావం కలిగింది. మనస్సులో స్వామిని ప్రార్థించాను. (ప్రార్థించాను అనడంకంటే ప్రశ్నించాను అంటే బాగుంటుందేమో!) 'స్వామి! నీ ఫోటో మా పూజా మందిరంలో వుంది కదా! ఆ ఫోటో నుండి విభూతి వస్తే నాకు విశ్వాసం కలుగుతుంది!' (ఇక్కడ ఒక ముఖ్య విషయం చెప్పాలి. స్వామి ఫోటో అంతకుముందు సుమారు రెండు సంవత్సరాల క్రితం శ్రీమతి పెట్టినప్పుడు 'నువ్వు కూడా స్వామి భక్తురాలు అయిపోతున్నావే!' అని ఆక్షేపించాను). రెండు రోజుల తర్వాత స్వామి ఫోటో నుండి నిజంగానే విభూతి వచ్చింది. అప్పటి నుండి స్వామి లీలలు, మహిమలు ంచాం, ఆనందించాం. స్థలాభావం వల్ల క్లుప్తంగా వ్రాస్తున్నాను. వర్ణనలు ఏమీ లేకుండా.

1987లో విపరీతమైన నడుం నొప్పితో బాధపడ్డాను. 'నీలో ఐక్యం చేసుకోస్వామీ!' అని ఆఖరుసారిగా ప్రార్థించాను. స్వప్నంలో స్వామి పాదాభివందనం ప్రసాదించారు. అంతే మరునాటి నుండి విచిత్రంగా తగ్గిపోయింది. 1989లో శ్రీమతికి హార్ట్‌ఎటాక్ వచ్చింది. ఇంట్లో ఎవరూలేరు. ఎవరినైనా పిలవటానికి కూడా మాటరాలేదు. స్వామిని మనసులో ప్రార్థిస్తే విభూతి డబ్బావున్న చిన్నబల్ల మంచానికి దగ్గరగా వచ్చేసింది. విభూతి నోట్లో వేసుకున్న తర్వాత చిత్రంగా (నమ్మశక్యంకానంత ఆశ్చర్యంగా) వంట చేసింది. ది. 20-8-90 నాడు స్వప్నంలో నాకు సత్యసాయి, శ్రీమతికి షిర్డీసాయి దర్శనం ప్రసాదించారు. అంతేకాదు. నేను ఇద్దరు వ్యక్తులను చూచినట్లుగాను, శ్రీమతి షిర్డీసాయి పాదాలమీద, రెండు గులాబీలు పెట్టినట్లుగాను స్వప్నంలో స్పష్టంగా చూశాం.

ది. 24-8-90న అకస్మాత్తుగా విచిత్రమైన పరిస్థితులలో శ్రీ పెమ్మరాజు సుబ్బారావుగారితో (మిత్రులు + గురువులు) కలసి షిర్డీ వెళ్ళడం, స్వప్నానుభవం వాస్తవంలో జరగడం! ది. 25-10-90నాడు నేను విపరీతమైన దంత బాధ అనుభవించాను. Love is my

## ఎమ్.ఎస్. మూర్తి, కాకినాడ

Form స్వామి పాడిన పాటవినాలని బుద్ధిపుట్టి కాసెట్ విన్నాను. అంతే పాట పూర్తి అయ్యేసరికి బాధ మాయం! 1995 జనవరిలో అరుణాచలం వెళ్ళాం. (పైన చెప్పిన వారితో) శ్రీమతి ఆరోగ్యం బాగాలేదు. అయినా కొండ చుట్టూ ప్రదక్షిణ చేయాలని ఆమె సంకల్పం (ఆ శక్తి స్వామి తప్పక యిస్తారు అని వాదన). ప్రదక్షిణ ప్రారంభించగానే స్వామి అభయహస్తంతో దర్శనం యిచ్చారు. సునాయాసంగా ప్రదక్షిణ పూర్తిఅయింది. నేను మాత్రం గదిలోనే వుండి పోయాను. స్వామి దర్శనార్థం అప్పుడప్పుడు ప్రశాంతి నిలయం వెళ్ళే వాళ్ళం. కాని స్వామి జన్మదినోత్సవం తిలకించి, ఆనందించాలని చిరకాలవాంఛ, ఆశ్చర్యకరంగా స్వామి 70వ జన్మదినోత్సవం చూచి ఆనందించడం జరిగింది. అప్పుడే ఒక విశేషం జరిగింది. ది. 23-11-95న షెడ్‌కు వచ్చిన తరువాత రాత్రి శ్రీమతి భయంతోను, ఆందోళనతోను చెప్పింది.

'ఈ రోజు స్వామి నా కళ్ళల్లోకి చాలా తీక్షణంగా చూశారు చాలా భయం వేసింది. నేను ఏ తప్పు చేశానా అని ఎంతో ఆలోచించాను కాని ఏమీ గుర్తురావడంలేదు'

ఇది విని ఇద్దరు స్త్రీలు (స్వామి మార్గంలో అనుభవజ్ఞులు) చెప్పారు. "మీకు ఏదో ఆపద రాబోతోంది. దాన్ని ఎదుర్కొనే శక్తి ప్రసాదించారు స్వామి! భయపడవలసినది ఏమీలేదు. అది మా అనుభవం. ముందు ముందు మీరే గ్రహిస్తారు. అక్షరాలా మాకు అనుభవం అయింది. షిర్డిసాయి పటం నుండి విభూతి వచ్చింది. ఇంటికి చేరిన తరువాత మా తల్లిగారు అనారోగ్యంతో మంచం పట్టారు. 2, 3 రోజుల కంటే జీవించరని అందరూ అభిప్రాయపడ్డారు డాక్టర్లతో సహా. కాని 194 రోజులు ఆమె జీవించినది. "అత్యంత ఆశ్చర్యకరమైన సంగతి. గుండెజబ్బు, బి.పి.తో బాధపడే నా భార్య అన్నిరోజులు అత్తగారికి సేవ చేసినది. ఎలా చేయ కల్గుతోంది? అందరికీ ఆశ్చర్యం కల్గించినది. మధ్య మధ్య శక్తిహీనమై నిస్సహాయస్థితి ఆవరించేది. మనసులో స్వామిని ప్రార్ధిస్తే, స్వామి పటం నుండి కాంతిరేఖ ప్రసరించడం, 10, 15 నిమిషాలలో విచిత్రంగా శక్తి పుంజుకోవడం! ది. 5-9-96 నాడు కృష్ణాష్టమి రోజున మా తల్లిగారు స్వామిలో ఐక్యమైనారు. స్వామి ప్రేమ, శక్తి విర్వచించడానికి కొలమానాలు, తూనికరాళ్ళు ఎవరిదగ్గరా లేవు.

శ్రీ సాయినాథ! సత్యసాయి భగవాన్ !

అన్యథా శరణం నాస్తి!!

# ఆపద్బాంధవుడు స్వామి

నేను, నా భార్య (శ్రీమతి లక్ష్మి) కలిసి ది. 15-10-96న బయలుదేరి పుట్టపర్తి 'కలసోత్సవము'చూచుటకు మరియు శ్రీ సత్యసాయిరామ్‌ను దర్శించుటకు వెళ్ళితిమి. తుఫాను కారణముగా వర్షము చాలా ఎక్కువగా కురియుచున్నది. వర్షములో తడుస్తూ శ్రీ సత్యసాయిరామ్ . వారిని దర్శించుచున్నాము. -

ది. 20-10-96న రాత్రి నా భార్య 'డయోరియా' వ్యాధితో బాధపడుచుండెను. మేము షెడ్‌లో యుంటు న్నాము. షెడ్ పర్యవేక్షకుని సలహామేరకు, ఈశ్వరమ్మ హాస్పిటల్‌లో, జాయిను చేస్తిని. అత్యవసర వార్డులో జాయిన్ చేసారు. వైద్యులు వైద్యము చేయుచుండిరి. డయోరియా వ్యాధి లక్షణములు తగ్గుచున్నవి.

ది. 22-10-96 మధ్యాహ్నము గం॥2-30ని॥లకు 'అతితీవ్రమైన' ఫిట్సు జబ్బువల్ల మంచము మీద నిలువెత్తున వణుకుతూ నిలబడి అదొకరకమైన చూపులతో రెండు నిమిషములు పాటు బాధపడేది. తదుపరి ఏడ్చేది. నా యొక్క కేకలు విని హాస్పిటల్ డాక్టర్లు అందరూ వచ్చి, మమ్ములను చుట్టుముట్టి నన్ను ప్రశ్నించుచుండిరి. డాక్టర్లు యుంటుండగా మరల జబ్బు కన్పించినది. ఏ మందు యివ్వాలని డాక్టర్లు అందరూ ఆలోచన చేయుచు, ఒకచోట చేరిరి. నేను భగవాన్ శ్రీ సత్యసాయిరామ్‌వారిని **'భగవాన్! మేమిరువురము శ్రీకాకుళం నుండి వచ్చాము. నీవే దిక్కు. శరణాగత రక్షకా! ఆపద్బాంధవా!'** అని ప్రార్ధిస్తూ 'గజేంద్రుని రక్షించుటకు 'శ్రీ మహావిష్ణువు (నీవే) ఎంత త్వరగా వచ్చి కాపాడితివి. నా ఆర్తనాదము విని, నా భార్యప్రాణములను కాపాడుము. రక్షించుము. సాయికుళ్వంత్ ప్రాంగణములో యుండి పోవద్దు. త్వరగా వచ్చి నా భార్య ప్రాణములను కాపాడుము. ప్రాణము పోయే స్థితిలోయున్నది".

ఆర్తజనరక్షకుడు శ్రీ సత్యసాయిరామ్ - డాక్టరు వేషధారియైవచ్చి, తన కోటు ప్యాకెట్టు నుండి రెండు ఇంజక్షన్లు సీసాలను, ప్రక్కనేయున్న డాక్టరు గారికిచ్చి ఇంజక్షన్లు చేయమని సంజ్ఞచేసారు. ఆర్తజన రక్షకుడు నన్ను తీక్షణముగా చూచారు. ఈ చూపులలో యున్న భావము **'స్వామి అంగరక్షకుడు, తానే స్వయంగా వచ్చి, వైద్యము చేసి, ప్రాణములను కాపాడెను'.**

మరుసటి దినము (ది. 23-10-'96) ఉదయము డాక్టరు కమలగారు (హాస్పిటల్ సూపరింటెండెంటు) మా వద్దకు వచ్చి, నా భార్యను ఉద్దేశించి మాట్లాడారు. **'స్వామి స్వయంగా వచ్చి, నీకు మందు యిచ్చి, నీ ప్రాణములను కాపాడారు. నీవు ధన్యురాలవు. నీ రోగము పూర్తిగా పోయింది, నేను వైద్యము చేయలేదు'.** అని చెప్పారు. (ఇప్పటికి ఆమె హాస్పిటల్‌లో పని చేయుచున్నారు).

ఈ సంఘటన ద్వారా - 'స్వామి' ఆపద్బాంధవుడు. భక్తుల బాధలను తీర్చుతారు. మన వెంట, జంట, ఇంట, ఉంటూ అండగా ఉంటారు. స్వామి లీలలు అనంతములు. అద్భుతములు.

**- వేణుగోపాలస్వామి, శ్రీకాకుళం**

# అపూర్వ సత్యసాయి అవతారము

శ్రీ సత్యసాయి సుప్రభాతంలో పూర్వం ఇంకో పద్యం కూడా చెబుతుండేవారు. ఆ పద్యం ఎంతో మధురంగా, అర్థవంతంగా, సాయి గుణగణాల్ని, అవతార వైభవాన్ని విడమర్చి చెపుతున్నట్లనిపిస్తుంది. అది విన్నప్పుడల్లా, మననం చేసికున్నప్పుడల్లా ఏదో అలౌకికానందంతో ఆ పద్యాన్ని, అందంగా ఏరికూర్చిన ఆ మాటల్ని ఎన్నిసార్లో చెప్పుకుంటుంటారు.

ఆ పద్యం - '**శ్రీ సాయిరామ, శుభనామ, మనోభిరామ, సంపూర్ణకామ, కమనీయవచోభిరామ, సర్వజ్ఞ, సర్వగుణగణ్య, మునీంద్రవంద్య, శ్రీ సత్యసాయి భగవాన్, మమదేవదేవ**'!

'**మమదేవదేవ**' అన్న మాటలు 'తవసుప్రభాతం' అని Original పద్యంలో ఉన్నమాటలకి బదులుగా నేను వాడినవి. సత్యసాయి సద్గుణాలన్నిటినీ ఏకరువుపెట్టి, అట్టి సత్యసాయి, భగవంతుడే దేవదేవుడు - నా దేవుడే అని ఎలుగెత్తి చాటటం అన్నమాట. ఇప్పుడు ఒకో పదానికి నాకు తోచినట్లనిపించిన వివరణ చూద్దాము.

మంగళకరుడు, శుభప్రదాత అయిన సత్యసాయిని శ్రీ సత్యసాయి, శ్రీ సాయిరామ అని సంబోధిస్తుంటారు. సాయిభక్తులనోట్లో తెల్లవారింది మొదలు, రాత్రిపడుకునే వరకూ '**సాయిరాం, సాయిరాం**' ఎన్నిసార్లు నాట్యమాడుతుంటుందో! ఒకరినొకరు పలుకరించుకోవటం, అభినందించుకోవటం, ఆప్యాయతను అందించుకోవటం, ప్రేమను పంచుకోవటం, ఇబ్బందుల్ని తొలగించుకోవటం, అశాంతి, అలజడులతో నిండిన మనస్సుకి ఊరట కలుగచేసికోవటం, బాహ్యప్రపంచపు భావాలు మనస్సులో చోటు చేసుకోకుండా ఉంచుకోవటం అన్నీ ఆ ఒక్క 'సాయిరామ' తోనే. ఇన్ని విధాల బాసటగా ఉంటున్న ఆ భగవన్నామం ఎంత శుభనామం కదా!

సాయి సుందరరూపం, మనోజ్ఞ ముగ్ధసౌందర్యం, చిరుదరహాసం, గాలిలో తేలిపోయేటట్లుండే మందగమనం సాయి భక్తుల మనస్సులను ఏవేవో లోకాల్లో విహరించేటట్లు చేస్తాయి. ప్రత్యక్షంగా సాయి సన్నిధి భక్తులకు పెన్నిధి. ఎన్నిసార్లు చూచినా తనివితీరని తృష్ణ అది. సాయి ఎటు తిరిగితే అటువైపే తిరుగుతుంటాయి సహస్రశిరస్సులు, నేత్రాలూ. అంతటి ముగ్ధమనోహరరూపుడు సాయి రాముడు. అందరి మనస్సుల్ని ఆ విధంగా ఆకట్టుకుంటుంది మనోభిరాముని ముగ్ధరూపం. చేతులెత్తి అందించే అభయం, ఆనంద, శాంతులకోసం ఆక్రోశించే లక్షల మనస్సులకి ధైర్యాన్నందిస్తుంది. మళ్ళీ ఎన్నోరోజులు, మాసాలు ఈ మానవ యంత్రం ఉల్లాసంగా, ఉత్సాహంగా, ధైర్యంగా పనిచేసుకోగల్గేటట్లు చేస్తుంది.

**తూములూరు ప్రభ**, హైదరాబాద్

కామధేనువు దగ్గరకు వెళ్ళి కాఫీపొడి అడుగకూడదని స్వామి ఎన్నిసార్లు హెచ్చరించినా, హెచ్చరిస్తున్నా చాలా చిన్న కోరిక దగ్గర నుంచి పెద్ద కోరిక వరకూ ప్రతి క్షణం భక్తులు కోరుకుంటూనే ఉంటారు అడుగందే అమ్మయినా పెట్టదనే భావంతో. కామితార్థము లీడేర్చు కమనీయమూర్తి కళ్ళెదుట కదలాడుతుంటే అడుగకూడదనుకుంటూనే అడుగుతుంటారు. తమ భక్తుల అవసరాలను తమ సర్వజ్ఞత్వంతో గ్రహించే సాయి అడుగకపోయినా తీరుస్తుంటారు. **సంపూర్ణ, పరిపూర్ణకామప్రదాత సత్యసాయి.**

మానవాళిలో మంచి మార్పు తీసుకువచ్చి, ప్రజలలో '**దైవప్రీతి, పాపభీతి, సంఘనీతి**' అభివృద్ధిపరచి, ప్రపంచ శాంతిని నెలకొల్పటమే ఆశయంగా, **'My Life is My Message;' 'My Message is Love'** అంటూ చేసిచూపుతూ ఆదర్శానందిస్తుంటారు సాయి. వేదాంతసారాన్ని, పురాణాల ప్రాశస్త్యాన్ని పండుగల సమయాల్లో తేటతెలుగులో ప్రజలకందిస్తుంటారు. సూక్ష్మధర్మాల నెన్నిటినో సూటిగా చెప్పు స్వామిది సరళ, మధుర భాష. మంజులగళము. కమనీయ కంఠము. కోటివీణలు మీటినట్లుండి, ప్రజల్ని పులకాంకితుల్ని చేస్తుంది. వేరుభాషలవారు కూడ వారి భాషణలోని అంతర్యాన్ని గ్రహించగల్గుతారు. భగవాన్ నిస్వార్థప్రేమతో హృదయపూర్వకంగా మాట్లాడుతారు కనుక - 'Heart to



Heart ఓర్పుగా, నేర్పుగా ఇంత ప్రేమపంచి పెడుతున్న ఆ పురాణపురుషుని ఆదర్శం ప్రజల్ని ఉత్తేజపరచి, సత్యమార్గంలో నడుచుకునేటట్లు చేస్తుంది.

మనిషి కోరికల పుట్ట. ఎన్నో ఆశలు, ఆశయాలతో తమను సమీపించే మనిషి స్వభావం, పుట్టుపూర్వోత్తరాలు అన్నీ తెలుసు సాయికి. మనిషి అంతరాంతరాల్లోని ఆలోచనల్ని ఇట్టే పసికట్టేస్తుంది సాయి సర్వజ్ఞత్వం. వాటికి అనుగుణంగా బాబా తన ప్రేమను, అనుగ్రహాన్ని అందిస్తూ, తాము సంకల్పించిన రీతిలో మానవుడు రూపుదిద్దుకునేటట్లు చేస్తుంటారు. తమ సన్నిధిలోనే ఉండాలనే సిద్ధాంతం ఏమీలేదు. సర్వాంతర్యామిగా, తమ సర్వజ్ఞత్వంలో ఎన్నో వేలమైళ్ళ దూరంలో ఉన్నవారికి కూడా తమ ప్రేమానుగ్రహాన్ని అందిస్తుంటారు. ఈ సర్వజ్ఞత్వంతో ప్రదర్శించే సర్వశక్తిత్వం చాలు సత్యసాయిని పరిపూర్ణ అవతారంగా, భగవాన్‌గా గుర్తించటానికి.

భగవంతుడు గుణాతీతుడు, కామరూపరహితుడు. కాని అవసరాన్నిబట్టి ఒకేకాలంలో, ఒకే సమయంలో నామరూపాలతో ప్రజల మధ్య అవతరిస్తుంటాడు. అయినా సత్వ, తమ, రజోగుణాలకి అతీతంగానే ఉంటుంటాడు. అన్నిమంచి గుణాలు మూసలో పోసినట్లున్న మంచి మనీషి (మనుష్యుల మధ్య). మూర్తిభవించిన మహనీయమూర్తి. "మీ బాధల్ని, వ్యధల్ని నాకర్పించండంటూ వాటినన్నిటినీ స్వీకరించినా, అన్నిటికీ అతీతంగా నిలిచే చిన్మయమూర్తి సత్యసాయి. క్రుంగటం, పొంగటం తెలియని సమాధి స్థితిలో ఉంటుంటారు సాయి. ఒక్క తల్లిప్రేమను చవిచూచే మానవుడు వేయితల్లుల ప్రేమ (జగజ్జనని)లో ఓలలాడ గల్గడం ఎంతో అదృష్టం.

అపూర్వసాయి అవతారానికి ముగ్ధుడైన మానవుడు తనని తానే అర్పించుకుంటాడు. సాయిదివ్యచరణాల చెంత, చిన్న, పెద్ద, కులం, మతం, తరతమ బేధాలు లేకుండా అందరూ శరీరంతో, మనస్సుతో పవిత్ర నిర్మల హృదయంతో అర్చించుకుంటారు సాయిని. నాడు తలక్రిందులుగా తపస్సుచేసినా లభించని స్వామి, సంవత్సరాల తరబడి తపస్సుచేసినా ఒక్కక్షణం దర్శనమిచ్చి, ఇట్టే అంతర్ధానమయే స్వామి (పురాణాల్లో చెప్పబడినట్లు), మన పూర్వజన్మ పుణ్యఫలంగా, ఆర్తితో అనుకుంటేచాలు సాక్షాత్కరిస్తూ, ప్రేమతో లేవనెత్తుతూ, చాలా అరుదైన ఆనందాన్నీ, శాంతినీ, ప్రశాంతత ప్రసాదిస్తుంటారు, సత్యసాయి నేడు. ఇట్టి సత్యసాయి (అవతారం) సామాన్య మానవులకేకాక, మునులకు, మునీంద్రులకు కూడా వంద్యుడే కదా!

1918లో అవతారం చాలించిన షిర్డీసాయి మనలో చాలామందికి తెలియకపోవచ్చు. మళ్ళీ 8 సం॥ల వ్యవధిలోనే 1926లో అవతరించిన సత్యసాయి భగవానుల సమకాలీనులముగా జన్మించటం మన పూర్వజన్మ సుకృతం. సత్యసాయిని ప్రపంచానికందించిన ఈశ్వరాంబ పుణ్యమూర్తి. ఈ పుణ్యపురుషుని లీలలు, మహిమలు, ప్రేమానుగ్రహాలు అందుకొంటున్న మనం అదృష్టవంతులం. ఈ అదృష్టాన్ని, సత్యసాయి అనుగ్రహాన్ని ఇదేవిధంగా పదికాలాలపాటు పొందగల్గేటట్లు మనల్ని మనం మలుచు కుంటూ, మమ్మల్ని నడిపించండి స్వామీ అని వేడుకొంటూ, దానికనుగుణంగా నడవటమే మన కర్తవ్యం. అదే సత్యసాయి చేస్తున్న ధర్మరక్షణ, శాంతి స్థాపన. సత్యయుగ సంస్థాపన కృషిలో ఉడుతాభక్తిగా, చంద్రునికో నూలు పోగులా మనం చూపే కృతజ్ఞత. ❂

## కర్తవ్యము

**"భూమియందు సర్వత్రా నీటి ఊటప్రవహిస్తూనే ఉంటుంది. కాని ఆ అంతర్భాగమునందు ప్రవహించే జలము మనకు ఏ మాత్రం గోచరించదు. ఆ ప్రవహించే జలమునకు మట్టి అడ్డుగా ఉండడంచేత, ఆ జలము మనకు కనిపించకుండా మరుగున పడిఉన్నది. మానవుని యొక్క ప్రయత్నబలముచేత, అడ్డుగానున్న మట్టిని ప్రక్కకు నెట్టినప్పుడే, అంతర్భాగమునందున్న ఆ జలము మనకు కనిపిస్తుంది. అదే విధముగనే ప్రతి మానవుని అంతరాత్మయందు, అంతరింద్రియములందు, అంతఃకరణ యందు, శాంతి సౌభాగ్యములనే ప్రవాహము ప్రవహించుచునేయున్నది. కాని అట్టి పవిత్రప్రవాహము కామక్రోధద్వేష అసూయలనే దట్టమైన మట్టిచేత కప్పబడివుండటంవలన మనం ఆ శాంతి సౌభాగ్యములను అనుభవించలేక పోతున్నాము. కనుక పురుష ప్రయత్నం చేత అట్టి అపవిత్ర పదార్థము (కామక్రోధద్వేష అసూయలు) లను దూరం గావించుకొనే ప్రయత్నం చేయాలి. అదే ప్రతిమానవుని యొక్క కర్తవ్యము."**

**- బాబా**







# సేవకు మించిన సాధన లేదు

విప్రుల వేదపఠనలతో అక్కడ వాతావరణం పవిత్రతను సంతరించుకుంది. పాండవులుచేయ తలపెట్టిన రాజసూయయాగానికి మిత్రులు, హితులు, సన్నిహితులు, రాజులు, రారాజులు, మునిశ్రేష్టులు యావన్మందీ తరలి వచ్చారు. ఎంతో కోలాహలంగా వుంది వాతావరణం. ఆ సమయంలో శ్రీ కృష్ణుడు ఆ ప్రదేశానికి చేరుకున్నాడు. పాండవులు ఆయన రాకకు ఆనందించి ఆయన పరిచర్యలకై శ్రీ కృష్ణుని సమీపించారు. మందస్మిత వదనుడైన శ్రీ కృష్ణుడు అడిగాడు. **'ధర్మజా! కార్యక్రమ నిర్వహణ సజావుగా సాగుతుంది కదా! ఏర్పాట్లు అన్నీ జరిగినాయా?'.** 'స్వామీ! అన్నీ అనుకున్న విధంగానే చక్కగా జరుగుతున్నాయి' అని బదులిచ్చాడు ధర్మజుడు. **'ధర్మజా ఇక్కడ నాకు కూడా చేయడానికి ఏదైనా పని ఇవ్వు'** అన్నాడు శ్రీ కృష్ణుడు. పాండవులందరూ విస్తుపోయారు. 'స్వామీ! నీకు సేవ చేసే భాగ్యాన్ని మాకు ప్రసాదించమని మేము అర్థిస్తుంటే నువ్వే సేవ కావాలని అడగటమేమిటి?', అనగానే శ్రీ కృష్ణుడు **'నాకు కావల్సినది పని. అది చేయడానికి మీరు ఎవరు అడ్డుచెప్పవద్దు'** అని అతిథులు తిని వదిలేసిన ఎంగిలి విస్తరాకులను ఎత్తటం ప్రారంభించాడు. 'ఈ పని చేయటంలో నాకు ఎంతో తృప్తి వుంది. ఇతరులకు సేవ చేయడం అంటే నాకు మిక్కిలి ఆనందం. దీనిని ఎవరూ కాదనకూడదు' అని వారించాడు శ్రీకృష్ణుడు.

అఖిల జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయ కారకుడు, సాక్షాత్తు అవతారమూర్తియైన శ్రీ కృష్ణభగవానుడు పరులకు సేవ చేయటంలోనే తనకు ఆనందం వుందని చెప్పినట్లు మనకు భాగవతం చాటుతుంది. సేవకు ఆయన ఇచ్చిన స్థానాన్ని భాగవతంలో ఈ ఒక్క సంఘటనే కాదు అనేక సంఘటనలు ఈ యదార్థాన్ని చాటుతున్నాయి. కేవలం భారతంలోనే కాదు అనేక ప్రామాణిక గ్రంథాలలో, పవిత్ర చరిత్రలలో కూడా సేవయొక్క ప్రాముఖ్యతను, ప్రాధాన్యతను గొప్పగా వివరిస్తూ వచ్చారు. **'అష్టాదశ పురాణేషు వ్యాసస్య వచనద్వయం పరోపకారాయ పుణ్యాయ పాపాయ పరపీడనం'** అని వ్యాసమహర్షి అష్టాదశ పురాణాల సారాన్ని రెండు వాక్యాలలో విశదీకరించారు. ఈ పాపపుణ్యాలు ఎక్కడో లేవు. పరోపకారము చేయడమే పుణ్యము. పరులను బాధించడమే పాపము అన్నారు. అంటే పరులకు సేవచేయడం మానవునికి పుణ్యాన్ని సంపాదించిపెడుతుందనే వాస్తవాన్ని చాటిచెప్పారు వేదవ్యాసులవారు. దీనిని బట్టి సేవకు ఉన్న పరమోత్కృష్ట భావము, అర్థము మనము తెలుసుకోవచ్చు. అయితే

కొమరగిరి శ్యామ్‌ప్రసాద్

ఈ సేవ ద్వారా కేవలం పుణ్యం ప్రాప్తించడమే కాదు ఏకంగా భగవత్ సాన్నిధ్యాన్నే మనం పొందగలమని చరిత్ర చెబుతుంది.

భగవత్ సాన్నిధ్యాన్ని పొందాలంటే ఈ కలియుగంలో, కలహయుగంలో, యాంత్రిక జీవితంలో, పరుగు జీవితంలో మనమేమి చేయగలము? కృతయుగములోవలె తపోధ్యానాదులు నేడు మనం చేయలేము. త్రేతాయుగంలోని యజ్ఞయాగాదులను మనం నిర్వర్తింపచేయలేము. అలాగే ద్వాపరయుగంలోవలె అర్చనాదులను మాచరించలేము. అయితే ఈ కలియుగంలో మనమేమి చేయాలి? ఏంచేస్తే మన జన్మ సార్థకత చెందుతుంది?

**"పరమార్థ ప్రేమను ధరణిలో జనులకు**
**ప్రవహింపచేయటమే పరమ భక్తి**
**ప్రతి మానవుండు బ్రతికి తానుండుట**
**స్వార్థంబునకుగాదు సంఘసేవ**
**చేయుటకే అన్న శ్రేష్ఠ భావముతో**
**మెలగుచు నుండిన మేలుకలుగు**
**మరచియు తనను తాను మానవ దేహంబు**
**అంకితమొసగుటే ఆత్మ తృప్తి**
**నిష్కళంకమగు ప్రేమ హృదిని నిల్పి**
**సర్వజీవులకు పకృతి సలపకున్న**
**పుట్టి ఫలమేమి నరుడిగా పుడమియందు"**

నరుడుగా పుట్టినందుకు మనకు సార్ధకత సేవ ద్వారానే సాధ్యమౌతుంది అంటారు భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు. కలియుగంలో సేవయే పరమోత్కృష్టమైన సాధనగా చెబుతారు స్వామి. అయితే అసలు సేవ అంటే ఏమిటి? అది ఉత్తమోత్తమమైన సాధన ఎలా అవుతుంది? అనే విషయాన్ని ఇప్పుడు మనం తెలుసుకొందాము. మనం ఎప్పుడయినా ఆపదల్లో ఉన్నప్పుడు ఎవరైనా మనకు సహాయం చేస్తే ఎంతో ఆనందిస్తాము. ఆ విధంగా ఆపదలో ఉన్నవారికి, మన తోటివారికి చేసే సహాయాన్నే సేవగా చెప్పవచ్చు.

'సొంత లాభము కొంతమానుకు
పొరుగు వాడికి తోడుపడవోయ్'

అని గురజాడవారన్నట్లు మనకవకాశమున్నంతలో ఇతరులకు ఉపకారం చేయడం కొంతవరకు సేవ అనిపించు కొంటుంది. అయితే ఈ సేవవలన కలిగే ప్రయోజనం ఏమిటి? మనలో సేవాభావం ఉన్నందువల్ల సమాజానికి ఏదైనా ఉపయోగం ఉందా? ఒక్కసారి ఆలోచిద్దాము.

ఒక ఉపాధ్యాయుడు తన వృత్తిని తాను నిర్వర్తిస్తూనే అర్హులైన పదిమంది పేదవారికి ఉచిత విద్యాబోధన చేయడం వలన సమాజానికి ఎంతో ప్రయోజనం ఉంటుంది. ఒక డాక్టరు తన విధిని తాను నిర్వర్తిస్తూనే కొంతమంది పేదలకు సేవాభావంతో ఉచిత వైద్యం చేయడం వలన ఎంతో ప్రయోజనం ఉంటుంది. ఒక వ్యాపారి తన వ్యాపారాన్ని న్యాయబద్ధంగా నిర్వహిస్తూ ధార్మిక దృష్టితో పదిమందికీ ఉపయోగపడిననాడు సమాజానికి ఎంతో ప్రయోజనం చేకూరుతుంది. ఒక ఉద్యోగి తన వృత్తి ధర్మాన్ని పాటిస్తూ తనకున్నంతలో తోటివారికి సహాయపడిననాడు సమాజానికి ఉపయోగం ఉంటుంది. ఒక రాజకీయ నాయకుడు సేవాదృక్పధంతో వ్యవహరించిన నాడు నిజమైన అభివృద్ధిని మనం చూడగలం. అదేవిధంగా ఒక రాష్ట్రము, ఒక దేశము తమ స్వప్రయోజనాలతోబాటు సేవాధృక్పదంతో, విశాల భావంతో వ్యవహరించిననాడు సమాజం తప్పక పురోగమిస్తుంది. ఈ విధంగా వ్యక్తులలో సేవాదృక్పధం ఉన్నట్లయితే వారు అభివృద్ధి చెందడమేకాక దేశాభ్యుదయానికి కూడా దోహదకారులవుతారని తేటతెల్లమవుతుంది. ఇవి సేవవలన కలిగే లౌకికమైన ప్రయోజనాలయితే ఆధ్యాత్మికముగా సేవ మనలను ఉన్న స్థితి నుండి ఉన్నత స్థితికి ఎలా తీసుకొని వెళుతుందో పరిశీలిద్దాము.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు 4 అంచెల సేవా మార్గాన్ని వివరించారు. అవి :

**1.** స్వార్ధసేవ : ఈ పని చేసినందువలన అందరూ నన్ను పొగడాలి, కీర్తించాలి అని భావించి చేసే సేవ స్వార్ధపూరిత సేవ. తన పేరు నిమిత్తం, తన అభివృద్ధి నిమిత్తం, గుర్తింపు నిమిత్తం చేసే సేవలు స్వార్ధపూరిత సేవలు. ఈ సేవల వలన సమాజానికికానీ, వ్యక్తికికానీ ఎటువంటి ప్రయోజనం కలగదు అంటారు స్వామి.

**2.** స్వార్ధపరార్ధ సేవ : నేను బాగుపడాలి, నా పక్కవాడూ బాగుపడాలి అనే భావంతో చేసే సేవ ఇది. దీని వలన కొద్దిగా ప్రయోజనం వుటుంది.

**3.** నిస్వార్ధసేవ : ఎటువంటి స్వార్ధస్వప్రయోజనాలను దృష్టిలో పెట్టుకోకుండా కేవలం ఇతరుల క్షేమం మాత్రమే ఆశించి చేసే సేవ నిస్వార్ధపూరిత సేవ. దీనికి ఉదాహరణగా కొవ్వొత్తిని గమనించమంటారు స్వామి. కొవ్వొత్తి తాను

## శ్రీవాణి చందాల వివరములు

| | | | |
|---|---|---|---|
| **సం. చందా.** | **-** | **రు.** | **60-00** |
| **4 సం. చందా** | **-** | **రు.** | **225-00** |
| **జీవిత సభ్యత్వము** | **-** | **రు.** | **600-00** |
| **పోషకులు** | **-** | **రు.** | **1116-00** |

**గమనిక: జీవిత సభ్యత్వం రు 600-00లు చెల్లించిన వారి ఫోటో శ్రీవాణిలో ముద్రించబడుతుంది. పోషకులుగా రు.1116/-లు పంపినవారి దంపతుల ఫోటోలు కూడా శ్రీవాణిలో ముద్రించబడును. మరియు మేము ముద్రించిన ప్రేమజ్యోతి, సాయి చమత్కారవాణి, శ్రీ సత్యసాయి శతకము, సాయిలీలాతరంగిణి, రామాయణ పాత్రలు, అమృతవాణి, కనీస విజ్ఞానము పుస్తకములు ఉచితంగా Regd. Post ద్వారా పంపబడుతాయి.**

**ఉదారవదాన్యులు, రాజపోషకులు రు. 5,116/-, మహారాజ పోషకులు రు. 10,116/-లు పంపి శ్రీవాణిని ప్రోత్సహించ ప్రార్ధన. - సం.**

కరిగిపోతూ, కరిగిపోతూ ఇతరులకు వెలుగునిస్తుంది. అటువంటిదే నిస్వార్ధసేవ. ఇది సేవా మార్గంలో మూడవమెట్టు.

**4. పరమార్ధసేవ :** ఇది అత్యున్నతమైన సేవ. సర్వులలో ఎవరికి ఆత్మతత్త్వాన్ని దర్శిస్తూ సేవచేస్తున్నా ఆ దైవానికే ఎవరికి సేవ చేస్తున్నామనే భావంతో చేసే సేవ పరమార్ధ సేవ అవుతుంది. మానవసేవయే మాధవ సేవ, జన సేవే జనార్ధన సేవగా భావించి చేసే సేవే పరమార్ధ సేవ. ఈ సాధనాక్రమంలో మనమందరం పరమార్ధసేవ స్థాయిని చేరుకోవాలంటారు స్వామి.

ఒకసారి ఏకనాధుడు తన శిష్యులతో కలసి కాశీ నుండి గంగాజలాన్ని కావడి కుండలతో మోసుకుంటూ తీసుకొని వెళ్ళి రామేశ్వరంలోని శివుని అభిషేకించి అర్చించాలని బయలుదేరుతాడు. మార్గమధ్యములో అడవిలో ఒక గాడిద దాహంతో ప్రాణములు విడిచే సమయంలో దానిని చూస్తాడు. వెంటనే తన వద్దనున్న గంగాజలాన్ని గాడిద నోటిలోపోసి దాని ప్రాణాలను నిలబెడతాడు. నివ్వెరబోయిన శిష్యులకు చెబుతాడు. **"నాయనా! ఈ గాడిదలోనున్న ప్రాణశక్తి రామేశ్వరంలోని ఈశ్వరుని దివ్యశక్తియే. ఈశ్వరుడు రామేశ్వరంలోనే లేడు. 'ఈశ్వరః సర్వభూతానాం!' ఈశ్వరుడు ఈ సకలచరాచర జగత్తులో సర్వవ్యాపియై సర్వజీవులలో ఉన్నాడు. ఈ జీవికి సేవచేయడం పరమాత్మకు సేవ చేయడమే స్వయంగా ఈశ్వరుడు ఈ రూపంలో మన ముందుకు వచ్చి అభిషేకం స్వీకరిస్తుంటే మనం అక్కడిదాక వెళ్ళవలసిన అవసరం ఏముంది'** అని హితబోధ గావిస్తాడు. భారతీయ సత్‌సాంప్రదాయ వ్యవస్థలో ప్రతి జీవి పూజనీయమే. ప్రతి జీవి దైవస్వరూపమే. కాబట్టి ఎవరికి సేవచేసినా అది పరమాత్మకే చెందుతుంది. **'మమైవాంశో జీవలోకే జీవభూత స్సనాతనః'** అన్న గీతాచార్యుని వాక్కులు ఈ సందర్భంగా జ్ఞప్తికి తెచ్చుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. 'సర్వజీవ నమస్కారం కేశవం ప్రతిగచ్ఛతి, సర్వజీవ తిరస్కారం కేశవం ప్రతిగచ్ఛతి'. ఏ జీవికి నమస్కరించినా, తిరస్కరించినా అది దైవానికి చెందుతుందనే భావము మనకు కలిగిననాడు ఆ భావముతో సేవ చేసిననాడు అది పరమార్ధసేవ అవుతుంది. స్వార్ధసేవ నుండి ఈ పరమార్ధసేవ స్థాయికి మనం ఎదిగిననాడే మన జీవితాలకి సార్ధకత ఏర్పడుతుంది.

1976లో శ్రీ సత్యసాయి సేవాసంస్థల సమ్మేళనం బొంబాయిలోని ధర్మక్షేత్రంలో జరుగుతున్నది. గుడారాలను, షామియానాలను వేశారు సేవాదళ్ సభ్యులు. భక్తులు స్వామి సందేశాన్ని శ్రద్ధగా ఆలకిస్తున్నారు. స్వామి ప్రసంగం వింటున్న భక్తజనావళిపై ఎండ పడుతోంది. అయినా వారు ఎండ వేడిమిని ఓర్చుకుంటూ స్వామి సందేశం వింటున్నారు. కొంతసేపయిన తర్వాత స్వామి మీద కూడా ఎండపడనారంభించింది. వెంటనే సేవాదళ్ సభ్యులు స్వామి మీద ఎండపడకుండా ఉండేందుకు ప్రయత్నాలు ఆరంభించారు. స్వామి వారిని వారిస్తూ ఇలా అన్నారు. **"ఏమిటి మీరు చేస్తున్న పని? ఇక్కడ ఇంతమంది సాయిలు ఎండలో మాడుతుండగా ఈ సాయి మీద ఎండ పడగానే దానిని అడ్డుకునే ప్రయత్నాలు చేస్తున్నారు? స్వామిని ఈ ఒక్క దేహానికే పరిమితం చేయకండి. ఆ భావనతో చేస్తే మీ సేవ సేవ అన్పించుకోదు. స్వామిని ప్రతి జీవిలో దర్శించి సేవ చేయండి. మీరు చేసే ప్రతి పనిని భగవదర్పితం గావించండి. అప్పుడే సేవ ద్వారా మీకు ప్రయోజనం కలుగుతుంది"** అన్నారు. ఈ సంఘటన ద్వారా సర్వులలో సర్వేశ్వరుడు ఉన్నాడని వారిని సేవిస్తే స్వామిని సేవించినట్లేనన్న మహోన్నత సత్యాన్ని సాయి సేవకులకు, భక్తులకు స్వామి చాటిచెప్పారు.

మరొక పర్యాయం సేవ చేయవలసిన విధానం వివరిస్తూ స్వామి ఇలా అన్నారు. **'నీవు శక్తికి మించి సేవ చేస్తే అహంకారివవుతావు. శక్తిని దాచుకుని సేవ చేస్తే దొంగవవుతావు. కాబట్టి అహంకారివి కావద్దు, దొంగవు కావద్దు. శక్త్యానుసారం తగినంత సేవ చెయ్యి'** అన్నారు.

"My Life is my Message & Your Life should be my Message" అన్నారు స్వామి. సేవలోని అంతరార్ధం వివరిస్తూ, వాటిని నిత్యజీవితంలో మనం ఎలా చేయాలో, తానే స్వయంగా చేసి చూపిస్తున్నారు. స్వామి ప్రబోధాల ననుసరించి ఈనాడు ప్రపంచవ్యాప్తంగా వివిధ దేశాలలో శ్రీ సత్యసాయి సేవాసంస్థలు అనితరసాధ్యమైన సేవలను అందిస్తున్నాయి. స్వామిమాటల్లో చెప్పాలంటే **'ప్రేమతో చేసిన సేవకు మించిన పూజలేదు. ప్రార్ధించే పెదవులకన్న సేవించే చేతులు మిన్న'.** కాబట్టి మనమందరము సాయి ప్రబోధాలను మార్గదర్శకంగా తీసుకుని సేవామార్గంలో మునుముందుకుసాగి, మన జీవితాలను సార్ధకం గావించుకుందాం. సేవకు మించిన సాధనలేదు.



ప్రకాశం జిల్లా వేటపాలెంలో భగవాన్ సాయి దివ్యలీలలు
(ఫోటోలపై విభూది కుంకుమలు)